


మొదటి కూర్పు : ఏప్రిల్, 1967

పునర్ముద్రణ : మార్చి, 1972

రెండవ కూర్పు : మే, 1983

ప్రచురణ సంఖ్య : 1038

ప్రతులు : 2000

వెల : రు. 20/-

ముద్రణ :

స్వతంత్ర అర్టు ప్రింటర్సు

విజయవాడ-4

# ఈ కూర్పు గురించి....

మొట్ట మొదట 1967 లో తిలక్ కథలు ప్రచురించే నాటికి 20 కథలూ, స్కెచ్‌లూ లభించాయి. కొన్నిటి పేర్లు తెలిసినా లభించలేదు, మరి కొన్నిటి ఉనికే తెలియలేదు.

1972 లో పునర్ముద్రించే నాటికి ఒక అభిమాని 'నిర్మల మొగుడు' అందించగా దాన్ని చేర్చాం.

ఇప్పుడు, యీ కూర్పులో మిత్రులు డా॥ అత్తలూరి నరసింహారావు గారు సేకరించి యిచ్చిన మరొక ఎనిమిది కథలు చేర్చాం. కథావస్తు ప్రాధాన్యాన్ని బట్టి కథల వరుస క్రమాన్ని మార్చాం.

ఇప్పటికీ 'రాలిన ఆకులు' కథ లభించలేదు. ఈ కథ అజ తెలిసిన సాహిత్యాభిమానులు ఎవరయినా దాన్ని మా కందజెయ్య గోర్తాం.

గతంలో లాగే ఈ కూర్పుని పాఠకులు ఆదరిస్తారని విశ్వసిస్తున్నాం.

1983. ప్రకాశకులు

# మనవి

ఆకలీ, బాధలూ, ఆందోళనలూ, సమస్యలూ విరివిగావున్న సుమారు ఏభై కోట్లమంది భారతీయులను నిజమైన ప్రాణం వున్న మనుష్యలను–

"పవిత్రులనుండి, పతివ్రతలనుండి
పెద్దమనుషులనుండి, పెద్దపులులనుండి
నీతుల రెండు నాల్కలు సాచి బుసలుకొట్టే
నిర్హేతుక కృపా సర్పాలనుండి
లక్షలాది దేవుళ్ళనుండి, వారి పూజారులనుండి
వారి వారి ప్రతినిధులనుండి
సిద్ధాంత కేసరులనుండి
శ్రీ మన్మద్గురు పరంపరనుండి"–
కాపాడి,

వారికి

"కడుపునిండుగా ఆహారం
గుండె నిండుగా ఆశ్లేషం
బ్రతుకు పొడుగునా స్వతంత్రం
కొంచెం పుణ్యం కించిత్ పాపం
కాస్త కన్నీరు మరికాస్త సంతోషపు తేనీరు"
సంపాదించి,

"నటనలూ, చుట్టూ కటకటాలు,
గొప్పలూ, గోసాయి చిట్కాలు"
లేకుండా
వారంతా
"సరదాగా నిజాయితీగా
జాలి జాలిగా హాయి హాయిగా"
బ్రతకాలని కోరుకున్న

## శ్రీ తిలక్

వారికోసం

'కన్నీటి జడులలో తడిసిన దయాపారావతాల' వంటి
'ప్రజా శక్తుల వహించే విజయ ఐరావతాల' వంటి
'వెన్నెల్లో ఆడుకునే అందమైన అమ్మాయిల' వంటి
రమ్య రమణీయాక్షరాలతో,
సంభాషణా చాతుర్యం, సున్నిత హాస్యం,
అత్యంతాధునిక శాస్త్రీయ దృష్టి,
అద్యతన రాజకీయ పరిజ్ఞానం, వస్తు వైవిధ్యం,
అనుభవ సంపద, నిశిత పరిశీలనలతో
రసపుష్టము, భావనివిష్టమై
పద్యంవలె సాగే గద్యంలో
మలిచిన మణిదీపాలవంటి
'తిలక్ కథలను' సేకరించి
మీకు సమర్పించగలిగినందుకు
మిక్కిలి నంతసిస్తున్నాము.

—ప్రకాశకులు.

(ఏప్రిల్, 1967)



కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్

జననం : ఆగస్టు 1921 మరణం : జూలై 1966

# కథల వరుస


| | | |
|---|---|---|
| 1. | లిబియా యెడారిలో (1948) | 1 |
| 2. | కదలే నీడలు | 7 |
| 3. | అద్దంలో జిన్నా (1961) | 19 |
| 4. | హోటెల్లో | 27 |
| 5. | ఉషాకిరణం | 35 |
| 6 | బాబు | 48 |
| 7. | యవ్వనం | 62 |
| 8. | గడియారపు గుండెలు | 68 |
| 9. | పలితకేశం | 72 |
| 10. | తీవ్రవాద నాయకుడు | 81 |
| 11. | కవుల రైలు | 91 |
| 12. | బొమ్మ | 92 |
| 13. | దొంగ | 97 |
| 14. | నల్లజర్ల రోడ్డు | 103 |
| 15. | మణిప్రవాళం | 132 |
| 16. | ఓడిపోయిన మనిషి | 137 |
| 17. | సీతాపతి కథ | 146 |
| 18. | అతని కోరిక | 173 |

| | | |
|---|---|---|
| 19. | ఊరి చివర యిల్లు | 188 |
| 20. | సుందరీ-సుబ్బారావు | 221 |
| 21. | సముద్రపు అంచులు | 252 |
| 22. | జీవితం | 289 |
| 23. | ఉంగరం | 319 |
| 24. | నిర్మల మొగుడు | 333 |
| 25. | పరివర్తన | 342 |
| 26. | దేవుణ్ణి చూసినవాడు | 355 |
| 27. | నవ్వు | 374 |
| 28. | రాత్రి 9 గంటలు | 382 |
| 29. | ఏమీ లేదు | 387 |





# "లిబియా యెడారిలో"

౧

లిబియా యెడారిలో ఓ పెద్ద యిసక తుపాను వచ్చింది. మండే తెల్లని నల్లని యిసుక తరంగం మీద తరంగంలా పైకి లేచింది. ఒకమూల విరిగి పడి వున్న విమానం చటుక్కుని పైకిలేచి గిర్రున తిరుగుతూ ఓ పెద్ద చెట్టుకి తగిలి తిరిగి కిందకి పెద్ద చప్పుడు చేస్తూ పడిపోయింది. అందులో యిదివరకు చచ్చిపడివున్న పైలటు తిరిగి చచ్చిపోయాడు.

తర్వాత రోజున వీధులలో రక్తం కారే వార్తాపత్రికలు అమ్ముతున్నారు. అందులో యిలా వుంది: 'జర్మన్ పైలటు అమోఘ వీరమరణం! విజయం మనదే!'

ఆ మరుసటి రోజున అక్షరాలు లేని తెల్లని పత్రికలు అమ్మారు. అందులో యిలావుంది : 'పైలట్ భార్య తన యిద్దరు కొడుకులను చంపి, తాను ఆత్మహత్య చేసుకుంది. జర్మన్ నారీమణుల ఆదర్శ దేశభక్తికి యిదే తార్కాణం.'

ఈ వార్త విని అసూయతో బ్రిటిషు ద్వేషం ఎర్రపడింది. తీరాన్నే ఉన్న వెయ్యినొక్క శతఘ్నులు ఉక్రోషంతో ఠక్కున పేలాయి.

అమెరికాలో, యింగ్లండులో, యితర దేశాలలో కోటికోటి గోరీలు పగిలించుకుని, చచ్చిన సైనికులందరూ ఒక్కొక్క విమానంమీద, ఒక్కొక్క ఓడమీద, కాలినడక మీద లిబియా ఎడారి చేరారు.

తిరిగి అనేకమైన పగిలి పడివున్న విమానాలు పైకిలేచి ఒక దాని నొకటి ఢీకొని తిరిగి అన్నీ పగిలి ముక్కలు ముక్కలుగా పడిపోయాయి. యెడారిలో ప్రవహించిన యెర్రని నెత్తురు తాగలేక తాగలేక భూమి ఒక పక్కకి ఒత్తిగిలి ఉస్సురంది.

ఓ గొప్పశాంతి యెడారిలోని ఖర్జూరపు చెట్ల మొవ్వులలో నవ్వుతూ వదిలింది. ఊపిరి సలపని, బతకనివ్వని ఓ పెద్ద శూన్యం యొక్క శాంతి; మృత్యువుయొక్క కాంతి.

౨

ఉత్తర ధృవం మీద మంచుతో కట్టబడిన ఒక పెద్ద మేడలో నాగరికత విసుగ్గాంగా, తెల్లని పాలరాతి వొళ్ళు ముడుచుకుని పడుకుంది. సూర్యుని ఏడురంగుల కాంతిపడి ఆ భవనం విచిత్రంగా కరిగిపోతూ ఒక దివ్యమైన స్వప్నంలా వుంది. ఆమె జుట్టు మంటలా, మనిషిలోవుండే కోర్కెలా నొక్కులుదీరి పిరుదులవరకూ పరచుకుంది. గజనీ, నాదిర్‌షా, అలెగ్జాండరు, నెపోలియన్ల అస్థిపంజరాలు గదిచుట్టూ అలంకరింపబడి వున్నాయి. పక్కనున్న పాత్రలోని ఎర్రని నెత్తురు రుచి చూసే ఆమె పెదవులు ఎర్రగా ఉన్నాయి. గుండ్రని ఆమె రొమ్ములు, పాపంలా ఆకర్షణీయంగా ఉన్నతంగా ఉన్నాయి. నలుగురు సైనికులు ఎలెక్ట్రిక్ తీగ నములుతూ అక్కడికి వచ్చారు. 'హీల్-హిట్లర్! నేను నాలుగు వందలమందిని చంపాను, నేను ఒక్కణ్ణే! నువ్వు నన్ను వరించాలి, అన్నాడొక సైనికుడు.

'నా ది ప్రజాస్వామ్యం డెమోక్రసీ, నేను చాలామందిని చంపాను చచ్చిపోయాను కూడా. కావలిస్తే 'క్రానికల్' లో మృతసైనికుల పేర్లలో నా పేరూ వుంది చూసుకో! చంపడంలోకూడా నాకు నాగరికత తెలుసు. నేను ఆరువందల డెబ్భైమందిని చంపాను' అన్నాడు మరొక సైనికుడు.

'డౌన్ విత్ ఇంపీరియలిజం.... నేను సామ్యవాద సైనికుణ్ణి. అందర్నీ సమానంగా చంపెయ్యగలను. వినాశనంలోనుంచికాని అభివృద్ధి పుట్టదు. నీకు డయలెక్టిక్స్ తెలియవు కాబోలు. నేను ఎంతమందిని చంపానో నాకు లెక్క తేలటం లేదు!' అన్నాడు ఇంకో సైనికుడు.

'నేను విమానాలు నడిపి బాంబులువేసి ఊళ్ళకి ఊళ్ళు పట్టణాలకి పట్టణాలు నాశనం చేశాను. ఇందువల్ల నాగరికత మరీ అభివృద్ధిఅయే కారణాలు ఏర్పడుతున్నాయి. దాన్నే 'Rehabilitation' అంటారు కొందరు. దీనివల్ల యంత్రపరిశ్రమ, సైన్సు బలేగా అభివృద్ధి అయిపోతాయి. నేనూ వీళ్ళలాగే ఒక యిజమ్ కోసమే చంపాను. నిజం చెప్పేయ్యనా నీతో; చంపడమే నా 'యిజమ్'. న్యాయానికి అదిగో ఆ అలెగ్జాండరు, నెపోలియన్ల ప్రక్క ఉండవలసినవాణ్ణి. తర్వాత నీ యిష్టం, అన్నాడు మహాహ సైనికుడు, తుపాకి మందు ఓ చిటికెడు తీసుకొని నోట్లో వేసుకుని చప్పరిస్తూ.

నాగరికత మంచంమీద నుంచి సిగ్గులేని నగ్నత్వంతో లేచి నుంచుని చేతులు చాచింది. నలుగురూ ఆమెను నాలుగువైపులా కౌగలించుకున్నారు. ఆ మంచు యిల్లు ఓపెద్దగడ్డలా దొర్లిదొర్లి పసిఫిక్ సముద్రంలో దభీమని పడిపోయింది.

లిబియా యెడారిలో ఇసుక తుపాను వచ్చింది. ఆగిపోయింది. గద్దలూ, నక్కలూ, అక్కడక్కడ విశ్రాంతిగా ఆహారం తీసుకుంటూ ఉన్నాయి. సగం విరిగిన విమానాలూ, ట్రక్కులూ, తుపాకులూ చిందరవందరగా పడివున్నాయి.

ఒక మొండి చెయ్యి మూలుగుతూ గంతులు వేస్తూ పక్కనున్న మొండెం వద్దకు వెళ్లింది.

'హలో బ్రదర్ నీదగ్గర ఏంటీ సెప్టిక్ ఏదేనా వుందా.'

'ఏం.'

'నావాళ్లింకా రక్తం కారుతోంది. నాకు భయంగా వుంది. నేను చచ్చిపోతానంటావా? 'అబ్బా' అని మొండి చెయ్యి భయంకరంగా ఏడ్చింది.

మొండెం విషాదంగా, వెకిలిగా సకిలించింది: 'ఫూల్ నువ్వు యిదివరకే చచ్చిపోయావు. నువ్వు ఒక శరీర భాగానివి. నువ్వు యిపుడు మొండి చెయ్యివి.'

నిజం. మొండిచెయ్యికి యుద్ధంఅంతా తిరిగికళ్లకి గోచరించింది. దడదడలాడింది. 'పోనీ నా కుటుంబానికి ఏదేనా ప్రభుత్వం సహాయం చేస్తుందా?

నా మేరీ! నా ప్రియమైన తియ్యని మేరీ! అరే బ్రదర్ ప్రభుత్వానికి ఎప్లికేషన్ రాసిపారేస్తా!'

'చచ్చినవాళ్ళకి ప్రభుత్వం ఏ సహాయం చేస్తుంది. నువ్వు మతిస్థిరం లేని వాడవులా కనబడుతున్నావు' అంది మొండెం.

ఇంతలోకి ఒక తలకాయ పంటుపుంటూ అక్కడికి వచ్చి యిలా అంది: 'చచ్చినవాళ్ళకి, అంటే మనకి, ఒక పెద్ద స్మారకచిహ్నం కట్టిస్తారు. ఇంకేం చేస్తారు?'

మొండెం వెనక్కి తిరిగి చూసి రోషంతో యిలా అంది: 'ఎవరు నువ్వు....'థింకర్'వి(Thinker) అయితే చెప్పు! నేనెవణ్ణి. నేనెందుకు యీ యెడారికి వచ్చాను. ఎందుకు చచ్చిపోయాను. ఏమిటి ఫలితం (గట్టిగా అరుస్తూ.) చెప్పు థింకరూ! నా బత్తాయి తోట ఏమయిపోయింది. నా కొడుకు పరీక్షలో ప్యాసయాడా. నా భార్యకి ఎన్నవనెల గర్భం! నేను ప్రేమించి ఉంచుకొన్న మార్గరెట్‌కి తిండి ఉందో లేదో! ఇవన్నీ ఎవరు చూస్తారు! ఎవరు చూస్తారు! ఎందుకీ యుద్ధం? చెప్పు.' మొండెం కోపంతో వణకి పోయింది.

థింకర్ తల గోక్కున్నాడు. 'చచ్చి పోయినప్పట్నించీ యిదే ఆలోచిస్తున్నాను. ఎందుకీ యుద్ధం అని! నాకేం అర్థమవడం లేదు.'

ఒక శరీరంలో పైభాగం అక్కడికి దొర్లుకుంటూవచ్చి వాళ్ళ మధ్యన కూర్చుంది. రెండు గ్లాసు ట్యూబులను జేబులోంచి తీసింది.'గుడ్ వినింగ్. నాకు కొంత పొటాషియం....కావాలి. ఇక్కడెక్కడా మందుల కొట్లు లేవు. వట్టి యెడారి.'

'నీకు మందులు ఎందుకు?'

'నేను ఓ పెద్ద మానవ వినాశన కారకమైన యంత్రాన్ని కనిపెట్టు తానని నా ప్రభుత్వానికి మాట యిచ్చాను. చాలామటుకు అయిపోయింది. ఇప్పుడు కొద్దిగా పొటాషియం, రేడియమ్, ఒక మైక్రాస్కోపు....ఇటువంటివే కావాలి.'

మొండి చెయ్యి భయంతో అరచింది. 'ఇతను పిచ్చాడు. పిచ్చాళ్ళంటే నాకు భయం.'

శరీరం పైభాగం కళ్ళజోడు తీసి చూచి 'పిరికి వెధవ్వి నువ్వు. నేను ఒక్కడ్నీ ఏకాంతానికి వెళ్ళి నా 'రీసెర్చి' చేసుకుంటాను. కాలం నాకు చాలా ప్రెషస్' అంటూ దొర్లుకుంటూ వెళ్ళిపోయింది.

మొండెం జేబులోంచి కొన్ని ఫోటోలు తీసింది. 'ఇది నా తల్లి, ఇది నా భార్య, ఇది నా....' అంటూ బావురుమంది.

మొండిచెయ్యి జాలితో కదలిపోయింది. థింకర్ దగ్గరగా వెళ్ళి మెల్లగా యిలా అంది: 'మనం మళ్ళీ బ్రతకలేమా! ఒకవేళ ఇప్పుడు వెళ్ళిపోయిన సైంటిస్టు మన్ని బ్రతికిస్తాడేమో....మళ్ళీ మాయింటికి వెళ్ళిపోవచ్చు. మా ఆవిడ చేస్తుంది రొట్టె—బలే బలే రుచి ...నోరూరిపోతుంది.'

మొండెం విసుగుతో 'ఏడిశావ్ వెధవాయి. నీకు నోరులేందే ఎలా ఊరుతుంది. నువ్వు వట్టి మొండిచెయ్యివి' అంది.

ఒక గుండెకాయ పరుగెత్తుతుంటూ అక్కడికివచ్చి థింకర్‌ని కౌగలించుకుంది. దానికిరుప్రక్కలా స్టెతస్కోపు వేలాడుతూవుంది.

'నేను డాక్టర్ని. యుద్ధంలో చచ్చిపోయాను, చూడు మిష్టర్! నా గుండె ఆగిపోతోన్నట్టు అనిపిస్తోంది. ఈ స్టెతస్కోపుతో ఒక్కసారి చూడు....కొట్టుకుంటోందా!'

థింకర్ నవ్వాడు. మొండెం థింకర్‌తో ఇలా అంది: 'నీకు కాలక్షేపం ఎలా అవుతోంది.'

థింకర్ వెళ్ళిపోతూ యిలా జవాబిచ్చాడు: 'చచ్చినవాళ్ళ జేబుల్లోంచి సెకండ్ హాండ్ పుస్తకాలు తీసుకుని ఓ మూలగా కూర్చుని చదువుకుంటాను.'

మొండిచెయ్యి ఏడుస్తోంది. 'ఓ నా భార్యా, నాతల్లీ....' రెండు నక్షత్రాలు కిందికి పారాచ్యూట్లలో దిగాయి. ఒకనక్షత్రం అందియిలాగ: 'ఇదంతా ఏమిటి? ఈ పగిలిన సామాన్లూ, తలలూ, చిందిన రక్తమూ? వీళ్ళందరూ ఎవరూ?' మగనక్షత్రం మెల్లిగా చెవిలో యిలా చెప్పింది: 'వీళ్లనే మనుష్యులంటారు.'

ఆడనక్షత్రం నవ్వింది కాబోలు, చటుక్కుని మెరసింది. 'ఇవన్నీ ఏరుకుని యింటికి తీసుకు పోదాం. చాలా సరదాగా వుంటుందిది.'

రెండునక్షత్రాలూ ఆకాశంమీదికి నిచ్చెన ఎక్కినట్లుగా ఎక్కి, సూర్యుడికీ చంద్రుడికీ మధ్య ఎక్కడో ఒకచోట నుల్చునిపోయాయి. ఈ విచిత్రం చూస్తోన్న మొండిచెయ్యి అంతవరకూ ఏడుపు మానివేసి, తిరిగి మొదలు పెట్టింది.

ఆ ఏడుపు నిస్సహమైన ఆ యెడారిలో యుగ యుగాల వ్యర్థ ప్రయత్నంలా, యుగయుగాల దిగులులా, చావులా, అర్థం లేని జవాబులేని ప్రశ్నలా యిసుకనీ, చెట్లమోడులనీ ఒరసుకుంటూ అలాగే పోయింది.

*(ఆంధ్రశిల్పి - ఫిబ్రవరి 1948)*

7

# కదలే నీడలు

"చీకటి" అన్నాడతను.

"అవును" అంది ఆమె.

ఇద్దరూ రోడ్డు మలుపు తిరిగారు. ఇప్పుడు వచ్చినరోడ్డు మరీ పెద్దదిగా వుంది. ఇరువైపులా ఉన్న మేడల వరుసలు ఆ నిశ్శబ్దంలో చీకటిలో ఆలోచనలులేని స్తబ్ధమనస్సుల్లా ఉన్నాయి. మధ్యమధ్య వలయంగా నీడలు కల్పిస్తూ, బ్లాకౌట్ చేయబడిన విద్యుద్దీపాలు నగరపు మెల్లకన్నులులా వున్నాయి. అక్కడక్కడ షెల్టర్లూ, సగం సగం తియ్యబడిన గోతులూ, కంకర గుట్టలూ ఉన్నాయి. ఏదో ప్రమాదాన్ని పసికట్టినట్టు గాలి స్తంభించిపోయింది.

"ఇలా ఎక్కడికి?" అంది ఆమె. తలపైకి ఎత్తినపుడు చెవిలోలకు మెరిసింది.

"ఎక్కడికేఁవిటి" అన్నాడతను. అతను తన చేతిని జేబులోనికి పోనిచ్చి తిరిగి తీసివేశాడు.

"ఒక్కొక్కసారి చీకటి కూడా బావుంటుంది." అన్నాడు.

"అవును" అందామె.

"చీకట్లో ఏమీ కనపడవు" అతనన్నాడు ఏదో తృప్తిగా.

"ఊహూం-మరీ స్పష్టంగా కనపడతాయి. భయపెడతాయి" అందామె ఆలోచనగా.

"ఏమిటి?"

"మన ఊహలు.... మన బాధలు...."

అతను దగ్గాడు. ఈ మాటలు యిష్టంలేదన్నట్టు చటుక్కున ప్రసంగం మార్చాడు.

"కలకత్తా చాలా పెద్ద పట్టణం" అన్నాడు. జేబులోకి చేతిని పోనిచ్చి తీసివేశాడు. ఆమె ఏం మాట్లాడలేదు.

"మీరు చదువుకున్నారా? అంటే కాలేజీలో."

"ఆఁ"

"మీ ఆయన ఏం చదివాడు."

"నాలాగే బి.యే."

"మిమ్మల్ని వదలి ఎలా వెళ్ళిపోయాడు?" అతను మరొకవైపు చూస్తూ అడిగాడు.

"లేకపోతే ఏం చెయ్యమంటారు?"

"మీకు బాధగా లేదూ?"

ఆమె నీరసంగా నవ్వి "ఎందుకుండాలి?" అంది.

"అంతే అంతే" అన్నాడతను. దేనికోసమో జేబులో చెయ్యిపెట్టి తీసివేశాడు.

"ఈ రోడ్డు చాలా పొడుగు" ఏం తోచక అన్నాడతను.

"అవును."

పెద్ద లైట్లతో ఒక కారు వచ్చి వాళ్ళని దూసుకుపోయింది.

ఆమె తప్పుకుంటూ అతనికి తగిలింది. మళ్ళీ చటుక్కున దూరంగా తప్పుకుంది.

"పొగరు" అంది ఆమె.

"లారీ మిలటరీవాళ్ళది."

"యుద్ధం వస్తుందా?"

అతను నవ్వాడు. "రావడమేమిటి? ప్రచండంగా జరుగుతూంటే."

"కాదు. మన దేశానికి కూడ?" అంది ఆమె.

"ఏమో."

ఒక మిణుగురు ఆమె ముంగురులకి తగిలి వెళ్ళిపోయింది.

రైలుగేటు దగ్గర ఎవరూ లేరు. రెండు కుక్కలు మాత్రం పట్టాలకి కాస్త దూరంగా పడుకున్నాయి.

"మీరేం ఆలోచిస్తున్నారు?" అని అడిగాడతను, గేటుదాటి కొంచెం దూరం వెళ్ళాక.

"ఏమీలేదు" స్వప్నంలోంచి మాట్లాడుతూన్నట్టుంది ఆమె.

"ఏం లేదూ!"

"ఏమీలేదు"- స్ఫుటంగా కోపంగా అంది ఆమె.

అతనికి ఆశ్చర్యం వేసింది. ఏమీ లేకపోవడం అంటే? లారీలూ, షెల్టర్లూ, విమానాలూ, పత్రికలూ, హిట్లరూ, ఎ.ఆర్.పి. ఆమె, తానూ - అన్నీ ఉండగా అందరూ ఉండగా ఏమీ లేకపోవడమేమిటి? తెలివిగా తనంతట తనే కనురెప్పల మధ్య నవ్వుకున్నాడు. ఒకసారి జేబులోకి చెయ్యిపోనిచ్చి తీసివేశాడు.

"మీ ఆయన ఎక్కడున్నాడు?" అన్నాడతను.

"ఈజిప్టులో."

"పాపం" అన్నాడతను.

"ఏం?" అంది ఆమె.

"సైన్యంలో ఎందుకు చేరాడు?"

"ఎందుకా-" ఆమె అతనికేసి ఓ నిముషం చూసి మెల్లగా "మీరెందుకు చేరాలా?" అంది.

"నే నీ దేశంలోనే వున్నానుగా."

"అయితేనేం!"

"ఎందుకు చేరానా!" అతను ఆలోచిస్తూ ట్రాము బద్దీలకేసి చూశాడు. అవి సాగిసాగి ఎక్కడో చీకట్లో కలిసిపోయాయి. దారిపక్క ఓ పెద్ద గోతిలోంచి రెండు పందికొక్కులు ఉత్సాహంగా యివతలకివచ్చి పరిసరాల్ని పర్యవేక్షించాయి.

"ఎందుకేమిటీ?" అతను కారణాలు వెతుక్కుంటూ స్వగతంలా మాట్లాడుతున్నాడు. "ఉద్యోగమూ లేదు, డబ్బూ లేదు. నా భార్యా చనిపోయింది. ఏం తోచలేదు. సైన్యంలో చేరేశాను" ఇలాగ అని ఆలోచిస్తూ అతను అక్కడే నుంచునిపోయాడు.

నాలుగడుగులు ముందుకు వెళ్ళిన ఆమె వెనక్కి తిరిగి "ఆగిపోయారేం!" అంది.

"మర్చిపోయాను" క్రాపు సవరించుకుని అతను ముందుకు సాగాడు.

"మీ భార్య ఎందుకు పోయిందీ?" ఆమె అడిగింది.

"నన్ను ప్రేమించి."

ఆమె వింతగా అతనికేసి చూసింది. అతను కంగారుగా తల పక్కకి తిప్పుకున్నాడు.

"ఎప్పుడయింది మీ పెళ్ళి?" అంది ఆమె.

"మేం పెళ్ళి చేసుకోలేదు."

"అంటే?"

"పెళ్ళికి పెద్దవాళ్ళు ఒప్పుకోలేదు. మా కులాలు వేరు. ఆమె నాతో వచ్చేసింది."

"తర్వాత"

"రిజిష్టరు మారేజీ చేసుకుందామని అనుకున్నాం. కాని ఉద్యోగం కోసం ఊరూరా తిరుగుతూ నాగపూర్ వెళ్ళాం. అక్కడ సత్యాగ్రహంలో చేరాం. మమ్మల్ని జైలులో పెట్టారు. మాకు మలేరియా వచ్చింది. మమ్మల్ని వదలిపెట్టారు. నాకు మలేరియా దానంతట అదే కుదిరింది. ఆమెకు కుదరలేదు. సరైన మందులేక...." అతను గుండెల మీద చెయ్యిపెట్టి రాసుకున్నాడు. ఆమె అవ్యక్తంగా వచ్చే ఒక ఆలోచనను తల్చుకుని భయపడి "అబ్బా" అంది.

"ఏం?" అన్నాడతను.

"ఏమీలేదు" అందామె.

అతనికి తిరిగి ఆశ్చర్యం వేసింది. తెలీని బాధ, ఒంటరితనమూ, యుద్ధమూ-ఈజిప్టూ, మలేరియా - యిన్ని వుంటే లేకపోవడం ఏమిటీ?

ఆకాశంమీద ఆర్ద్రనక్షత్రం మీద ఒక లేతమబ్బు కప్పుకొని వుంది. పక్కసందులో ఒక ఆంగ్లో - ఇండియన్ యువతీ, యువకుడూ ఒకరి మీద ఒకరు తూలుతూ నడుస్తున్నారు.

"మీరు వెల్సురాసిన Things to Come' చదివారా?"

"నాకు వెల్సు అంటే అయిష్టం" అందామె.

"అందులో Walking disease వచ్చిందట యుద్ధంమూలాన్ని. మనకీ ఆ జబ్బు వచ్చిందేమో" అతను నవ్వుదామని ప్రయత్నించి దానికి బదులుగా దగ్గాడు.

"మా మేనమామ క్షయమూలాన్ని చనిపోయాడు" అందామె.

"మంచిపని చేశాడు." అతను తిరిగి యిలా అన్నాడు.

"మీ రెందుకు నర్సుగా చేరారూ?"

"ఆయన యుద్ధంలోకి వెళ్ళిపోయారు, మరి నేనేం చెయ్యను? ఏదో దిగులుగా వుండేది. ట్యూషన్లు చెప్తున్నారు."

"బాగానే వుంది."

"కాని చెప్పలేను."

"ఏం?"

"నా రహస్యం."

"తర్వాత?"

"నర్సుగా చేరాను ఒక హాస్పిటల్లో."

"మరి?"

"ఒక రోగి వచ్చాడు."

"ఎవరూ ?"

"ఒకరు. ఎంతో గంభీరంగా వుండేవాడు. ఎప్పుడూ జాలిగా నాకేసి చూసేవాడు. నేను లేచిపోతే మందైనా తాగేవాడు కాదు."

"ఊఁ."

"అతనంటే ఏదో యిష్టం కలిగింది. పరిచర్యతో, అనురాగంతో అతని బాధను తగ్గించాలనుకునేదాన్ని అతనిలాగా నా భర్త ఎక్కడేనా పడి ఉన్నాడేమో...."

ఆమె గొంతు రుద్ధమయినట్టనిపించింది. అతను జేబులోకి చేతిని పోనిచ్చి తీసేశాడు.

"తర్వాత" అన్నాడతను భయంగా.

"నర్సుపని మానేశాను."

"ఏం?"

"ఆ రోగి పోయాడు."

అతను నిట్టూర్చాడు. ఒక షెల్టరు దగ్గర ఎవడో ముష్టివాడు నిద్రలో కలవరిస్తున్నాడు. అతను మళ్ళీ అన్నాడు.

"ఇలా ఎక్కడికి నడుస్తున్నాం?"

"అగమ్యం" అంది ఆమె.

"మీకు తెలుగు బాగా వచ్చునే."

"పరీక్షలో పోయేది ఎప్పుడూ."

అతను నవ్వాడు ఏదో గౌరవార్థంగా అన్నట్టు.

"మరి...." సందేహిస్తూ ఆగాడు.

ఏమిటి అన్నట్టుగా ఆమె అతని కేసి చూసింది.

"మరి సైన్యంలో నర్సుగా ఎందుకు చేరారు?" అన్నాడతను.

"కొన్నాళ్ళు ఈజిప్టు నుండి ఉత్తరం రాలేదు. కంగారుపడ్డాను."

"అహా"

"అతని భుజంలోంచి గుండు దూసుకుపోయిందని వార్త వచ్చింది."

"అరె!" – అప్రయత్నంగా ఆమె భుజంమీద చెయ్యి వేశాడు.

"మళ్ళీ నేటివరకూ ఏ వార్తా రాలేదు. బతికి వున్నాడో లేదోకూడా తెలియదు."

ఆమె నుదుటిమీద పడే ముంగురుల్ని వణకే చేత్తో సవరించుకుంది. మళ్ళీ యిలా అంది.

"అప్పట్నుండి సంక్షోభంగా ఉండేది మనస్సు. సైన్యంలో నర్సుగా చేరాను."

"ఇక్కడ శాంతిగా వుందా?" అడిగాడతను.

"లోని కంగారుని అణచివేస్తోంది యీ యుద్ధ సంక్షోభం. అందరి వెనుకాలా అన్ని చోట్లా మృత్యువు పొంచి ఉన్నట్టనిపిస్తుంది. యీ సోల్జర్ల మధ్య. అప్పుడు నా బాధ ఒక్కటీ విడిగా కనపడదు."

"నిజమే."

"ఒకొక్కొక్కసారి యీ సోల్జర్లలో ఎక్కడో మా ఆయన ఉన్నాడేమో అనిపిస్తుంది."

బ్లాకౌట్ చేయబడిన వెలుతురులో ఆమె కళ్ళ చివర కన్నీటి బిందువుని చూశానా అని అనిపించింది అతనికి. ఏమనాలో తోచలేదు. "చీకటి బాపుంటుంది" అన్నాడు. జేబులో చెయ్యిపెట్టి తీసివేశాడు.

రోడ్డు క్రమంగా ఒక మైదానంలో కలిసిపోయినచోట అస్పష్టంగా విశాలంగా అయిపోయింది. మైదానంలో డేరాలూ, డేరాలలోంచి చిన్న చిన్న లైట్లూ కనబడుతున్నాయి. మైదానానికి ఇంకా దూరంగా నడుస్తూన్న అతనికీ ఆమెకీ సన్నని గొంతుక పాడుతూన్నట్టు వినిపిస్తుంది. పాట కొత్తగా విజాతీయంగావుంది. ఎవరో తనలో తాను ఏడుస్తూ నవ్వుతూ కింద పడి దొర్లుతున్నట్టుగా ఉంది.

"ఏమిటదీ" అంది ఆమె.

"బర్మా శరణార్థుల క్యాంపు."

"వెళదామా."

"ఊఁ"

ఇద్దరూ ఆ డేరాలవైపు నడవసాగారు. అంత రాత్రివేళ కూడా కొందరు నిద్రలేకండా డేరాలకి దూరంగా కూర్చుని ఉన్నారు. కొన్నిచోట్ల ఒక స్త్రీ, పురుషుడూనూ, మెల్లగా భయంగా వీచే గాలిలోంచి వాళ్ళ గుసగుసలు వినబడుతున్నాయి. డేరా సందుల్లోంచి వెలుగు సన్నగా పాకి యిసుకమీదపడి మెరుస్తోంది.

"ఈ జంటలు భార్యాభర్తలా" అడిగిందామె.

"అవొచ్చును. ఏం చెప్పగలం" అన్నాడతను.

"ఇంతమంది యిళ్ళూ వాకిళ్ళూ వదలి వచ్చేశారు. పాపం వాళ్ళకి ఎలా వుంటుందో!"

"యుద్ధం-" పళ్ళు నొక్కి పెట్టి అన్నాడతను.

డేరాలు సమీపించిన కొలదీ ఆ ప్రదేశమంతా కంగాళీగా వుంది. డేరాలకి కొద్దిదూరంలో షెల్లులూ గోతులూ వున్నాయి. డేరాలలో పెట్టెలూ సామాన్లూ ముసలివాళ్ళూ పేర్చబడి వున్నారు. చాపమీద స్త్రీలూ, శిశువులూ పరున్నారు.

"ఎంతమందో" అందామె.

అతను మాట్లాడలేదు. జేబులో చెయ్యిపెట్టి తీసేశాడు.

ఒక చంటిపిల్ల 'కార్' మంది—ఏడుస్తూ పక్కకి మరొకడి పక్కలోకి దొర్లింది. వాడు లేచి విసుక్కుంటూ పెద్ద కేకలు వేస్తున్నాడు. ఒక వృద్ధుడు లేచి పిల్ల నెత్తుకుని లాలిస్తూ ఈవలికి వచ్చాడు.

"తల్లికివ్వరాదూ పిల్లని"-అందామె యింగ్లీషులో.

వృద్ధుడు ఆమెకేసి కొంతసేపు శూన్యంగా చూశాడు. అతికష్టం మీద మాటలను పోగుచేసుకుంటూ ఇలా అన్నాడు. ఆ పిల్ల తన మనుమరాలనీ, తన కూతురు అస్సాము సరిహద్దు దగ్గర ప్రసవించి చనిపోయిందనీ—తిరిగీ యిలా అన్నాడు. "దీనికి పాలు లేవు. ఇదికూడా చచ్చిపోతే బాగుండును."

ఆమె జాలిగా చూసింది. ఇద్దరూ అక్కడనుండి కదిలారు.

"పాపం" అందామె.

"ఏం?"

"జాలేసింది. కాని ఆ పిల్ల నాడులూ అవీ పైకొచ్చి అసహ్యంగా వుంది."

అతను యిసుకలో మౌనంగా నడుస్తున్నాడు. భారంగా అడుగులు వేస్తూ కొంచం వంగి నడుస్తున్నాడు. ఆమెకి ఏమయ్యేదో తెలియని తన భర్త ఏ అరేబియా యెడారిలోనో యిలాగే నడుస్తున్నాడా అనిపించింది. కంగారుగా పైటచేత్తో సవరించుకుంది.

ఎదురుగా ఒక యిరవై యేళ్ళ యువకుడూ యిరవై నాలుగేళ్ళ యువతీ వస్తున్నారు, మసక నిదరలో నడుస్తూన్నట్టు. ఆ యువతి వీళ్ళని

నదానించి చూసి "బామా" అని పిలిచి ఒక్క పరుగున వచ్చి హఠాత్తుగా లగి పకపకా నవ్వడం ప్రారంభించింది. ఆమె వెనుకాలే యువకుడు కంగారుగా వచ్చాడు. ఇద్దరూ బర్మా దేశీయులు.

అతను యువకుణ్ణి ఉద్దేశించి "ఎందుకు నవ్వుతుంది" అని అడిగాడు ఇంగ్లీషులో.

మిమ్మల్ని "బామా" అనుకుంది. కాని మీరు బామాకారు అన్నాడా యువకుడు.

"మీరెవరు—మీ పేరు" అన్నాడతను.

"నా పేరు యూబా, ఈమె పేరు ఆమా. శరణార్థులం" అన్నాడా యువకుడు, లావుపాటి కిందపెదవి నొక్కిపట్టి. తిరిగి ఇలా అన్నాడు: "మీరు ఎందుకిలాగ వచ్చారు. ఈ క్యాంపులో వుంటారా?"

"కాదు. మిలటరీలో పనిచేస్తున్నాను" అన్నాడతను.

బర్మా యువతి ఏదో అంది, యూబా అనువదించి ఇలా అడిగాడు.

"ఈమె మీకేమౌతుంది?"

"ఏమీకాదు" అన్నాడతను.

ఆమా నిద్రలేచి బరువు కళ్ళతో నవ్వి ఏదో అంది. యూబా "మాకూ ఏమీ తోచడం లేదు; కాసేపు కూర్చుని మాట్లాడుకుందామా" అన్నాడు.

నలుగురూ కొంచెందూరం నడిచి ఒకచోట కూర్చున్నారు. ఆమా ఏదో మాట్లాడుతూ పకాలున నవ్వుతోంది. ఈసారి యింతవరకూ మౌనంగా ఉన్న ఆమె అడిగింది: "ఆమా మీకన్న పెద్దదిలా వుంది. ఈమె మీకేమౌతుంది?"

యూబా కళ్ళు కుంచించాడు. అతని చిన్న నొసలు ముడతలుపడి ఏవేవో స్మృతుల్ని దాస్తున్నట్టుగా వుంది. "బామా యీమె అన్నగారు. 'దేశద్రోహి.' జపాన్‌వాళ్ళ గూఢచారి అనే పేరుతో అతన్ని ప్రభుత్వం చంపివేసింది. కాని యీమెకింకా పాపం తెలియదు. ఎక్కడో బతికి ఉన్నాడనుకుంటోంది. తర్వాత జపాన్ విమానాలు దాడిచేశాయి. ఆ దాడిలో

యీమె గృహమూ, ముసలితల్లీ నాశనమై పోయారు. మా అందరితోనూ యీమె పారిపోయి వచ్చింది. ఇప్పుడు...." యూదా ఒకసారి దగ్గి ఇలా అన్నాడు: "ఇప్పుడు మేం భార్యా భర్తలలాగా వున్నాం."

"మీరు బర్మాలో ఏం చేసేవారు?" అన్నాడతను.

యూదా మళ్ళీ ఆలోచించాడు. మళ్ళీ నొసలు కుంచించాడు. జవాబు చెప్పడమే పెద్ద పరిశ్రమలాగ ఉంది అతనికి. "కలప వర్తకం చేసే వాళ్ళం-నేనూ మా అన్నలూ."

ఆమె ఏదో అడగబోయింది. కాని అతను కళ్ళతో వారించాడు.

ఆమా అక్కడనుంచి లేచి అల్లరిగా గాలిలో ఎగిరే మిణుగురుల్ని పట్టుకునేందుకు ప్రయత్నిస్తోంది. అతను చేతిలోకి యిసుక తీసుకుని కొంచెం కొంచెం కిందపోస్తూ యిలా అన్నాడు.

"ఏదైనా ఉద్యోగం చెయ్యరాదూ."

యూదా అన్నాడు "అవును. నేను మిలటరీలో చేరదామనుకుంటు న్నాను."

అతను ఆమెకేసి చూచాడు. ఆమె కూర్చునే ఇసుకపాట్లు పడు తోంది. అత నామెను తట్టి లేపాడు. ఆమె ఉలిక్కిపడి "అరె! నిద్ర వచ్చింది-చిత్రంగా" అంది.

యూదా అన్నాడు మళ్ళీ నిశ్చయంతో: "అవును. మిలటరీలోనే చేరుతాను."

"మరి ఆమా ఏమవుతుంది?" అంది ఆమె.

"ఏమౌతుంది?" యూదా కాస్త దూరంలో ఉన్న ఆమాని ప్రేమ చూశాడు. "ఏడుస్తుంది నిజమే. కాని ఈ దేశాలలో ఏ సౌకర్యమూ లేక ఎన్నాళ్ళు వుండడం? ఊరికే ఉన్నకొలది మా వ్యాపారమూ, అన్నలూ, మా వూరూ జ్ఞాపకం వస్తారు. నేను సైన్యంలో చేరితే ఆమె యింకొక మంచివాణ్ణి స్నేహం చేసుకుంటుంది. యుద్ధం వచ్చినప్పుడు స్నేహాలెంత త్వరగా చేసుకుంటామో అంత త్వరగా తెంపుకోవాలి. అం నంటారా?" అన్నాడు యూదా ఇంగ్లీషులో తన ఆలోచనల నొక్కొక్క

మెల్లగా విప్పుతూ. అతని గొంతులో కందిరీగ దూరినట్లు స్వరం విషాదంగా పలికింది.

మిణుగురులతో ఆడుతూ ఆమా దూరంగా వెళ్ళిపోయింది. అక్కడ నుండి యూహాను పిలిచింది. యూహా లేచి "ఆమె పిలుస్తోంది. నేను వెళ తాను." అని గబగబా వెళ్ళిపోయాడు. అతడు లేచాడు. ఆమె లేచింది.

నిశ్శబ్దంగా యిద్దరూ ముందుకు నడచి వెళుతున్నారు. పోలీసు ఈల దూరంగా వినపడింది. తూర్పున నక్షత్రం మీద కప్పుకున్న మబ్బు పింజె పింజెలుగా విడిపోయింది. ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు. యూహా, ఆమా-యిరువురూ గాఢమైన కౌగిలిలో ఉన్నారు. ఇద్దరూ యిసుక ప్రదేశం దాటి ఎత్తుగావున్న ఒక దిబ్బదగ్గరకు వచ్చారు. అక్కడ కొన్ని తాటిచెట్లు మాత్రం ఉన్నాయి. చక్రాలూ, టాపూ లేని ఒక పాత జీప్‌కారు తుప్పు పట్టి బోర్లాపడివుంది.

"ఇలా కూర్చుందాం" అన్నాడతను.

"ఊఁ"

దిబ్బమీద యిద్దరూ కూర్చున్నారు. ఆకాశంమీద చంద్రుడు వడలిన పువ్వురేకులా ఉన్నాడు. ఇద్దరి నీడలూ వెనక్కి పొడుగ్గా సాచుకుని ఉన్నాయి.

"యూహా చిత్రమైనవాడు" అన్నాడతను.

"ఔను."

"మరి...."

ఆమె కనులు పైకెత్తి "ఏఁవిటి?" అంది.

"ఏదో చెప్పబోయి మరచిపోయాను." అన్నాడతను, జేబులోనికి చెయ్యి పోనిచ్చి తీసివేసి.

ఆమె వింతగా చూసింది. అతను నిశ్చలంగా శూన్యంలోకి చూస్తున్నాడు. తాటిచెట్టు పక్కనుండి ఒక ముంగిస పరుగెత్తుకు వెళ్ళింది. గుడ్డి వెన్నెలలో పట్టణపు మేడల కొసలు మెరుస్తున్నాయి. దూరంగా డేరాల నీడలు యిసుకలో మెత్తగా పరుచుకున్నాయి. అంతా విచిత్రమైన నిశ్శబ్దం.

అతను చటుక్కున నవ్వాడు. ఆమె కంగారుగా ముంగురులు పైకి తోసుకొని "ఏం?" అంది.

"ఏముందీ - ఎందుకో వచ్చింది ఏడుపులాంటి నవ్వు" అన్నాడు. అతను జేబులో చెయ్యిపెట్టి తీసివేశాడు పళ్ళు పటపటా కొరుకుతూ "యుద్ధం!" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. అతను ఆమెకేసి చూశాడు. ఆమె కళ్ళమ్మట నీటిచుక్కలు రాలుతున్నాయి. అతను తెల్లబోయాడు. జాలి అతని మొహంలో ప్రసరించింది.

"ఎందుకు ఏడుస్తున్నావు ?" అన్నాడు విసుగ్గా, జాలిగా.

ఆమె జవాబు యివ్వలేదు. అతను ఆమె దగ్గరగా జరిగి ఆమె తలనీ, చెక్కిళ్ళనీ నిమిరాడు. ఆమె వొరిగి అతని వక్షంమీద తలని ఆన్చింది. అతనామె పెదవుల్ని మెల్లగా మెత్తగా ముద్దుపెట్టుకున్నాడు. ఇద్దరూ ఒకరి పక్కగా ఒకరు ఒరిగి పడుకున్నారు.

"రేపు ఆఫీసరు వస్తాడు పరీక్ష చేసేందుకు" అన్నాడతను.

"ఊహూఁ" అందామె.

"ఇక్కడ బావుంది కదూ - పీడకలలు వచ్చే నిద్రకన్నా?" అన్నాడతను. అతను తిరిగి జేబులోనికి చెయ్యిపోనిచ్చి తీసివేశాడు.

"ఎందుకు యిందాకట్నుంచి జేబు తడుముకుంటున్నారు!" అంది ఆమె అతని జుట్టులోకి వేళ్ళని పోనిస్తూ.

అతను నవ్వాడు "సిగరెట్లకోసం - లేవన్నమాట మరచిపోతున్నాను."

మధ్య మధ్య ఏవో అస్పష్ట రవాలు దూరంగా దేరాలనుంచి వినవస్తున్నాయి. కృష్ణపక్షపు గుడ్డివెన్నెలలో ఆ నగరం తనలో తానొదిగిన పెద్ద తాబేలులా వుంది.

19

# అద్దంలో జిన్నా

యం. ఏ. జిన్నా కోటు తొడుక్కుని అద్దంముందు నుంచున్నాడు. అద్దంలో జిన్నా కనపడ్డాడు. అద్దంలో చాలా గొప్ప జిన్నాలా కనపడ్డాడు. అద్దంలో నిజానికి ఒక జిన్నా ఒక్కడే కనపడలేదు. జిన్నా వెనకాల ఎంతోమంది మహమ్మదీయులు వరుసలుతీరి "జిన్నాకీ జై" అంటూ నిల బడ్డారు. అందరిలోనూ ఒక్కొక్క జిన్నా ఉన్నాడు. ప్రతి మహమ్మ దీయుడూ ఒక అద్దం. అద్దంలో జిన్నా అంటే విశాలమూ వివిధమూ అయిపోయిన జిన్నా. పెడల్పూ పొడుగూ విస్తరించి మరీ రహస్యమూ మరీ ప్రకటితమూ అయిపోయిన జిన్నా.

జిన్నా చాలా గొప్పవాడు. కోటు గుండీలు పెట్టుకుంటున్నాడు. 'పోర్టికోలో' కారు ఆగింది. ఆ కారుమీద జిన్నా తన గృహావరణం దాటి వీథిలోకి వెళతాడు. పత్రికా విలేఖరులూ, అనుయాయులూ, భక్తులూ, రాజ కీయవేత్తలూ పోర్టికో స్తంభాన్ని ఆనుకుని నుంచున్నారు. ఆతృతతో నమ్రతతో నుంచున్నారు. తన్ను దర్శించటానికి వచ్చారు. అవి రంజాన్ రోజులు కాబట్టి ; తన్ను దర్శించడంలో మహత్తు వుంది. ఒక జగత్తు వుంది. తాను కోటు గుండీలు పెట్టుకునే ఒక సామాన్య ప్రాణికాదు. తాను వారిలో అవ్యక్తంగా ఉన్న ఒక ఆశ, తన వ్యక్తతలో వాళ్ళందరూ మడ తలు పడిపోయిన ఒక పెద్ద అవ్యక్తత.

తానొక రూపంకాదు. ఒక చిత్రంకాదు. ఒక విచిత్రంకాదు. తానొక పెద్ద వయస్సు. తానొక పెద్ద శాపం. మనస్సు కండరాలకన్నా కోటుగుండీల కన్నాపెద్దది. గొప్పది. ఆ మనస్సు తనలోవుంది. ఆ మనస్సు తనలో పెద్ద

కాంతిలాపుంది. ఆ మనస్సు పరమాణువులా ఉంది. ఆ పరమాణువు తనచుట్టూ వలయాలు కల్పించుకుంటూ శక్తినీ కదలికనీ ప్రేరేపిస్తుంది. ఆ కదలికలో కోటి మనస్సులలో వుండే కోటి పరమాణువుల్ని తాకుతుంది. తన మనస్సు రథికుడు. ఆ మనస్సు సృష్టించిన భావం ఒక రథం. ఆ రథాన్ని తను నడిపిస్తున్నాడు. మహమ్మదీయు లందరూ ఆ రథచక్రాలకి కట్టబడి వున్నారు. ఆ రథం అతి వేగంతో నడుస్తుంది. వేగం రథంతో నడవలేదు. పంజాబ్, సింధు, బెలూచిస్థాన్, బెంగాల్, అస్సామ్ భూములమీద ఆ రథం నడుస్తుంది. ఆ చప్పుడుకి కాబూలు కైబరు కనుమలు ప్రతిధ్వనిస్తాయి. కైలాసం మీద మహేశ్వరుడికి బదులుగా 'అల్లా'ని తాను ప్రతిష్ఠిస్తాడు. తన రథం వెనకాల మహమ్మదీయులందరూ వస్తారు. ఎందుకు వస్తారో వారికి తెలియదు. తెలుసుకుంటే ఎవరూ ఏ విషయం ఏమీ చెయ్యరు. అజ్ఞానం, క్రియకీ కర్మకీ కారణం. జ్ఞానం సమాధికీ నిదానానికీ కారణం. ఆ అజ్ఞానాన్ని తాను భద్రంగా కాపాడుతాడు. ఆ అజ్ఞానాన్ని తాను భ్రమలతో ఆశలతో పోషిస్తాడు.

తన మనస్సు తన భావాన్ని నిజానికి నమ్మలేదు. తనలో ఉండే ఒక అధికార వాంఛ ఆ భావాన్ని తయారుచేసి యితరుల్ని నమ్మమంది. తాను నమ్మినట్టుగా నమ్మించింది. తాను నమ్మినట్టుగా ఉండిపోవడం వలన ఒక్కొక్కసారి తనూ నమ్మేశాడు: అలా నమ్మకపోతే పదికోట్ల మంది మహమ్మదీయులు తన వెనకాల రారు. పదికోట్ల జెండాలమీద పది కోట్ల అర్ధచంద్రరేఖ లెగరవు. పదికోట్లమంది యొక్క యిరవైకోట్ల కళ్ళలోని భక్తినీ, విశ్వాసాన్నీ తాను చూరగొనలేడు. తనకేకాదు ఈ స్వార్థం అందరికీ ఉంటుంది. హిట్లర్, చర్చిల్, నెహ్రూ - గాంధీ - అందరికి వుంటుందనుకున్నాడు జిన్నా. గాంధీ, నెహ్రూ తనలాగే అద్దంలో చూసుకుంటారు. సంతృప్తి పడతారు. తన స్వార్థం గొప్పది. తన స్వార్థం పవిత్రమైనది. తన స్వార్థంలేనిదే తాను ఏమీకాడు. తాను ఏమీ కాకపోతే ముస్లిం జగత్తు అంతా ఏమీకాదు. అర్థంలేనిదై పోతుంది. ఆకృతిలేనిదై పోతుంది. ఆశలేనిదై పోతుంది. అబద్ధమై పోతుంది. ఆవిరై పోతుంది.

జిన్నా కోటు గుండీలు పెట్టుకున్నాడు. 'పోర్టికో'లోకి వచ్చాడు. జనం పాయలుగా విచ్చిపోయారు. జనం మిణుగురుల్లా ముడుచుకు పోయారు. నీటిమీదవేసిన తారాజువ్వలా జిన్నా ముందుకు సాగిపోయాడు. పైన అనంతమైన ఆకాశం వుంది. కింద ఎక్కడికో పరుచుకున్న భూమి వుంది.

జిన్నా ఆకాశం అంచుకీ భూమి చివరికీ వ్యాపించాడు. జిన్నాలోని 'అధికారం' గాలిలో కలిసి చెట్లల్లో పచ్చదనంగా మబ్బులలోని నీలిమగా అయిపోయింది. దూరంగా వేలకొలదీ మహమ్మదీయులు తన కారుని చూసి చేయెత్తి సలాము చేశారు. వాళ్ళ కళ్ల తనని చూడగానే జిగార్ మని మెరి శాయి. వాళ్ళ కళ్ళు ప్రకాశించాయి. వాళ్ళ కళ్ళు ఎర్ర బడ్డాయి. వాళ్ళలోని తన భావం విద్యుత్తుతో చేసిన కొరడాలాగ ఒక చరపు చరిచింది. వాళ్ల పరిసరాల్నీ నీతినీ దేహాన్నీ సర్వాన్నీ మరచిపోయారు. వాళ్ళ తన 'భావం' అయిపోయారు. వాళ్ళు జలపాతం వంటి తన భావంతో మోదబడ్డారు. కల్లు వంటి తన భావంతో నింపబడ్డారు. కత్తులూ కర్రలూ పైకిలేశారు. జిన్నా కారు వీధిమలుపు తిరిగింది. తన వెనకాల కోటి మనస్సులు మలుపు తిరిగాయి. యావత్తు దేశం యొక్క భవిష్యత్తు మలుపు తిరిగింది.

జిన్నా తన కారుమీద తిరిగి వస్తున్నాడు. రోడ్డమీద రక్తం కన పడింది. రక్తం పక్కన శవాలు కనపడ్డాయి. గాజుగుడ్ల శవాలు – చేష్ట, వికృతీలేని శవాలు కనపడ్డాయి. శవాల పక్క తన 'భావం' కనపడింది. జిన్నా ఉలిక్కి పడ్డాడు. జిన్నా కోటు గుండీలు సరిచేసుకున్నాడు. ఉలిక్కి పడిన జిన్నాలో రక్తం చల్లబడింది. రక్తం నల్లబడింది. ఎదురుగా రోడ్డమీద మానవుల రక్తం వుంది. హిందువుల రక్తం వుంది. ముస్లిముల రక్తం వుంది. ఆ రక్తంలో ఎర్రకణాలు చచ్చిపోయాయి. ఆ రక్తంలో రక్తం యొక్క గుణం పోయింది. ఆ రక్తానికి ఏ జాతీ ఏ నీతీ లేదు. ఏ భేదమూ లేదు. ఆ రక్తం మనిషి కన్న గొప్పది. మనస్సుకన్న గొప్పది. ఆ రక్తం ఒక పెద్ద నిజం. ఆ రక్తం ప్రపంచ మంతా మానవులకిందా సింహాలకిందా బల్లులకిందా గొర్రెలకిందా హిందువులకిందా ముస్లిముల కిందా అనేక రూపాలు ధరించింది. ఆ రక్తం ఒక పరమ సత్యాన్ని చాటు

తోంది. ఆ రక్తం ఒక పెద్ద అమాయికత్వం. ఆ రక్తం ఒక పెద్ద కరుణ. ఆ రక్తం ఒక ఆర్త నాదం. ఆ రక్తం మానవుడి నీరసత్వాన్నీ బుద్బుదత్వాన్నీ తెలుపుతోంది. ఆ రక్తం మానవుడి పవిత్రతనీ మానవుడి మానవత్వాన్నీ తెలుపుతుంది.

అనేక మంది రక్తం అది. అనేకులు తమకి తెలియకుండానే చచ్చిపోయారు. చచ్చిపోతామనుకోకుండా చచ్చిపోయారు. చంపబడ్డారు. పిల్లలూ తల్లులూ వృద్ధులూ–విరిగిన కాళ్లు, పొడిచిన కళ్ళు, పేగులూ మాంసమూ –అందరూ ఆరిపోయిన ప్రమిదలులా, ఆడుకుని పారవేసిన మట్టి బొమ్మలులా వున్నారు. అందరూ అరుస్తూ చచ్చిపోయారు. చచ్చిపోయినా అరుపులు వినబడుతున్నాయి. అరుపులు దిక్కుల్ని చీలుస్తున్నాయి. ఆ అరపులు గుండెల్ని చీలుస్తున్నాయి. ఆ అరపులు పోలీసుల్ని మాత్రం చీల్చడం లేదు.

జిన్నా కారు మలబారు హిల్సువైపు వెళ్ళసాగింది. కారు వెనకనే అరుపులు వెంబడించాయి. కారును వెంబడిస్తూ రక్తం ప్రవహించింది. కారులో జిన్నా ఉన్నాడు. జిన్నా చాలా గొప్పవాడు. జిన్నా తన భావాన్ని వెంబడిస్తున్నాడు. డ్రైవరు అతి వేగంగా కారు నడుపుతున్నాడు. జిన్నా చేతిలో వార్తా పత్రిక వుంది. వార్తా పత్రికలో యిలా వుంది.

'కలకత్తాలో రెండు వేల మంది మరణం.'

వార్తాపత్రిక కలకత్తా అయిపోయినది. వార్తా పత్రికలో కలకత్తా వీధులూ గల్లీలూ కనపడ్డాయి. పిచ్చిగా మత్తుగా రేగిన జుట్టుతో ఒకరినొకరు ఆ వీధుల్లో పొడుచుకుంటున్నారు. ఒక భావం కోసం పొడుచుకుంటున్నారు. ఒక మాట కోసం పొడుచుకుంటున్నారు. ఒక మాటకోసం మాటలు మాటల్ని పొడుచుకోవు. ఒక మాట కోసం మనుష్యులు మనుష్యుల్ని పొడుచుకుంటున్నారు. మాటలు చచ్చిపోవు. మనుష్యులు చచ్చిపోతారు. మనిషి మాటని సృష్టించాడు. మాట మనిషిని బంధించింది.

కలకత్తా, లక్నో, అలహాబాద్, అహమ్మదాబాద్, బొంబాయి, పంజాబ్– ప్రతీ నగరంలో ప్రతీ వీధిలో గల్లీలో తాను నిలుచున్నట్టూ, ఎవరినో పొడిచినట్టూ, ఎవరి చేతనో పొడవ బడుతూన్నట్టూ ఊహించుకున్నాడు జిన్నా. అతని క్రాపు రేగింది. అతని కోటు గుండీలు వదులయాయి. అతను దోషిలా బాధపడ్డాడు. మనిషిలా జాలి పడ్డాడు. సంఘంలా

జలదరించాడు. విశ్వంలా విసుపోయాడు. తన భావం కోసం యింత ఘోరం జరిగింది. తనని లోకం అంతా చూస్తోంది. ప్రజలందరూ ప్రశ్నిస్తున్నారు. చరిత్ర తన కోటుగుండీలు విప్పి తన లోపం లోపల పరీక్షిస్తుంది. కొందరు తనని శిక్షించారు. తనని ఖండఖండాలుగా చీల్చివేశారు. కొందరు తనని హేళన చేశారు. తన కోటు తనకి తిరగేసి తొడిగారు. కొందరు తనని పొగిడారు పూలమాలలు వేశారు.

'అల్లాహో అక్బర్' అన్నాడు.

వరండా ముందు కారు ఆగింది. రాజకీయవేత్తలూ, భక్తులు, పత్రికా విలేఖరులూ స్తంభాల్ని ఆనుకున్న స్తంభాల్లా వున్నారు. వాళ్ళ కళ్ళల్లో కంగారు వుంది. చీకాకువుంది. ప్రశ్నవుంది. 'నీ భావం మమ్మల్ని ఎక్కడకు తీసుకు వెళ్ళింది? తీసుకు వెళుతుంది? ఈ రక్తపాతానికీ మీ భావానికీ సంబంధం ఏమిటి? అమాయకంగా సుఖంగా వెళ్ళే మా కుటుంబాలలో ఈ హఠాత్ మృత్యువూ భయమూ ఎన్నాళ్ళని భరించం?'

ఆ ప్రశ్న వాళ్ళ కళ్ళల్లో పెద్ద మౌనంగా వుంది. ఆ మౌనం భయంకరమైన శబ్దంలా వుంది. చచ్చిన జీవుల మౌనం, వాళ్ళ భార్యల చచ్చి చావని ప్రాణాల మౌనం ఆ వరండాలో పోర్టికోలో పేరుకుంది. ఆ మౌనం ఎలుగుబంటిలా కూర్చుంది. పులిలాగ పంజా చరచింది.

ఒక భావంతో పదికోట్లమందిని ఒకటిగా చేశాడు. ఒక భావంతో పదికోట్లమందిని ముప్పైకోట్ల జనం నుండి వేరు చేశాడు. అందరూ ఇదే చేసారు. రాజకీయవేత్తలవని వేరు చేయడం. ఒక జాతి అంటే తక్కిన మానవ సంఘంతో వేరు పడిన ఒక సమూహం అన్నమాట. ఎంత బాగా వేరు చేసే అంత పెద్ద నాయకుడౌతాడు. ఫాసిజం అని ఒక దేశం వేరు పడింది. మరొక యిజం అని ఇంకో దేశం వేరుపడింది. మతం, నీతీ, విజ్ఞానమూ మనిషినీ మనిషినీ వేరుచేస్తున్నాయి. నక్షత్రాన్నీ నక్షత్రాన్నీ వేరుచేస్తున్నాయి. పువ్వునీ పువ్వురేకుల్నీ వేరు చేస్తున్నాయి. గుండెకీ గుండెకీ మధ్య ఒక అగాధం తను సృష్టించాడు. ఆ అగాధాన్ని తానిప్పుడు దాటలేడు; పూడ్చలేడు. నిజానికి ఆ అగాధంలోనే తానున్నాడు.

జిన్నా అద్దంముందు నుంచున్నాడు. జిన్నా కోటు గుండీలు విప్పుకుంటున్నాడు. అద్దంలో మరొక జిన్నా కనపడ్డాడు. అద్దంలో జిన్నా యిదివరకటిలాగే గొప్పవాడు, చాలా గొప్పవాడు. అద్దంలో జిన్నా అందరిలోనూ జిన్నా! కోటు విప్పుకుని చొక్కా విప్పుకున్నాడు. జిన్నా ఉలిక్కిపడ్డాడు. అద్దంలో జిన్నా గుండెమీద రక్తపు మరక కనపడింది.

"ఆయా!" అని పిలిచాడు.

"నా గుండెమీద ఈ రక్తం ఏమిటి" అన్నాడు.

"నాకు ఏం కనపడటం లేదు!" అంది ఆయా.

కానీ రక్తపు మరక వుంది. అక్కడ ఆ గుండెమీద. ఆయాకి కనపడలేదు-తనకి కనపడింది. అది ఒక నిజం! అది ఒక ఛాలెంజి! ఆ రక్తపు మరక యిలా అంది. "నీ భావం అబద్ధం, నీ భావం అనవసరం" తనే నిజం అంది. భావం కన్నా మనుష్యులకన్నా ప్రభుత్వాలకన్నా సిద్ధాంతాలకన్నా తనే నిజం అంది. తనకోసమే యివన్నీ అంది. ఆ రక్తపు మరకని చూశాడు. తిరిగి జిన్నా కళ్ళు మూసుకున్నాడు.

అతని మనస్సుకి అతని మనస్సు కనపడింది. ఆ మనస్సులో ఒక పెద్ద విద్యుత్తువుంది. అల్లిబిల్లిగా అల్లుకున్న తీగలు ఉన్నాయి. చక్రాలు గిర్రున తిరుగుతూన్న డైనమో వుంది. మనిషిలో ఉండే "అహం" అది. నరుడి పతనానికీ, ఔన్నత్యానికీ, పరిశ్రమకీ, పరిణామానికీ కారణభూతమైన మూలశక్తిఅది. అలెగ్జాండరునీ, గజనీనీ,నాదిర్షానీ సముద్రాలూ, భూములూ, పర్వతాలూ దాటించిన బలీయ స్వభావం అది. జిన్నా మనస్సులో ఉన్న భయంకర పరమాణువుని చూసి యిలా అన్నాడు:

"నీ భావం నాకు వద్దు. నీ భావం అనేకమందిని చంపింది. నీ భావం అబద్ధం. కృత్రిమం. నిజమైనాకూడా నాకు వద్దు. నేను అందరితోనూ నిజం చెప్పేస్తాను. నాకు అలసట కలుగుతోంది. ఇంక నాకు శాంతి కావాలి. నాకు మైత్రి కావాలి"

పరమాణువుకు కోపం వచ్చింది. "అహం" ఎర్రగా ఎదురు తిరిగింది. డైనమో చక్రాలు గిర్రున తిరిగాయి. తీగలు టకటకమని కదిలాయి.

మనస్సు అంతా భరింపరాని వేడితో మంటతో నిండిపోయింది. జిన్నా హడలిపోయాడు. తలవంచాడు.

జిన్నా కళ్ళు తెరిచాడు. ఒక అబద్ధాన్ని నిజం అనిచెప్పి నమ్మించ వచ్చును. తర్వాత ఆ అబద్ధం అబద్ధమేనర్రోయ్ అని చెప్పినా ఎవరూ నమ్మరు. ఇంక దారిలేదు. నాయకుడెప్పుడూ నాయకుడులాగే వుండాలి. అలా ఉండకపోతే నాయకుడినే చంపేస్తారు. సాంఘిక మత పరమైన ఒక మూర్ఖతని తాను పురిగొల్పాడు. ఆ మూర్ఖతకి తానూ తల ఒగ్గాలి చివరికి. నాయకుడు అజ్ఞానాన్ని అభివృద్ధి చెయ్యాలి. అజ్ఞానం బలమైనది. జ్ఞానం చురుకైనది.

పత్రికా విలేఖరులు కిటికీల దగ్గర మూగి 'సందేశం' యిమ్మని ప్రార్థించారు. సంతృప్తిలేని ధీమాతో, అసహజమైన చిరునవ్వుతో జిన్నా యిలా అన్నాడు: "నా భావం నశించదు. నా భావాన్ని రథంలా పరుగెత్తించండి."

రథం పరుగెత్తింది. బెలూచిస్థాన్, పంజాబ్, బెంగాల్, అస్సాం భూములమీద రథం పరుగెత్తింది. జిన్నా అద్దంలో చూచుకున్నాడు. అద్దంలో జిన్నా చాలా గొప్పవాడు. తన వెనకాల పదికోట్లమంది మహమ్మదీయు లున్నారు. పదికోట్లమంది మహమ్మదీయుల మనస్సులో తన భావం విద్యుత్తులా మెరిసింది. వానలా కురిసింది. కొండగుహలా ప్రతిధ్వనించింది. కానొక ప్రాణికాదు. చిత్రం కాదు, విచిత్రం కాదు. ఒక మనస్సు.

"ఆయా!" అని పిలిచాడు జిన్నా.

"చిత్తం ప్రభూ" అంది ఆయా.

"ఎవరివి ఆ అరపులు? ఏమిటి యీ గదిలో నన్ను చుట్టబెట్టు కుంటున్నాయి?" అని అడిగాడు.

ఆయా మాట్లాడలేదు.

జిన్నా అద్దంలో తన గుండెనిచూశాడు. మళ్ళీ "ఆయా" అన్నాడు.

"చిత్తం ప్రభూ" అంది ఆయా.

"ఈ రక్తపు మరకని చెరిపెయ్యి" అన్నాడు గుండెని చూపిస్తూ.

"అది చెరగదు ప్రభూ" అంది ఆయా.

జిన్నా ఉలిక్కిపడ్డాడు. "చెరగదా ?" అని తిరిగి ప్రశ్నించాడు.

తొందరగా కోటు తొడుక్కున్నాడు. కోటు గుండీలు పెట్టుకున్నాడు. అద్దంలో జిన్నా కనపడ్డాడు. అద్దంలో జిన్నా చాలా గొప్పవాడు. చాలా గొప్పవాడికన్న గొప్పవాడు. జిన్నా వెనుక పదికోట్లమంది మహమ్మదీయులు, యిరవై కోట్ల కళ్ళల్లో....

*(1961)*

# హోటెల్లో

## [ఐదు రోజుల దినచర్య]

*22-5-41*

రాత్రి పదిగంటలకి బందరులో దిగాను. బంధువుల యింటికి వెళ్ళటం ఇష్టంలేదు. తిన్నగా 'మో—కే' హోటలుకి వెళ్ళాను. గది చాలా చిన్నది. గాలీ, వెల్తురూ ఆట్టే సోకని పతివ్రత ఉండటానికి చాలా బాపుంటుంది. గదిలో ఒక మంచం, ఒక బల్లా, ఒక కాలువిరిగిన కుర్చీ వున్నాయి. చాలా అసహ్యం వేసింది కాని, బడలికమీద త్వరలోనే గాఢంగా నిద్రపోయాను.

*23-5-41*

ఇక్కడి కెందుకు వచ్చానూ! అదే తెలియటం లేదు. తిరిగి ఆ 'వింత సంఘటన' జరగ్గానే వెళ్ళిపోయాను. బందర్లో ఎందర్నో కలుసుకోవాలని కుతూహలం. కృష్ణరావుగార్నీ, పురాణం వార్నీ, కాటూరివార్నీ, మునిమాణిక్యం వార్నీ, ఇంకా యింకా! స్నానంచేసి కాఫీ పైకి తెప్పించుకొని తాగి, వెళ్ళబోతూంటే అతను!— ఎదురుగా గుమ్మం దగ్గిర వాన విడిచిన ఆకాశంలా మొహం, లోతుకు పోయిన కళ్ళూ!

'ఏం అలా చూస్తున్నావ్' అన్నాను.

'దయ చూడాలి.'

'ముష్టి, ఎప్పుడూ నీకు ముష్టేనా. చంపుతారయ్యా మీరు' అన్నాను గదమాయిస్తో.

అతను చేతుల్లో మొహం పెట్టుకొని ఏడుస్తున్నాడు. నాకు అసహ్యమూ, జాలీ వేసింది.

'ఏవిఁటి అల్లా ఏడుస్తున్నావు. ఇంద, తీసుకో' అని ఒక అణా అతని మీదకు విసిరాను. అతను ఆ 'అణా' జాగ్రత్తగా తీసి నా మంచం మీద పెట్టి 'నేను ముష్టికి రాలేదు' అన్నాడు.

'మరి ఏం' అన్నాను ఆశ్చర్యంతో ;

'నాకు ఐదు రూపాయలు కావాలి - బదులు ;

'పాపం, ఐదు చాలా! నువ్వెవడవో ఉత్త స్కౌండ్రల్‌లావున్నావే' అంటూంటే అతను అడ్డువచ్చి, 'తిట్టకండి! లోని వ్యక్తి బాధ పడుతుంది. ఆత్మనిందని సహించలేదు' అన్నాడు.

పూర్వం చదువుకొని, లెక్చర్లిచ్చి, దబాయించిన 'సోషలిజం' నాలో ఒక్కసారి ఉబికింది. జార్ ప్రభుత్వం కూలదోసిన 'రెడ్స్'లో వీడు ఒకడా ;

'పెద్ద కబుర్లు చెప్పకు ; దయ చెయ్, ఇది దబాయింపు భిక్షలా కనపడుతోంది, ఫో' అన్నాను.

అతను వెళ్ళాడు. వెళ్ళుతూ అతను చూసిన చూపులో 'బాధా, తృణీకారమూ, ఉన్నై. అతనెవడో ఏమిటో అని వీధిలోకి అతని వెనకాలే వెళ్ళాను.

వీధిలో ముగ్గురు మనుష్యులూ, ఒక స్త్రీ నుంచొని వున్నారు. అతనక్కడికి వెళ్ళి, ఏదో గుసగుసలాడాడు. ఇందులో ఏదో గూడుపుఠాణీ వుందనీ, వీళ్ళు దొంగవెధవలనీ అనుకున్నాను.

నా ప్రక్కగదిలో వున్న యువకుడు (ఎగదువ్వాడు క్రాఫింగు) ఇటూ అటూ రెండుసార్లు తిరిగి, ఆమెను చూసి నవ్వి వెళ్ళిపోయాడు.

జట్కానుంచి ఒక నలభై యేళ్ళాయన అప్పుడే దిగి, హోటలులోకి వెళుతూ సూటుకేసు క్రింద పడేసుకొన్నాడు.

నేను ముందుకు సాగిపోయాను.

తిరిగి 11 గంటలకి వచ్చాను. భోంచేసి, మునిమాణిక్యంవారి 'తిరుమాళిగ' చదువుతూ పడుకొన్నాను.

సాయంత్రం 'సంజీవ్' వచ్చాడు ఇద్దరం కలిసి పార్కుకి వెళ్లాం.

పార్కులో రేడియోలో న్యూస్ విని ఇద్దరు విద్యార్థినులు మాట్లాడుకుంటూ వెళ్ళుతున్నారు.

'సంజీవ్' కొన్ని పాటలు పాడాడు. నేను కొన్ని గేయాలు చదివాను.

'చూడామణి' ఎడ్వర్టయిజుమెంటు చూస్తూ యింటికి వచ్చాము. ఏదో ఆలోచిస్తున్నాడు సంజీవ్. ఏమిటిరా, అన్నాను.

'వాడెవడో చాల బీదవాడు. వచ్చి రెండురూపాయలుంటే ఇమ్మన్నాడురా! యేడ్చాడు. ఇవ్వకుండా పంపించేశాను. పాపం తప్పుపని చేశానురా!' అన్నాడు.

'ఓరి ఫూల్! సన్నెవడో వచ్చి ఇలాగే 'ఐదు' అంటే ఐదు రూపాయ లడిగాడురా. వెధవ నీ దగ్గరకీ వచ్చాడా! ఇదేదో పెద్ద వేషం!' అన్నాను.

సంజీవ్ వెళ్ళాడు. యెవడో ఏజెంట్ వచ్చి 'సెంటుస్' కొనమని, ప్రైజెస్ వస్తాయనీ, అరగంటసేపు వాదించి లాభంలేక వెళ్ళిపోయాడు.

ప్రక్కగదిలో ఎగదువ్వుడు క్రాపింగ్ కామ్రేడు వెళ్ళిపోయాడు.

మున్సిపాలిటీ భవిష్యత్తును చూపిస్తో ఎలక్ట్రిక్ దీపాలు ఆరిపోయి అరగంటవరకూ వెలగలేదు. ఆ సమయంలోనే ఒకాయన భోంచేస్తూ, ప్రక్కాయన విస్తట్లో కూర కాస్తా నాకేసినట్టు చెప్పుకొంటూ ఒకటే నవ్వు.

కొత్తగా పెంగ్విన్‌వాళ్లు ప్రకటించిన 'న్యూ రైటింగు' చదువుతూ పడుకొన్నాను.

గది అవతల మూలుగు వినపడింది. తలుపు తెరచి చూశాను. అతను-! మూల్గుతో, దగ్గుతో హాలులో పడుకొన్నాడు.

కిటికీలోంచి ఆకాశంకేసి చూస్తున్నాను. నల్లగా దట్టంగా మబ్బులు ఒకటిపైన ఒకటి షేక్స్పియరు ట్రాజెడీల్లాగ, పడుతూ గంతులు వేస్తున్నాయి.

నా ప్రక్క గదిలో గొంతుకలు వినపడ్డాయి. ఎవరా అని చూస్తును గదా, ఆ ముగ్గురు మనుష్యులూ, ఆ స్త్రీన్నీ! కొన్నిమాట లిలా వినపడ్డాయి:

'నగంరాత్రి నువ్వూ, నగంరాత్రి నేనూ. రేపురాత్రి వాడూ! దాంతో ఋణం తీరిపోతుంది.'

మానవుడిలో ఉండే పశుత్వం నల్లని వాసనతో హోటలు నంతా ఆవరించింది.

గాలి జోరుగా వీస్తోంది. వాన కూడా వచ్చింది. హోటలు తలుపులు 'ఠక్-ఠక్' మని కొట్టుకుంటున్నాయి.

తలుపు గడియ వేసుకొని ఒక విధమైన భయంతో నిద్రపోయాను.

*24-5-41*

ఉదయం లేవగానే, తలుపు తీయగానే. 'అతనూ ఆ స్త్రీ దూరంగా నుంచొని కళ్ళతో మాట్లాడుకొంటున్నారు.'

'అయిందా' అన్నాడు అతను.

'ఈవేళ కూడా ఉంది' అని జబాబు, పెద్ద నిట్టూర్పు.

ఆమె చాలా అందమైనదే!

కృష్ణాపత్రికా ఆఫీసుకి వెళ్ళాను. మౌనముద్రాలంకారునీ, పింగళ, రావూరినీ, ప్రతిభావిశేషంతో 'భరతమునిని' చిత్రించిన యువక చిత్రకారుణ్ణి కలుసుకొన్నాను. ఒక విధమైన నిశ్శబ్ద చైతన్యంతో, నీరవగానంతో యివాలకి వచ్చాను. హోటలుకి వస్తూంటే- మేనేజరు సెర్వరుని పట్టుకు కొట్టుతున్నాడు, కప్పు ఒకటి పగలగొట్టినందుకు. ఆ సమయాన్నే మేనేజరు కూతురు టేబిలుమీద వున్న గ్లాసుని పరధ్యానంగా పగలగొట్టింది. మేనేజరిల్లా అన్నాడు:

'అయ్యో, అమ్మాయిణి ! గాజు పెంపదా గుచ్చుకొంటే, భయమిల్లే ! యేరా పైత్ కారీ, ఆ గ్లాసు ఎందుకలా పెట్టావు' అంటూ సర్వెంట్ ని తిరిగి రెండు దెబ్బలు కొట్టాడు.

నా గదిలోకి వెళ్ళి ఘోంచేసి కూర్చున్నాను.

'అతను'—గదిముందు!

'ఏం' అన్నాను.

'కోపపడకండి! నేను మంచివాడినే!' అంటూ గదిలోకి వచ్చి, గోడ నానుకు కూర్చొని యిలా అన్నాడు:

'మీతో చెప్పుకొందామని వచ్చాను. మీరు మంచివా రనిపిస్తోంది' అన్నాడు.

'ఏమిటి' అన్నాను.

'పాపం ఉందా' లన్నాడు.

'ఉంది.'

'ఏమవుతుంది.'

'నరకకూపంలోకి తోస్తారు.'

అతను వణికాడు. 'ఆ పాపం రక్తంలో కలిసిపోయి, ప్రతీ అణువు లోనూ 'భగ్గు' మంటూ మండి బ్రతుకును అంటించివేస్తుంది కదూ' అన్నాడు.

'అవును' అన్నాను. అత నిలా చెప్పుకురావటం మొదలు పెట్టాడు:

'నేను మూడేళ్ళక్రిందట బి.యే. ప్యాసయ్యాను. (ఆశ్చర్యం) దొంగిలించిన డబ్బుతో చదువుకొన్నా. (ఆశ్చర్యం) అమ్మని నాన్న చంపేశాడు 'ముండ'తో పోవద్దు అందనీ. (షాక్!) మా అమ్మని దహనం చెయ్యటానికి వీల్లేక చెరువులో పారేశాను. (అతని కళ్ళమ్మట నీళ్ళు) నేను కొన్నాళ్ళు వంటపని చేశాను, (జాలి) సినిమా థియేటరులో క్లీనరుని కొన్నాళ్ళు. (పాపం!) నాగపూర్ లో ఆంగ్లో యిండియన్ రెస్టారెంటులో పని చేశాను, అప్పుడే త్రాగుడు అలవాటైంది....గుంటూరులో ఒకరింట్లో వంట చేసి, ఆ యింటాయన కూతుర్ని పాడుచేశాను....యేం చెయ్యను'

వయస్సుయొక్క ఉద్వేగం....చివరకి నేనూ ఒక ఆమెని ప్రేమించాను. నేనూ ప్రేమించ గల్గుతాను (చిత్రమే!) ఆమె నన్నూ ప్రేమించింది. ఆమెని పెళ్ళాడేశాను!' అని హఠాత్తుగా ఆగిపోయాడు.

'తర్వాత' అన్నాను.

'అదే తప్పుపని చేశాను. డబ్బులేనివాడు ప్రేమించకూడదు. అదే తప్పు' అంటూ వెళ్ళిపోయాడు. ఏం అర్థమవలేదు నాకు.

సాయంత్రం ఏమీ తోచలేదు.

సినీమా మంచిది లేదు.

కాఫీకూడా బావులేదు.

సంజీవ్ వచ్చి కొన్ని పాటలు రాసిపెట్టమన్నాడు. అలాగే అన్నాను.

రూముకి వచ్చాను. ఆరుగంటలైంది. అతను హాలులో ఒక మూల పడుకొని అమితంగా దగ్గుతున్నాడు. నేను దగ్గరకి వెళ్ళి ఐదు రూపాయ లతని కిచ్చి, 'తీసుకో మందు యిప్పించుకో' అన్నాను.

అతను ఆ నోటుతీసుకొని, చింపేశాడు. నాకు వొళ్ళు మండింది. 'ఏరా ఫూల్, అలా చింపేశావు' అన్నాను.

'నా గుండె చీలిపోయాక, ఇదెందుకూ! ఐనా, నా కిచ్చిన తర్వాత నాయిష్టం! నీ దాతృత్వం స్థిరపడిందిలే! ఇంకేం కావాలి' అన్నాడు. వాడ్ని చంపివెయ్యాలన్న కోపంతో రూముకి వెళ్ళాను.

ఫోంచేశాను — సాంబార్ని ఆంధ్రాపులుసు అంటూ. తొమ్మిది గంట లకు ఆ స్త్రీన్నీ, మరొహ పురుషుడూ నా ప్రక్కగదిలోకి వచ్చారు.

నేను నిద్రపోయాను.

పన్నెండు గంటలకి మెలకువ వచ్చింది. తలుపు తెరచుకొని దొడ్డికి వెళ్ళబోతూంటే—ప్రక్క గదిలోంచి ఒకడు జారిన పంచెని సర్దుకుంటూ తొందరగా వెళ్ళిపోతున్నాడు.

తిరిగివచ్చి పడుకొనేసరికి ఆ గదిలోకి 'అతను' వెళ్ళాడు. ఏవో మూల్గులూ- ఏడుపులూ....

నాకు నిద్రపట్టింది.

రెండు గంటలకి ఎవరో తలుపు తట్టారు. లేచి తలుపు తీశాను. అతను – ఎఱ్ఱగా కళ్ళూ, చెదరిన జుట్టూ, కొట్టుకొనే గుండె !

'ఏం, అర్ధరాత్రి' అన్నాను.

'అతను' లోపలికివచ్చి, తలుపు దగ్గరగావేసి చెయ్యి చూపెట్టాడు ర.... క్తం !

భయంతో 'హాహోయి' అన్నాను, అత నిలా అన్నాడు:

'కేకలు వెయ్యకు. నిన్నేం చెయ్యనులే ?'

'ఏమిటిది ?' అన్నాను, పైకి ధైర్యంతో.

'ఆమెని చంపేశాను,' అన్నాడు. నేను పణికిపోయాను.

'ఎవరితోనూ చెప్పకు సుమీ....ఆమె నా భార్య, ఆమె నేను ప్రేమించి పెండ్లాడిన భార్య ... (అతనిలో ఆయాసం ఎక్కువాతోంది) ఆమె నాకోసం తన మా....న....ము అర్పించింది. ఆ ముగ్గురికీ అయిదు రూపాయలు బాకీ ఉన్నాను. ఆ వెధవలు నా భార్య అందానికి వశ్యు లయ్యారు. 'మూడు రోజుల్లో అప్పు తీర్చకపోతే, నా భార్యని వారి కివ్వా లన్నాడు'— ఆ షరతుకి ఒప్పుకొన్నాను. ఆకలికి తాళలేక,....ఇవ్వలేక పోతామా అని. చివరకి ఎవరూ ఇవ్వలేదు. నువ్వూ నున్నా!

లగి కన్నీళ్ళతో ఇలా అన్నాడు :

'ఆమె మానం పోయింది. నా కోసం సర్వస్వమూ అర్పించింది. ఇంక బ్రతకలేనంది—ఆమెకీ శీలమూ, అభిమానమూ వున్నాయి. చంపి వెయ్యమంది, ఆలోచించాను ! నాకూ నీతీ, ప్రేమా వున్నాయి. ఆమె సుఖంకోసం, ఆమె ఔన్నత్యంకోసం, నా గౌరవ స్వాతంత్ర్యాలకోసం – నా కోసం త్యాగం చేసిన ఆమెని కృతజ్ఞతా చిహ్నంగా చంపివేశాను' అని భోరుమంటూ యేడ్చాడు.

నేను దిగ్భ్రాంతుణ్నయ్యాను. అతడు కళ్ళు తుడుచుకొంటూ వెళ్ళి పోతూ 'ఎవరితోనూ చెప్పకు ! కాని నీ దాతృత్వాని కిది చిహ్నం' అని చొక్కామీద ఆ చెయ్యి చరచి వెళ్ళిపోయాడు.

*25-5-41*

ఉదయం పోలీసులూ, జనమూ 'ఆ ముగ్గురూ' గది చుట్టూ చేరారు.

ఆమె పెదవు లింకా ఎర్రగానే ఉన్నై ! ఆమె గుండెల్లో బాకు పోటు ఉంది. ఆమె జట్టు భూమి మీద ప్రాకివుంది.

పాపం !

మురళీధరుని హోటలుకి వెళ్ళాను. మునిమాణిక్యంవారు కనపడ్డారు'

'మనలో మార్పు రావాలండి రష్యాలో వుండే రచనలూ, ప్రభుత్వం మనకి కావాలి' అన్నాను.

ఆయన నవ్వారు, సౌహార్దంగా ఆయనకీ పైకథ ఏం తెల్సు!

*26-5-41*

ఇంటికి వచ్చేశా ! 'ఎందుకు వెళ్ళావురా బందరు' అన్నారు.

అదే తెలియదు. ఐనా రక్తపు మరక పడిన చొక్కా దానికి నిదర్శనం !

(డైరీ నుండి)

*(వాణి- సచిత్ర పక్షపత్రిక 10 జులై 1941)*

35

# ఆశాకిరణం

వెంకటేశ్వర్లు తిరిగి తిరిగి ఒంటిగంట దాటాక యింటికి వచ్చాడు, అతనికి ఎక్కడా బియ్యం దొరకలేదు, ఇంక దొరకవనీ తాను సంపాదించలేననీ తెలిసికూడా ఊరికే వెర్రిగా పిచ్చిగా అలా తిరిగాడు. ఆకలీ, నిస్పృహ శీతాకాలపు మధ్యాహ్నపు ఎండా—మూడూ అతన్ని విమూఢుణ్ణి చేశాయి. ఆఖరికి ఓ బియ్యం కొట్టుపద్దకు వెళ్ళాడు. యాచించాలని అతని ఉద్దేశ్యం. కాని "బస్తా ఎంత ?" అని అడిగాడు. షాహుకారు యితని వెర్రివాలకాన్ని చూసి ఓ క్షణం సందేహించి "ఎనభై రూపాయలు" అన్నాడు.

"ఓహో" అని వెనక్కి తిరిగాడు వెంకటేశ్వర్లు. దారిలో సత్రం అరుగుమీద కూర్చున్నాడు కాసేపు. ముష్టివాళ్ళు కుండల్లో అన్నం వండుకుంటున్నారు. వాళ్ళకేసి ఆశగా ఈర్ష్యగా చూశాడు, అతనికి తెలియకుండా కన్నీళ్ళు వచ్చాయి. చిన్నప్పుడేడిస్తే అమ్మా, నాన్న ఓదార్చేవారు. ఇప్పుడు పెళ్ళాం తిడుతుంది. పిల్లలు తెల్లబోయి చూస్తారు. అతను ఆకలికే ఏడవలేదు. బియ్యం దొరకలేదని ఏడవలేదు. అతను నిస్సహాయుడై ఏడ్చాడు. చాతకానివాడై ఏడ్చాడు. అతని ఏడుపుకి బలం లేదు. గుండెల్ని గాలినీ చీల్చుకొని కొండలలో ప్రతిధ్వనించే ఆక్రోశం కాదు. బురదలోవున్న వానపాముమీద అడుగేసినప్పుడు ఆ వానపాము గిలగిలలాడి నీరసంగా నిశ్శబ్దంగా చచ్చేపోవడం లాంటి ఏడుపు. అసమర్థుడి అసహ్యమైన ఏడుపు.

కళ్ళు తుడుచుకొని అలా అలా నడచి వంతెన దాటి కాలవ వొడ్డున కొంతదూరం నడిచి మళ్ళీ వెనక్కి తిరిగి ఊళ్ళోకి అక్కడ నుంచి తిన్నగా యింటికి వచ్చాడు. భయం భయంగా యింట్లో అడుగు పెట్టాడు. వీళ్ళందరికీ ఏమని చెప్పడం ? వీళ్ళందరూ – పెళ్ళామూ, అయిదుగురు పిల్లలూ ఏ ఆకలివల్లనో చచ్చిపోయి పడివుంటే అతనికి ధైర్యమూ కులాసా కలిగేది. వాళ్ళు బియ్యం తేలేదేమని అడగరు. నిందాగర్భితంగా కసిగా దీనంగా తనకేసి చూడరు. కాని వాళ్ళలాగ చచ్చిపోలేదు. నడవలో నేలమీద భార్య కొంగు పరుచుకొనివుంది. ఇతను రాగానే కళ్ళు తెరచి శూన్యంగా చూసి మళ్ళీ మూసుకొంది. 'అమ్మయ్య' అనుకొని గదిలోకి వెళ్ళబోయాడు. పెద్దకూతురు జయ గోడనానుకుని వొళ్ళో చంటివాణ్ణి వేసుకొని కూర్చుంది. ఆమె వాసాలకేసి చూస్తోంది. తడి లేని పెదవులతో, తక్కిన పిల్లలెక్కడున్నారో కనపడడం లేదు. వెంకటేశ్వర్లు కూతురికి కూడా కనపడకుండా పెరట్లోకి వెళ్ళాడు. నూతిలోంచి నీళ్ళుతీసుకొని కాళ్ళూ ముఖమూ కడుక్కొని బాదం చెట్టుకింద చతికిల పడ్డాడు.

అతనికి వొంట్లో నీరసం ఎక్కువవుతోన్నట్టనిపించింది. ఒక్క క్షణంమాత్రం సుయ్యా, బాదంచెట్టు, చెట్టుమీద కాకి గుండ్రంగా తిరిగాయి. అలాగే ఎండుటాకులమీద మేనువాల్చాడు. అతనికి వొళ్ళు బిగుసుకుపోతూన్నట్టు చచ్చిపోతూన్నట్టు అనిపించింది. భయం వేసింది. చచ్చిపోవాలన్న ఆలోచన అతనికి చాలా సార్లు కలిగింది. కాని యిలాగ వార్నింగ్ లేకుండా చచ్చిపోవడంకూడా చాతకాని వాడి పని అనిపించింది. "నేను వెధవని, వెధవన్నర వెధవని, చచ్చువెధవని" అనుకున్నాడు. అతని కళ్ళమ్మట బొటబొట నీళ్ళుకారాయి. "బాబూ పేదవాణ్ణి. రెండు రోజుల్నుంచి తిండిలేదు. కొద్దిగా బియ్యం యిప్పించండి బాబూ, కరుణించండి" అని బియ్యం కొట్టువాణ్ణి వేడుకుంటే యిచ్చేవాడేమో! ఎందుకు తా నాపని చెయ్యలేకపోతున్నాడు ? తాను చాతకాని వాజమ్మ కాబట్టి. ముష్టివాళ్ళు బతుకుతున్నారు. కాకులూ, గాడిదలూ బతుకుతున్నాయి. తనే బతకలేక పోతున్నాడు.

ఇంటికి రాగానే భార్య తనని తిడుతుందని అనుకున్నాడు. కాని ఆమె ఏమీ మాట్లాడలేదు. అతనికో అనుమానం కలిగింది. వీళ్ళందరూ ఎక్కడేనా బియ్యం సంపాదించి వండుకు తిన్నారా ? మరి తనకి పెట్ట లేదేం ? ఎవరూ పిలవరేం ? అతనిలో ఆశ కదిలింది. మెల్లగా లేచి వంట ఇంట్లోకి చప్పుడు గాకుండా వెళ్ళాడు. అన్నంగిన్నె మూతతీసి చూశాడు. లోపల అన్నం వుంది. ఓ పక్కగా యింత ఏదో పచ్చడి కూడా వుంది. ఇటూ అటూ భయంగా చూసి పచ్చడితో అన్నం గబగబా కలిపి నోట్లో పెట్టుకోబోయాడు. గభాల్న తలుపు తోసుకుని అతని భార్య వచ్చి అతని రెక్క పట్టుకుని వెనక్కి లాగింది.

"ఉదయం అనగా బియ్యం తీసుకొస్తానని వెళ్ళావు. ఇప్పుడొస్తావా? నేనూ పిల్లలూ ఏమౌతామనుకున్నావు ? పాపం పెద్దపిల్ల ఎన్ని కొంపలో తిరిగి ఓ అర్ధశేరు బియ్యం ఎలాగో తీసుకొచ్చింది. లేనిదే - నిన్నరాత్రి తిండిలేక యిప్పుడూలేక నీ కళ్ళు చల్లగా పిల్లలు చచ్చివుండేవాళ్ళు. నీకేం ఎక్కడో యింత బొక్కివుంటావు. వెర్రివెధవ నాలుగోవాడు యిన్ని మజ్జిగ నీళ్ళు ఎవరినేనా అడిగి తెచ్చుకుంటానని వెళ్ళాడు, అన్నం తిన కుండా. వాడికోసం అట్టేపెట్టిన అన్నం దొంగలా వచ్చి కాజేద్దామను కున్నావా ? కన్న కొడుకు కడుపునే కొడదామనుకున్నావా ! ? ఆమె చాలా గట్టిగా ఆవేశంగా అరిచింది. అంతలోనే అక్కడే కూలబడి వెక్కి వెక్కి ఏడ్చింది. వెంకటేశ్వర్లు నరనరాలు పీక్కుపోయాయి. అతనికేదో అసహ్యం- నోట్లో ఏదో అశుద్ధం పెట్టినట్లు - కలిగింది. అతనిమీద అతనికే అసహ్యం కలిగింది. అతనికి పెళ్ళాన్నిచూస్తే జాలి కలిగింది. కాపురాని కొచ్చిన కొత్తలో ఆమె ఎంత శాంతమధురంగా వుండేది. ఇప్పుడెందుకిలా అయిందో అతనికి తెలుసును. అతను ఓదార్చాలనుకున్నాడు. ఏదో చెప్పాలను కున్నాడు. కాని అక్కడ నుంచి లేచి మళ్ళీ వీధిలోకి వెళ్ళిపోయాడు.

అతను తిరిగి సత్రంవద్దకు వెళ్ళి అరుగుమీద ఓ మూలగా కూర్చు న్నాడు. ముష్టివాళ్ళు కొందరు అరుగుమీద పడుకుని కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఎవరి తాయాదు కుండలూ బట్టలు వాళ్ళదగ్గర వున్నాయి. మాసి పోయిన చీలికలైన బట్టలూ, సంస్కారంలేని జుట్టూ, సిగ్గూ, సభ్యత

లేకుండా కనపడే దుమ్ముకొట్టుకుపోయిన వొళ్ళూ - మురికి కాల్వల్లో గుంపులు గుంపులుగా కూడే ఓ రకం పురుగుల్లా వున్నారు. తననీ తన బట్టల్నీ చూసుకున్నాడు. వాళ్ళకీ తనకి ఎంతో తేడా కనపడలేదు. అయితే వాళ్ళు బతుకుతున్నారు. ఎలాగో అలాగ బతుకుతున్నారు. ఇంత అసహ్యంగా ఎందుకు బతకడం ? బతుకుమీద యింత మమకారం ఎక్కడనుంచి పుట్టుకొస్తుంది ? కాళ్ళూ కళ్ళూ లేకపోయినా రోడ్లవార దేకుతూ "అమ్మా కబోదిని" అంటూ అరుస్తూ ఆక్రోశిస్తూ చస్తూ ఎందుకు బతుకుతారు ? ఈ బతకడంలోని ఆకర్షణలో ఉన్న దగా అతనికి చటుక్కున తెలిసినట్టనిపించింది. ఇది పచ్చిమోసం. వెధవల్నిచేసి చేపల్నిచేసి గాలానికి కట్టి ఒక్కొక్కసారి నీటిలో ముంచుతూ ఆశపెడుతూ ఎవడో యింత మంది మనుషుల్ని కొంచెం కొంచెం చంపేస్తున్నాడు. ఏడిపిస్తున్నాడు. చిత్రవధ చేస్తున్నాడు.

వెంకటేశ్వర్లు దీర్ఘంగా నిట్టూర్చాడు. అతను చచ్చిపోవాలని నిశ్చయించుకున్నాడు. బతకడంకన్న బరువైన బాధైన దింకొకటి లేదనిపించింది. తాను బతకలేడు. తన కుటుంబాన్ని బతికించలేడు. తాను చాతకానివాడు. తనలాంటి నిర్భాగ్యుల్నీ నిరుపాయుల్నీ దేవుడెందుకు పుట్టించాలి. సత్రం గోడనానుకుని కళ్ళు మూసుకుని తనజీవితాన్ని పర్యావలోకనం చేసుకున్నాడు వెంకటేశ్వర్లు.

తనకీ కష్టపరంపరలు తన ఉద్యోగం పోవడంతో ప్రారంభమయాయి. ఎలిమెంటరీ స్కూల్లో మేస్టారై ఉన్నన్నాళ్ళూ ఏదో విధంగా తిండి గడిచిపోయేది తనకీ తన కుటుంబానికీ. కాని తాను తెలివితక్కువవాడు. వెర్రివెధవ. లేనిదే స్కూళ్ళ ఇన్‌స్పెక్ట్రెస్ కొంగుపట్టుకు ఎందుకు లాగుతాడు ? తనకేం దుర్బుద్ధి లేదని అంటే ఎవరు నమ్ముతారు ? ఆవిడ రెండురోజులూ ఇన్‌స్పెక్షనుకు వచ్చి తనతో హాస్యం చేస్తూ ఎందుకు మాట్లాడింది ? తననీ తన క్లాసునూ పరీక్షిస్తూ ఎందుకు అలా నవ్వేది ? తన యింటికి రమ్మనమని అన్నిపనులు ఎందుకు పురమాయించేది ? తనంటే యిష్టం; తనంటే సదభిప్రాయం వుందనుకున్నాడు. ఆఖరిరోజు తన క్లాసులోకి వచ్చేసరికి తాను నిద్రపోతున్నాడు. నిజానికి అప్పుడే కునుకుపట్టింది.

ఆమె తన్ని చెడా మడా తిట్టింది. పిల్లల్ని ప్రశ్నలు వేస్తే అందరూ తెల్లబోయి నుంచున్నారు. ఆమె రౌద్రాకారం తాల్చింది. తక్కిన మేష్టర్లందరూ చూస్తూండగా "ఇదేం దూడల్ని కాయడం కాదు వెంకటేశ్వర్లుగారూ. మీకు బ్లాకుమార్కు వేస్తున్నాను" అని చెప్పి వెళ్ళిపోతోంది. తనకి భయంవేసింది. ఆమె వెనకాలే రోడ్డు మీదకు పరుగెత్తాడు. 'మేడమ్ మేడమ్' అంటూ ఏమిటో కంగారుపడి పోయాడు తను. వినిపించుకోకుండా వెళ్ళే ఆమె కొంగు పుచ్చుకుని 'మేడమ్' అంటూ లాగాడు. ఆమె పైట వూడిపోయింది. అందరూ ఫక్కున నవ్వారు. ఆమె 'బ్రూట్ బీస్ట్' అని నిప్పులు కురిపించి వెళ్ళిపోయింది. అంతే తన ఉద్యోగం ఊడిపోయింది. ఆమె పైటకన్న బహిరంగంగా; అంతకన్న శాశ్వతంగా.

అలా పైట పట్టుకోవడం, లాగడం ఎంత తప్పో తనకి తెలియక కాదు. తన కంగారులో తనకేం చేసినదీ తెలియదు. ఆమెను నిలబెట్టి ప్రాధేయపడాలనే అతని ఉద్దేశ్యం. కాని తాను దురదృష్టవంతుడు. అందుకే పెళ్ళాం దగ్గర్నుంచీ తనని వెధవకింద వాజమ్మకింద చూస్తారు.

తర్వాత ఏవో ట్యూషన్లు కుదుర్చుకున్నాడు. కాని ఏవీ నిలబడలేదు. తనలో లోపం ఏమిటో ఒక్కొక్కరే తన దగ్గర మానివేశారు. ఎన్నో ఉద్యోగాలకోసం ప్రయత్నించాడు. దొరకలేదు. దొరికినవి నిలబడలేదు. తాను అభిమానాన్ని చంపుకున్నాడు. సినిమా గేటుదగ్గర టిక్కెట్లు అమ్మాడు. ఆ ఉద్యోగమూ ఊడిపోయింది. సంచిలో అప్పడాలూ సాంబారు పొడుమూ వేసుకుని యింటింటా తిరిగి అమ్మేవాడు. ఎవరూ తన దగ్గర కొనేవారు కారు. తనకి అమ్మజూపే చాకచక్యం లేదు. ఆఖరికి తనభార్య యిక్కడా అక్కడా వంటకు కుదిరి పిల్లల్ని పోషిస్తూ బతికిస్తూ వచ్చింది. తనని నలుగురూ తిట్టేవారు. గడ్డిపెట్టేవారు. "ముష్టెత్తు - దొంగతనం చెయ్యి - అంతేకాని ఆడదాన్ని వీధిలోకి తోస్తావా!" అనేవారు. తాను పొరుగూళ్ళు వెళ్ళాడు. యాచించాడు. కానీ అందరూ అతన్నీ, అతని యాచించే వైఖరినీ సందేహంగా చూసి, 'పోవయ్యా పో' అనేవారు. ఇంక దొంగతనం చెయ్యాలనుకున్నాడు. రైలుస్టేషను దగ్గర తారట్లాడేవాడు. ఎలా దొంగతనం చెయ్యాలో తెలిసేదికాదు. ఒక రోజున ధైర్యం

చేసి రైలు పెట్టెదగ్గర తోసుకుంటూన్న జనంలో ఒకడి లాల్చీజేబులో చెయ్యి పెట్టాడు. ఆ లాల్చీ మనిషి అతని జుట్టు పట్టుకున్నాడు. నలుగురూ గబగబా నాలుగు దెబ్బలు వేశారు. తన నెరుగున్న మేష్టరొకతను వచ్చి "ఇందులో ఏదో పొరపాటు ఉంది. అతను అలాంటివాడు కాదు" అని నచ్చచెప్పాడు కాబట్టి కాని లేనిదే తనని చంపేద్దురు.

నలభై ఏళ్ళు పైబడిన తాను, తన సభ్యతకీ, స్వభావానికీ విరుద్ధమైన పనులన్నీ బతకడంకోసం చేశాడు. కాని దాని ఫలితంగా మరింత అవమానాన్ని దుఃఖాన్ని కొనితెచ్చుకున్నాడు. ఇంకా తనిలాగ ఎన్నేళ్ళు ఆకలితో బతకగలడు? తన కుటుంబానికి ఏం దారి చూపించగలడు? భయంకరమైన నిస్సహాయత అతన్ని చుట్టుకుంది. అతనికి చీకట్లోకి జారిపోతున్నట్టు, చీకటి నీళ్ళలో పీకలోతు మునిగిపోతూన్నట్టు ఉంది. నీరసంవల్ల అతని కాళ్ళూ చేతులూ లాగుతున్నాయి. అతనికలా గోడ నానుకుని ఆలోచించే వోపిక కూడా లేకపోయింది.

అలా మగతగా నిస్త్రాణగా వున్న అతనికి 'నాన్నా' అన్న పిలుపుతో మెలకువ వచ్చింది. కళ్ళుతెరచి చూశాడు. అతని పెద్దకొడుకు - పదేళ్ళవాడు 'అమ్మ రమ్మంటోంది' అన్నాడు.

"ఏం?''

"తింటానికి.''

"ఏం తింటానికి?"

"అట్లు.'

కొడుకు వెనక్కాలే బయల్దేరి వెళ్ళాడు వెంకటేశ్వర్లు. భార్య అతని కోసం గడపదగ్గర నిరీక్షిస్తోంది. "రండి, నాలుగు అట్లు తిందురుగాని" అని ఎంతో ఉత్సాహంతో అంది. "సూరమ్మ నోము చేసుకుంది. పిల్లలం మేమూ అందరం వెళ్ళి తిన్నాము. ఇంక రేపటివరకూ బాధలేదు. ఈ అట్లు మీ కోసం చీర చెంగులో దాచేసి తీసుకొచ్చాను" అంది అట్లు పెడుతూ. "ఇంకా మొగుడనీ, వాడికి తిండిలేదనీ ఋషించిన ఈ స్త్రీ ప్రాణిలో మమతా బాధా వున్నాయేఁ" అనుకున్నాడు వెంకటేశ్వర్లు. ఆ

ఆదరణకే అతని కంఠం రుద్ధమైంది. అట్లు నోట్లో పెట్టుకున్నాడు. అతనికి రుచి తెలియలేదు. ఆకలితో గిలగిల్లాడిన నాలిక ఎండిపోయింది. అయినా గబగబా అన్నీ బొక్కేసి మంచినీళ్ళు తాగాడు. చీకటి పడుతోంది. అతను పెరటి అరుగుమీద చాపమీద పడుకున్నాడు. బాదంచెట్టు కొమ్మల్లోంచి రెండు నక్షత్రాలు కనపడుతున్నాయి. పక్కింటిలోంచి ఏదో పాట విన వస్తోంది. చీకటి నల్లని యిసుకలా రాలుతూ ఆ పాటతో కలిసి అతనికి వొళ్ళంతా గుచ్చుకుంటూన్నట్టు ఉంది. అతనికి నిస్పృహలాంటి మూర్ఛ లాంటి నిద్రపట్టింది.

కాస్సేపటికి భార్య వచ్చి అతన్ని కుదుపుతూంటే మెలకువ వచ్చింది. అతను లేచి కూర్చుని 'ఏం' అన్నాడు.

"తొమ్మిదవుతోంది. జయా, రెండవదీ సాయంత్రమే ఎక్కడికో వెళ్ళారు. ఇంకా రాలేదు."

'ఉహుఁ'- తనకెందుకు చెపుతోందీ విషయం !

"ఉహుఁ అంటే చాలా ! ఏమైపోయారో ఏమో! కన్న కూతుళ్ళు కారా ! ద్రాపిలాగ ఉహుఁ అంటావా!"

పళ్ళు తిట్లు. ఎప్పుడూ తనకి తిట్లే. ఏదో ఒక క్షణం - క్షణంలో సగం - ఆమె కాస్త అనురాగం చూపిస్తుంది. ఆ తర్వాత ఎప్పుడూ కన రపడం, తిట్టడం - అవును. ఇంతమంది పిల్లలు ఆకలితో ఆమెని రంపంలా కోత పెడుతూంటే తల్లిప్రాణం బాధతో కరడు కట్టుకుని యజమాని అయిన తనమీద, తన చాతకాని తనపు బండరాతిమీద తలకొట్టుకు ఏడుస్తుంది.

పెళ్ళాం కన్నీళ్ళు పెట్టుకుంటూ చెపుతోంది.

"పదిహేడేళ్ళు వచ్చాయి. ఓ ముద్దూ ముచ్చటా ఎరగదు. వీళ్ళ యిళ్ళకీ, వాళ్ళ యిళ్ళకీ వెళ్ళి ఇదిలేదు అదిలేదు అని బతిమాలి ఏదో ఒక పూట కూరపోతే మరొక పూటయినా యింత తీసుకొచ్చి పడేస్తుంది. ఎదిగిన పిల్ల- పెళ్ళి పెటాకులు యింకెక్కడ ? తిండి లేకపోతే-పాపం తమ్ముళ్ళని చూసి బాధపడుతుంది. "నాన్న వెర్రివాడే, ఏమి అనకే! పాపం ఏం చేస్తాడే" అని బాధపడుతుంది. జ్వరమొస్తే పిల్లల్ని ఆవారిగారి దగ్గరికి

మోసుకెళ్ళి వైద్యం చేయిస్తుంది. ఇంట్లో ఉంటేనే దానికి ఏదో బాధ, నన్ను చూసినా, శ్మశానంలాంటి యిల్లు చూసినా. అందుకే ఇక్కడా అక్కడా కూర్చుని వస్తుంది. ఏమి చెయ్యను చెప్పండి. నాకు వంట పని కూడా దొరకటం లేదు."

ఆమె వెక్కి-వెక్కి ఏడుస్తోంది. అతనికి కడుపుమీద కత్తిపెట్టి సన్నగా నాజూకుగా చీలుస్తున్నట్టు వుంది. ఆమెకి చెపుదామనుకున్నాడు తను చచ్చిపోవాలనుకున్న నిర్ణయం. చటుక్కున ఆమె 'పీడా వదుల్తుంది' అంటే-తను చచ్చిపోతూ కూడా సుఖపడలేడు.

అతను చాపమీద పడుకున్నాడు. పెద్దకూతురూ రెండవ కూతురూ వచ్చారు. ఆమె ఏడుపు ఆపి లోపలి కెళ్ళింది. అతను చీకట్లోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు నిజమే. జయకి పెళ్ళి చేసేస్తే ఆమైనా సుఖపడుతుంది. కాని ఎవరు చేసుకుంటారు. ఎవరు పెళ్ళి చెయ్యడం! జయ అందమైనది కాకపోయినా అనాకారి కాదు. ఇంత దరిద్రంలోనూ బాధలోనూ యౌవ్వనం విచిత్రంగా పరిపుష్టంగా ఆమెలోకి ప్రవేశించింది. ఎత్తయిన పిల్లేమో నదరుగా ఉంటుంది. అయితేనేం ఇంత పరమ దౌర్భాగ్యుడి కూతురుకి పెళ్ళి ఎలా జరుగుతుంది! ఏ రెండో పెళ్ళివాడైనా మూడో పెళ్ళివాడైనాసరే !.. ఓ పిడికెడు బియ్యం సంపాదించలేనివాడు పెళ్ళికొడుకని తీసుకురాగలడా! తనకి ఓ గౌరవమూ, ప్రతిష్ఠా ఎవడైనా ముసలివెధవైనా గుమ్మం తొక్కడానికి........

ఏదో ఎలక అతని పక్కనుంచే పరిగెత్తినట్టు అతనికి తెలుసును. అంతే. అతనికి నిద్రపట్టేసింది.

## 2

రెండు రోజుల్నుండి వెంకటేశ్వర్లు ఇంటికి వెళ్ళడం మానేశాడు. అతని చిన్న కొడుక్కి జబ్బు చేసింది. ప్రమాదకరమైన జబ్బు చేసింది. వాంతులూ, విరేచనాలూ....తిరిగి తిరిగి వచ్చిన తనకీ విషయం తెలియదు.

కాళ్ళూ చేతులూ చల్లబడిన పిల్లవాణ్ణి జయ ఆస్పత్రికి తీసుకు వెళ్ళింది. భార్య నడవలో పడుకొని వుంది. ఆమె ఏడుస్తోంది కాబోలు తనకు తెలియదు. వెళుతూనే "ఎక్కడైనా బియ్యం దొరికాయా ఆకలౌతోంది అన్నం పెట్టు" అన్నాడు. ఈమధ్య ఎప్పుడూ అతను అన్నం పెట్టమని అడగలేదు. ఎవరైనా వచ్చి తినమంటే తినేవాడు. లేసిదే అందరూ యింట్లో పస్తు అని గ్రహించి నోరు మూసుకొని పడుండేవాడు. అలాంటిది ఈవేళ ఎప్పటి చేతకానితనంతో చావు బతుకులలో ఉన్న కొడుకు కోసం ఘూర్ణిల్లే ఆమె దగ్గిరికి వెళ్ళి కులాసాగా "అన్నం పెడతావా" అన్నాడు. ఆమె చటుక్కున ఉగ్రరూపంతో లేచింది. విడిపోయిన జుట్టుతో జ్వలించే కళ్ళతో "ఛా పశువా" అని అరిచింది. అరుస్తూనే పక్కన ఉన్న చెంబును తనమీదికి బలంకొద్దీ విసిరింది. చెంబు గురితప్పి తలుపుకు తగిలి పిడుగుపాటంత చప్పుడయింది. అతను సంభించి పోయాడు. ఏమీ అర్థంకాలేదు. ఆమె నిలువెతునా నేలమీద దొర్లుతూ "కొడుకో" అని మొత్తుకుంటోంది. కొడుకు పోయాడా! అతనికి భయమేసింది. ఇంటిల్లిపాదీ తనచుట్టూ మూగి "నువ్వే హంతకుడివి" అని అరుస్తోన్నట్టనిపించింది. పోలీసులు వచ్చి తనని జైలుకు లాక్కువెళుతూన్నట్టు అనిపించింది. అతను గబగబా యింట్లోంచి వెళ్ళిపోయాడు.

ఎక్కడనుంచో ఎవరినుంచో అతనికి తప్పించుకు పారిపోవాలనిపించింది. ఆరాత్రి అంతా వీధులన్నీ తిరుగుతూ యిక్కడా అక్కడా కూర్చుంటూ కాలం గడిపాడు. ఎక్కడికి పారిపోవడం? ఎవరినుంచి? అని ప్రశ్నించుకున్నాడు. అతనికి మెరుపులా జవాబు తట్టింది. తననుంచి, తన బతుకునుంచి. అంతకన్న మార్గంలేదు. మృత్యువే శరణ్యం. అదే అతనికి శాంతినిస్తుంది. ఈ సమస్యలకు పరిష్కారం సూచిస్తుంది. సత్రం అరుగుమీదికి వెళ్ళి పడుకున్నాడు. ఎలా చావాలో ఎప్పుడు చావాలో నిశ్చయించుకున్నాడు. తనుగాని తన కుటుంబంగాని యిక బతకలేదు. బతికే మార్గంలేదు. తానేం చేయలేదని యిదివరకే రుజువైంది. తనంత వెధవ బతుకు బతికి లాభంలేదు. తర్వాత రోజున రైలుక్రింద తలపెట్టడమే మార్గం అనుకున్నాడు. ఎలా చావాలో ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.

బాగా ఎండ మీదపడుతూంటే వెంకటేశ్వర్లుకి మెలకువ వచ్చింది. ముష్టివాళ్ళందరూ వెళ్ళిపోయారు. వాళ్ళ కుండలు ఎండలో నల్లగా మెరుస్తున్నాయి. వెంకటేశ్వర్లు ఒకసారి తన పెళ్ళాన్నీ, పిల్లల్నీ చూడాలనుకున్నాడు. తన వీధి మొగవరకు వెళ్ళాడు. అతనికి ధైర్యం చాలలేదు. అతని భార్య లోపలికి రానివ్వదేమో! మళ్ళీ ఏమిటి ఈ మమకారం? తన యింటిపక్క వాళ్ళబ్బాయి వస్తున్నాడు. వాణ్ణి ఆపి, "ఏరా మా చిన్నబ్బాయికి జబ్బు చేసిందట. బతికాడా చచ్చిపోయాడా" అన్నాడు.

"బతికాడు. నిన్న సాయంత్రం ఆస్పత్రినుంచి తీసుకొచ్చారు" అంటూ వెళ్ళిపోయాడు. "పోనీ" అనుకుని వెనక్కి తిరిగాడు. మళ్ళీ సత్రం అరుగుమీదికి వచ్చాడు. అతనికి తన చిన్నతనం అంతా జ్ఞాపకం వచ్చింది. తనకి కాస్త దెబ్బ తగిలినా జబ్బుచేసినా తల్లిచేసే ఆర్భాటం, ఆదరం, లాలనా అన్నీ జ్ఞాపకం వొచ్చాయి. ఇప్పు డెవరున్నారతనికి. "ఏం వెంకటేశ్వర్లూ యిలా వున్నావేం, మొహం అలా వాడిపోయిందేం, నాన్నా యీ పాలు తాగు" అని ఎవరంటారు. అతని కేడుపు వచ్చింది. చచ్చిపోదామనుకున్న వెంకటేశ్వర్లు ఆఖరిసారిగా తనమీద తను జాలిపడి ఎంతోసేపు ఏడ్చాడు. మధ్యాహ్నం సత్రం గుమస్తా వీధిలోకి వెళుతూ తనకిచ్చిన రెండరటిపళ్ళు తిని కడుపునిండా నీళ్ళుతాగి గోడ నానుకుని కూర్చుండిపోయాడు.

సాయంత్రం అవుతూన్న కొలదీ అతనికి భయం ఎక్కువాతోంది. అతనికి చావడం తప్పదు. ఆ నిర్ణయం మారదు. కాని ఏదో బాధ ఏదో తీపి అతనిలో గందరగోళం చేస్తున్నాయి. అతను పళ్లు బిగబట్టి కళ్ళు మూసుకుని కూచున్నాడు. అతని బాల్యం, కాపురం, పిల్లలు, బడి, యిన్స్పెక్టరు....అన్నీ అతని మనస్సులో గిర్రున తిరుగుతున్నాయి. రోడ్డు మీద ఏదో శవాన్ని మోసుకుపోతున్నారు. అతను చూడలేక మొహం పక్కకి తిప్పుకున్నాడు. మళ్ళీ ఆకలి మొదలుపెట్టింది.

ఆకలితోపాటు నీరసం. ఆ నీరసంలో వొళ్ళంతా బిగుసుకుపోతూన్నట్టనిపించింది. మళ్ళీ ఈసారి గట్టిగా అనిపించింది చచ్చిపోవడమే మంచిదని.

చీకటి పడేవేళ అతను లేచాడు. ఇంక గంట మాత్రమే వుంది, రైలు రావడానికీ, తాను చావడానికీ. గటగటా నడవడం మొదలుపెట్టాడు. వంతెన దాటాడు. పొలాలమ్మట పడిపోవడం మొదలుపెట్టాడు. అక్కడ రైలుపట్టాల వద్ద జనసంచారం ఉండదు. స్టేషన్‌కి మైలుపైగా దూరం వుంటుంది. అక్కడ అటూయిటూ చెట్లు గుబురుగా ఉంటాయి. రైలు అక్కడ మలుపు తిరుగుతుంది. అక్కడ తలపెట్టితే రైలు వస్తూన్నట్టే తెలియదు. హఠాత్తుగా రైలు మలుపు తిరిగి మీదనుంచి తెలియకుండా పోతుంది. వెంకటేశ్వర్లు పట్టుదలగా రెండు పొలాల మధ్య ఉన్న దారమ్మట నడుస్తున్నాడు.

అరుణ వర్ణంలోనుంచి నలుపులోకి మారుతున్న మబ్బులూ, నల్లగా బొద్దుగా ఉన్న తుమ్మచెట్లు దిగులు దిగులుగా ఏడుస్తూన్నట్టు వీచే గాలి, పిట్టల, పురుగుల అస్పష్టపు కూతలూ అన్నీ అతన్ని 'చచ్చిపో,చచ్చిపో' అని హెచ్చరిస్తూన్నట్లున్నాయి. ప్రకృతి అంతా అతని చావు కోరుతూన్నట్టు, అతన్ని చావుకి తరుముతూన్నట్టు ఉంది.

"ఏయ్ వెంకటేశ్వర్లూ - నిన్నే ఆగవోయ్" — కేక.

వెనకాల సైకిలుమీద సూర్యనారాయణ. వెంకటేశ్వర్లు నిలుచున్నాడు. సూర్యనారాయణ రోజూ బడి వదలగానే అడ్డదారిని అక్కడికి దగ్గర్లోవున్న అత్తవారి వూరు వెళతాడని వెంకటేశ్వర్లుకి తెలుసును.

"ఇలా ఎక్కడికోయ్" అన్నాడు సూర్యనారాయణ. వెంకటేశ్వర్లు మాట్లాడలేదు. సూర్యనారాయణ తను పనిచేసిన ఎలిమెంటరీ స్కూల్లో మేష్టరు.

"నీకేమైనా బుద్ధి ఉందా! నువ్వేమైనా మనిషివా!" అన్నాడు సూర్యనారాయణ కోపంగా.

హతబుద్ధియై చూస్తున్నాడు వెంకటేశ్వర్లు. అతనికి కోపం రాలేదు. సూర్యనారాయణ ఏమంటున్నాడో అర్థం కాలేదు.

"మన కులం మన గౌరవం ఏమైనా నిలబెట్టేట్టున్నావా? నీ మూలాన్ని మేంఅందరం తలెత్తుకు తిరగాలా అక్కర్లేదా! ఛీ, సిగ్గుండాలి

కన్నకూతుర్ని పళ్లిగ్గా తారుస్తావా? అచ్చోసిన ఆంబోతులా వదలివేస్తావా? ఈవేళ మధ్యాహ్నం సూర్యా లాడ్జిలోంచి వస్తూంటే చూసి నిశ్చేష్టుణ్నయిపోయాను. వాడు లేడూ బ్రోకర్ వెంకయ్యగాడూ – వాణ్ని అడిగితే ఆ ఏజంటుగాడికి పదిహేను రూపాయలకి కుదిరింది అని చెప్పాడు. తల కొట్టేసినట్లయి పోయింది. నా కూతురైతే అక్కడే రోడ్డుమీద నరికేసి వుండేవాణ్ణి. ఎందుకురా యిన్నేళ్లొచ్చి కుటుంబాన్ని అదుపులో పెట్టుకోలేని వాడవు. చావకూడదురా! ఇంకా తగుదునమ్మా అని బతికే వున్నావా! నేనయితే రైలుకింద తలపెట్టేసి వుండేవాణ్ణి. ఛీ సిగ్గుమాలిన బతుకు. నీదీ ఒక బతుకేనా" లంటూ సూర్యనారాయణ నేలమీద కాండ్రించి ఉమ్మేసి సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

వెంకటేశ్వర్లు అలా సంభితుడై ఓ అయిదు నిముషాల పాటు సూర్యనారాయణ వెళ్ళిన వైపే వెర్రిగా చూస్తూ నిలుచుని పోయాడు. క్రమంగా అతని మొహంలో ఏదో ఆనందంలాంటి కాంతి కమ్మింది. నిర్జనమైన ఆ పొలాల మధ్య ఫక్కుమని నవ్వేశాడు. "ఇంక నేను చావ నక్కర్లేదు" అనుకున్నాడు. నడి సముద్రంలో కొట్టుకుపోతూన్న అతనికి ఏదో నావ దొరికినట్లయింది. అతనికి వెర్రి ఆనందం కలిగింది. ఎవరినేనా కౌగలించుకుని తనకి పట్టిన అదృష్టాన్ని గురించి చెప్పుకోవాలనిపించింది. ఇన్నాళ్ళకి తనకొక దారి దొరికింది. బతకడానికి ఆధారం దొరికింది. ఇక తాను చావనక్కర్లేదు.

వెంకటేశ్వర్లు వెనక్కి తిరిగి కులాసాగా నడవడం మొదలు పెట్టాడు. అతనిలో నీరసం హరించుకు పోయింది. చీకట్లో ఒక్కడూ చేల దారినే నడిచి యింటికి వెళ్ళాడు. నడవలో ఎవరూ లేరు. గదిలోకి తొంగి చూశాడు. పెళ్ళాం, పిల్లలూ అప్పుడే నిద్దట్లో ఉన్నారు. అరె! తనని గురించి వీళ్ళెవరూ ఆలోచించడం లేదా! తన మాటే తన ఉనికే మరచి పోయారా! అతనికి కోపమొచ్చింది. పెరట్లో అరుగుమీదకు వెళ్ళి కూర్చు న్నాడు. బాదంచెట్టు కొమ్మల్లో చీకటి దట్టంగా ఉంది. రెండు నక్షత్రాలు కొమ్మల మధ్య మెరుస్తున్నాయి.

"నాన్నా అన్నానికి రా" అని పిలుపు. వెంకటేశ్వర్లు తల పైకెత్తి చూశాడు. తన చిన్న కూతురు పన్నెండేళ్ళది. లేచి ఆమె వెనకాలే వంటయింట్లోకి వెళ్ళాడు. కంచంనిండా అన్నం వుంది. వేపుడు ముక్కలు. పచ్చడి, చారు-ఒహ్ చాలా రుచిగా వున్నాయి. తృప్తిగా తిని త్రేన్చాడు వెంకటేశ్వర్లు.

నడవలో పడుకున్న వెంకటేశ్వర్లుకి అర్ధరాత్రి మెలకువ వచ్చింది. అతన్ని ఏదో ఎప్పుడూ ఎరుగని సుఖమూ, తృప్తి చుట్టుకొన్నాయి. అతనికి అందర్నీ లేపి కబుర్లు సరదాగా చెప్పాలనిపించింది. అతను చిన్నతనంలో నేర్చుకున్న గీతగోవిందం పాట పాడాలనిపించింది. చటుక్కున అతనికి ఏదో తప్పుచేసినట్లనిపించింది. ఇంత ఆనందానికీ సుఖానికీ కారణమైన పెద్ద కూతుర్ని తానభినందించనేలేదు, దగ్గరగా వెళ్ళి "అమ్మా నే సంతోషిస్తున్నాను" అనొద్దూ! తాను కృతఘ్నుడుగా ఎలా ఉండగలడు, అతను లేచి గదిలో చూచాడు. అక్కడ జయ లేదు. నాలుగువైపులా చూచాడు. జయ లేదు. పెరటి తలుపు తీశాడు. దొడ్లో బాదం చెట్టుక్రింద జయ కూర్చొని వుంది. చవితినాటి వెన్నెంలో స్పష్టాస్పష్టంగా గోచరిస్తోంది. ఆమె జుట్టు వీడిపోయి మొహంమీద భుజాలమీదా పడుతోంది. ఆమె కాళ్ళలో మొహం పెట్టుకొనివుంది. వెంకటేశ్వర్లు ఆమెవైపు రెండడుగులు వేశాడు. కాని యింతలో ఆమె వెక్కివెక్కి ఏడుస్తూన్నట్టు చప్పుడు వినిపించింది. అతనికి అర్థం అవలేదు. ఓ నిముషం ఆమెవైపు చూసి చప్పుడు కాకుండా వెనక్కి తిరిగి వచ్చి నడవలో పడుకున్నాడు. "ఈ వేళ కాదు మరెప్పుడైనా కృతజ్ఞత చెపుతాను" అనుకుని కళ్ళు మూసుకున్నాడు.

*(1967)*

# బాబు

"నీ పేరు?"

"బాబు."

"ఇదివరకు ఏం చేసేవాడవ్?"

"కొట్లో"

"ఏం కొట్లో?"

"మరి....మరి....కొట్లో."

"చెప్పవోయ్ కుర్రవెధవా!" అంటూ చెవి మెలిపెట్టాడు గౌరీనాథం. బాబు మొహం వంకరలు తిరిగింది. చక్రం తిప్పే తాత తప్ప అందరూ ఫక్కున నవ్వారు. బాబు మొహంలో రంగులు కరిగాయి.

"సైకిళ్ళు అవీ బాగుచేసే కొట్లో" అన్నాడు బాబు.

"మరెందుకు మానేశావ్?"

నల్లగా వెడల్పుగావున్న గౌరీనాథం మొహంకేసి, వంపులుతిరిగిన మీసాలకేసి విచిత్రంగా భయంగా చూశాడు బాబు. ఇక్కడ అక్కడ చిరిగిన చొక్కాలోంచి ఉక్కుగుండులాంటి కండలు యివతలకి కనపడుతున్నాయి. ఉత్తభౌతికవాదంలాగ భయంకరంగా ఉన్నాడు గౌరీనాథం.

"ఎందుకు మానేశావు?" తిరిగి అడిగాడు గౌరీనాథం.

"ఎందుకా?" బాబు చెప్పటానికి సందేహించాడు.

"సెప్పరా నా కొడకా, సందేగం యెందుకు" అని ఆసరా యిచ్చాడు కొలిమితిత్తినూదే వీరన్న.

"కొట్టాడు .... సావకొట్టాడు దొంగనంజకొడుకు ...." అన్నాడు బాబు కోపంతో. గౌరీనాథం పెద్దగా నవ్వాడు. యజమాని నవ్వుని తక్కిన వర్గం పనివాళ్ళందరూ అనుకరించారు.

"ఎంత యిచ్చేవారు నీకు"

"రోజుకి నాలుగణాలు."

"నాలుగే ! గుంటవెధవ్వి నీకు యింత జీతమా" అని గౌరీనాథం బాబుని నిదానంగా చూసి అన్నాడు.

"తెలివైనోడివే మరి ! జాగ్రత్తగా పని నేర్చుకుంటావా?"

"ఆఁ"

"దొంగవేషాలేస్తే మక్కెలిరగ తంతాను."

"ఊఁ !"

"కూడెక్కడ తింటావ్ ! నాలుగణాలకి రెండుపూట్ల కూడెవడు పెడతాడు?"

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు బాబు తీవిగా, కనురెప్పలు యెగరవేస్తూ.

"సూరేకారం పుందిరోయ్ యీడికి" అన్నాడు కొలిమిదగ్గర్తి పీరన్న.

"లమ్మా, బాబూ వున్నారా ?" అన్నాడు గౌరీనాథం.

"సచ్చిపోయారు, దొంగ ఎధవలు."

అందరూ యీ జవాబు విని నవ్వినా, గౌరీనాథంమాత్రం నవ్వలేదు. తుమ్మచెక్కల్లాంటి అతని రొమ్ములలో యిటువంటి అనుభవం యేదో వుంది.

"నేను కూడు పెడతాను. మరి జీతం యివ్వను. నాదగ్గరే ఉండవు కాని, సరేనా" అన్నాడు.

"ఊఁ" తన సమ్మతిని తెలిపాడు బాబు. గౌరీనాథం తన బిరుసైన మీసం సవరించి నవ్వాడు. అంటే యేదో చెప్పబోతున్నాడని అందరికీ తెలుసును. చక్రం తిప్పే తాత కళ్ళు మూసుకునే వింటున్నాడు.

"ఇదే పయస్సులో నాప బాబు పోయాడు. అమ్మ వుంది. ఉండే మాత్రం ఒక కాలూ, ఒక చెయ్యీ పడిపోయింది. ఆ రోజుల్లో యెంత కష్టపడేవాణ్ణి. మరి యీ కాలం పఁరాళ్ళలాగానా!"

"ఎంతమాట" అన్నాడు వీరన్న.

"పాపం. మహా కట్టంలెండి" అన్నాడు రంపపుకోత ఆపుచేసి పైతయ్య. గౌరీనాథం తిరిగి ప్రారంభించాడు.

"రెండేసి రోజులు కూడు లేకుండా వుండి పని నేర్చుకునేవాణ్ణి. దోసకాయలు తిని బ్రతికేవాణ్ణి. మునసబుగారి యింటికి పది బిందెల నీళ్ళు మోసేవాణ్ణి. రాత్రీ పగలూ అనక, దెబ్బలు, చీవాట్లూ తింటూ యీ వడ్రం పని నేర్చుకున్నాను. మరి యిప్పుడు మనతో సమానమైన వడ్రంగి యెవ డంటాను? మునసబుగారికీ, జమీందారుగారికీ, కోట రామయ్యగారికి...."

"మీరే చేసి యివ్వడం" అని పూర్తిచేశాడు వీరన్న. పనివాళ్ళం దరూ తమ యజమాని ఉపన్యాసానికి తలలువూపి "సెభాష్" అన్నారు. బాబు మాత్రం అక్కడవున్న పెద్దపెద్ద దూలాల్నీ, రంపపుపొట్టు వాస ననీ, అమాయకంగా పడివున్న బల్లలూ - చెక్కలూ అతి విచిత్రంగా కుర్చీలూ, బీరువాలూ అయిపోయే మహత్తునీ వింతగా చూస్తూ నిలబడ్డాడు. గౌరీనాథం మాట్లాడుతూన్నంతసేపూ అందరూ పనులు మానేసి కులాసాలో కబుర్లలో పడ్డారు. గౌరీనాథం హెచ్చరించాడు. కాని పనివాళ్లు వినిపించుకో లేదు. తాత మాత్రం కునుకుపాట్లు పడుతూనే చక్రం తిప్పేస్తున్నాడు. అతనిచెయ్యి సంవత్సరాల అలవాటువల్ల తక్కిన దేహంనుంచి విడిపడి ఒక ప్రత్యేక మనస్తత్వాన్ని అలవరచుకుంది. రాములు శ్రీరామనవమి ఉత్సవాలలో భోగం ఆటని వర్ణిస్తున్నాడు.

"అబ్బా, అబ్బా. ఏం సోకు. ఏం సోకురా ఆళ్ళకి. ఏం గుమాగా ఆడిందిరా, బుగ్గమీద యేలేసుకుని 'తూరుపు తెల్లారే నాసాఁయీ' అంటూ, ఏంసోకు, ఏంసోకు." గౌరీనాథం హెచ్చరిస్తున్నా, రాములు తన ధోరణిని మానలేదు. గౌరీనాథం ఉగ్రుడైపోయి సుత్తిపట్టుకుని కేకలువేస్తూ రాములు తలమీద కొట్టబోయాడు. రాములు తప్పుకోకపోతే తల పగిలిపోయి వుండును.

గౌరీనాథం కార్ఖానా చాలా పెద్దది. ఇప్పుడు ఆ వూరికి దూరంగా ఉండే పెద్ద మైదానంలో కట్టే మిలటరీ పనులకి యితను పద్రంగి. కంట్రాక్టు పద్ధతిమీద పనిసాగుతోంది. తాపీ పనివాళ్ళూ, పడ్రంగులూ. యితర కూలీలూ అక్కడే చిన్నచిన్న గుడిసెలు వేసుకుని కుటుంబాలతో వుంటున్నారు. ఈ మిలటరీ నిర్మాణం సగంలో ఆపివేశారన్న విషయం యీ కథకి ప్రస్తుతం కాదు.

"ఇంటికి పోదాం పద" అన్నాడు గౌరీనాథం బాబుతో. బాబు చేత్తో చిన్నమూట పట్టుకుని వెనకాలే వెళ్ళాడు. ఒకే సైజులో వరుసగా గుడిసెలు తీర్చిఉన్నాయి. చూరుల్లోంచి దీపం వెలుతురు యివతల నేలమీద సన్నంగా సాచుకొని పడుతోంది. గుడిసెల వెనకాలఉన్న పెద్ద తుమ్మలబీడు చీకట్లో చీకటిలా భయంకరంగా ఉంది.

"ఈ కుర్రాణ్ణి పనిలో చేర్చుకున్నాను. వీడికి తిండిపెట్టు" అని గౌరీనాథం భార్యతో చెప్పాడు. బాబు భోజనంచేసి మూట తలకింద పెట్టుకుని ఒకమూల పడుకున్నాడు. అలసిపోయిన అతని దేహం విశ్రాంతిని కోరుతోంది. ఇంతలోకి గౌరీనాథం చిన్నకూతురు గంగి అక్కడికి వచ్చింది. బాబు మొహం పరీక్షించి యిలా అంది.

"నువ్వు దిక్కులేనోడివి కదూ?"

"ఆఁ" అన్నాడు బాబు గర్వంగా.

"మరి నీ జుత్తు దువ్వుకోలేదేం!"

"నా యిష్టం."

"అదేంటి-అంత పణ్ణం తినేశావ్. గేదలాగ. ఎంత తినేశావో."

"ఆకలేసింది. పొద్దుట కూడు తినలేదు.'' అన్నాడు బాబు. అతను ఆవులించాడు.

"నాదగ్గర ఎన్నో గమ్మత్తులున్నాయి. నీకు చూపించనులే" అంది గంగి మూతి ముడుచుకుని.

"ఊఁ"

"అప్పుడే నిదరేంటి - ఛా!"

"ఓ పో నంజా నాకు నిదరొత్తుంటే" బాబు నిద్రపోయాడు.

గంగి అలాగే కూచుని కబుర్లుచెప్పి చివరికి విసుగెత్తి వెళ్ళిపోయింది.

## 2

బాబుకి వద్రంపని ఏమీ బాతవడం లేదు. గారీనాథం తిట్టిపోసున్నాడు. అన్నిటికన్నా కొలిమితిత్తి వీరన్నకూడా అదమాయించడం బాబుకి ఏమీ బాగాలేదు. కార్ఖానాలో ఉన్నంతసేపూ బాబుకి గంగి చూపెట్టిన సంగితపు పెట్టెమీదనే దృష్టి ఉంది. అది నోట్లో పెట్టుకుని వూదితే, రకరకాల స్వరాలతో బలేగా మోగుతుంది.

"ఎక్కడ కొన్నావు నువ్వు?" అన్నాడు గంగితో.

"తీర్థం" అంది గంగి.

"ఎక్కడా?"

"గూడెం అపతల"

"ఓస్ అంతేనా, నేనూ కొనుక్కుంటాను."

"మరి నీకు డబ్బులేవీ?"

"నా దగ్గర ఎన్నో డబ్బులున్నాయ్.బోలెడు...."

"అయితే నేనూ వత్తాను" అంది గంగి ఉత్సాహంగా.

"పనిమానేత్తే, నీ బాబు నన్ను తంతాడు. మరి ఎలాగ?" అని సందేహించాడు బాబు.

"మా బాబు దొరగారిని కలుసుకుందుకు వెళ్ళాడు. చందాలకి కాని రాడు."

బాబు మొహం వికసించింది. "అయితే మధ్యాన్నం వత్తాను. తయారుగావుండు గంగీ" అన్నాడు. తల వూపింది గంగి.

మధ్యాహ్నం ఎండలో యిద్దరూ బయలుదేరారు తీర్థానికి. గూడెం రోడ్డు దుమ్ము ఎర్రగా కాలి పైకి లేస్తోంది. పైకి ఉత్సాహంగా వున్నా

బాబుకి పెద్ద ఆలోచన పట్టుకుంది. తన దగ్గర డబ్బేమీ లేదు. గంగితో గొప్పగా అబద్ధం ఆడేశాడు. ఇప్పుడెల్లాగ!

పొలిమేరలో తీర్థం కనబడింది. ఇద్దరి కళ్ళల్లో ఆశ్చర్యపు ఇంద్ర ధనుస్సులు రంగురంగులుగా విరిశాయి. రంగురంగుల దుస్తులూ, మనుష్యులూ, బొమ్మలూ, బుడగలూ, బూరాలూ, మిఠాయికొట్లూ - అన్నీ రంగురంగులే!

"ఎంతమందో" అంది గంగి.

"సముద్రం సముద్రం" అన్నాడు బాబు. ఒక్కొక్క కొట్టుదగ్గర ఆగారు. ఒక్కొక్క విచిత్రాన్నే చూశారు వింతగా, ఆశగా.

"ఇదే, యిక్కడే సంగీతప్పెట్టె అమ్ముతారు." అంది గంగి. బాబు సంగీతపు పెట్టెని జాగ్రత్తగా ఠీవిగా పరిశోధించి "ఎంత?" అన్నాడు.

"మూడణాలు" అన్నాడు కొట్టువాడు.

బాబు కనురెప్పలు పైకి ఎత్తి ఏదో ఆధ్యాత్మిక చింతన చేస్తోన్నట్టు ఆలోచించాడు.

"కొనవేంటి!" అంది గంగి.

"నువ్విక్కడే వుండు గంగి. నే నిప్పుడే వత్తాను" అంటూ బాబు లేచాడు. "దబ్బునరా యేం?" అంది గంగి.

బాబువెపే చూస్తోంది గంగి. బాబు ఆ జనంలో కలిసిపోయాడు. కాసేపట్లో ఒక పెద్దమనిషి పక్కన కనపడ్డాడు. పెద్దమనిషి నెత్తిమీద తల పాగా వుంది. కాళ్ళకి కిర్రుచెప్పులున్నాయి. సరీసరిపడని పాతకోటు తొడుక్కున్నాడు. బాబు ఆ పెద్దమనిషిని ఆనుకునే నడుస్తూవున్నాడు. బాబు కుడి చెయ్యి కదిలింది. చేతివేళ్ళ చివర ఒక తెలివి మెల్లగా కదలింది. బాబు చెయ్యి పైకి ఎత్తాడు. పెద్దమనిషి జేబులోనికి చొచ్చుకొని మరునిమిషంలో యివతలికి వచ్చింది ఆ చెయ్యి.

"దొంగ దొంగ" అన్నాడు పెద్దమనిషి. కేకలేస్తూ బాబుని పట్టుకున్నాడు. బాబు చుట్టూ జనం మూగడం చూసింది గంగి. బాబుని కొట్టిన చప్పుడు వింది. బాబు ఏడుపు వినపడింది. కొంతసేపటికి బాబు ఏడుస్తూ ఎర్రని కళ్ళతో వచ్చాడు. చొక్కా దుమ్ముతో ఎర్రబడింది.

"గట్టిగా కొట్టారా!" అంది గంగి.

"సావకొట్టారు. దొంగనంజకొడుకులు" అన్నాడు బాబు. అతని మోచెయ్యీ కాలూ కొట్టుకుపోయాయి. వీపుమీద అయిమువేళ్ళ చారలూ దళ సరిగా మంటమంటగా ఉన్నాయి.

"అయ్యో పాపం-ఎలా కొట్టారో? జేబులో చెయ్యి పెడితేనే కొడతా రేంటి!" అంది గంగి.

"అదే నే ననుకొంటున్నదీని...." అన్నాడు బాబు పౌరుషంగా, సాగదీస్తూ.

రోడ్డుమీద యిద్దరూ నడిచి యింటికి పోతున్నారు. బాబు విచారంగా గంభీరంగా ఉన్నాడు; ఓడిపోయిన పెద్దరాజులాగ. గంగికి యిదేమీ బాగా లేదు. ఏదో విధంగా బాబుని సంతోషపెట్టాలనుకుంది. కార్ఖానా సమీపించే పుందు యిలా అంది:

"పోనీ, నా సంగీతపెప్పెట్టె యిత్తానులే."

"అక్కర్లేదు-"

"తీసుకుంటేనేం- మరి నా జత ఉండవా?" గంగి జాలిగా అడిగింది.

"మరి - మరి మీ బాబుతో యిదంతా సెప్పకేం?"

"సెప్పను."

"ఒట్టెయ్యి-"

"ఊఁ ఒట్టు."

గంగి యిచ్చిన సంగీతపు పెట్టెని పెదవుల మధ్యకి పోనిచ్చి ఉత్సాహంగా మ్రోగించాడు బాబు. చుట్టూ పొడుగ్గా పెరిగిన సర్వీచెట్లు కూడ ఉత్సాహంగా ఆ ధ్వనికి యిటూ అటూ ఊగాయి.

# 3

కార్ఖానాలో పని తీవ్రంగా సాగిపోతోంది, ఎండగాడ్పు వేడిగా మొహానికి కొట్టుతోంది. అక్కడికి కొద్దిగా దూరంగా తాసేవాళ్ళు కూలీలూ పదాలు పాడుకుంటూ పనిచేస్తున్నారు. గౌరీనాథం చెమటలు కక్కుతూ

బల్లల్ని సాపుగా చెక్కుతున్నాడు. బొగ్గునలుసులు పడి వీరన్న కళ్ళు ఎర్రగా వున్నాయి. నిద్రలో వున్న తాత చెయ్యి చక్రాన్ని గిరగిర తిప్పే స్తోంది. "ఒరేయి జాగ్రత్త. అక్కడ బందులు సరిగ్గా బిగించు- అక్కడ వంపు సరిగ్గా చెక్కాలి" అంటూ గౌరీనాథం మధ్య మధ్య హెచ్చరిస్తు న్నాడు. బాబు పెద్ద పెద్ద మేకుల్ని కర్రలోకి దిగగొట్టుతున్నాడు.

రంపపు పనివాడు పరాకుగా లైను తప్పించి కోశాడు. గౌరీనాథం ఛర్రున అక్కడికి వెళ్ళాడు. "ఏరా యెదవకొడక- యిదేం పనిరా. వంద రూపాయల దూలం తగలేశావ్" అంటూ అతని గొంతుక పట్టుకున్నాడు. ఆ పిడికిలిలో మృత్యువు యొక్క బలం వుంది. రంపపు పనివాడి గొంతుక నరాలు లావుగా పగులుతోన్నట్టుగా వుబికాయి. అంత నల్లని మొహమూ యెర్రగా అయిపోయింది. చివరకి కొనవూపిరితో వాణ్ణి వదిలేసి గౌరీనాథం తన పనిలోకి వచ్చి కూర్చున్నాడు.

బాబుకి భయం వేసింది. ఈ పని కొత్తగా, అసహ్యంగా బాధగా వుంది. ఆ ఎండగాడ్పుకి మరికాస్త దాహం ఎక్కువయింది. పైకి తేలికగా కనపడుతుంది యీ పని. కాని మనిషి బలం అంతా చేతివేళ్ళలో ఆనుకుని ఉంటుంది. ఇంతకన్న ధాన్యం బస్తా మొయ్యడం సులభం అనిపించింది. పెద్ద బరువైన సుత్తిని పైకెత్తి గురితప్పకుండా ఆ మేకుల్ని కొట్టాలి. అత నికి చేతికండలు పీకుతూన్నట్టు అనిపించాయి. గౌరీనాథం మెల్లగా వచ్చి బాబు జుట్టు పట్టుకుని పైకి లేవదీశాడు. "ఏరా పనుకుపాట్లు పడుతున్నావ్! ఆ మేకు అలా వంకరగా దిగిందేమిటి?" అన్నాడు.

"గాడిద కొడుకు! ఎంత పొగరు యీడికి" అని వీరన్న తన అభిప్రాయం వెల్లడించాడు.

"చేతులు పీకుతున్నాయి" అన్నాడు బాబు భయంతో.

"కంచెడు వణ్ణం తినగలవా? ఈ పని లాభంలేదు నీకు. పోయి ఆ దూలం చెక్కలిటు మోసుకునిరా. వేషాలేస్తే చితకకొడతాను" అన్నాడు గౌరీనాథం.

దూలపు చెక్కలు రోడ్డుకి అటుపక్కన పడి వున్నాయి. ఎండ అతి తీవ్రంగా ఉంది. అసలే అలసటగావున్న బాబుకి ఏడుపువచ్చింది. చెక్కలు

మరీ బరువుగా వున్నాయి. దూరంగా కూలీలు సున్నం దంపు తున్నారు. ఆ పని అయితే తేలికగా ఉంటుందేమో అనుకున్నాడు. ఆ సున్నం దంపు లోంచి ఒక మనిషి కార్ఖానా వైపు వచ్చాడు. "ఏం యిలా వచ్చావ్ యెంకడూ?" అన్నాడు గౌరీనాథం.

"ఓ సుట్టముక్క యిప్పించండి మేస్త్రీబాబుగారూ" అన్నాడు వెంకడు. గౌరీనాథం వెంకడితో మాట్లాడుతూ ఉండటం గమనించాడు బాబు. ఆ దూలపు చెక్కని అతని భుజం భరించలేకపోతోంది. ఎందుకో తెలియని ఉక్రోషం అతని గొంతుకలో వుండలా చుట్టుకుని వుంది. సగం వరకూ మోసుకువచ్చిన ఆ చెక్కని దభీలున కిందపడేశాడు. గౌరీనాథం, కొలిమి తిత్తి వీరన్న పరుగెత్తుకు వచ్చారు

"ఏంటదీ-" అన్నాడు వీరన్న.

"బరువెక్కువయింది" అన్నాడు బాబు.

గౌరీనాథం ఒళ్ళుమండింది. బాబు జుట్టు పట్టుకుని యీడ్చి గిరవా టెయ్యాలన్నంత కోపం వచ్చింది. బలమైన నల్లని చెయ్యిని ముందుకు పోనిచ్చాడు. ఇంతలో వెంకడు పెద్ద కేక వేశాడు. "ఓరి బాబు ఇక్క డున్నాయేంటి నీ పిన్నమ్మ యిక్కడే వుంది" అంటూ "ఓసి మాలచ్చి యిడిగిడుగో నీ కొడుకు!" అని సున్నం దంపువైపు చూసి పిలిచాడు. గౌరీ నాథం తమాయించుకొని "కుర్రగుంటడివని ఈసారికి వూరుకున్నాను. ఎత్తు ఆ చెక్కని" అని గర్జించాడు.

మాలక్ష్మి సున్నంతో తెల్లబడిన చేతులతో కొప్పు సవరించు కొంటూ అక్కడికి వచ్చింది. బాబుని చూసి ఆశ్చర్యపడి "దొంగయెదవ ఇలా పారిపోయొచ్చావ్" అంది. బాబు మొహం కోపంతో జేవురించింది. గౌరీనాథం ఏమిటని అడిగాడు. తల్లీ దండ్రీ పోగానే తాను జాలితలచి యింట్లో పెట్టుకున్నట్టూ, ఉన్నట్టే ఉండి పారిపోయినట్టూ మాలక్ష్మి చెప్పింది.

"ఈడి తండ్రి కొద్దిగా డబ్బుసేసుకుని మమ్మల్ని లోకువగా సూసే వాడు. ఈడి తల్లి వుత్తి దొంగముండ. దొంగతనం చేసి డబ్బు సంపాదిం

చింది. ఈడికి ఎంతపొగరు బాబూ, యిదివరకులాగ ఆడికి మంచం లేదంట. యిదివరకటిలాగ బళ్ళోకి వెళ్తాడంట.... సేపలకూర నేందే వణ్ణం సయించదంట.... సివరకి తండ్రి వ్యాపారంలో డబ్బు తగలేసుకుని సచ్చాడు. అందరూ సచ్చినా యీడికి పొగరు సావలేదు. పాలేరుపని సేసుకుంటూ యింటికాడ ఉండకూడదూ" అంది.

"దొంగముండ, అంతా అబద్ధం. చందాలదాకా పని సేయించుకుని కూడెట్టేది కాదు" అన్నాడు బాబు.

"ఓరి నీ జిమ్మడా...." అంది మాలక్ష్మి.

"మా బాబు డబ్బున్నాడని దీనికి ఈసు" అన్నాడు బాబు.

"పోనీ నాతో వచ్చెయ్యి ఈ. యేడాది నుంచీ ఎక్కడున్నావ్" అంది మాలక్ష్మి.

"ఓ అనేక చోట్ల. ."అన్నాడు బాబు.

"నీ పిన్నమ్మతో వెళ్ళిపోరా" అన్నాడు గౌరీనాథం.

"నాను యెల్లను. ఎదవ గుడిసె యెదవ కూడూ.... అత్తమానూ దీని మొగుడు సావకొడతాడు."

"ఓరి గుడిశేటికొడకా. యీడు నీకు గంజి పోత్తాడో సూత్తాను. దిక్కులేక సతావులే" అంటూ మాలక్ష్మి కోపంతో వెళ్ళిపోయింది. గౌరీనాథం వీరన్నకేసి అర్థవంతంగా చూసి మాలక్ష్మి వెనకాతలే వెళ్లాడు.

బాబు చెక్కలు మోసుకొస్తున్నాడు. పని చప్పబడింది కార్ఖానాలో. వీరన్న, రాములూ, బాబుని ఆక్షేపణగా ఎత్తిపొడుస్తున్నారు. సూర్యుడు క్రమంగా పడమరకు వాలుతున్నాడు. కాలిన భూమి నెరదల్లోంచి వేడి వేడి ఆవిరి పైకి వస్తోంది.

"నీ అమ్మ ఎంతమందితో తిరిగేది?" అన్నాడు వీరన్న.

"నంజకొడక" కోపంతో తిట్టాడు బాబు.

"తిడితే సంపేత్తాను. మళ్ళీ తిట్టు."

"నువ్వంటే నేను తిడతాను."

"నీ అమ్మ ఎంతమందితో...." వీరన్న అన్నాడు.

"నంజకొడక——" అన్నాడు బాబు.

వీరన్న ముందుకు దుమికి "సత్తావురా నా కొడక" అన్నాడు. బాబు భయంతో మోసే ఆ చెక్కల్ని కింద పడేసి పారిపోయాడు.

"ఏయ్ గంగీ- నా సంగీత పెట్టి యిలా యివ్వు" అన్నాడు బాబు గౌరీనాథం ఇంటికెళ్ళి.

"నీదే-టిరా సచ్చినోడ....నాదీ" అంది.

"నాకు అచ్చంగా యివ్వనేదూ" అన్నాడు బాబు.

"ఏడుత్తున్నావని యిచ్చాను."

"దొంగముండ.... నీ జత లేను" అంటూ బాబు అక్కణ్ణుంచి వెళ్ళి పోయాడు.

ఎప్పటికీ బాబు రాకపోవడం చూసి గంగి వెతకడానికి బయలు దేరింది. సర్వీ చెట్లక్రింద బాబు నేల మీద పడుకొని నిద్రపోతున్నాడు.

"ఇక్కడ తొంగున్నాయేంటి, యెర్రి ఎదవ" అంది గంగి పెద్ద దానిలా మొహం పెట్టి.

"ఆలోచిత్తుంటే నిదరట్టింది" బాబు లేచి యిటూ అటూ చూసి "ఏదే దొంగముండ నా కత్తి" అన్నాడు. నేలమీద చేతులు పెట్టి వెతికి ఈ ఖ పట్టిస విరిగిన కొడవలి పైకి తీశాడు.

"ఎందుకిదీ?" అంది గంగి.

"సంపెయ్యడానికి"

"ఎవణ్ని?" అంది గంగి అర్థమవక.

"ఆణ్ణి - ఆ ఈరన్న నంజకొడుకుని" గంగి ఫక్కున నవ్వింది. ఇంతలోకే తీవ్రంగా మొహం పెట్టి,

"నా దగ్గర పెద్ద కత్తి ఉంది. మాంచి కత్తి! దాంతో సంపెయ్య డానికి బావుంటుంది" అంది.

"నిజం?"

"ఆఁ."

"అయితే యింటికి పోదాం పద గంగీ" అన్నాడు బాబు.

ఆ మసక చీకట్లో ఈ విధంగా వీరన్నని చంపెయ్యడానికి తీర్మా నించుకొని యిద్దరూ యింటికి బయల్దేరారు. బాబు గుండెల్లో పెద్ద కోపం, ఏడుపూ, ఉక్రోషం నిండుకుని ఉన్నాయి. కాని గంగి సహాయంతో వీరన్నని సులువుగా చంపెయ్య వచ్చునని తెలుసుకున్నాక అతని మనస్సు తేలిక పడింది.

# 4

ఈ రెండు మూడు రోజుల నుంచీ బాబుని తన అజమాయిషీలో వుంచుకున్నాడు గౌరీనాథం. బాబు సగంసగం పనిలో పారిపోవడం, మేకులు తప్పుగా కొట్టడం, దురుసుగా మాట్లాడటం గౌరీనాథానికీ చాలా కోపం కలిగించాయి. "బండికి కట్టిన గిత్త మొదట్లో మారాము చేస్తుంది. నాలుగు దెబ్బలు తగిలితే గాని దారిలో పడదు" అన్నాడు వీరన్నతో. నిజంకూడా అంతే. స్వతంత్రంలోంచి దాస్యంలోకి పోయే ముందు ప్రతి జాతీ, ప్రతి వ్యక్తీ, ప్రతీ జంతువు కూడా ఓపిక లేని తిరుగుబాటుని చేస్తాయి.

రేగిన జుట్టుతో, కాలిన మొహంతో బాబు దూలపు చెక్కలు మోస్తున్నాడు. వీరన్నని చంపలేక పోయే బాధ అతనికి యెక్కువగా వుంది. "సంపితే పోలీసులు జైల్లో పెడతారు కదూ...." అంది గంగి. బాబుకి భయం వేసింది కాని గంగి అంది "నువ్వు పోలీసు అవకూడదూ."

"ఎల్లాగ?" అన్నాడు బాబు.

"పట్నం ఎల్లితే సెపుతారు."

"ఊహూఁ" అన్నాడు బాబు. పోలీసు అయాక వీరన్నని చంపటానికి తీర్మానించుకున్నాడు.

ఇంటికి వచ్చాక ఆ రోజున సాయంత్రం బాబు గంగితో అన్నాడు "నీ బాబు దొంగ నంజకొడుకు."

గంగికి కోపం వచ్చింది. "ఏం?" అంది.

"ఈ యేల బరువైన సెక్కలన్నీ మోయి' నొప్పులెత్తింది" బాబు గద్గదికంగా అన్నాడు. గం

దొంగనంజకొడుకే- పాపం" అంది. బాబు కళ్ళమ్మట నీళ్ళు బొట బొట ప్రవహించాయి.

"కల్లు తాగితే వొళ్ళు నొప్పులు పోతాయి" అంది గంగి.

"ఎవరు సెప్పారు?"

"మా బాబు రోజూ చందాల తాగి వత్తాడు."

"మరి కల్లు ఎవరు పోత్తారు?" అని అడిగాడు బాబు కళ్ళు తుడుచు కుంటూ.

"ఓస్ తెలియదూ....దూరంగా అక్కడ పోలేరమ్మ గుడికాడ సందులో...."

"ఊరికే పోత్తారా?"

"ఊహుఁ-ఓ రూపాయి యిత్తే పోత్తారు."

"నువ్వుకూడా తాగుతావా?" అన్నాడు బాబు.

"నా కొల్లు నొప్పులెత్తందే ఎందుకు" అంది గంగి.

అర్ధరాత్రివేళ బాబుకి మెలుకువ వచ్చింది. అంతా నిశ్శబ్దంగా వుంది. గౌరీనాథం గుర్రు కుక్క మొరిగినట్టుగా వినపడుతోంది. బాబుకి వొళ్లు సలుపుతోంది. అంతా భుజంమీద దూలపు చెక్కలు బరువుగా ఉన్నట్టే అనిపించింది. 'కల్లు తాగితే——'అనుకున్నాడు బాబు. 'ఓ రూపాయి అవుద్ది' అనుకున్నాడు ఒత్తిగిల్లుతూ.

బాబు మెల్లగా లేచాడు. దీపం శెమ్మా ఒకమూల వెలుగుతోంది. గౌరీనాథం, పెళ్ళమూ ఒకళ్ళొకళ్ళు దగ్గరగా పడుకున్నారు. గంగి వేరే పడు కుంది. బాబు కళ్ళు రహస్యంగా భయంగా యిటూ అటూ చూశాయి. గోడకి పక్కగా ఉన్న కర్ర పెట్టె మూత తియ్యబోయాడు. రాలేదు. తాళం గట్టిగా లాగాడు. చప్పుడయింది. అప్రయత్నంగా "యెదవపెట్టె, ఎంత లాగినా మూతరాదు" అంటూ గట్టిగా లాగాడు. గౌరీనాథం గబుక్కుని లేచి మంచం మీదనుంచి ఉరికాడు. దీపపు గుడ్డి వెల్తురులో కంగారు పడుతూఉన్న బాబు ముఖం కనపడింది.

శపట్టుకొని దవడమీద బలంకొద్దీ ఒకటి చరిచాడు గౌరీ
'నే దొంగతనవంట్రా యెదవకొడక, వేలెడున్నావో

బాబు బాపురమన్నాడు. గౌరీనాథం భార్యా, గంగి లేచి ఏమీ అర్థ మవక చూస్తున్నారు. గౌరీనాథం అడిగాడు, "ఏం చేస్తున్నావు యిక్కడ?"

"ఓ రూపాయి అవసర మొచ్చింది...." అమాయికంగా, ఆందోళనగా అన్నాడు బాబు.

"ఏం?'

బాబు మాట్లాడలేదు. అతని కాళ్ళూ, పెదిమలూ, చేతులూ అతి తీవ్రంగా వణకుతున్నాయి. జవాబు చెప్పని పెంకెతనానికి గౌరీనాథం తిరిగి లాగి కొట్టాడు.

బాబు సహనశక్తి యింక తాళలేక పోయింది. అతని కళ్ళల్లో పెద్ద భయం నిస్పృహా నీచంగా వెలిగాయి. ఏదో చెప్పరాని తిరుగుబాటు అతనిలో కలిగింది. ప్రక్కనున్న కర్రపేడు తీసి గౌరీనాథం మీద విసిరాడు. "నీ లమ్మ....నీ....దొంగనంజకొడక" అని తిట్లు అతను అప్పచెప్పేస్తున్నాడు. గౌరీనాథం పక్కకి తప్పుకున్నాడు. ఈ తిరుగుబాటుకి గౌరీనాథం ఒక్క నిముషం ఆశ్చర్యంతో అలా నుంచునిపోయాడు.

"దొంగనంజకొడక, గుడిశేటికొడక....నీ అమ్మ ..." ఇలా తిట్టుకుంటూ బాబు చనమూటని చేత్తో పట్టుకొని ఆ అర్ధరాత్రి వీధిలోకి గంతేశాడు. గంగి గుమ్మం దగ్గరకు పరుగెత్తి "నా సంగితపెట్టె యిచ్చెయ్" అని కేకలేసింది. వినిపించుకోకుండా దట్టమైన ఆ చీకట్లో గూడెం రోడ్డుని పరుగెత్తుకు పోయాడు బాబు.

కొంతసేపటికి తిరిగి అందరూ పడుకున్నారు. గౌరీనాథం గుర్రుకుక్క మొరిగినట్టుగా వినపడుతోంది. గుడిసెల వెనుక తుమ్మలబీడు చీకట్లో చీకటిలా వుంది.

బాబు ఎక్కడికి ఆ చీకట్లో వెళ్ళిపోయాడో, ఏమయిపోయాడో తెలియదు. కాని తిరిగి ఆ కార్ఖానాకి మాత్రం రాలేదు.

(విశాలాంధ్ర 1948)

62

# యవ్వనం

ఆ రోజున విశాలలో ఎప్పుడూ లేని ఉత్సాహం సముద్రపు కెరటాల్లా పొంగింది. ఆమె కళ్ళలో కాంతి, చెక్కిళ్ళలో యెర్రదనం, ఆమెకి మరింత అందం తెచ్చాయి. వసంత కాలపు పూలతోనూ, పాటలతోనూ ఆమె హృదయం నిండిపోయింది.

ఆమె నడకలోని వయ్యారమూ, పెదవుల్లో పరవశించే మెలుపూ, పెద్ద వాల్జడలో కిలకిల నవ్వే పువ్వులూ, ఇవన్నీ రోజూ చూస్తూండే భర్త 'శాస్త్రి' హృదయంలో నే గిలిగింతలు పెట్టినై. ఆరోజుకు ఆఫీసుకు సెలవు పెట్టితే బాగుంటుందనుకున్నాడు. కాని, బాధ్యత అతన్ని వెనక్కి లాగింది.

ఆ అందాన్ని జేబులో దాచుకొని, తర్వాత రోజువరకూ జాగ్రత్తగా భద్రపరచుకుంటే ఎంతో బావుండు ననిపించింది. అద్దం ఎదురుగా, కురుల్ని దిద్దుకుంటూన్న విశాలని చూసి గర్వపడ్డాడు. తన మిత్రుల భార్యలతో పోల్చికొని జీవితానికి సంపూర్ణతా సంతృప్తి ఇచ్చింది విశాల! కాని రైలుకి వేళ దాటిపోతుంది. చిన్న సూటుకేసు చేత్తో పట్టుకొని, వెనకాలకే వెళ్ళి, ఈవేళ ఎంతో బావుందండీ! సెలవు పెట్టండీ,' అంది విశాల అతని వొళ్ళోకి జరుగుతూ.

ఆలోచించాడు శాస్త్రి. నూరు వసంతాలు శోభించే ఆమె సన్నిధికి దూరమైపోవటం తెలివితక్కువ అనుకున్నాడు. 'సరే, కలం కాగితం తీసుకురా!' అన్నాడు. విశాల తీసుకువచ్చింది. శాస్త్రి ఆమె కళ్ళల్లోకి చూశాడు. విశాల సౌందర్యాన్ని నవ్వింది.

శాస్త్రి ఉత్తరం పూర్తిచేసి కవరులో పెట్టాడు. ఇంతలోకీ, అతని మొహంలో భయం గోచరించింది. పెద్ద ఇంజనీరు ఇన్‌స్పెక్షనుకి వస్తే? తన ఉద్యోగం ఊడుతుంది. తిండి లేక విశాల, తనూ ముష్టెత్తుకోవాలి! ఏదో తెలియని బాధ అతన్ని ఆవరించింది.

వెన్నెల, వెన్నచేతులతో 'రా, రా' అని పిలుస్తోంటే, చీకటి ముండ దేహాన్ని కౌగిలించుకుంటున్నట్టుగా అనిపించింది. విశాల గడ్డం పట్టుకుని, 'ఈవేళ యినస్పెక్షను జరుగుతుంది, వెళ్ళకపోతే ఉద్యోగం తీసేస్తారు విశా! రేపు మధ్యాహ్నానికి తప్పక వచ్చేస్తా,' అంటూ ఆమెని ముద్దిడుకొని, వెనక్కి తిరిగి చూడకుండా, యుద్ధానికి వెళ్ళబోయే సైనికుడిలా, తడబడుతూ గుమ్మం దాటాడు.

విశాలకి కోపం వచ్చింది—ఉద్యోగం మీద. యవ్వనులకి ఉద్యోగమేమిటి! అందుకే అడవుల్లో వుంటే బావుంటుంది. చెట్లూ, కొండలూ, సరస్సులూ, నెమళ్ళూ, స్వేచ్ఛ! కాని అక్కడ సింహాలూ, పెద్దపులులూ వుండవూ! బాబోయ్!– నవ్వుకొంది, తన పిచ్చి ఆలోచనలకి.

ఏమీ తోచలేదు. ఇల్లంతా ఒకమారు తిరిగింది. బీరువాలోంచి పుస్తకాలు తీసింది—తిరిగి బీరువాలోకి విసిరింది. పెరటిలోకి వెళ్ళి మల్లెలూ, మందారాలూ, గులాబీలూ కోసి, నిర్లక్ష్యంగా కొన్ని తల్లో పెట్టుకుని, కొన్ని మంచంమీద విసిరింది. ఉయ్యాలలో ఊగుతూ ఊగుతూ, ఆకాశాన్ని ముట్టుకోవాలనిపించింది. భర్త డ్రాయరు తెరచింది. పాడైపోయిన ఫౌంటెన్ పెన్నూ, కాగితపు ముక్కలూ, స్నేహితుల ఫొటో ఒకటీ వున్నాయి.

అదిగాక ఏదో కవరు వుంది. ఏమై వుంటుంది ఆ కవరు? 'క్యూరియాసిటీ'తో పైకి తీసి ఎడ్రసు చదివింది. 'శ్రీమతి రత్తమ్మకు' అని వుంది. ఆమె చెయ్యి వణకింది. కళ్ళెర్రబడ్డాయి! ఈ రత్తమ్మ ఎవరు? ఎంత చపలత్వం, ఎంత దొంగబుద్ధి యీ మగవాళ్ళది? అసూయతో, భయంతో కవరు చించి ఉత్తరం ఇలా చదివింది:

'శ్రీ మహాలక్ష్మి సమానురాలైన రత్తమ్మ అత్తయ్యకు....'

ఫక్కున నవ్వింది విశాల. ఎంత అనుమానపడింది. తనైతే ఎప్పుడేనా భర్తకి ద్రోహం చేస్తుందా! ఇంకా ఏం రాశారో యీ వుత్తరంలో !

".... నా భార్యా, నేనూ సుఖంగా ఉంటున్నాము. ఇదంతా నీ ఆశీర్వాద ఫలితం. నిజంగా అటువంటి పెర్ఫెక్టు— అంటే ఆదర్శపూర్వకమైన.... ఎవరికీ లేదు. నా పూర్వజన్మ సుకృతం...."

పాపం! ఆయనెంత మంచివారు. తన్నెంత ప్రేమిస్తున్నారు. ఈ పాటికి కాకినాడ వెళ్ళి వుంటారు. అక్కడ రోడ్డు కంకరా, గింకరానే యిస్తారుట. ఇదేం యినస్పెక్షనూ— బొగ్గుల యినస్పెక్షనూ!

నేనే రాణీనైతే— ఈ ఉద్యోగాలు తీయించేస్తాను; యవ్వనులకి తోటలూ, సరస్సులూ ఉన్నచోట నివాసం ఏర్పరుస్తాను.... లబ్బ, గడియారం ఒకటి కొట్టింది....' అంటూ ఆలోచించుకుంటూ విశాల నిద్రలో మునిగిపోయింది.

నిద్ర లేచేటప్పటికి అయిదు గంటలైంది. ఆమె కళ్ళలో లేత ఎరుపుఛాయలు, లోన అణగివున్న కోర్కెల తీవ్రతని ప్రకటిస్తున్నాయి. ఆమెకి తెలియకుండానే ఆమె పెదవులమీద చిర్నగవూ, కన్నులలో బరువైన నీలినీడలూ నాట్యమాడుతున్నై. తిన్నగా వెళ్లి టాయిలెటు చేసుకొని, లేతగులాబి జార్జెట్ చీర కట్టింది. తల్లో మందారాలూ, మల్లె మొగ్గలూ తురుముకొంది; గోడమీద రాధాకృష్ణుల బొమ్మను తదేకధ్యానంగా చూస్తూ నిలబడి పోయింది. ప్రపంచాన్నంతా ఒక్కసారిగా హత్తుకోవాలని ఆమెకి కోరిక కలిగింది. తిరిగి ఆ కోరికకు భయపడి నిందించుకొని, ఫిడేలు తీసి తంత్రి ప్రమోగించింది.

తలుపు చప్పుడైంది. పాట ఆపి, విశాల తలుపు తీసింది. ఎదురుగా చక్కని యువకుడు, తీర్చిదిద్దిన మొహమూ, తెలివితేటలయిన కళ్ళూ !

"ఈ యింటివా రున్నారా అండి !"

"యెవరూ !"

"వెంకట్రామయ్యగారు."

"వెంకట్రామయ్యగారా.... వెంకట్రా.... పెద్ద బొజ్జ...." విరగబడి నవ్వింది విశాల.

అతను తెల్లబోయాడు. తేరుకొని, తిరిగి నవ్వాడు. విశాల నవ్వాపుకొని, కొంటెగా అంది "లేరండి."— ఆ గొంతులో పిలుస్తోన్న వేయి చేతులు కనపడ్డాయి ఆ యువకుడికి.

"ఎక్కడుంటున్నారు? బస మార్చారా?" అన్నాడు.

"అవును. ప్రక్కవీధిలో వుంటున్నారు."

అతను వెళ్ళలేదు; ఆమెకేసి తదేక ధ్యానంగా చూస్తున్నాడు. ఆమె సిగ్గుపడింది. కళ్ళు పైకెత్తి దింపింది. పెదవులు కదలినై.

అతడు నవ్వుతూ "మళ్ళీ వస్తా- ష్!" అంటూ వెళ్ళిపోయాడు.

విశాల జరిగిందంతా ఆలోచించింది. భయమూ, పశ్చాత్తాపమూ గుండెలో చిచ్చును రగులు కొలిపాయి. అద్దం ముందుకువెళ్ళి కనురెప్పలు పైకెత్తి దించింది. సరీగ్గా అదే అర్థం. ఎంత వెధవపని! ఎంత ద్రోహం! 'వాడు వస్తే రోకలితో తలమీద బాదుతా. పాపం, అందమైనవాడు, ఐతే మాత్రం వస్తే చంపేస్తా' అంటూ ఆమె తలుపులన్నీ గడియవేసింది.

ఆకలి వేసింది. కడుపునిండా భోంచేసింది. పాందానులోంచి తమలపాకులు తీసి వేసుకొంది. లైట్లు ఆర్పింది. తిరిగి 'on' చేసింది. బొమ్మలపత్రిక తీసి చదవటం మొదలుపెట్టింది. కాని ఆమెలో భయం పోలేదు. వాడు వస్తాడేమో....! కాని తలుపులన్నీ గడియ పెట్టింది కదూ!

ఎనిమిది, తొమ్మిది.... పది ఐంది. ఇంక వాడు రాడు అనుకుంది. తిరిగి వీధి తలుపు చూసి పడుకుంది. నిర్భయంగా కన్ను మూసింది. 'పెద్ద సముద్రంలో చిన్ని నావ. దాంట్లో తనూ, భర్తా.... తుఫాను, నావ తలక్రిందులైంది.' ఆ కలకి ఆమె అదిరిపడింది. కన్ను విప్పింది. ఎదురుగ్గా అతను.... నొక్కు నొక్కుల జుట్టూ, సిల్కు లాల్చీ, చేతికి వాచీ....

"ఎవరు నువ్వు,ఎలా వచ్చావు, ఫో!" అని భయంతో అరిచింది.

"భయమెందుకు, వెళ్ళక ఇక్కడుంటానా! దొడ్డితలుపు తీసివుంటే నువ్వెలా వున్నావో చూసి పోదామని వచ్చాను విశాలా!" అన్నాడు బుజ్జగింపుగా.

"వెళ్ళిపొండి! వెళ్ళిపొండి!"

"నువ్వెందుకు పిలిచావూ?"

"పొండి, లేకపోతే అపాయం.... బుద్ధి వుండనక్కర్లేదూ!"

"తిట్టటానికా పిలుస్తా? పోనీ వెళ్తాను"అంటూ ఆమెకేసి చూశాడు. ఆమె మాట్లాడలేదు. నవ్వుతో దగ్గరకు వెళ్ళి భుజంమీద చేయి వేసాడు.

"ఫో, నీచుడా" అని అరిచింది. కాని ఆ స్పర్శ ఆమెలో తీవ్ర సంచలనం కలిగించింది. అతను చాతుర్యంతో ఆమెను ఒడిలోకి తీసుకున్నాడు. ఆమె లొంగిపోయింది.

* * *

ఉదయం లేచేటప్పటికి ఆమె హృదయం భారంగా తోచింది. ఒక విధమైన ఆవేదనతో, హంతకుడివలె, తన్ని తానే చూసుకుని భయపడింది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు బొటబొట కారినై. ఏడ్చి, ఏడ్చి సొమ్మసిలిపోయింది.

మధ్యాహ్నం ఆమె కళ్ళు తెరిచింది. చాలా నీరసంగా బలహీనంగా మూగింది. ముందు రాత్రి సంగతి ఆమెకి జ్ఞాపికివచ్చింది. పాప భయమూ, పశ్చాత్తాపమూ ఆమెను తిరిగి ఆవరించినై. ఆకలి మాట మరచిపోయి, ఏడుస్తో పడుకుంది.

"విశాలా!"

ఆ పిలుపు విని ఉలిక్కిపడి లేచింది విశాల. భర్త ఎదురుగా నిప్పులు చిమ్మే కళ్ళతో నించొని ఉన్నాడు. విశాల కంగారుతో, అవమానంతో తడబాటుతో లేచింది. కాని కళ్ళు తిరిగి అతని పాదాల దగ్గర పడిపోయింది.

"క్షమించండి, నే తప్పు చేశాను శిక్షించండి, తెలియక—తెలియక చేశాను" దీనంగా కన్నీళ్ళతో అతని కాళ్లు పట్టుకుంది. శాస్త్రి ఆమె జుట్టు పట్టుకుని వీధిలో కీడ్చివేశాడు, ఆమె 'క్షమించరూ!' అంటూ ఏడుస్తోంది. శాస్త్రి తలుపు గడియ వేశాడు.

* * *

వారం రోజుల తరవాత శాస్త్రికి ఒక ఉత్తరం వచ్చింది. అందులో:

"మరిచిపోయారా మీ గత జీవితాన్ని. ఎవరి జీవితంలో లేవు యీ తప్పులు ?

అయినా మిమ్మల్నే ప్రేమించాను. ఈ ఉత్తరం మీకు చేరేటప్పటికి గోదావరి తల్లి ఒడిలో వుంటాను. ఆ పవిత్ర జలం అనేకమంది పాపులకు ఆశ్రయ మిచ్చింది. నాకున్నూ...."

ఉత్తరం పట్టుకొన్న అతని చెయ్యి వణికింది.

*(వాణి. 25 ఆగస్టు 1941)*

౭౮

# గడియారపు గుండెలం

రాఘవయ్యకి సిరీ సంపదా ఉన్న విషయం అందరికీ తెలిసిందే. అతను ఆ సిరిని ఉపయోగించే విధానం అందరినీ ఆకర్షించింది.

శర్మ వేసిన బొమ్మలూ, 'రాజు' రాసిన పద్యాలూ, గోపాలం స్థాపించిన సంఘ సంస్కార సమితీ, ఆ ఊళ్ళో ఉన్న పిక్చరు పేలస్ - అన్నిటికన్నా, అతని సౌందర్య తృష్ణని వ్యక్తపరచే, 'లలిత' మీద వలపూ—ఇవన్నీ రాఘవయ్య ప్రేమించేవాడు. అందుకే అతణ్ణి 'అపర భోజుడు' అన్నారు.

అయితే, అతనిలోవుండే ఒకే ఒక లోపాన్నిగూర్చి అతనికి తెలియ జెప్పాలని నిశ్చయించారు నలుగురూ.

వారు వెళ్ళి రాఘవయ్యతో అన్నారు : "నువ్వు చేసే పనుల్లో హెచ్చు తగ్గులు వస్తున్నాయి. సరీగ్గా టైమ్ కుదరటంలేదు. అదీగాక, ఇటు వంటి చక్కటి గదిలో ఆ గోడ అంత ఖాళీగా, పూర్వ సువాసిని లలా టంలా ఉండటం ఏమీ బాగులేదు. మనకి నిత్యకృత్యాల్లో ఉపయోగపడేదీ, నీ గదికి అందం తీసుకువచ్చి, అమితమైన కాలాన్ని, తన గుండెలో ఇము డ్చుకో గలిగినటువంటీ, ఎప్పుడూ టిక్కు టక్కు మని ధ్వనిస్తూ, ఏకాంత బాధల్ని పోగొట్టేదీ ఐన గడియారం నువ్వు వెంటనే కొనాలి" అని.

సరి. పెద్ద గడియారం వారం రోజుల్లో గది గోడ మీద పెళ్లి కూతురులాగ తయారై కూర్చుంది.

౨

మొదట్లో ఆ గడియారం ఆ గోడకు ఎంత అందం తెచ్చిందో పరీక్షించాడు. తర్వాత ఆ గడియారాన్ని ఎవరు ఇంత అందంగా చేశారా అనుకున్నాడు. తిరిగి, ఆ గడియార మహాత్మ్యం ఆలోచించాడు. హఠాత్తుగా ఒక రోజున గడియారాన్ని తను అమోఘంగా ప్రేమిస్తోన్నట్లు తెలుసుకొన్నాడు.

మొదటి రోజుల్లో స్నేహితులతో ఇలా అనేవాడు :

'ఒరేయ్ ఈవాళ తొమ్మిదింటి వరకూ తోటలో తిరిగి, పది గంటలకి భోంచేసెయ్యాలిరా !' కాకపోతే 'ఇప్పుడు ఏడయిందా, ఎనిమిదింటి వరకూ ఈ పుస్తకాన్ని చదవాలిరా !' అనే వాడు.

తోటలో లలితను కల్సుకొని, 'లలితా ! నువ్వు నాకు దేవతవు. నిన్ను నేను ప్రేమించాను. నువ్వు మరొహవర్ణానికి చెందినా సరే, పెళ్లాడి తీర్తాను. నిర్మలమైన ప్రేమకి ప్రపంచంలో ఏమీ అడ్డురేదు !' అని....

తర్వాత —

మిత్రులతో వెన్నెల్లో విహారంచేసి రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. పదిగంటలైంది. ఇంకా తను భోజనమే చెయ్యలేదు. తాను చాలా అశ్రద్ధగా వుంటోన్నట్లు తెల్సుకున్నాడు మరుసటి రోజున మిత్రులతో 'ఒరేయ్, ఎనిమిదింటికి ఇంటికి వెళ్ళిపోవాలిరా ! లేకపోతే ఆరోగ్యం చెడిపోతుంది' అని చెప్పి అలాగే చేశాడు.

ఉదయం ఆలస్యంగా లేస్తే 'అరెరే ! ఎంత బద్ధకం అలవాటైంది. ఏడు గంటలు దాటిందే' అని విచారించేవాడు ఆ గడియారాన్ని చూసుకుంటూ. అది లేక మునుపు తనెంత స్వేచ్ఛగా, వెర్రి వెధవలాగ తిరిగిందీ తల్చుకొని, విచారించేవాడు. 'కాలం అమూల్యం-Time is Precious' అని రోజుకు ఐదుసార్లేనా అనుకునేవాడు.

'రాజు' ఒకరోజున వచ్చి తను రాసిన పద్యాలు చదివి వినిపించబోయాడు. రెండు మూడు విని రాఘవయ్య ఇలా అన్నాడు : 'రాజూ, భోజనం వేళయిందిరా ; తరవాత చదువుదుగానిలే!' అని. అదీగాక అతని కవిత్వంలో దోషాలు పట్టటం మొదలెట్టాడు.

'లలితా, మనపెళ్ళికి యింకా ఒక యేడాది ఆలస్యం వుంది. అంత వరకూ దూరదూరంగా ఎందుకూ ఇలా బాధపడటం, నా మాట నమ్మి, నా హృదయం నువ్వేరగవ్' అని ఆమెతో....సౌఖ్యం అనుభవించాడు. కొన్నాళ్ళయినాక :

ఉదయం ఆరుగంటలకల్లా లేవటం. మిత్రులతోనూ, పుస్తకాల తోనూ కాలక్షేపం చేయటం. రాత్రి ఎనిమిదింటికి అతని కొక ఆలోచన తట్టింది: ఈ పధ్నాలుగు గంటల్లో ఎంత ఖర్చుచేశామా అని. ఆలోచించి చూశాడు. పది రూపాయిల నాలు గణాలన్నర లెక్కతేలింది. అతని గుండె ఆగిపోవటానికి సిద్ధమైంది. పధ్నాలుగు గంటల్లో పదిరూపాయలు ఖర్చు పెట్టుతూంటే, ఆస్తి అంతా ఐదు రోజుల్లో అజామత్ ఐపోతుందను కొన్నాడు. మరునాటినుంచి చిఠా—ఎకౌంటు తయారు చేశాడు. క్రమంగా రోజు రోజుకూ రెండు రూపాయలు ఖర్చు తగ్గ నారంభించింది. గ్రామ ఫోను రికార్డులు కొనటమూ, సినీమాకి అమితంగా వెళ్ళటమూ మానేశాడు.

'నా పద్యాలు అచ్చువేయిస్తా నన్నావు కదురా; నీకే కృతి యిస్తాను.' అన్నాడు రాజు.

'ఏం చెయ్యనోయ్ (రా' అనటం మానేశాడు.) ఈ యేడాది ఒక్క రైతూ శిస్తు వసూలివ్వలేదు. ఒకపని చెయ్యి! నలుగుర్నీ అడుగు, నేనూ సాయం చేసాను.'

ఒకరోజున రాఘవయ్య తాతగారు వచ్చాడు. ఆయన ఒళ్ళంతా విబూది, హృదయం అంతా బొగ్గు! యజ్ఞం చేయించటంలో అంతటివాడు లేడని ప్రతీతి.

'ఒరేయ్, రాఘవా! మన సోమయ్య కూతురు — మహాలక్ష్మిలా వుంటుందిరా! మంచి సాంప్రదాయమైన కుటుంబం. ఆరు వేలు కట్నం యిస్తాడురా!' అన్నాడు తాతగారు.

మరుసటిరోజున 'ఆ సంబంధం స్థిరపరచమని' చెప్పాడు రాఘవయ్య. తాతగారు 'తథాస్తు' అన్నాడు.

సుబ్బయ్యశెట్టిలో కలిసి వ్యాపారం ప్రారంభించాడు. మంచిరోజున ఇనప్పెట్టె కొని గదిలోవుంచి, లక్ష్మీపూజ ప్రారంభించాడు రాఘవయ్య. ఏజెంట్సుద్వారా వడ్డీవ్యాపారమూ మొదలెట్టాడు.

గదిలో వున్న ఒక శిల్పమూ, కుషన్ కుర్చీలూ, తీయించి ఒక చిన్నగదిలో పడేయించి, ఒక చాపా, ఎకౌంటు పుస్తకాలూ, ఒక గుమాస్తా, వాటి స్థానే ఉంచాడు.

శర్మకాని, రాజుకాని, గోపాలంకాని కనపడితే 'చిరునవ్వు' నవ్వేవాడు. క్రమంగా అదీ మానేశాడు.

పెళ్ళి అయిదు రోజులయితే ఖర్చు ఎక్కువని, ఒకరోజున పెళ్ళి ఎవరికీ తెలియకుండా చేసుకొచ్చాడు. ఎలాగో లలితకి తెలిసింది. 'నన్ను అన్యాయం చేశావ్; దుర్మార్గుడా ఇప్పుడు నాకు గర్భిణి- అయిదవ నెల.' అని యేడ్చింది. 'గర్భం ధరించటం గొప్ప విశేషమేమీ కాదు. ఏదో మహాకష్టపడినట్టు మాటాడుతున్నావు; పోనీ. మా వర్ణంకాదు నువ్వు. ఓపిక ఉంటే పిల్లాణ్ణి పెంచుకో. లేకపోతే గోదారిలో పడెయ్' అని, నౌకరు చేత ఆమెని పంపించేశాడు. కొన్నాళ్ళకి ఆమె నూతిలోపడి చచ్చిందని వార్త.

3

ఒకరాత్రి రాఘవయ్య యింట్లో దొంగలు పడి ఏమీ దొరక్క, ఆ గడియారం తీసుకుపోయారు. రాఘవయ్య మిక్కిలి విచారించాడు. కాని తిరిగి గడియారం కొనలేదు. ఉదయం లేస్తాడు. ఎకౌంట్లు సరి చూసుకొంటాడు. ఇంట్లో పిల్లల్ని (ఇద్దరు సంతానం) తిట్టుతాడు. తర్వాత వడ్డీ వ్యాపారం; సుబ్బయ్య శెట్టితో కబుర్లు. రైతుల్ని జడిపించటం - యిలాంటివే రాఘవయ్య పనులు. "ఒరేయ్. ఇప్పుడు టైము ఎంతఅయిందిరా ! అని ఒకడూ. 'రాఘవయ్య శెట్టిఇంటికి బయలుదేరాడు — పన్నెండయిందన్నమాట' అది మరొకడూ !

రాజూ, శర్మా పట్నం వెళ్ళిపోయారు, ఏ పేపర్లోనో పని చెయ్యటానికి. తక్కిన మిత్రులు రాఘవయ్య ఇంటివైపే వెళ్ళరు.

కావలిస్తే రండి—మోకాలుదాకా మొద్దు బట్టతో, పెరిగిన గడ్డంతో, మొలకు తాళాలు తగిలించుకొని శెట్టి ఇంటికి వెళ్ళే ఆ రాఘవయ్యాని చూద్దురుగాని.

*వాణి—సచిత్ర పక్ష పత్రిక 10 అక్టోబరు 1941*

72

# పలిత కేశం

ప్రసాదరావు అద్దంముందు నిలుచున్నాడు. అతనికి తనని తాను తీరికగా చూసుకోవాలనిపించింది. అందులో ఏదో తృప్తి వుంది. అహం ఉంది. అతనికి బాధ్యతలు ఎక్కువ. ఆ ఊళ్ళో సమాజంలో అతను చెప్పుకోదగ్గ వ్యక్తి. ఒక మిల్లూ, పల్లెటూళ్ళో భూములూ, రెండు మూడు మేడలూ అతనికి ఉన్నాయి. వీటిని జాగ్రత్తగా తెలివిగా నిర్వహించుకుంటూ మున్సిపల్ కౌన్సిలర్‌గా, రోటరీక్లబ్బు సభ్యునిగా, సంగీత సభ కార్యదర్శిగా యింకా ఎన్నో సంఘాలలో సభ్యునిగా తన బాధ్యతల్ని నెరవేర్చాలి. దినదినాభివృద్ధి అవుతున్న కీర్తితోపాటు తనమీదగల బరువూ వొత్తిడీ కూడా ఎక్కువ అవుతున్నాయి. వీటన్నింటిలోనూ ఒక మెలకువతో, ఒక తెలివితో తాను వ్యవహరించాలి. అదీగాక అతని అభిప్రాయాల్ని దృక్పథాన్ని నలుగురూ అంగీకరించేటట్టు చేయాలి. అతను అందరిలాంటివాడూ కాడు. అందరి విశ్వాసాలు అతనివి కావు. శాస్త్రీయమైన, సహేతుకమైన అతని దృక్పథం ముందు సమాజంలో చలామణీ అయ్యే నమ్మకాలూ ఆదర్శాలూ అర్థంలేనివిగా కనిపిస్తాయి.

మంచి సౌష్ఠవంతో ఉన్న అతని శరీరం అద్దంలో ప్రతిబింబించి అతనికి తృప్తి కలిగించింది. అతని ఆరోగ్యం మంచిది. అతనికో విధమైన గర్వం కూడా. అలాగ అద్దంలో చూసుకుంటూన్నంతసేపూ అతనిలో ఆత్మవిశ్వాసం ప్రబలం కాజొచ్చింది. తానెంతో అర్థవంతంగా బతికాడు. ఇకముందు కూడా యిలాగే ప్రయోజనాన్ని పరమార్థాన్ని కలిపి జీవితాన్ని సార్థకం చేసుకోగలడు. తనకి ఒక బాహ్యమైన రూపసౌందర్యమేకాదు.

లోపల్లోపల ఒక అంతరంగికమైన వ్యక్తిత్వం కూడా ఉంది. తన వ్యక్తిత్వపు ముద్ర ఎన్నింటిమీదనో పడింది. ఈ పట్టణంలో అతని వ్యక్తిత్వం కలిసిపోయింది. ఈ పట్టణం అతని వ్యక్తిత్వంతో కలిసి పెరిగింది. తాను నిజంగా అదృష్టవంతుడు. ఎవరికోగాని యిటువంటి తృప్తి కలిగే అవకాశం వుండదు. ప్రసాదరావు మరోసారి అద్దంలో తన ప్రతిబింబాన్ని నిదానించి చూసుకొన్నాడు. అతని మనస్సు చటుక్కున కలుక్కుమంది. అరె! నొసటిమీద ఒత్తుగా వంకర తిరిగిన జుట్టులో తెల్లని వెంట్రుక కనపడింది.

అతనికి చిరాకు కలిగింది. ఆశ్చర్యం కలిగింది. భయం వేసింది. ఇంతవరకూ ఉన్న మనస్స్వాస్థ్యం చెడిపోయినట్టయింది. ఎక్కడిదీ తెల్ల వెంట్రుక? ఎప్పుడు ఎలా వచ్చింది? అభేద్యమనుకొన్న యీ కోటగోడకి పగులు ఎలా ఏర్పడింది. ప్రసాదరావు మొహంలో రంగులు మారాయి. అతనికి చీకట్లో ఒంటరిగా నడుస్తూంటే ఎవరో శత్రువులు చుట్టుముట్టినట్టనిపించింది. అతను సరదాగా మంచుమీద స్కేటింగ్ చేస్తుంటే చటుక్కున అంచు విరిగి అగాధమైన లోయలోకి జారిపోతున్నట్టు అనిపించింది. తన నిస్సహాయత తనకి తెలియవచ్చింది. ఈ తెల్ల వెంట్రుక యిక నల్లబడదు. ఈ ఒక్క తెల్లవెంట్రుక ఆసరాతో తక్కిన వెంట్రుకలు కూడా తెల్లబడిపోతాయి. అతను ఎన్నో పరిస్థితులను ఎదుర్కొన్నాడు. పరిష్కరించాడు. కాని యిది తనచేతిలోలేదు. ఏదో బలవత్తరమైన శక్తి అతన్ని ఆక్రమిస్తోంది. ఓడిస్తోంది. శ్రీమంతుడైన ప్రసాదరావు, హేతువాది అయిన ప్రసాదరావు, ఆపిమిస్టు అయిన ప్రసాదరావు, గౌరవమూ ప్రతిష్ఠగల ప్రసాదరావు, సిసలైన వ్యక్తిత్వం కల ప్రసాదరావు తెల్లబోయి కంగారు పడి అద్దంముందు వెర్రిగా నిలుచునిపోయాడు.

అవును. తనకి ముప్ఫైతొమ్మిది సంవత్సరాలు గడచి నలభైయవ ఏడు వచ్చింది. ఈమధ్య ఒళ్ళంతా బరువుగా ఉంటున్నట్టూ, నొప్పులు పెడుతూన్నట్టు అప్పుడప్పుడు అనిపిస్తోంది. ఆఫీసులోగాని సభలలోకాని అలసట కలుగుతోంది. మధ్యమధ్య ఏదో దిగులు ఆవరిస్తోంది. ఇదంతా ఎందుకో ఏమిటో అర్థం కాలేదు. ఇప్పుడు తెలుస్తోంది. తనకి వయసు పైబడుతోంది. తాను వృద్ధాప్యంలోకి అడుగు పెడ్తాడు. తన జీవన సూర్యుడు అస్తమయ శిఖరంవైపు ఒరుగుతున్నాడు. ఇలా అనుకొంటూంటే అతని

వొళ్ళు వొణికింది. అతన్ని ఎవరో దగా చేస్తున్నట్టు అనిపించింది. అతనికి ఏడవాలనిపించింది. ఇన్ని ఆశలూ ఆదర్శాలూ కట్టుదిట్టాలూ చేసుకున్నా ప్రకృతి ధర్మం ముందు మానవుడు ఎంత అల్పుడూ, నీరసుడూ అయిపోతాడో తెలిసిపోయింది. మరి ఎందుకు యీ జీవితమనే నాటకం!

అతనికి తన ఆరోగ్య పరిస్థితి ఎలా ఉందో అనుమానం కలిగింది. డాక్టరుచేత ఒకసారి **Check up** చేయించుకోవాలి. బహుశా తనకు రక్తపు పోటు ఎక్కువయి వుండొచ్చును. ఊపిరితిత్తులు బలహీనమై పోవచ్చును. మధుమూత్ర రోగం వచ్చివుండవచ్చును—రేపే వెళ్ళి డాక్టరుకి చూపించుకోవాలి. భోజనంలో కారం పులుపూ తగ్గించాలి. తగినంత విశ్రాంతి కావాలి. ఇన్ని సంఘాలలో సభ్యత్వాలు వదలుకోవాలి. అరె! ఏమైపోతున్నాడు తను! ముసలివాడు, రోగి బలహీనుడు భయస్తుడు—ప్రసాదరావు అనే అఖండ జీవనది పాయలు పాయలై నిర్దయాపూరితమైన కాలపు యిసుక పర్రలలో పడి యింకిపోతుందా?

ఇంతలో అతని గదితలుపు తెరచుకొంది. కామేశ్వరి చేతిలో మర చెంబుతో నవ్వుతూ వచ్చింది. "ఏఁవిటి అలాగ అద్దంలో చూసుకొని మురిసిపోతున్నారు" అంది దగ్గరగా వచ్చి. ప్రసాదరావు ఆమెను నిదానించి చూశాడు. నల్లగా వొత్తుగా వొంపులు వొంపులుగా ఉన్న ఆమె జుట్టు ఎంతో అందంగా ఆకర్షణీయంగా ఉంది. ఆరోగ్యంగా ప్రౌఢంగా అందంగా ఉన్న ఆమె పసిమిఛాయను మరింత అందగింపజేస్తూ నీలమేఘంలాఉంది. వెనకాల చుట్టుకొన్న సిగలోని తెల్లపువ్వుల తాలూకు పరిమళం పరువమైన యౌవనపు బరువునీ మత్తునీ సూచిస్తోంది. ఆమె జుట్టులో ఎక్కడా తెల్లవెంట్రుక లేదు.

"ఏమిటండీ అలా చూస్తున్నారు నా మొహాన్ని" అంది కామేశ్వరి.

ప్రసాదరావులో ఏదో అసూయ కదలింది. ఆమెకీ తనకుగల వ్యత్యాసం కొట్టవచ్చినట్టు కనబడుతోంది. తమ యిద్దరిమధ్యా వయస్సులోగల తేడా కూడా గుర్తుకువచ్చి అతని ప్రాణం గిజగిజలాడింది. ఎనిమిదేళ్ళ వ్యత్యాసం ఉంది తమ యిద్దరి వయస్సులో. ఆమెకు ముప్పైరెండు ఏళ్లు. అయినా చిరాకులూ బాధ్యతలూ తనకున్నంతగా లేనందువల్ల కాబోలు ఆమె యింకా నాలుగేళ్ళు చిన్నదిగా కనబడుతోంది. ఆమె బుగ్గల్లో బుజాల్లో ఆరోగ్యపు నిగనిగ ఉంది. అతని మొహంలో వయసు పెరిగిన తాలూకు చారలు

తొంగిచూస్తున్నాయి. అతను నీరసంగా విషాదంగా నవ్వి మంచంమీద చతికిలబడ్డాడు. ఆమె అతని దగ్గరగా నుంచొని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి గోముగా అంది "ఏం అలా ఉన్నారు, దొరగారు ?"

అతను నిట్టూర్చాడు. "ఇదిగో యిలా రా" అని ఆమెని అద్దం ముందుకు లాక్కువెళ్ళి నిలుచున్నాడు. తన నొసటిమీద ఉన్న తెల్ల వెంట్రుకల్ని చూపించి "చూడు" అన్నాడు. ఆమె కిలకిల నవ్వింది. "అయ్యో ముసలి మొగుడు" అని సాగదీసింది నవ్వులాటగా హేళనచేస్తూ, కాని అతనికి బాధకలిగింది మళ్ళీ అసూయ ప్రజ్వరిల్లింది. ఒకే జీవనయాత్ర చేస్తున్న తమ యిరువురిలో వ్యత్యాసం యింతగా ఉండడం సబబు కాదనిపించింది. కళ్ళు మూసుకొని మంచంమీద పడుకున్నాడు. బాధగా నిట్టూర్చాడు.

ఆమెకి పెట్టి పోషించేందుకు తానున్నాడు. నౌకర్లున్నారు. వంటవాడున్నాడు. ఆమెకి ఏ విషయంలోనూ నలిగిపోవల్సిన అవసరంలేదు. చివరకి ఆమెకు కాన్పులు కూడా ఎక్కువలేవు. ఒకడే కొడుకు. బుద్ధిగా చదువుకొంటున్నాడు. ఆమె కోరిన కోరికలన్నీ తీరుతున్నాయి. రేడియో, సినిమా, పేరంటం, వ్రతాలూ, ఆమెకి అంతా కాలక్షేపమే. ఆమె ఉపవాసాలుంటుంది నిజమే—కాని అవి ఆమె ఆరోగ్యాన్ని మరింత సంరక్షిస్తున్నాయి. అతనికి ఏదో బెంగపుట్టింది. "కామీ" అన్నాడు బాధగా.

"ఏమండీ" అంది కామేశ్వరి సిగలో పువ్వులు సర్దుకుంటూ.

"ఇక నేను ఎక్కువకాలం బ్రతుకను—నేను ముసలివాణ్ణయిపోతున్నాను." అన్నాడతను. ఆమె వింతగా భయంగా అతనివైపు చూసింది.

"నాకు బ్లడ్ ప్రెషర్ ఉంది. నాకు తెలుసును—" ఆమె దగ్గరగా వెళ్ళి అతనిపక్కన కూర్చొంది. "ఛఛ—ఏమీలేదు—మీకు నూరేళ్ళాయిష్షు ! నాకు తెలుసును" అంది.

'నేనుపోతే నువ్వొక్కతెవూ బాబుని పెంచుతూ ఉండగలవా' అన్నాడు అతను గద్గదికంగా. ఆమె అతన్ని హత్తుకుంది. 'ఏమిటి యీలా పిచ్చివారైపోతున్నారు యివ్వాళ ? అసలు ఏ మొచ్చింది ?' ఆమె సాలోచనగా నిశ్చయంగా అంది. 'నేనే ముందుపోతాను, నాకు తెలుసును, పసుపుకుంకుమలతో నేను పునిస్త్రీగానే చచ్చిపోతాను !'

'ఏడిశావ్ !'

'నిజం—త్రిపురసుందరి నన్ను అన్యాయం చెయ్యదు. మీకేం ఫర వాలేదు. అయినా ఒక్క తెల్లవెంట్రుకకి యింత బేజారెత్తిపోతున్నా రేవిటీ ! మా పింతండ్రి కొడుక్కి పాతికేళ్ళు రాకుండానే జుట్టంతా తెల్ల బడిపోయింది! '

'కాని నా విషయం వేరు. ఈ తెల్ల వెంట్రుక నాకు సూచన కామీ. నా ఒంట్లో ఉన్న సత్తువ క్రమంగా హరించుకుపోతుంది !'

'ఎప్పుడూ కాదు. నా దేవతమీదా నా పూజమీదా నాకు నమ్మక ముంది. త్రిపురసుందరి ఎన్నోసార్లు కలలో కనబడి నాకు చెప్పింది—' ఆమె గొంతులో విశ్వాసం ఖంగని మ్రోగింది.

'మూఢనమ్మకం' అన్నాడతను.

'ఇదిగో యిలా అంటే అలా అంటారు. పోనెండి బాబూ, నా నమ్మకాలు నావి. మీరు పడుకోండి వెర్రి మొర్రి ఆలోచనలు పెట్టుకోక. ఛా, యింత భయస్థులనుకోలేదు మీరు—' ఆమె అనునయంగా మాట్లాడి అతని పాదాలు నొక్కుతోంది.

ప్రసాదరావు కళ్ళుమూసుకొన్నాడు. అతను కొంచెం సిగ్గుపడ్డాడు తన ఆవేశానికి భయానికీ. కాని తన భార్యకున్న విశ్వాసం తనకిలేదు. తన ఉద్దేశ్యంలో ఆమె మంచిది, శీలవతి, సద్గృహిణి — అన్నిటికన్నా ఆమె మూఢురాలు. తనకి దేవుడూ మతాలూ పూనకాలూ తావేదులూ— యిలాంటి వాటిమీద నమ్మకంలేదు. ఆమెకి అన్నీ నిజాలు. గడ్డం పెంచు కున్న ప్రతీ బైరాగిలోనూ ఆమెకి మహత్తు గోచరిస్తుంది. ప్రతీ పతం లోనూ శిలావిగ్రహంలోనూ దేవుణ్ణి చూస్తుంది—వ్రతాలు చేస్తుంది. ఉప వాసాలుంటుంది. తననీ తన కుటుంబాన్నీ దేవుళ్ళు వేయికళ్ళతో కనిపెట్టి రక్షిస్తున్నారని ఆమె నమ్మకం. దేవుళ్ళూ దేవతలూ ఆమెకి కలల్లో కనపడి ఆమెకి వరాలు అడిగినవన్నీ యిచ్చి వెళ్ళిపోతుంటారు. ఆమెలో ద్వైవిధీ భావం లేదు. సంశయంలేదు. అందుకే ఏమో ఆమె ఎప్పుడూ హాయిగా నిశ్చలమైన సరోవరం లాగుంటుంది.

'నా పాదాలు కళ్ళకి అద్దుకుంటా వేమిటి ఛ ఛ' అంటా డతను.

'నా దేవు డెవరో నాకు మీకన్నా బాగా తెలుసులెండి' అంటుంది ఆమె.

'ఈ పూజలూ ఉపవాసాలూ ఏమిటి కామీ ? నీ ఆరోగ్యం పాడై పోతుంది' అంటా డతను. ఆమె తనని చూసి జాలిగా నవ్వి ఖాతరు చెయ్యదు.

ఏమైనా తర్వాత రోజునుంచీ ప్రసాదరావు మారిపోయాడు. భార్యని చూడగానే అతనికో అసూయ అనుకోకుండా కలిగేది. అతనిలో భయం పెరగజొచ్చింది. డాక్టర్లకి చూపించుకొంటాడు. వాళ్ళు కొంచెం బ్లడ్ ప్రెషర్ ఉందనో లేదనో మరొహటో ఏదో అంటారు. దానిలో అతనికి మతి స్తిమితం పోతుంది. ఇప్పుడతను ఆహార విహారాలు చాలా నియమంగా చేస్తున్నాడు. చప్పిడి తింటున్నాడు. రాత్రుళ్ళు నిద్రకోసం అప్పుడప్పుడు మాత్రలు మింగుతున్నాడు. భార్యని కసురుకొంటున్నాడు. ఆమె పక్కన ఉంటే అతనికోవిధమైన బాధ, అసూయా, పైబడుతూన్న వయస్సూ అన్నీ జ్ఞాపకంవచ్చి పిచ్చివాడై పోతున్నాడు. అతను కసురుకున్న కొలదీ కామే శ్వరి మరీ ఓర్పుగా ఉంటోంది. చిరునవ్వుతో, లాలసతో లతన్ని మచ్చిం చాలనిచూసేది. 'మీరు కూడా వచ్చి నాతో పూజచేయండి. ఈ సంశయాలు బాధలూ ఉండవు' అనేది. నిజమే ఏమో అనుకునేవాడు. కాని యింత లోనే అతని శాస్త్రీయదృక్పథం అడ్డు వచ్చేది. హేళన చేసే వాడు ఆమెనీ ఆమె విశ్వాసాల్ని ఏదో తెలియని కసితో.

ఆరు నెలల్లో మరికొన్ని వెంట్రుకలు కూడా తెల్లబడ్డాయి. ప్రసాద రావుకి అద్దంలో చూసుకోవడమే భయంగా ఉంది. లోపల్లోపల పెరుగు తూన్న అసంతృప్తినీ అస్థిమితత్త్వాన్నీ కోపం నిర్దయగా మార్చి భార్య మీద నౌకర్ల మీదా రైతులమీద మిల్లు కూలీలమీద చూపించేవాడు. హఠా త్తుగా ఒకనాడు అతని భార్య తెలివితప్పి కిందపడిపోయిందని ఫోన్‌లో చెప్పినప్పుడు ఆఫీసు నుంచి యింటికి పరుగెత్తుకు వెళ్ళాడు. ఆమె పెద్ద మంచం మీద దిండ్లు నానుకుని పడుకుని ఉంది. డాక్టరూ ఆ ఇంటి నౌ అక్కడే ఉన్నారు—"ఏమైంది డాక్టరు ?" అని ప్రసాదరావు అడిగాడు.

'ఈమెకి జ్వరం చాలా తీవ్రంగా ఉంది. న్యూమోనియా అని అనుమానిస్తున్నాను.' డాక్టరు తలపంకించి చెప్పాడు.

'ఏం ప్రమాదం లేదుకదా.'

'ఈమె గుండె కూడా సరిగ్గా పని చేయడంలేదు. అవును కాని ప్రసాదరావుగారూ! మీ రీమె విషయంలో ఏ శ్రద్ధ తీసుకోనట్టు తెలుస్తోంది. ఈమె రోజు రోజూ ఉపవాసాలూ స్నానాలూ చేస్తున్నారట. మీరెందుకని వారించలేదు ?' అని ప్రశ్నించాడు డాక్టరు.

నిజమే తాను పట్టించుకోలేదు. కాని ఆమె చేసే స్నానాలు, పూజలూ వ్రతాలూ ఉపవాసాలు తనకోసమే. నిజంగా తన కామేశ్వరి తన కోసమే ఏం చేసినా ! స్వార్థం ఒకింత కూడాలేని ఆమె గృహిణీ జీవితం అతని కళ్ళకు కట్టింది. అతనిలో ఏదో పశ్చాత్తాపం బాధా వెల్లువై ఉబికాయి. ఆమెతో పోల్చుకుంటే తనెంత అల్పుడుగా గోచరిస్తాడో కూడా తెలుసుకున్నాడు.

కామేశ్వరి కళ్ళు తెరచి అటూ యిటూ చూసింది. తనని చూసి నీరసంగా చిరునవ్వు నవ్వి 'నాకేం భయంలేదు. మీరు వెళ్ళి భోంచెయ్యండి. ఇప్పటికే ఆలస్యమైపోయింది' అంది.

ఇప్పుడూ—యింత జ్వర తీవ్రతలోనూ తనని గురించే ఆమె ఆందోళన ! ప్రసాదరావు సిగ్గులో పశ్చాత్తాపంలో కూరుకుపోయాడు. ఆమె దగ్గర కూర్చొని నొసటిమీద కురుల్ని సవరిస్తూ 'కామీ ! నీకు నయమయ్యే దాకా యింకొక పని ఏదీ చూడను. నీ దగ్గరే ఉంటాను' అన్నాడు. ఆమె స్నేహ పిచ్ఛిలంగా నవ్వింది.

వారం రోజులైనా జ్వరం తగ్గే సూచనలేమీ కనబడలేదు. ఆమె హృదయపరిస్థితి భయావహంగా ఉందని చెప్పాడు డాక్టరు. ప్రసాదరావుకి అన్నం సయించదు, నిద్రపట్టదు. అలాగే ఆమెను కనిపెట్టుకుని కూర్చున్నాడు. ఆమెకి ధైర్యం చెబుతూన్నాడు.

'నాకేమీ భయంలేదు. అన్నింటికీ త్రిపుర సుందరే ఉంది. మీరు నా పక్కగా ఉన్నారు. నా కొడుకున్నాడు. నాకు కావలసిందేముంది ? ఇంక ఏమైనా సరే....'

చప్పున ఆమె నోరు మూశాడు ప్రసాదరావు. అంత ఆందోళన లోనూ అతనికొక ఆశ్చర్యం కలిగింది. ఆమెలో ఉన్న నిబ్బరం! ఆమెకి తన జబ్బుని గురించి తన పరిస్థితిని గురించి ఏమాత్రం భయంలేదు. ఒక్క తెల్ల వెంట్రుక కనపడగానే తాను చలించిపోయాడు. ఆమె ఆసన్న మృత్యువుకి కూడా కొంచమైనా కంగారుపడదు. బాధపడదు, భయపడదు. నిశ్చల సరోవరంలాగ నిర్మలంగా ఉంది! ఏ అఖండ విశ్వాసం ఏ రహస్యం ఆమెకీ శక్తి నిచ్చింది? ఇంత విజ్ఞానంతో శాస్త్రీయదృక్పథంతో కూడా తా నెందుకింత చపలుడూ, దుర్బలుడూ అయిపోయాడు?

ఒకనాడు ఉదయమే కామేశ్వరి భర్తని పిలిచింది. ఇద్దరు డాక్టర్లు ఆమె మంచం పక్కనే ఉన్నారు. ప్రసాదరావు ఏడుపు నాపుకుంటూ ఎర్రని కళ్ళతో చూస్తున్నాడు.

'చూడండి' అంది నీరసంగా కామేశ్వరి. 'నా నొసట మీ చేత్తో కుంకుమ పెట్టండి' అంది.

ప్రసాదరావు వొణికే చేతులతో ఆమె ఫాలాన బొట్టు పెట్టాడు. ఆమె తలను తన వొళ్ళో పెట్టుకున్నాడు. 'కామీ! నన్ను అన్యాయం చెయ్యకు' అని ఏడ్చాడు.

ఆమె కళ్ళు తెరచి పాలిపోయిన పెదాలమీద చిరునవ్వు వెలుగు తూండగా యిలా అంది. 'నేను మీకు చెప్పాను కదూ! పసుపు కుంకుమలతో నేనే మీ సెలవు తీసుకుంటానని, త్రిపురసుందరి నాకు అన్యాయం చెయ్యదు.'

ఆమె వదనంలో శాంతమూ, తృప్తీ అలముకొని ఉన్నాయి. అవిశ్వాసి అయిన ప్రసాదరావు రెండు చేతు లెత్తి పైకి నమస్కరించి 'ఓ భగవంతుడా! నా భార్యని బ్రతికించు' అని ఆక్రోశించాడు.

డాక్టర్లు క్షణక్షణం పుంపలిస్తూ యింజెక్షన్లు యిస్తూ మ… కుస్తీ పడుతున్నారు. ప్రసాదరావు లేచి స్నానం చేసి పట్టు… కామేశ్వరి పూజామందిరంలోకి వెళ్ళి త్రిపురసుందరి ముందు కన్నీళ్ళతో ఆమెని వేడుకొంటున్నాడు. ఇంతలో కెవ…

ఏడిచ్చిన ధ్వని-ప్రసాదరావు స్పృహతప్పి త్రిపురసుందరి పాదాగ్రాల వద్ద పడిపోయాడు.

*(రేడియోలో ప్రసారితం)*

*(ఆనందవాణి — తిలక్ సంచిక 1969?)*

81

# తీవ్రవాద నాయకుడు

శేషయ్య మునిసిపాలిటీవాళ్ళ రోడ్లన్నీ తిరుగుతుంటాడని చెప్ప డానికి అతని పైజామాలు నిదర్శనం.

ఆ రోడ్లమీద దుమ్ము మూంచి ఒత్తుగావుండి, అడుగుపెట్టగానే ఝామ్మని రేగిపోవడం మునిసిపాలిటీవారి బుద్ధికుశలతకి నిదర్శనమైనట్టు.

శేషయ్య ఇలా తిరగడంవల్లనే రోడ్లరిగిపోయి, దుమ్ము లేస్తోందని ఒక కౌన్సిలర్ విమర్శలకి చెప్పిన జవాబు.

పాపం శేషయ్యకి తిరగడమే పని. ఆకలేసినప్పుడల్లా శేషయ్య తిరుగుతూంటాడు. అదేమిటోకాని, రోజూ శేషయ్యకి ఆకలేస్తుంది.

ఎప్పుడూ కడుపునిండా తినడానికి వీలు దొరకదు కాబట్టి ఎప్పుడూ ఆకలేస్తూనే ఉంటుంది. అందుకే ఎప్పుడూ తిరుగుతూంటాడు.

ఆ వూళ్ళో ఉపాధ్యాయులు భూ పరిభ్రమణాన్ని శేషయ్యతో పోల్చిచెప్పడంవలన విద్యార్థులకి చటుక్కున అర్థమైపోతోందని ప్రతీతి.

ఇటు శ్రామిక లోకానికీ, అటు ఉద్యోగానికీ సంపాదనకీ నోచుకోని, స్థిరత్వంలేని, ఏమీ చెయ్యలేని, ఎందుకూ పనికిరాని శేషయ్యలాంటి నిరర్థకపుశాల్తీ ఒకటి చిన్నరకం మధ్యతరగతి కుటుంబాలలో బయల్పడుతుంది.

శేషయ్య స్కూలుఫైనల్ వరకూ చదువుకున్నవాడేనని వదంతి కూడా వుంది. మధ్య మధ్య ఇంగ్లీషు మాటల్నీ ఉద్యోగపర్వంలో తిక్కన పద్యాల్నీ గబగబా అనేస్తాడనీ, ఒక్కొక్కసారి నిశితంగా తెలివితేటల్ని ప్రదర్శిస్తాడనీ కొందరు చెప్పుకుంటూ వుంటారు.

అయితే అతనెందుకు వృథాగా ఏ సంపాదనా, ఏ పనీ లేకుండా ఉండిపోయాడు? ఈ ప్రశ్నకి దేశంలోని నిరుద్యోగంమీదా మన తత్వాల మీదా కొందరు నిపుణుల్ని కమిటీకిందవేసి, పరిశీలన చేయిస్తే తప్ప సమాధానం దొరకదు.

శేషయ్యకి ఓ విధవ అక్కగారూ, తల్లీ ఉండేవారు. ఇతని సంపాదనా చాతుర్యానికి తట్టుకోలేక తల్లి పరలోకానికి చప్పుడు చెయ్యకుండా వెళ్ళిపోయింది. అంతకన్నా గప్‌చిప్‌గా అక్కగారు ఒకనాటి రాత్రికిరాత్రి ఎవడితోనో లేచిపోయింది.

ఆ రోజున శేషయ్య చాలా విచారంగా ఉన్నాడు. అక్కగారు చేసిన అప్రతిష్ఠ పనికికాదు—తను కూడా ఆడదై వుంటే ఎవడేనా లేవదీసుకు పోనుకదా అని........

ఇప్పుడు శేషయ్య లోఫర్.

ఇదివరకు ఎరిగున్నవాళ్ళు, పాతస్నేహితులూ, దయాహృదయులూ ఎప్పుడేనా ఏదేనాఇస్తే తీసుకుంటాడు, తింటాడు, నిద్రపోతాడు. లేనిదే తిరుగుతూంటాడు, అర్థం లేకుండా.

అదేకాదు, అతను మంచివాడు కూడా. దొంగతనం చెయ్యడు, తన కివ్వలేదని ఒకణ్ణి నిందించడు, మోసం చెయ్యడు, దబాయించడు. ఆ రోడ్లమీద అలాగ తిరగనిస్తోన్నందుకు అందరికీ కృతజ్ఞత తెలుపుతూన్నట్టు ఉంటాయి అతని కళ్లు.

ఇటువంటి పరమ దరిద్రుడియొక్క అవసరం ఎవరికీ ఉంటుందని మనం కలలో కూడా అనుకోం. అయితే తిరపతికి మాత్రం ఇతనిలోని గర్భిత శక్తిని—Potential కనిపెట్టే గౌరవం దక్కింది.

ఆ వూళ్ళోవున్న తీవ్రవాద సంస్థ కార్యదర్శి తిరపతి. సమ్మెలూ, నిరసన ప్రదర్శనాలూ, ఎర్రజెండాలూ, నల్లజెండాలూ, కొట్లాటలూ, నినాదాలూ ఇవన్నీ తిరపతి కార్యదీక్ష ఫలితాలు. అతడు అశాంతిని రేపుతాడు. మంచులోంచి మంట పుట్టించగలిగిన తీవ్రవాది.

ఆకలితో ఉన్నవాడు, ఆస్తిపాస్తులు లేనివాడు, నిరాశ అంచులమీద నడుస్తూన్నవాడు — ఈవేళో రేపో కాస్త ట్రెయినింగుతో బ్రహ్మాండమైన తీవ్రవాదిగా సోషలిస్టో, కమ్యూనిస్టో, బోల్షివిస్టో — ఏదో ఒకటి

అయిపోయే సావకాశం వుందని తిరపతి దృఢాభిప్రాయం. అందుకే శేషయ్యతో స్నేహం చేశాడు. రోజూ అతనికి ఎన్నో చెప్పేవాడు. ప్రపంచంలో రెండే వర్గాలున్నా యన్నాడు. ఈ రెండింటికీ, పాముకీ, ముంగిసకీఉన్న ఆజన్మ వైరం లాంటిది ఉంది అన్నాడు.

చారిత్రకంగా ఆధారాలు చూపించాడు. రష్యా—చైనా దేశాలలో ప్రజా విప్లవాన్ని చిత్రించాడు. చివరికి తన భావబీజాలు అతనిలో అంకుర స్థితికి వచ్చాయన్న సమయాన, 'మా సంస్థలో—పార్టీలో చేరు శేషయ్యా. నీ హక్కులకోసం, నీ వేలాది సోదరులకోసం నడుంకట్టి అగ్రగామివై నడు, నడిపించు' అని ఆవేశంగా హెచ్చరించాడు.

తిరపతి ఉపన్యాసం గంటన్నరసేపూ విన్నాక, శేషయ్య తల గోక్కుంటూ తాపీగా 'సర్లెండి. మా మాధవుణ్ణి కలుసుకుని వాడు కూడా మంచిదే అంటే చేరుతానులెండి. ఏదో మీరింతగా అడుగుతూంటే.........' అంటూ నసిగాడు.

తిరపతి నివ్వెరపోయాడు. ఒక రాజకీయమైన ఆదర్శంకోసం, దేశంకోసం ఇంతగా తను చెపితే, ఇదేదో మొహమాటం అభినయించే శేషయ్యని చూడగానే తిరపతి జన్మకంతటికీ సరిపోయేటంత నిస్పృహ కలిగింది. అందులోనూ శేషయ్య చెప్పిన మాధవుడు ధనవంతుడు. ఆ వూళ్లో కల్లా ధనవంతుడు. తిరపతి లేచి, శేషయ్య మొహంమీద మొహంపెట్టి గట్టిగా కంఠనాళాలు ఉబ్బేటట్టుగా 'రియేక్షనరీ—పెటీబూర్జువా' అని అరచి గబగబా వెళ్ళిపోయాడు. ఆ మాటలలోని అర్థమూ నిందా ఏమిటో తెలియక పోయినా తిరపతికి ఎందుకు కోపం వచ్చిందా అని ఆలోచించుకుంటూ ఇంకా తలగోక్కుంటూనే రోడ్డు పట్టాడు శేషయ్య.

మాధవుడి తండ్రికి ఇన్‌కమ్‌టాక్సువాళ్ళ లెక్కల ప్రకారం సాలుకి యాభై వేల రూపాయలు తక్కువ కాకుండా ఆదాయం. ఇదికాక, పన్నులకీ, ప్రభుత్వపు కన్నులకీ దొరకని ఆదాయం ఎవరికి తోచిన రీతిని వాళ్లు అంచనా వేస్తూంటారు. ఇంత శ్రీమంతుడైన మాధవుడూ, శేషయ్యా స్నేహితులవడానికి కారణం వీళ్ళిద్దరూ ఆ వూరి స్కూల్లో ఫేలౌతూ, ప్యాసవుతూ ఏడెన్మిదేళ్లు కలసి చదువుకోవడమూ—కలసి వేరుశనక్కాయలూ, బఠానీలు కొనుక్కు తినడమూ లాంటి సంఘటనలు. ఇప్పు

డిద్దరికీ పాతిక సంవత్సరాల వయస్సు దాటినా, వారి మధ్య అంతరం బాల్యంలోకన్నా ఎక్కువైనా, ఎప్పుడోకాని రోడ్డుమీదతప్ప, కలుసుకోక పోయినా, శేషయ్యకి మాధవుడంటే అభిమానమూ, నమ్మకమూ కూడా.

కారు ఆపుచేసి, మాధవుడు పిలుస్తాడు. శేషయ్య ఓ నిముషం ఆకలీ్ని, బాధర్నీ మరచిపోయి, నవ్వుతూ దగ్గరగా వెళతాడు.

'ఏరా శేషూ! బాగున్నావా' అంటాడు మాధవుడు.

'ఆఁ రోడ్లమీద యిలా చక్కర్లు కొట్టుచున్నాను.'

'నీ పనే బాగుందిరా.'

'అదేం?'

'మానాన్న డబ్బివ్వడురా. కొట్లల్లో కాఫీ హోటళ్ళలో అప్పు రెండు వేలు. ఫ్రెండ్సుకీ అయిదారువందలు ఇవ్వాలి. పెట్రోలుబంకుకి ఆర్నెల్లనుంచి కానీ ఇవ్వలేదు. ఛీ ఛీ ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోందిరా.'

శేషయ్య అటువంటి సమయంలో మిత్రుడిమీద నిజంగా జాలిపడేవాడు. 'మీ నాన్నకింత కరుకుతనం పనికిరాదు' అనేవాడు.

'మా నాన్న! రాక్షసుడు, విలన్, రావణాసురుడు, హిరణ్య కశిపుడు' అని తిడుతూ కారు స్టార్టుచేసి వెళ్ళిపోయేవాడు మాధవుడు.

....నాలుగైదు నెలల అనంతరం శిథిల గృహావశేషమైన ఒక గదిపంటిదాంట్లో నిదిరిస్తూన్న శేషయ్యకి తన నెవరో పిలుస్తూన్నట్టనిపించి, కళ్లు నులుముకుని బయటికి వచ్చాడు. మాధవుడు కార్లోంచి అమాంతం దుమికి, శేషయ్యని కావలించుకుని, 'శుభవార్తరా శేషూ' అన్నాడు.

శేషయ్య అర్థమైనట్లు నవ్వి, 'ఎప్పుడురా లగ్నం? అని అడిగాడు.

'ఛఛ-పెళ్లి గిళ్లీ కాదు. నా డియర్ ఫాదర్ చచ్చిపోయాడు. ఈ వేసవికి ఊటీ వెళ్లాంకదూ. అక్కడ సడన్‌గా, హాయిగా కళ్లు మూశాడు. ఒరేయ్ శేషూ, రాయిలా అలా నిలబడ్డావేంరా? - కంగ్రాచ్యులేషన్సు చెప్పక' అన్నాడు మాధవుడు శేషయ్య భుజాల్ని కుదుపుతూ.

బెదురుగా 'కంగ్రాచ్యులేషన్సు' అన్నాడు శేషయ్య.

'ఇంక పెళ్ళి విషయం చూడుభాయ్. నాలాంటివాడికి పెళ్ళి ఆటంక మేకాని, సుఖంలేదు. నలుగురమ్మాయిలకి ప్రామిస్ యిచ్చి, వేర్వేరుగా లొంగ దీసుకున్నాను. పెళ్ళని తెలిస్తే నలుగురూ వచ్చి ఇంటిముందు సత్యాగ్రహంచేస్తారు. వాళ్ల నెలా వదలించుకోవడమా అని బ్రహ్మాండమైన మానసికపరిశ్రమ చేస్తున్నాను' అని ఓసారి ఆగి,మాధవుడు మళ్లీ యిలాఅన్నాడు.

'ఈ శుభ సమయంలో ఆ బాల్యమిత్రుడివైన నీకు ఎన్నడూ మరచి పోలేని ఒక బహూకృతి-ఒక అనుభవరూపంలో ఇవ్వదలిచాను. రా నాతో కారు ఎక్కు',

శేషయ్య తన మాసిన గడ్డాన్నీ, పైజామాల్నీ చూసుకుని, సందేహిస్తూ, 'ఎందుకూ, ఎక్కడికీ?' అన్నాడు.

'నీకు అవన్నీ అనవసరం. నేను చెప్పినట్లు చెయ్యి' ఆజ్ఞాపించాడు మాధవుడు.

శేషయ్య ఏనాడూ మాధవుణ్ణి కాదనలేదు.

కారు సెలూన్ దగ్గరా, రెడీమేడ్‌షాపు దగ్గర ఆగి, బయలుదేరే సరికి శేషయ్య రూపం సర్వాంగసుందరంగా అభినవంగా సూట్, బూట్, హేట్‌తో దర్శనీయంగా తయారయింది ఈసారి కారు ఓ పెద్ద హోటల్ ముందు ఆగింది.

'ఇదిగో శేషూ. రెండవ అంతస్తులో నీకోసం ఎయిర్ కండిషన్డ్ గది ఒకటి తీసుకున్నాను. ఈ మూడువందలూ నీదగ్గర ఉంచుకో. నాల్గవ రోజునాటికి నీ దగ్గర పైసా కూడా ఉండకూడదు. ఈ హోటలులో నీకు సర్వ సౌఖ్యాల్నీ, భోగాల్నీ ఎప్పుడు కోరినా పళ్లెంలోపెట్టి అందిస్తారు. హాయిగా, కులాసాగా అనుభవించు' అంటూ మాధవుడు మూడువందల రూపాయల నోట్లు శేషయ్యకోటుజేబులోపెట్టి విష్‌చేసి వెళ్ళిపోయాడు.

తెల్లబోయి నుంచున్న శేషయ్యని ఇద్దరు హోటల్ జవాన్లు గౌరవంగా, భక్తిశ్రద్ధలతో నడిపించుకు వెళ్ళి లిఫ్ట్ ఎక్కించి రెండవ అంతస్తులో ఒక పెద్ద గదిలో దిగవిడిచారు.

చలువరాయి చప్టాలో, చల్లదనంఇచ్చే రంగులతో నిగనిగ మెరిసే సామగ్రితో టెలిఫోన్, రేడియోగ్రాములతో వేడి, చల్లని కుళాయిలతో, కిటికీలకి సిల్కు తెరలతో పువ్వుల కుండీలతో ఎవరో సౌఖ్యం అనే

భావాన్ని భౌతికంగా తర్జుమాచేసి, నాలుగు గోడలమధ్యా బంధించినట్టని పించింది శేషయ్యకి.

మంచంమీద వాలగానే డన్‌లోపిల్లో మెత్తని పూపుకి తన్నొక దేవకన్య మెత్తగా మత్తుగా కౌగలించుకుంటూన్నట్టు అనుమానపడి, ఫక్కున నవ్వేశాడు.

'రోజుకి గదికి అద్దె ఎంత?' అని అడిగాడు శేషయ్య.

'నలభై రూపాయలు' అన్నాడు బోయ్.

ఉలిక్కిపడి 'నాకు తాగేందు కేదేనా కావాలి. మాంచి మాంచి....' అని పేర్లు తెలియక తికమకపడ్డాడు శేషయ్య.

రక రకాల పానీయా లతని ముందుకువచ్చి పడ్డాయి.

'నాకు తినేందు కేదేనా కావాలి' అన్నాడు శేషయ్య.

నానావిధ భక్ష్యాలూ అతని ఎదుట సాక్షాత్కరించాయి.

'అబ్బ, వొళ్లు సొప్పుబుగావుంది. నిద్ర వస్తోంది' అనుకున్నాడు శేషయ్య తనలో తాను.

ఒక ఓద్ర మంగలి పళ్లు పట్టగా, రేడియోనుండి చక్కని పాట వింటూ కలలుకంటూ నిద్రపోయాడు శేషయ్య.

సాయంత్రం టాక్సీలో పార్కుకీ, ఊరు శివారుకీ, థియేటర్‌కీ వెళ్లాడు. ఎక్కడా అతనికి అమితమైన గౌరవం. ఒకచోట జనం గుంపులుగాచేరి, గారడీ ప్రదర్శనాన్ని చూస్తున్నారు. అటువంటి వీధి ప్రదర్శనాలు చూడడం బాగా అలవాటయిన శేషయ్య కారాపి, అక్కడ దిగాడు. ఎవరో అడిగారు.

'అయ్యా తమ రెవరు. ఎక్కడ ఉంటున్నారు?

'దేవేంద్రా హోటల్, రూమ్ నెంబరు 18' అన్నాడు శేషయ్య.

అంతే. జనం పాయలుగా విచ్చిపోయారు. జనం పీతల్లా ముడుచుకుపోయారు. కొందరు 'సలాం' అన్నారు. కొందరు నమస్కరించారు. పక్కనున్న టీ దుకాణంవాడు గబగబా ఓ కుర్చీ తీసుకువచ్చి వేశాడు. శేషయ్యకి వెర్రి ఆనందమూ, గర్వమూ కలిగాయి.

రాత్రి వెన్నెలలో Roof-garden లో భోంచేశాడు. సగం సగం బట్టల్ని ధరించి, ఉద్రేకపరిచే నాట్యాన్ని చూస్తూ బీరునీ వైన్‌నీ తాగాడు. తూలుతూ గదిలోకి వచ్చాడు. కాలింగ్ బెల్ నొక్కాడు.

'చిత్తం' అన్నాడు నౌకరు వచ్చి.

'కావాలి' అన్నాడు శేషయ్య.

'ఏమిటి సార్'

'వాళ్ళు'

'ఎవరు సార్'.

'పిల్లలు'

కాసేపట్లో కృత్రిమమైన నవ్వుల్ని కురిపిస్తూన్న ఒక తైనాతీ వచ్చాడు. ఆల్బమ్ ఒకటితీసి చూపించాడు. ఆశగా, ఆబగా అన్ని బొమ్మలూచూసి ఒక బొమ్మమీద వేలు పెట్టి 'యిది' అన్నాడు శేషయ్య.

'యాభై రూపాయలు' అన్నాడు తైనాతీ.

'ఆల్ రైట్' అన్నాడు శేషయ్య.

అందానికీ అలంకారానికీ, కృత్రిమత్వానికి ఆడదానికి, పశుత్వానికీ ప్రేమకీ మధ్యగల వ్యత్యాసం తెలియని శేషయ్య ఒక అపరిచిత వ్యభిచారిణి కౌగిలిలో సొమ్మసిలి నిద్రపోయాడు. మూడు రోజులూ ఎన్నడూ ఎరుగని ఆనందాన్నీ తృప్తినీ గర్వాన్నీ అత్యున్నత స్థాయిలో పొందిన శేషయ్యకి తల తిరిగిపోయింది. వివేకం తప్పిపోయింది. అధికారమూ సౌఖ్యమూ తన జన్మహక్కు అనుకున్నాడు-తనే సౌఖ్యమూ, అధికారమూ అంతే అనుకున్నాడు.

మూడవరోజు రాత్రి పండ్రెండు గంటలకి మూడవ బొమ్మ శేషయ్యగది విడిచి వెళ్ళిపోయింది. నిద్రమత్తులోఉన్న శేషయ్యకి తెల్లవారగానే రాసు గది ఖాళీచేసి తన పాత తాటాకు ఇంటికి వెళ్ళిపోవాలన్న జ్ఞానం చటుక్కున తేలుకాటులాగ స్ఫురించింది.

ఎవరో ఒక పెద్దనిచ్చెనవేసి, ఎక్కుకి మరీ ఎక్కుకి ఎక్కించేసి, ఉన్నట్టుండి దభాల్న కిందకి తోసేసినట్టయింది శేషయ్యకి. అతనిబుర్ర తీవ్రంగా పని చెయ్యడం మొదలు పెట్టింది. భయమూ బాధా నిర్వేదమూ, కలిగాయి. పళ్ళు బిగించాడు. తల పట్టుకున్నాడు. ఎయిర్ కండిషన్డు గదిలో

కూడా అతనికి చెమటలు పట్టాయి. తెల్లవారేవరకూ ఆలోచిస్తూ, గదిఅంతా కలయదొక్కాడు.

ఏడుగంటలకి - ఉదయం - హోటలు విడిచి రోడ్డుమీద అడుగు పెట్టాడు. మాధవుడు నవ్వుతూ ఎదురొచ్చాడు. 'ఏరా, ఎలాగవుంది ? అన్నాడు.

కోపంగా మాధవుణ్ణి ఆపాదమస్తకం పరీక్షించి 'హుం' అన్నాడు శేషయ్య.

'ఏమిట్రా యిది' అన్నాడు మాధవుడు.

'చంపేస్తా'.

'ఎవర్ని'

'నిన్ను'

'ఆ—' అంటూ ఒక్క అడుగు వెనక్కివేశాడు మాధవుడు.

'ప్రపంచంలో రెండే రెండు వర్గాలు. ధనికులూ. పేదలూ. వీరి మధ్య ఎప్పుడూ ఎడతెగని వైరం. జాగ్రత్త మాధవ్ ! ఇంతమంది దరిద్రుల్నీ నిస్సహాయుల్నీ నీచుల్నీ తయారుచేసిన నిన్నూ, నీలాంటివాళ్లనీ క్షమించేదిలేదు. నువ్వంటే నాకు వైరం. పీక దాకా ద్వేషం, అసహ్యం'- అంటు గబగబా వెళ్ళిపోయాడు శేషయ్య.

మాధవుడు తెల్లబోయి నుంచున్నాడు. మాధవుణ్ణి చూసి, ప్రత్యుత్థానం చేసేందుకు వచ్చిన హోటల్ మేనేజరు శిలాసదృశుడై పోయాడు.

శేషయ్య తిన్నగా తీవ్రవాద సంస్థ కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ కుర్రవాణ్ణి జుట్టు పట్టుకుని ఊపుతూ, 'ఏడీ తిరపతి ఎక్కడ' అని గర్జించాడు. కుర్రాడు భయపడి ఓగది చూపించాడు. శేషయ్య విసురుగా వెళ్ళి, 'తిరపతీ, నీ సంస్థలో చేరాను. నా పేరు రాసుకో' అన్నాడు.

తిరపతి గుడ్లప్పగించి చూస్తున్నాడు.

శేషయ్య పిడికిలి బిగించి, గాలిలో వూపాడు. 'ఈ ధనిక వర్గాన్ని నాశనం చెయ్యడమే నా జీవితాశయం. నల్లుల్లాగ నలిపి పారేస్తాను. విప్లవం నా ధ్యేయం. హింస నా సాధనం. ద్వేషం నా రక్తం' అని అరిచాడు.

ఆలస్యంచేస్తే తననే చంపేస్తాడేమో అన్నంత తొందరతో గబుక్కున శేషయ్య పేరు రాసేసి సభ్యత్వపు రశీదు శేషయ్య కిచ్చాడు తిరపతి.

'ఇప్పుడు నేనేం చెయ్యాలి' – అడిగాడు శేషయ్య.

'సాయంత్రం మీటింగ్, అక్కడికిరా' అన్నాడు తిరపతి. మీటింగులో, శేషయ్య ఉపన్యాసం విన్నవాళ్ళ ఒళ్ళు జలదరించి, కంగారుపడి పోయారు. అతనేం చెప్పాడో సరిగా ఎవరికీ తెలియదు కాని, చూపులూ, మంటలూ, శ్మశానాలూ, గద్దలూ, రక్తమూ మొదలైన భయంకరమైన మాటలు చాలాచాలా వినిపించి, చాలామంది చప్పట్లు కొట్టేశారు.

నాటినుండి ఎక్కడ చూసినా శేషయ్య. పోస్టర్లు అంటిస్తూ శేషయ్య. మీటింగులలో శేషయ్య, సమ్మెలలో శేషయ్య....

ఓ సారి ఎవడో ఒక ధనవంతుడితో మాట్లాడినందుకు ఒక సభ్యుడిని సాచి లెంపకాయ కొట్టాడు శేషయ్య.

ఇంకోసారి ఓ సినిమాతార బొమ్మని జేబులో దాచుకున్నందుకు ఒక యువకుణ్ణి వాళ్ళ సంస్థ కార్యాలయం గదిలో పైవాసానికి తాడుకట్టి రాత్రంతా వేలాడతీశాడు శేషయ్య.

శేషయ్య కఠినంగా అయిపోయాడు. నిరంతర ధనిక ద్వేషం ఒక మహావ్రతం క్రింద కొనసాగిస్తున్నాడు. అందుకే మేడల్నీ, మోటారుకార్లనీ, ఫస్టుక్లాసు రైలు పెట్టెల్నీ కూడా చూడడు. గట్టిగా కళ్ళు మూసేసుకుంటాడు. అందమూ, ఆనందమూ, కళలూ—ఈ మూడూ తీరికగల ధనవంతులకే కాబట్టి వాటి ప్రసక్తి కూడా రానివ్వడు. ఎప్పుడూ కొరకొరలాడుతూ నడుస్తూన్న కొరకంచులా ఉంటాడు.

శేషయ్యముందు తిరపతి నీరసించిపోయి, తక్కువ రకపు సంస్కరణవాదిలా అందరికీ కనిపించాడు.

శేషయ్య చుట్టుపక్కల గ్రామాలన్నింటికీ ప్రధానుడై పోయాడు. కొన్నాళ్ళకి జిల్లా అంతటికీ ఏకైక తీవ్రవాద నాయకుడుగా గుర్తించబడ్డాడు.

శేషయ్య కళ్ళల్లో ద్వేషం స్పిరిట్‌లా నీలంగా మండుతూంటుం దనీ, యిప్పటికీ అతనికి రాత్రుళ్ళు కలల్లోకి 'హోటల్లో మూడు రోజులూ, మూడు బొమ్మలూ' వచ్చి ఉలిక్కిపడుతూంటాడనీ మాధవుడు అందరి తోనూ అంటూంటాడుట.

(భారతి-ఏప్రిల్ 1963.)

## ౯౧

# కవుల రైలు

తెలుగుదేశం కవులతో నిండి మూడవ తరగతి రైలు పెట్టెలాగ క్రిక్కిరిసి పోయింది. "ఇంక జాగాలేదు" అని కేకలేస్తున్నా వినిపించుకోక చవకగా అమ్మే టిక్కెట్లు కొనుక్కుని కొత్త కవులు తోసుకు లోపలికెగ బడుతున్నారు. కొందరు ఫుట్ బోర్డులమీద నిలబడి, కొందరు కమ్మీలు పట్టుకొని వేలాడుతున్నారు.

ఒకావిడ మేలిముసుగు వేసుకుని వచ్చింది. సుతారంగా అందంగా వుంది. కళ్ళల్లో అపూర్వమైన వెలుగు. ఎర్రని పెదవుల్లో తియ్యని సిగ్గు దొంతులు. వెన్నెలనీ, ఉషఃకాంతినీ, మల్లెపువ్వుల్నీ, మంచిగంధాన్నీ, రత్నాల్నీ కలబోసి మనమీద జల్లినట్టు అనిపిస్తుంది ఆవిడని చూస్తే.... అక్కడ దగ్గరలో నిలుచుంటే.... ....

ఆవిడ నిస్పృహగా చూసింది రైలు పెట్టెకేసి. లోపలి దొగ్గుపులుసు నార్, చుట్టపొగా వాగుడూ కలిసి పెట్టెలోంచి బయటికి దుర్భరంగా వ్యాపిస్తున్నాయి.

"ఇక్కడ చోటులేదు దయచేయవమ్మా, నువ్వుకూడానా మాఖర్మ" వగలొలుకబోసుకుంటూ అన్నాడొక చుట్ట ఆసామీ కాండ్రించిఉమ్మివేస్తూ. ఆయన కవి శార్దూల బిరుదాంకితుడు, అప్పకవీయం అడ్డంగా బట్టీ వేశాడు.

"నో ప్లేస్ మేడమ్ వెరీ సారీ" అంటూ కన్నుగీటాడొక నవయువకుడు నాగుల్ని తీసి, సెకండ్ హాండ్ సీకే నోట్లో ఉంచుకునే.

కొందరు వెకిలిగా నవ్వారు కొందరు దగ్గారు. మరికొందరు యీలలు వేశారు. పాపం ఆవిడ వెనక్కి తిరిగి జాలిగా వెళ్ళిపోయింది. రైలు కదలిపోయింది. స్టేషన్ మేష్టరా వచ్చే ఆమెని చూచి "పాపం చోటు లేదా అమ్మా, నీ పేరు?" అని అడిగాడు.

"కవిత" అందా సుందరి.

కవుల రైలు వడివడిగా గమ్యం తెలీకుండా వెళ్ళిపోతోంది

## బొమ్మ

ఆ పెద్ద నగరంలో మార్కెట్టులో ఒకచోట బల్లమీద ఓ ఆడది కూర్చునివుంది. ఆమె చాలా అందమైనది; లావణ్యమైనది. ఆమె ఉత్తర ధృవంలో ఆరోరా బోరియాలిస్ లా వుంది; ఊర్వశి లా, హెలెన్ లా వుంది. స్వప్నమల్లే అంత నిజమూ అంత అబద్ధమూ లాగ వుంది. ఆమె అర్ధనిమీలిత నేత్రాలు మరోలోకం చివర తెరచుకుంటున్నట్టు వున్నాయి. ఆమె కళ్ళల్లో ఓ విషాదం, ఓ అలౌకికత్వం జాలిగా మెరపుగావుంది. ఆమె చాలా సన్నని, విలువైన, సూర్యకిరణాల్లాంటి జరీ మెరిసే దుస్తులుధరించి వుంది. ఆమె ఎందుకు అక్కడ అలావుందో, ఆమె ఎవరో ఎవరికీ తెలియదు.

జనం గుంపులుగుంపులుగా వచ్చి చూస్తున్నారు. ట్రాఫిక్ ఆగిపోయింది. జనసమ్మర్దం తొలగించడానికి వచ్చిన పోలీసు ఉద్యోగులుకూడా ఆ ఆడదానికేసి చూస్తూ ఉండిపోయారు. నగరంలో ఉండే విద్యాధికులూ, కవులూ, రాజకీయవేత్తలూ, శాస్త్రజ్ఞులూ అందరూ ఆ మనిషిని తనివి తీరని ఒక చూపుతో, ఆశతో, తృప్తితో చూస్తున్నారు. ఆమె చాలా ఎత్తు మీద వుంది; అంత ఎత్తు మీద ఆమె కదలికలు ఏమీ స్పష్టంగా యెవరికీ గోచరించడంలేదు.

'ఈమెని చూసినకొలదీ నా భార్యకి నేను ద్రోహం చేస్తున్నానని పిస్తోంది. కాంతాకనకాలకి దగ్గరగా వుండకూడదు. పోదాం రా!' అన్నాడు శాస్త్రి.

'ఈమెని చూసినకొలందీ నా భార్య నాకు చేసిన ద్రోహం స్ఫురిస్తోంది; అతి ఘోరంగా, అన్యాయంగా. ఆమెనీ, ఆ వొంటి వొంపుల్నీ చూస్తో యిలాగ యెన్నాళ్ళైనా వుండిపోగలను. నేను యింటికేరాను.' అన్నాడు శర్మ.

'చూసి ఏంచేస్తావ్! ఏం చెయ్యగలవ్! ఆమె యౌవనం ఒక భ్రాంతి. మన పెళ్ళాల్లాగే రెండు కాన్పులతో ముసల్ది అయిపోతుంది.'

'ఏం చేస్తానా, పెళ్ళిచేసుకుంటాను. లేదూ ఉంచుకుంటాను.' అన్నాడు శర్మ.

'నీది అవినీతి' అన్నాడు శాస్త్రి.

'నీతి అంటే' అన్నాడు శర్మ.

'నీతి, అవినీతీ అందంముందు మంచులా కరిగిపోతాయి. అంద మొక్కటే నిజం, తక్కినవన్నీ అబద్ధం. ఆ అందాన్ని ఆరాధించండి. ఆమె దేవత.' అన్నాడొక గిరజాల మనిషి.

'ఆమె దేవతకాదు. ఆమె నా ప్రేయసి.' అన్నాడు కవి; ఓరగా సిగ్గుపడుతూ ఆమె వైపు చూస్తో. 'నా ప్రేయసి నాకు ఊహగా లీలగాతోచి యిదివరకు మాయమైపోయింది. అప్పట్నుంచీ యీ వియోగం భరించలేక పోతున్నాను. నా ప్రేయసి యెవరో అని తీవ్రగవేషణ సలిపాను. ఇంటింటా, బీచి దగ్గరా, ఆడవాళ్ళ కాలేజీలలో వెతికాను. నిరాశ అంచుమీద నిలబడి మృత్యువనే సముద్రంలోకి దూకబోయే నాకు ఈమె కనపడింది. ఈమె యెవరు! అచ్చంగా, నేనూహించి వియోగం పొందుతూన్న నా ప్రేయసి, నా తపఃఫలము.'

ఇంతలో ఒక పెద్దకేక వినబడింది. ఒక వ్యక్తి చేతులు ఊపు కుంటూ కంఠం చించుకుంటూ అలా వచ్చాడు. 'మేరీ యేంటియోనటీ! ఫ్రెంచి విప్లవంలో ఉరిదీయబడిన మేరీ తిరిగి యిండియాలో రూపందాల్చింది. ప్రజాస్వామ్యశక్తులు ఆమె ఆకర్షణకు లోబడకూడదు. ఆమెని ఉరి దీయాలి.'

"మా బలేగావుంది. ఓ రాత్రి దీంతో పడుకుంటే మాంచి మజాగా వుంటుంది. ఏమయ్యోయ్ పంతులూ, రేటు ఎంత?" అన్నా డొక కోమటి.

"ఈమె బూర్జువా! మరేం కాదు. ప్రపంచపీడిత ప్రజానీకపు ప్రథమ శత్రువు!" అన్నాడొక యువకుడు, రేగిపోయిన జుట్టుతో, నిక్కర్లతో వచ్చి.

"అంతే-" అని ఒకరు.

"ఈమె పాలబుగ్గలూ, మిసమిసలాడే వొళ్లూ, కళ్లూ- ఇవన్నీ ధనిక చిహ్నాలు. ఎంతమంది శ్రామికుల రక్తం తాగితే యీ బుగ్గలకి ఎరుపు వచ్చింది? ఎంతమంది బట్ట లేకుండావుంటే యీమెకి జరీచీర వచ్చింది. ఒక అన్యాయపు ఆర్థిక విధానపు సృష్టి యీమె. ఈమె రియేక్షన్, ఫాసిజం. ఘోరం, అపాయం."

"కాని మా బలేగావుందిలే! ఆ సూపూ, సన్నూ....ఓంపోచ, కై పెక్కి పోతున్నాది." అన్నాడొక కూలివాడు.

"అదిగో!-అదే బానిసత్వం. సంప్రదాయం! కామ్రేడ్ నువ్వీస్థితికి రావడానికి యీమె కారణం అని గుర్తించు. కూలీల సంఘంలో చేరిపో! ప్రపంచాన్ని ఆర్థిక దృక్పథంతోనే చూడాలి. ఈమె ఒక ఆర్థిక ఘోరం. ఈమె మీద మనం విప్లవం చెయ్యాలి. చూడు నా నినాదం. యిదిగో," ఈ బల్ల మీద ఆడది నశించాలి!" అంటూ ఆ నిక్కరు యువకుడు గట్టిగా అరచి ఆ కూలీని కౌగిలించుకున్నాడు.

లంబూరా మీటుతూన్న సాధువొకడు అక్కడికి వచ్చి యిలాఅన్నాడు "బాబూ, ఈ ప్రపంచం మిథ్య! ఓ పెద్ద మిద్దె. రక్త మాంసాల తోడి కుళ్ళు గుంట ఆడది. ఎందుకు నీకు ప్రేమ! మాయలో పడిపోకే మనసా! ఓ మనసా!"

"ఈమె నా తల్లి! మరెవ్వరూ కాదు! "అన్నాడొక మనిషి పరుగెత్తుకుని వచ్చి! అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"అలాగా, పాపం విచిత్రం" అంటూ అందరూ అతనిచుట్టూ మూగారు.

"ఈమె నామాత! పరాయిస్త్రీ ఎవరేనా నాకు తల్లి! భాగవతం చదువు కావలిస్తే. జీసస్, బుద్ధుడు, గాంధీ-స్త్రీని మాతృ రూపంలోనే చూశారు. ఈమె మాతృదేవత, సత్యదేవత-అంత ఎందుకూ. చరఖా దేవత!" అన్నాడు ఆ మనిషి గాంధీటోపీ సవరిస్తూ.

"ఆ బల్లమీది వస్తువు ఏమిటో నేను చెపుతాను. ఆగండి" అంటూ వైనాక్యులర్సు తగిలించిన ఒక సన్నని పెదవుల నడివయస్కుడు. అందరూ అతనిచుట్టూ మూగారు ఆతృతతో. అతను ఆమెని నిదానంగా టెలిస్కోపులో ఓ పావుగంటచూసి యిలా అన్నాడు.

"ఈ వస్తువు అందమైనది అన్న అభిప్రాయం సబ్జెక్టివ్-అంటే మీ మీ మనస్సులోనిది. ఈమెని ప్రేమిస్తున్నాననే కవిగారిది ఓ సెంటిమెంట్. మానసిక చాంచల్యానికి ఆయన మందు పుచ్చుకోవాలి. ఈ వస్తువు అసలు ఏమిటో తెలుసునా!-ఈ వస్తువు ఆడమనిషి. జీవశాస్త్రప్రకారం యీమెకి ఆడ దాని లక్షణాలే కనపడుతున్నాయి. కావలిస్తే చదవండి డార్విన్ పుస్తకాలు. ఈమె సృష్టి ప్రయోజనానికి పనికివస్తుంది. సృష్టి ఎలా జరుగుతుందో తెలుసునా. మనలో గ్లాండ్స్...."

"ఓస్, ఏం సెప్పావయ్యా, అరగంటసేపు చూసి ఆడమనిషి అని. ఎవడవు బాబు నువు." అన్నాడు కూలివాడు చుట్టనుసుల్తూ.

"నేనా! నేను సైంటిస్టుని. బైయాలజీ ప్రకారం యీమె ఆడది. అయినా యింతదూరం నుంచి నేను ఋజువు చెయ్యలేను. ఇంకా కొన్ని పరీక్షలు చెయ్యాలి." అంటూ అతను అంగలు వేసుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు.

"హా నా ప్రేయసీ:" అంటున్నాడు కవి.

"ప్రేయసీలేదు గేయసీలేదు ఊరుకోవయ్యా! మన షాపులో యీమెని నిలబెడితే కావలసినంత లాభం! లాభాలకి లాభాలు! ఏమంటావ్ చెంచయ్యా?" అంటున్నాడు ఒక మార్వాడీ.

ఇంతలోనే-యింతవరకూ బల్ల దగ్గర కిందగా కూర్చున్న ఒక సన్నని పొట్టివ్యక్తి బల్లమీదకెక్కి నుంచున్నాడు. ఆమెమీద ఒక పల్చని బట్ట కప్పి వేసి సులువుగా ఎత్తుకొని నెత్తిమీద పెట్టుకుని యిలా గంభీరంగా అన్నాడు. "సోదరులారా! ఈ బొమ్మని నేనే చేశాను. ఇది నా శిల్పం. మీలో ఒక్కరూ యీ బొమ్మని కొనలేదు. ఇంతకీ నాకు ప్రాప్తిలేదు. నేను మరో వూరు వెళ్ళిపోతా" నంటూ ఆ బల్లదిగి అతను చకచక వెళ్ళిపోయాడు.

"ఆ కళకి ప్రయోజనంలేదు" అన్నాడొకడు.

"కళకోసం కళ! దానికి ప్రయోజనం ఏమిటి"? అన్నాడు మరొకడు.

"అసలు కళలేదు. సైన్సుతప్ప" అన్నాడు ఇంకొకడు.

"అసలు ఏమీలేదుబాబూ! ప్రపంచం ఒక ముద్ద! ఇదంతా ఒక భ్రమ!"అన్నాడు సాధు.

"నాకు మూర్ఛ వస్తోంది. నా ప్రేయసికి నేను కనపడక ఒంగా, తెల్పంగా మారిపోయింది. ఇప్పుడేం చెయ్యను. ఏం చెయ్యను? అబ్బా బాధ, మిస్టర్! ఓ చేదవుంటే ఇయ్యి. కాఫీ తాగితే కాని...." అంటున్నాడు కవి.

ఇంతవరకూ చూస్తోన్న పోలీసు ఉద్యోగి విజిల్ వేశాడు, ట్రాఫిక్ ఆపుదలకి పోలీసుల్ని లాఠీ చెయ్యమని ఆజ్ఞాపించాడు. జనం చెల్లాచెదరై పోయారు.

తర్వాత రోజున న్యూయార్కులో ఓ పేపర్లో యిలావుంది.

"-నగరంలో ప్రజావిప్లవం. పోలీసులు తుపాకీలు కాల్చారు— నగరంలో మతకలహాలు నూర్గురి మరణం"

*(ఆనందవాణి దీపావళి సంచిక 1948)*

97

# దొంగ

మసక మసకగా వుంది వెన్నెల. చెట్లకిందవున్న చీకటిలోంచి నడుస్తున్నాడు గోపాలం. మోకాళ్ళపైకి ఎగకట్టిన పంచెకట్టూ, ఛాతీకి బిగుతుగా అంటుకొనిపోయిన బనీనూ, మొలలో చిన్న కత్తి— ఆత్మ విశ్వాసంతో, ధైర్యంతో ఉన్నాడు గోపాలం....

మధ్య మధ్య త్రేనుపులు వస్తున్నాయి పుల్లపుల్లగా— ఒకే ఒక గ్లాసుడు నాటుసారా పుచ్చుకున్నాడు బలానికీ, హుషారుకీ. చదువురాని వాడైనా, ప్రతీదీ ఒక ప్లాను ప్రకారం నడవాలి గోపాలానికి. ఏ పని చేసినా ముందూ వెనకా చూసి ఆలోచించి వేరీజువేసే అలవాటు వుంది అతనికి. ఒక స్వాభావికమైన వివేకం వుంది. అందుకే రత్తయ్యా, సోములూ ఎంతో నమ్మకం వుంచి అతనిమీద యీ బాధ్యత వేశారు. వాళ్ళిద్దరూ లేకుండా వుంటే, పనులు సవ్యంగా జరుగుతాయి. వాళ్ళిద్దరికీ నిదానం లేదు. ఉత్త కంగారు, ఉత్తి ఆశతప్ప.

రాత్రి ఒంటిగంట దాటితే కాని ఆవిడ మొగుడింటికి రాడు. రెండు వారాలు పరిశీలనగా చూసి యీ విషయం గ్రహించాడు. ఆ క్లబ్‌లో కూర్చుని ఖరీదైన మందు తాగుతూ పేకాడుతూ డబ్బయిపోయేవరకూ అక్కడే వుంటాడు. ఈలోగా అతని భార్య వొంటరిగా యింట్లో వంట గదికి పక్కగా వున్న గదిలో పడుకుని నిద్రపోతుంది. వంటగదికి దొడ్లో నుంచి వెళ్ళాలి. దొడ్డిచాలా పెద్దది. ఎన్నో మొక్కలూ చెట్లూ వున్నాయి. వాటి నీడలో తాను కనుపించడు. మరీ మంచిది. వంటగది కిటికీ వానకి తడిసి ఎండకి ఎండి కమ్ములు పట్టుతప్పి వున్నాయి. బలంగా తెలివిగా పనిచేస్తే

మూడు నాలుగు ఊచల్ని తీసెయ్యవచ్చును. ఇంక ఒకసారి వంటగదిలో ప్రవేశించాక పని చాలా సులభం. తాను అవతల గది తలుపు కొడతాడు మెల్లగా. ఆవిడ ఏ ఎలకో, పిల్లో అనుకుని తలుపు తీస్తుంది. అంతే. తాను కత్తి చూపించి భయపెడతాడు. మెళ్ళో వున్న నాలుగు పేటల గొలుసు ఒడుపుగా తాపీగా తీసుకుంటాడు. ఆమె తెప్పరిల్లేలోపల, కేకవేసేలోపల తోటలోకి చీకట్లోకి అదృశ్యుడై పోతాడు.

గోపాలం యిలాగ తన ప్లానంతా ఆలోచించుకుంటూ నిబ్బరంగా నడుస్తున్నాడు. రోడ్లు నిర్మానుష్యంగా వున్నాయి – అక్కడక్కడ ఒక రిద్దరు రాత్రించరుల్ని తప్పించి. ఊరికి దూరంగా ఉన్న కొత్తపేట యిది. ఊళ్ళోవున్న జనసంచారమూ, అలజడీ ఇక్కడ వుండవు. మొదట ఆట అయిపోగానే మొగలోవున్న కిళ్ళీకొట్లూ, చిన్న కాఫీ హోటలూ మూసే స్తాడు. చాలా ఇళ్ళు నిద్రలో మునిగిపోయాయి. కొన్ని ఇళ్ళలోంచి మాత్రం విద్యుద్దీపకాంతి కిటికీలలోంచి వస్తోంది. మొత్తమ్మీద వీధులూ, ఇళ్లూ ఆ మసక వెన్నెలలో ఒంటరిగా గోపాలంకోసం యెదురు చూస్తో న్నట్టు వున్నాయి.

గోపాలానికి తను చేసే పనిమీద నైతిక సందేహాలు ఏమీ లేవు. దొంగతనం తప్పనీ, పాపమనీ అతను అనుకోలేదు. ఎందరో తమ తమ అవసరాలకి ఎన్నో వృత్తులూ, ఉద్యోగాలు చేసినట్టుగా అతనూ యిది చేస్తూన్నాడే తప్ప మంచిచెడ్డల సూక్ష్మ విచారణచేసే పిరికితనం కాని, అసంబద్ధంవంటి ఆలోచనలకి అవసరంకాని అతనికి కనిపించలేదు. అందు వలన అతనికి అంతరాత్మని నొక్కివేయడమూ ఒప్పించడమూ లాంటి బాధలు కలుగలేదు. తనపనిలో దొరికిపోతే జైలుకి వెళ్ళాలన్న భయమూ జ్ఞానమూ వున్నాయి అతనికి. అందుకే జాగ్రత్తగా ప్లానువేసుకుంటాడు. ఎంతో అవసరమైతేకాని రత్తయ్యనీ, సోముల్నీ వెంట తీసుకుని వెళ్ళడు. వాళ్ళిప్పుడు తనకోసం ఆశగా ఎదురు చూస్తూంటారన్న ఆలోచన అతనికి మరింత ఉత్సాహం యిచ్చింది.

ఆ యిల్లు మసక వెన్నెల్లో ముడుచుకున్న తాబేలులా వుంది. ప్లాను ప్రకారం ఇంటివెనక్కి వెళ్ళి దొడ్లోకి ప్రవేశించాడు. అరటిచెట్లూ, కొబ్బరి చెట్లూ ఏవేవో మొక్కలూ, తుప్పలూ, అంతా గలీజుగా చీకటిగా ఉంది.

నెమ్మదిగా నడిచి వంటగది దగ్గరకు వచ్చాడు గోపాలం. కిటికీ పూచల్ని ఒకసారి లాగిచూశాడు. ఇంతలో అతనికి లోపల్నుంచి మాటలు వినిపించాయి. అతనికి ఆశ్చర్యం కలిగింది. అతని పథకం అప్పుడే దెబ్బతిన్నట్లనిపించింది. ఈసారి మాటలు కొంచెం గట్టిగా కోపంగా వినవచ్చాయి. గోపాలానికి కుతూహలం కలిగింది. బహుశా ఆ వచ్చిన వాళ్ళెవరైనా మళ్ళీ వెళ్ళిపోవచ్చును. తన మార్గం నిరాటంక మవవచ్చును అనికూడా అనిపించింది. ఒకవేళ ఎవరేనా ప్రియుడేమో- మొగుడు లేకుండా చూసి ప్రేమకలాపం జరుపుతోందేమో అని ఊహ తట్టింది. మాటలు తొందరగా గట్టిగా వినబడుతున్నాయి. ఆవిడ గొంతులో ఏదో భయం, బాధ వున్నాయి. అతని కుతూహలం హెచ్చింది. బలంగా పూచల్ని లాగి కదిపి ఊడదీశాడు. నేర్పుగా ఏర్పడినజాగాలోనుంచి వంటింట్లోకి ప్రవేశించాడు. పక్కగదిలోనుండి మాటలు వినబడుతున్నాయి.

"వద్దండీ- నా మాట వినండి" ఆవిడ గొంతు.

"ఇస్తావా- తగలనియ్యనా" మగగొంతు.

"ఎందుకు జూదమాడి తగలేస్తారు చెప్పండి. కాపరానికొచ్చిన నాటి నుండి సరదాలేదు, సుఖంలేదు. ఉన్న ఆస్తంతా తగలేశారు చాలదా?"

"వెధవ లెక్చరివ్వక మర్యాదగా తీసి ఇలా ఇయ్యి. లేకపోతే...."

"ఈ ఉన్న ఒక్క గొలుసూ ఇస్తే నాగతేంకాను. బాబు గతి ఏంకాను! చూడండి వాణ్ని- కన్న కొడుకుని. మీకు దయలేదా? జాలి లేదా! ఏమండీ- ఈవాళ్టికి ఊరుకోండి. పన్నెండు గంటలవుతోంది. ఒక్కర్తినీ బిక్కుబిక్కుమంటూ ఇంట్లో-రండి. పడుకోండి."

కర్కశంగా వినబడింది యీ సారి మగగొంతు - "ఇస్తావా- పీక పిసికి చంపెయ్య మన్నావా, వెధవ పీడ వదుల్తుంది."

"ఇవ్వను."

"ఇవ్వవా?"

"ఇవ్వనుగాక ఇవ్వను. ఇది మా పుట్టింటివారు పెట్టింది. ఇది నా ఆస్తి."

వింటూన్న గోపాలానికి ఆవిడ మాటలలో ఏదో న్యాయం గోచరించింది. ఆవిడ గొంతు తియ్యగా సన్నగా జాలిగా వుంది. గోపాలానికి ఆవిడ మొగుడిమీద కోపం వచ్చింది.

"నీ ఆస్తా-? ఏఁవిటే పేలావు ముండా - ఇన్నాళ్లూ తిన్నది నా డబ్బు కాదూ ! తే - ఆ గొలుసు తే."

"ఏఁవండీ. ఇలా అన్యాయంగా మాట్లాడతారేమండి.... నేను మాత్రం మీకోసం,మీ బాగుకోసం కాదూ చెపుతున్నది. ఈ గొలుసొక్కటే యింక మనకి ఆధారం. నాకు పసుపు కుంకుమకింద మా వాళ్ళు రాసిచ్చిన ఎకరమూ మీరు అమ్మేస్తే యేమైనా అన్నానా? మీరు తాగుతారు, జూద మాడతారు. మీకు మంచీ చెడ్డా; భార్యా కొడుకూ అన్న విచక్షణ పోయింది. ఈ నరకంలో మగ్గిపోతూ ఉండాల్సిందేనా, మీ కాళ్లు పట్టుకుంటాను. నా మాట వినండి."

ఛెళ్ళుమని చప్పుడు వినిపించింది గోపాలానికి. ఆవిడని మొగుడు కొడుతున్నాడు. గోపాలానికిజాలీ ఉద్రేకమూ కలిగాయి. దీనంగా మధురంగా గద్గదికంగా ఉన్న ఆమె గొంతు అతన్ని ఆకట్టింది.

"కొట్టండి, చంపండి. నా గొలుసుమాత్రం యివ్వను."

"ఇవ్వవూ, ఇవ్వవుటే పింజారి ముండా." పళ్ళీ గుద్దినట్టు చప్పుడు. ఆమె ఏడుస్తోంది నిస్సహాయంగా. దీనంగా.బాధగా, ఆమె ఆక్రోశించింది. ఇద్దరూ పెనగులాడుతూన్న ధ్వని వినపడింది గోపాలానికి.

"వొదలండి. నన్నొదలండి. అమ్మో."

గోపాలం పిడికిళ్ళు బిగించాడు. అతని కళ్ళలో ఎర్రజీర కదలింది.

"పీక పిసికి తీసుకెళతాను. గొలుసు ఇలా పడెయ్యి."

"ఎందుకివ్వాలి మీకు. జూదంలో తగలెయ్యడానికా?" ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూనే మాట్లాడుతోంది. "పిల్లవాడికి దగ్గుమందైనా తీసుకు రాలేదు. ఒక్క మంచి చీర లేదు. కట్టుకున్న పెళ్ళాం చచ్చిందో బతికిందో చూడరు. ఇంక వీధులమ్మట ముష్టెత్తుకుని బతకాలి నేను."

"ఈ వేలెడు వెధవకోసం నా కివ్వనన్నమాట. ఆగు వీడిని చంపేస్తాను. వీడి పీక నులిమేస్తాను."

"అయ్యో అయ్యో వాణ్ణి ఏం చెయ్యకండి. అయ్యో అయ్యో" ఆవిడ పెద్దపెట్టున కేకలు. పిల్లవాడు కెవ్వుమని ఏడుపు.

గోపాలం ఇంక ఆగలేకపోయాడు. కుర్రవాణ్ణి పీక నులిమి చంపి నున్న దృశ్యం అతని కళ్ళముందు కదలింది. బలమంతా ఉపయోగించి తలుపు తన్నాడు. రాలేదు. తిరిగి దడదడా తన్నాడు. తలుపులు విచ్చు కున్నాయి. ఆమె కుర్రవాణ్ణి ఎత్తుకొని గోడమూలగా నక్కి వుంది. వణికి పోతూ వుంది.

"బాబు నేమీ చెయ్యకండి. వొదలండి. ఇదిగో గొలుసు" అంటూ మీదకి రాక్షసుడిలా వొంగిన అతనికి గొలుసు ఇస్తోంది. మొగుడు తీసుకుని వెనక్కి తిరిగాడు. ఎదురుగా గోపాలం.

"ఎవడవురా నువ్వు?" అన్నాడు మొగుడు.

గోపాలం బలంగా అతని దవడమీద ఒకటివేశాడు. మొగుడు తూలి పడబోయాడు. గోపాలం యీసారి మెడకురికి అతని తలవంచి బలంగా గుద్దాడు. అతను కిందపడ్డాడు.

"ఆడకూతుర్ని కొడతావా? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా? దొంగముదవా, సిగ్గులేదురా నీకు, బుద్ధిలేదురా, ఏది ఆ గొలుసు ఇలా యియ్యి. లేపకు, లేచావంటే సంపేస్తాను."

గోపాలం అతని చేతిలోంచి గొలుసు లాక్కున్నాడు. అతను కింద పడి వగరుస్తున్నాడు. రొప్పుతున్నాడు. ఆమె యీ హఠాత్పరిణామం అర్థంకాక నిశ్చేష్టురాలై గోడకి బల్లిలా అంటుకుని కళ్ళప్పగించి చూస్తోంది.

"తాగుడూ జూదమూనట్రా నీకు. సదువుకున్నోడివి. ఉద్యోగం చేసి పెళ్ళాం పిల్లల్ని పోషించాల్సింది. పైగా పెళ్ళాం నగలే ఎత్తుకు పోతావట్రా దొంగనాయాల...."

నేలను కరచుకున్న మొగుడు అస్పష్టంగా బూతులు తిడుతున్నాడు. గోపాలం డొక్కలో ఒకటి తన్ని "నోర్మూయ్యి" అన్నాడు. ఆమె "వద్దు వద్దు కొట్టకు" అని అరచింది.

గోపాలం చేతిలో గొలుసుతో గోడవారనున్న ఆమెను సమీపించాడు. ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగా వుంది. జుట్టంతా రేగిపోయి వుంది. చెక్కిళ్లు కన్నీళ్ళతో తడిసిపోయి వున్నాయి. పాతికేళ్ళయినా

వుండవు. ఆమె కళ్ళలో భయాశ్చర్యాలు పెనవేసుకున్నాయి. చంకలో పిల్లవాడు ఏడుస్తున్నాడు.

"ఇదిగోనమ్మా గొలుసు" అంటూ ఆమె చేతికి గొలుసు ఇచ్చాడు. కింద దొర్లుతూన్న మొగుడు లేవబోయాడు. గోపాలం మొలనుండి కత్తి తీశాడు.

"ఇదేవిటో చూశావా! లేవడానికి ప్రయత్నించావా పొడిచేస్తాను కబడ్దార్. దెబ్బకి యెగిరిపోతావు "

మొగుడు దండం పెట్టాడు.

"నువ్వు మళ్ళీ ఎప్పుడేనా గొలుసు తీసుకున్నట్టు కాని, ఆవిడ వొంటిమీద దెబ్బపడినట్టుగాని తెలిసిందా నీ ప్రాణం తీసేస్తాను" గోపాలం కత్తిని అతని ముఖానికి దగ్గరగా పెట్టి ఝళిపించాడు.

మొగుడు తలవూపాడు ఇంకెప్పుడూ చెయ్యనన్నట్టుగా.

గోపాలం ఆమె వైపు తిరిగాడు, "ఏం భయంలేదు. ధైర్యంగా వుండమ్మా" అన్నాడు.

ఆమె భయంతో కృతజ్ఞతతో తల వూపింది.

గోపాలం కత్తి మొలలో పెట్టుకుని వెళ్ళిపోబోయాడు. ఆమె హీన స్వరంతో అడిగింది. "ఎవ్వరు బాబూ నువ్వు...."

"నేనా.... నేనా" తెల్లబోయాడు గోపాలం. "నన్ను గోపాలం అంటారు రెండి. అంతే" అంటూ గోపాలం తలెత్తకుండా వడివడిగా పెరట్లోకి చీకట్లోకి వెళ్ళిపోయాడు.

*(జ్యోతి, మార్చి 1964 - ఉగాది సంచిక)*

# నల్లజర్ల రోడ్డు

నల్లజర్ల అడవి మీద చంద్రుడు భయంకరంగా ఉదయించాడు. అవధానిగారు యిలాగ అనేటప్పటికి మేమందరం పక్కన నవ్వాం. కొవ్వొత్తి దీపపు వెలుతురులో ఆయన గడ్డంలోని తెల్ల వెంట్రుకలు వెండి దారాల్లా మెరిశాయి.

"చంద్రుడూ వెన్నెలా ఎప్పుడూ మనోల్లాసంగా హాయిగా ఉంటాయని మీ అభిప్రాయం. కాని ఒక్కొక్క పరిస్థితిలో ఎంత భయపెడతాయో మీకు తెలియదు" అన్నారు మళ్ళీ.

"చెప్పండి. మీరేదో కథ చెబుతారని తెలుస్తూనే వుంది. వినటానికి సిద్ధంగా ఉన్నాం" అన్నాను నేను.

"ఈ రాత్రికింక లైట్లురావు. ఎక్కడో తీగ తెగిపోయి వుంటుంది." అన్నాడు నారాయణ.

"తోట అంతా చీకటైపోయింది" అన్నాడు నెర్వస్‌గా ఆచారి. అస్థిమితంగా చేతివేళ్ళతో బల్లమీద ఆదితాళం వేస్తున్నాడు. "ఇంకా కొవ్వొత్తులున్నాయాండీ!" అని అడిగాడు.

అవధానిగారు తల వూపారు- ఉన్నాయన్నట్టు.

"ఈ తోటా, తోటలో మీ బంగళా, మీరు చేసిన విందూ- ఓహ్! మరచిపోలేం" అన్నాడు నారాయణ.

"వూరికి యింతదూరంగా యీ తోట వుండడమే అంత బాగాలేదు" అన్నాడాచారి.

"చెప్పండి కథ" అన్నాను నేను.

"కథా ?" నిరసనగా చూశారు అవధానిగారు.

"అదే ! అదే! మీ చిన్నప్పుడు జరిగిన సంఘటన...." అని సర్దు కున్నాను. అవధానిగారు కవీకాదు; కథకుడూకాదు. జీవితాన్ని నిండుగా సూటిగా జీవించిన మనిషి. హృదయమూ, చమత్కారమూ, ఆలోచనా ఉన్నవాడు. వీటికి తోడు విచిత్రంగా విరుద్ధంగా బాగా డబ్బున్నవాడు.

ఆయన చెప్పడం మొదలు పెట్టారు.

"ఏలూరులో చూసుకోవాల్సిన పని అంతా అయిపోయింది. ప్లీడరు గారు పక్కలు ఏర్పాటు చేయిస్తానన్నా వినక, కారు స్టార్టు చేశాడు రామ చంద్రం. పది గంటలు దాటింది రాత్రి. నాగభూషణం మామయ్యా, నేనూ వెనకాల సీటులో కూర్చున్నాం. ప్లీడరుగారు కారు దగ్గరకివచ్చి "నా మాట విన్నారు కాదు" అన్నారు. "అద్బే ఎంత సేపండీ, సరీగ్గా తొక్కితే ఒక్క గంటన్నరలో తణుకులో పడతాం. మీరేం యిదవకండి" అన్నాడు రామ చంద్రం.

"కలక్టరుగారి యింట్లో పెళ్ళి సరీగా ఉదయం ఏడు గంటలకి. నా మీదా, రామచంద్రం మీద భరోసా వేసుకుని కూర్చున్నారు కలక్టరుగారు" అన్నాడు నాగభూషణం మామయ్య.

"అమ్మమ్మ ! ఎంత మాట ! కలక్టరుగారింట్లో శుభకార్యమంటే వేరే చెప్పాలా !" అన్నారు ప్లీడరుగారు యీవిషయాన్ని గ్రహించిన వారై.

కారు సాగింది. "అప్పటికి నాకు పద్దెనిమిదేళ్ళు. అప్పటికి మీ రెవరూ పుట్టివుండరు" అన్నారు అవధానిగారు మా అందరికేసి చూసి.

"అటువంటి ప్రమాదం సంభవించే సూచనలు కూడా వాతావర ణంలో ఉండి ఉండవండి" అన్నాడు నారాయణ.

తోటలో గలగల చప్పుడయింది. ఆచారి ఉలిక్కిపడి "దొంగలేమో" అన్నాడు.

"పక్షులు చెట్లలో కదులుతున్నాయి. అంతే" అన్నారు అవధాని గారు.

"కథలోకి రండి" అన్నాను నేను.

"అంటే....?" కోపంగా చూశారు అవధానిగారు.

"అదేనండీ, మీ చిన్నప్పటి...."

అవధానిగారు చిన్నగా నవ్వి గడ్డం చేత్తో ఒక్కసారి సవరించు కున్నారు. కొంచెం ముందుకు వంగి యిలా చెప్పసాగారు.

ఆరుమైళ్ళు వచ్చేటప్పటికి కారు ఆగిపోయింది. రామచంద్రం దిగి బానెట్ చూశాడు.

"వెధవ కారులా వుంది. నడచి వెనక్కిపోదాం పద. ఎందుకేనా మంచిది" అన్నాడు నాగభూషణం మామయ్య.

"అరునుడు గాండీవాన్ని తిట్టినా సహిస్తాడేమోగాని యీ కారుని తిడితే మాత్రం నే నూరుకోను. అసలే యింజనులాంటిది ఇండియాలో వుండదు" అన్నాడు రామచంద్రం.

"అందుకే ఆరుమైళ్ళకే ఆగిపోయింది" మామయ్య విసుగ్గా అన్నాడు. "కొత్త కార్లు కొనమరా అంటే విన్నావ్? సెకండ్‌హాండ్‌వి కొనవల్సిన ఖర్మ నీకే మొచ్చింది? మనమాట ఎలాగున్నా వీణ్ణికూడా మనతో తీసుకువచ్చాం. వీడు కర్మ! ఎనిమిది గంటలకి పడుకోకపోతే మా అక్కయ్య ఎనిమిదిమంది డాక్టర్లని ఒకేసారి పిలిచి చూపెడుతుంది" అన్నాడు నన్నుద్దేశించి.

"ఏం భయంలేదు మామయ్యా. రాత్రిళ్ళు కార్లలో ప్రయాణం చెయ్యడం నాకు సరదా" అన్నాను నేను.

రామచంద్రం మావూళ్ళో పెద్ద టెన్నిస్ ఛాంపియన్. పొడుగ్గా, బలంగా, హుషారుగా వుంటాడు. మావూరి క్లబ్బుకి సహాయ కార్యదర్శి, సేవాసదనానికి గౌరవాధ్యక్షుడు. ఆ సదనం ఏమిటో, యేం చేసేదో యిప్ప టికీ నాకు తెలియదు. ఇటువంటి సంస్థల ప్రత్యేకత ఇదే కాబోలు. రామ చంద్రానికి కాలవవొడ్డున పెద్ద మేడ వుంది. మేడలో అతనికొక భార్యా కుమారరత్నమూ కూడా వున్నారు. అతను భార్యనెక్కువ ప్రేమిస్తాడో భార్య పేర ఆమె తండ్రి వ్రాసి యిచ్చిన ముప్పైనాలుగెకరాల్ని ఎక్కువ ప్రేమిస్తాడో తెలియక, తేలక జిజ్ఞాసువులు చాలా మంది బాధపడేవారు పాపం. మా నాగభూషణం మామయ్యకి వరుసకి బావ అవుతాడో బావ మరది అవుతాడో-యిటువంటి భోగట్టా నాకు సరిగా తెలియదు. మా ఆవి

డికి తప్ప - అసలు నాగభూషణం నాకు వేలువిడిచిన మేనమామ ; అందరమూ ఒకే ఊళ్ళో వుండడమూ, రాక పోకలూ, శుభకార్యాలూ, మంచి చెడ్డల్లో ఒకరినొకరు ఆదుకోవడమూ - ఇలాంటి వాటివలన ఈ కుటుంబాలన్నిటికీ చనువూ, గాఢస్నేహమూ ఏర్పడ్డాయి. నాగభూషణం కూడా ఊళ్ళో చెప్పుకోదగినవాడు. ఎం. ఏ. చదివాడు. పెద్ద కలప వ్యాపారం నడుపుతున్నాడు. ప్రతీ ఏడాదీ భగవద్గీతమీదా, ఉపనిషత్తులమీదా పెద్దవాళ్ళని పిలిపించి ఉపన్యాసాలు యిప్పిస్తూంటాడు. కట్టడం ఎప్పుడూ ఖద్దరే గాని జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఏ పార్టీ అయితే ఆ పార్టీనే బలపరుస్తాడు. దివ్యజ్ఞాన సమాజానికి ఉపాధ్యక్షుడు. ఊళ్ళోకి కలక్టరు వచ్చినా, మంత్రి వచ్చినా ఇతని యింట్లోనే మకాం.

"కారు బాగుపడిందాండీ?" అన్నాడు నారాయణ మధ్యలో అడ్డు వచ్చి.

ఆ రామచంద్రం కారు చుట్టూ రెండు సార్లు ప్రదక్షిణం చేశాడు. కొంతసేపు గొణుక్కున్నాడు. కారు కిందా మీదా ఏవో పరీక్ష చేశాడు, చివరికి "ఆల్‌రైట్" అంటూ కారులో కూర్చున్నాడు. కారు సాగింది. ఎర్రని పొడుగాటి రోడ్డుమీద కారు వెళుతూంటే చల్లని గాలి మొహానికి కొడుతోంది. ఇటూ అటూ పంటచేలు. కారు లైట్ల కాంతిలో నెంబర్లువేసిన మైలురాళ్ళు ఒకటొక్కటే జరిగిపోతున్నాయి. నల్లని ఆకాశం మీద జ్వాలా పుష్పాలలాగ నక్షత్రాలు మెరుస్తున్నాయి మండుతున్నాయి. చీకటిలో ప్రకృతి గాంభీర్యం వహిస్తుంది. దేవుడులాంటి అనిర్వచనీయమైన శక్తి సన్నిహితంగా వున్నట్టు వుంటుంది. మామయ్య నన్ను బి. ఏ. ఎక్కడ చదువుతావని అడుగుతున్నాడు. మద్రాసులో అని చెప్పాను. లజ్ కార్నర్ కి దగ్గర్లో అతనికో ఫియాసఫిస్టు మిత్రుడున్నాట్ట. అతని దగ్గరవుండి చదువుకోమనీ, హాస్టల్సులో వుంటే పాడైపోతావనీ చెపుతున్నాడు. రామచంద్రం మధ్య మధ్య రాజమండ్రీ శంకరం టెన్నిస్ ఆటలో వుండే లోపాన్ని గురించి చెపుతున్నాడు.

"మిక్సెడ్ డబుల్స్ ఆడుతుందిట. ఆవిడెవరూ?" మామయ్య అడిగాడు.

"మిస్ శర్మిష్ట"

"బాగుంటుందా?"

"ఆవిడా, ఆవిడ ఆటా?"

"రెండూనూ" అంటూ మామయ్య నవ్వాడు.

"దోబిచెర్ల వస్తున్నాం" అన్నాడు రామచంద్రం.

అక్కడక్కడ రెండు మూడు పాకలూ, గుడిసెలూ, చీకట్లో ముడుచుకుపోయి వున్నాయి. ఒక బండిదగ్గర ఇద్దరు మనుష్యులు తలలకు పాగాలు చుట్టుకుని జమిలిదుప్పట్లు కప్పుకొని చుట్టలు కాల్చుకొంటూ కూర్చున్నారు. ఊరు ఎక్కడో లోపలకు వుంది. ఇప్పటిలాగా అప్పటికి యింకా పల్లెటూళ్ళలోకి నాగరికత ప్రవేశించలేదు. ఈ పాతికేళ్ళలో ఎంత అద్భుతమైన మార్పు వచ్చిందో మీకు తెలియదు. మీకు ఆ రోజులు తెలియవు. విద్యుచ్ఛక్తి అంటే గ్రామీణులకు ఏమిటో తెలియదు. ఏలూరు నుంచి తణుకు వెళ్ళే రోడ్డుని గ్రాండ్ ట్రంక్ రోడ్డు అంటారు. రాత్రి ఎనిమిది దాటాక యీ రోడ్డు సంరక్షితం కాదు. నిర్జనంగా, చీకట్లో నిశ్శబ్దంగా నిద్ర పోతూండేది. ఇప్పుడు చూడండి నిముష నిముషానికి ఒక లారీ వస్తూ, వెళుతూ వుంటుంది. ప్రతీ గ్రామంనుండీ కూరలూ, పసుపూ, మిర్చి మొదలైనవి ఎగుమతి అవుతున్నాయి. ఈ దోబిచెర్లలో యిప్పుడొక డేరా సినిమాకూడా వుంది. గ్రామీణులీనాడుచుట్టలకన్న సిగరెట్లు ఎక్కువకాలుస్తున్నారు. మొన్న కార్లో వస్తూ చూశాను. వెంకట్రామన్నగూడెంలో బాడ్మింటన్ పోటీలు జరుగుతూన్నట్టు పెద్ద బోర్డు వ్రాసివుంది. పొడుగునా కాగితపు జెండాలు కట్టిపేశారు. అక్కడ రెండు న్యూ మోడల్ కార్లు కూడా వున్నాయి.

పాతికేళ్ళ క్రితం ఉన్న స్థితికీ యిప్పటికీ ఉన్న వ్యత్యాసం చాలా తీవ్రమైనది. సాధారణంగా రెండు దశాబ్దాలలో యింత మార్పు ఎక్కడా చరిత్రలో జరగదు. కాని ఒక్కుమ్మడిగా భూస్వామ్య వ్యవస్థ మీదపు పారిశ్రామిక విప్లవమూ, సైన్సు పరిణామ ప్రయోజనమూ దాడి చేసేటప్పటికి పాతది విచ్ఛిన్నం చేస్తూ నవీనలోకం కఠినంగా స్థిరపడుతోంది. ఈ తీవ్రవేగానికి తట్టుకోలేక మనుష్యులూ, సమాజమూ తమ చుట్టూ గోడలని కట్టుకుని లోపల దాక్కుంటారు. దేశానికేదో కీడు మూడిందని గోల పెడతారు....

"మీరు కథని ఆపుచేశారు" అని జ్ఞాపకం చేశాడు నారాయణ అవధానిగారి ఉపన్యాస ధోరణికి కొంచెం భయపడి.

"అవును. కథ ఆగిపోయింది. ఎందుకంటే కారుకూడా సడెన్‌గా అక్కడ ఆగిపోయింది" అన్నాడు అవధానిగారు చిన్నగా నవ్వుతూ.

"కొవ్వొత్తి అయిపోతోందండోయ్" అన్నాడు ఆచారి. వాడి చూపు దానిమీదే వుంది మొదటినుంచీ.

అవధానిగారు సొరుగులోంచి ఒక కొవ్వొత్తి తీసి వెలిగించారు. "ఇంక ఒక్క కొవ్వొత్తి మాత్రం వుంది- యిది కాక" అన్నారు.

"చచ్చాం!" అన్నాడాచారి.

"ఎందుకురా అంత భయం" – ప్రశ్నించాడు నారాయణ.

"నాకు చీకటంటే పడదు" అన్నాడాచారి దిగులుగా తోటలో పేరుకుని ముద్దకట్టిన చీకటిని చూచి.

ఇంతలో ఏదో వికృతంగా సన్నగా కూత వినపడింది. ఆచారి భయంతో చటుక్కున లేచి "ఏమిటది అవధానులుగారు?" అని అడిగాడు.

"నక్కలు."

"మీ తోటలో కూడా నక్కలు కూడా ఉన్నాయాండీ?"

"తోటలో కాదు. శ్మశానంలో వుంటాయి."

"శ్మశానమా?" ఆచారి గొంతు తడబడింది. వణకింది.

"అవును. తోటకి అవతల కాస్త దూరంలో వుంది"- అవధానిగారు తాపీగా, జాగ్రఫీ మేష్టారు తూర్పున బంగాళాఖాతమూ దక్షిణమున హిందూ మహాసముద్రమూ ఉన్నవి అని చెపుతూన్నంత నిర్లిప్తతతో అన్నారు.

"నోరుమ్మయ్యి ఆచారీ. ఇంత వయసొచ్చి కూడా, యింతమంది ఉండగా ఈ భయం ఏమిటీ-నవ్వుతారెవరైనావింటే...." అన్నాడు నారాయణ కోపంగా.

"నాకు దెయ్యాలంటే తెగ భయం....అయితే....హిహిహిహి" - నెర్వస్‌గా నవ్వాడు ఆచారి. ఈసారి బల్లమీద ఆదితాళం తొందరగా వేస్తున్నాడు. నక్కల కూతలు అప్పుడప్పుడు ఘోరంగా వినపడుతూనే వున్నాయి.

"చెప్పండి" అన్నాను నేను అవధానిగారితో.

రామచంద్రం విసుగ్గా కార్లోంచి దిగాడు. "మొదటినుండీ నువ్వు అపశకునం మాటలే మాట్లాడుతున్నావు. అందుకే అభిమానవతి అయిన నా ఫోర్డు మారాం చేస్తోంది." అన్నాడు నాగభూషణంతో. బానెట్‌తీసి పరీక్షించాడు. "సరిగ్గా కనపడడంలేదు యీ గుడ్డి వెన్నెలలో" అన్నాడు. అంతవరకూ వెన్నెల ఉన్నట్టు మాకు అనిపించలేదు. ఆకాశంమీదికి చూశాను. జేగురురంగుగాఉన్న చంద్రుడుమీద పల్చని మబ్బులు తారాడుతున్నాయి. రామచంద్రం చుట్టలు కాల్చుకుంటూ కూర్చున్న ఆసాములను పిలిచాడు. "కొంచెం అగ్గిపుల్ల గీస్తారా ! కారు ఆగిపోయింది" అని అడిగాడు. వాళ్ళు కుతూహలంగా ఒక్కొక్కళ్ళే. అగ్గిపుల్ల గీస్తోంటే ఆ వెలుగులో ఏదో మరమ్మతు చేశాడు రామచంద్రం. "థాంక్స్" అంటూ కారు ఎక్కి కూర్చున్నాడు స్టీరింగ్ దగ్గర.

"ఏవూ రెడుతున్నారు బాబూ" అన్నాడొక ఆసామీ.

"తణుకు" అన్నాడు నాగభూషణం.

"శానాదూరం. జాగ్రత్త బాబూ. అడవిలో ఏదో చిరుతపులి కనపడిందని చెప్పుకుంటున్నారు"

"అలాగే, అలాగే" అని కారు స్టార్టు చేశాడు రామచంద్రం. కారు సాగింది. నాకు ఏదో భయంగా వుంది.

"అడవి అంటే ఏ అడవి మామయ్యా ?" అని అడిగాను.

"అదేరా నల్లజర్ల అడవి. ఉదయం వస్తూంటే నీకు చూపించలేదూ !" అన్నాడు మామయ్య.

అపును, గూడెం దాటాక మెళ్ళకొద్దీ రోడ్డుకి రెండువైపులా అడవి పరచుకునివుంది. వందల కొలదీ కొండ ముచ్చులు రోడ్డుకడ్డంగా సభలు తీర్చి మా కారు సమీపించగానే కిచకిచలు చేస్తూ పరుగెత్తేవి. పగటివేళ సూర్యరశ్మిలో ఆ ఆకుపచ్చని అరణ్యం ఎంతో మనోహరంగా వుంది. నోరులేని, తెలివిలేని వృక్షకోటి మౌన సౌహార్దంతో హాయిగా గుబురుగా స్వేచ్ఛ ఉన్నట్టున్నది.

"అయితే చిరుతపులి ఉందంటావా మామయ్యా" అన్నాను నేను.

"ఆ ! చిరుతపులీలేదు గిరిలేదు. ఈ పల్లెటూరివాళ్ళు వూరికే ఇలాగ పుకార్లు వేస్తుంటారు. అబ్బాయ్ ! ఇది ఇంగ్లీషువాడి రాజ్యం రా. వాడి

తుపాకీసుంచు సింహాలూ, పులులూ నిలుస్తాయట్రా...." అంటూ రామ చంద్రం ఏదో చెపుతున్నాడు. కాని కారు యింజనులోంచి ఏదో పెద్ద స్వరం బయలుదేరి గొంతును వినపడనుండా చేసింది.

"ఇదేం జబ్బురా వెధవ కారుకి. మళ్ళీ ఆగిపోతుందేమో !" అన్నాడు నాగభూషణం భయంగా.

"ఇది మీ కాలంలోలాగే రెండెడ్ల బండికాదురా భూషణం. ఫోర్డు యింజను ఇలాగ చప్పుడైతే ఇంజన్ మాంచి బలంతో వుందన్నమాట" అంటూ రామచంద్రం ఏక్సిలరేటర్‌మీద కాలు నొక్కాడు. కారు రయ్యి మని చీకట్లో దూసుకుపోతోంది. నాకు ఏదో సరదాగా థ్రిల్లింగ్‌గా వుంది; ఆ చిరుతపులి గొడవ మాత్రం మధ్యమధ్య భయపెడుతోంది తప్ప.

"చూశావా ఒక్క పిట్టకూడా మైళ్ళకొద్దీ వెళ్ళినా కనపడదు. ఈ చెట్ల చాటున దొంగలు గుంపులుగా దాకుని పల్లెటూరి ప్రయాణీకుల్ని దోచుకునే వారు యిదివరలో...." అన్నాడు మావయ్య.

గత చరిత్ర నా కళ్ళముందు లీలగా ఆడింది. ఇలాగ రోడ్లూ అవీ ఉండేవి కావు. అక్కడక్కడా ఓ పల్లెటూరు వుండేది. ఏ కాకతీయులో, చాళుక్యులో పరిపాలిస్తూ ఉండేవారు. అప్పుడు దేశంలో వీరులూ, వీర వని తలూ, బందిపోటు దొంగలూ, మట్టి రోడ్లూ, పులులూ, ఎలుగుబంట్లూ, స్థిర మైన నమ్మకాలూ, సంప్రదాయాలూ అన్నీ ఉండేవి. ఇప్పుడు రోడ్లూ, టెలిగ్రాఫ్ తీగలూ, పోలీసులూ అన్నీ వచ్చి దొంగల్నీ, క్రూరమృగాల్నీ నాశనం చేశాయి. వాటితోపాటు వీరవరులూ, స్వధర్మ-నిరతులూ కూడా మాయమైపోయారు.

"అడవి వచ్చేసింది. ఇది దాటితే యింక పదిహేను మైళ్ళు తణుకు" అన్నాడు, రామచంద్రం.

నాగభూషణం జవాబివ్వలేదు. వెనక్కి జేర్లబడి నిద్దరోతున్నాడు.

"నువ్వు నిద్రపోతున్నావా ఏవిటిరా ?" అన్నాడు రామచంద్రం నన్ను ఉద్దేశించి.

"లేదు" అన్నాను నేను దట్టంగా అలుముకుపోయిన అడవిని చూస్తూ. అడవి మధ్యనుండి రోడ్డు ఒక రాక్షస సీమంతంలాగా వుంది. అడవిలో అంతా కటిక చీకటిగా ఉన్నట్టుంది.

ఇంజన్‌లో ఏదో ఠప్‌మని పేలినట్టయింది. నాగభూషణం ఉలిక్కిపడ్డాడు. కారు ఒక గంతువేసి ఆగిపోయింది.

"ఏమయింది!" అన్నాడు నాగభూషణం.

రామచంద్రం మాట్లాడకుండా దిగి యింజన్‌ని పరీక్ష చేశాడు. "సరీగా కనపడటంలేదు." అంటూనే పరీక్ష చేస్తున్నాడు. కీచురాళ్ళ కూతలు ఉచ్చస్వరంతో వినపడుతున్నాయి. నాగభూషణం కూడా దిగాడు. కంగారుగా అన్నాడు. "ఏం బాగుపడుతుందా?" అని అడిగాడు. రామచంద్రం మాట్లాడకుండా వెనకసీటు కిందనుంచి కొంత సామాగ్రి తీసుకుని పనిలో పడ్డాడు.

"చిరుతపులి యీ అడవిలోనేనా వుందీ?" అన్నాను నేను.

మామయ్య ఉలిక్కిపడి "ఎక్కడ?" అని ఒక గంతు వేశాడు. "వెధవాయ్ సడెన్‌గా అలా అన్నావేమిటిరా? అన్నాడు కోపంగా. రామచంద్రం పనిముట్లు టిక్‌టిక్‌మని చప్పుడు చేస్తున్నాడు. శ్రమవలన అతని బరువైన వూపిరి చప్పుడు కూడా వినపడుతోంది. మధ్యమధ్య ఎండుటాకులలో గలగలమని చప్పుడు. పక్షి కూతలు....కిచకిచలు.... ఇన్నిటినీ మించిన భయంకరమైన నిశ్శబ్దం.

"తెల్లవారితే కలక్టరు గారింట్లో పెళ్ళి...." స్వగతం చెప్పుకున్నాడు మామయ్య.

"నువ్వేం చదివిస్తున్నావ్" అన్నాడు రామచంద్రం.

"మనం వెళ్ళలేకపోతే ఎంత అభాసు అవుతుంది!" అన్నాడు భూషణం.

"చిరుతపులి మనుషుల్ని తింటుందా మామయ్యా" చిన్నవాడినైన నాకు ఒక పక్క భయం, మరోపక్క కుతూహలం.

"ప్లీడరుగారు పక్కలు వేయిస్తానన్నారు. వినలేదు ఖర్మం" మళ్ళీ భూషణం మామయ్య స్వగతం. ఏదో చెప్పలేని భయం అందరిలో.

వెన్నెల మరి కాస్త వచ్చింది. ఆకాశంమీద చంద్రుడు ఎర్రగా వున్నాడు. అసహ్యంగా మానని పెద్ద వ్రణంలా ఉన్నాడు, నోరు, చెక్కిళ్లు పెరికి వేసిన శిరస్సులా ఉన్నాడు. వలయంలోంచి కొంత భాగం వూడిపోయి ఉన్నాడు. నాకు చంద్రుణ్ణి చూడగానే మొదటిసారిగా భయం

వేసింది. అనంతమైన శూన్యంలో నీరసంగా, నిగూఢంగా ఉన్న అడవి మీద చంద్రుడు ఏదో విపత్తుకు సూచనలాగా దుశ్శకునంలాగా అనిపించాడు. వెలవెలబోతూన్న వెన్నెల కూడా కాష్ఠభస్మంలాగా భయపెడుతోంది.

అరగంట జరిగింది. రామచంద్రం పట్టుదలగా, యింజన్‌తో తిప్పలు పడుతున్నాడు. "కారు బాగుపడదు, ఈ రాత్రి అంతా యిక్కడ బిక్కు-బిక్కు-మంటూ ఉండాల్సిందే" అన్నాడు నాగభూషణం.

కాస్సేపాగి మళ్ళీ అన్నాడు. "వద్దురా యీ కార్లో ప్రయాణం అంటే విన్నావు కాదు. మా ప్రాణాలు తియ్యడానికి వచ్చింది ఖర్మం."

రామచంద్రం సహనం కోల్పోయి "అబ్బ చంపకు. వెధవ గోలా నువ్వూ. బాగుపడకపోతే నువ్వు కార్లో ఎక్కి స్టీరింగ్ దగ్గర కూర్చో. నేను తాడేపల్లిగూడెం వచ్చేవరకూ తోస్తాను. నీ ప్రాణానికి నా హామీ, సరేనా ...." అని అరిచాడు.

మనుష్యుల గొంతులకి రోడ్డు వారనున్న చెట్లలో కలకలం రేగింది. ఒక్క క్షణం సద్దు అణగింది. రామచంద్రం లేచి రేగిన జుట్టుని వెనక్కి తోసుకుని "ఆఖరి ప్రయత్నం చేస్తాను. ఒక లావుపాటి కర్ర ఉంటే చూడాలి కారుని పైకి ఎత్తి పట్టుకోవాలి." అంటూ రోడ్డు వారకుపోయి కర్రలకోసం వెదుకుతున్నాడు. నేను భయంతో ఆకాశం కేసి చూశాను. తెలుపూ నలుపూ కలిపిన చిరుమబ్బులు చంద్రుణ్ని కప్పివేస్తున్నాయి. చలిగాలి వీస్తోంది. నాగభూషణం దిగులుగా కారు పక్కనే నుంచున్నాడు. రామచంద్రం కర్రకోసం వెదకుతూ పదిగజాల దూరం ముందుకు నడిచాడు.

రోడ్డు వారనే చింతచెట్లూ, రావిచెట్లూ ఉన్నాయి. ఎప్పటివో ముసలి చెట్లు శాఖోపశాఖలుగా అంతటా ఆక్రమించి వేశాయి. ఒక పెద్ద మర్రి చెట్టు ఊడలతో చీకట్లో అసహ్యంగా, భయంకరంగా ఉంది. ఊడలు చీకటి పేగులలాగా వేలాడుతున్నాయి. చెట్టు చెట్టుకీ మధ్య యీత ముళ్ళపొదలు, బ్రహ్మజెముడు పొంకలు, రకరకాల తీగలూ అల్లిబిల్లిగా చుట్టుకున్నాయి. ఒక గుడ్లగూబ అరుస్తూ, ఒక చెట్టుమీద నుండి యింకో చెట్టుమీదికి ఎగిరింది. ఆ చప్పుడికి ఉడతలు కాకోలు కిచకిచమంటూ పరుగులెత్తాయి. మనుష్యులకి నివాసంకాని యీ కీకారణ్యం జంతువులకి సహజమైన ఆయి

సంగా ఉంది. ప్రకృతి శాసనం తప్ప వాటికి వేరే జీవన విధానమూ, నియమమూ, నీతి లేవు. ప్రతీ ప్రాణీ యిక్కడ తనని తాను రక్షించుకుంటూ తనకన్న అల్పమైనదానిని భక్షిస్తూ బతుకుతూంటుంది. ఈ అడవి యిలాగ యెన్ని మైళ్ళ లోపలికి చొచ్చుకుపోయిందో! లోపల చిరుత పులులేకాదు, పెద్దపులులూ, సింహాలూ ఉన్నా మాత్రం ఏం తెలుస్తుంది? అమాంతం మనిషి మీదపడి నోట కరుచుకుపోయి ఏ పొదలోనో దాగి ఒక్కొక్క అవయవాన్నే సావకాశంగా చీల్చి రుచిగా భక్షిస్తాయి కాబోలు. ఈ అడవి మీద వెన్నెల అనవసరంగా, అసందర్భంగా ఉంది. అందుకే అడవి కాచిన వెన్నెల అంటారు. అదేకాదు, వెన్నెల సహజమైన సౌకుమార్యాన్నీ హ్లాదత్వాన్నీ కోల్పోయి దుర్మార్గంగా, దుస్సహంగా కూడా ఉంది. గుబురుగా ఉన్న ఆకుల మధ్యనుండి కొంచెం కొంచెం వెన్నెల నేలమీదకు జారి వందల కొలదీ కట్లపాములూ, కొండ పాములూ పాకుతూన్నట్టుగా ఉంది.

"మరీ లోపలకు వెళ్ళకు, జాగ్రత్తరోయ్." అంటూ భూషణం కేక వేశాడు,

"కారు బాగుపడకపోతే రాత్రి అంతా ఇక్కడ ఉండిపోవడమే!" అన్నాను నేను. నాకు భయంగా ఉంది. గొంతుక యెండిపోతూన్నట్టు ఉంది.

"మంచినీళ్ళు కావాలి" అన్నాను.

"మంచినీళ్లు! ఎక్కడ దొరుకుతాయి. ఇదేం మీ యిల్లనుకున్నావా" విసుక్కున్నాడు నాగభూషణం.

నిస్సహాయతవలన నాగభూషణానికి అసహనం ఎక్కువైపోతోంది. నాకు ఎందుకో అమ్మా, మా ఇల్లూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి. లోపల్లోపల చిరుతపులి వచ్చి కరుచుకుపోతుందన్న భయం అవ్యక్తంగా పెరుగుతోంది కాబోలు. నాకు ఏడుపు రాబోయింది. నాగభూషణం నా వళ్ళు నిమురుతూ అన్నాడు. "భయపడకురా అబ్బాయి. ధైర్యం తెచ్చుకోవాలి. పన్నెండు గంటలయింది. ఇంకో నాలుగైదు గంటలు వోపిక పట్టితే తెల్లవారిపోతుంది. కారు బాగుపడిందా సమస్యే లేదు."

నేను మౌనంగా తలూపాను.

హఠాత్తుగా "భూషణం! పాము! పాము!" అన్న భయ విహ్వాల మైన కేక నిశ్శబ్దాన్ని కత్తిలా చీలుస్తూ వినపడింది. నాగభూషణం రామ చంద్రం వెళ్ళిన వైపు నాలుగడుగులు ముందుకు వేశాడు. దూరంగా రోడ్డు మీద ఒక వైపు నుండి మరోవైపుకి పెద్ద పాము మెలికలు తిరుగుతూ గుడ్డి వెన్నెలలో మెరుస్తూ వెళ్ళిపోయింది. "రామచంద్రం! రామచంద్రం!" అంటూ కేకలు వేస్తూ పరుగెత్తాడు. నాగభూషణం. రామచంద్రం అక్కడ పొదల దగ్గరే కూలబడ్డాడు. నా ప్రాణాలు బిగుసుకుపోయాయి. నెత్తురు జిలజిలమంది.

రెండు చేతులతోనూ పొదివి పట్టుకుని లేవలేక అనుకున్న రామ చంద్రాన్ని తీసుకవస్తున్నాడు భూషణం. రామచంద్రం వణికిపోతున్నాడు. "తలుపు తియ్యి" అన్నాడు భూషణం. కారు తలుపు తీశాను.

"పడుకో రామచంద్రం, ఇలాగ పడుకో" అంటూ మెల్లగా రామ చంద్రాన్ని వెనుక సీటులో పడుకోబెట్టాడు. పై మీద కంబళీతీసి కాలిమీద గట్టిగా బిగించికట్టాడు. "భయపడకు, భయపడకు" అని హెచ్చరిస్తున్నాడు భూషణం గొంతులో ప్రాణం లేదు, ఎండిపోయి చచ్చిపోయి ఉంది.

రామచంద్రం కళ్ళలో విపరీతమైన భయం సుళ్ళుతిరిగింది. వెర్రిగా పరవళ్ళు తొక్కింది. చావుకన్నా, దాన్ని గురించిన భయం భరించలేనిది. మనిషియొక్క ప్రాణం స్వరక్షణార్థం వెర్రిగా అరుస్తూ నరాలలో కళ్ళల్లో గుండెలలో పరుగులెత్తుతుంది. ఆ ప్రాణం యొక్క ప్రథమ వివేకం "నేను" అన్న అహమిక. నేను అనుకునే ఆ ప్రాణం ఏడుస్తుంది. మొరపెట్టుకుం టుంది, మోదుకుంటుంది, గిజగిజలాడుతుంది. రామచంద్రం వణికిపో తున్నాడు. రామచంద్రంలోని "నేను" లుప్తమైపోతున్నాడు. కరిగిపోతు న్నాడు. కోట్ల కొలదీ రక్త కణాల సైన్యాన్ని తన్ని తాను రక్షించుకుంటా నికి యుద్ధానికి పంపిస్తున్నాడు. కాని పామువిషంముందు యింత సైన్యమూ ఓడిపోతోంది. కాలకూట జ్వాల రక్తాన్నీ, మాంసాన్నీ, ధాతువునీ- అంతటా రూపహీనంగా పరచుకున్న ప్రాణాన్ని కాల్చి వేస్తోంది. "భూషణం నేను చచ్చిపోతాను, చచ్చిపోతున్నాను" అంటూ అరిచాడు రామచంద్రం, బొంగురుగా, గాద్గదికంగా.

భూషణం యిటూ, అటూ చూశాడు. ఎవరూ లేరు. చుట్టూ భయంకరమైన అడవి. ప్రతీ నిముషమూ అమూల్యమైనది. ఒక నిముషం గడచిందీ అంటే రామచంద్రం నివారింపలేని విపత్తులోకి జారిపోతున్నాడు. భూషణం కర్తవ్యతా విమూఢుడై పోయాడు ఏమీ చెయ్యలేని, ఏమి చెయ్యాలో తెలియని తన అవివేకం, తన అశక్తతలో తనే దండింపబడి కొట్టుకుంటూ నీరసంగా "ఏం భయంలేదు భయంలేదు" అంటూ గుండెలు రాస్తున్నాడు.

"నా భార్యా - నా పిల్లలు.... రక్షించు భూషణం రక్షించు-" రామచంద్రం దీనంగా ఏడుస్తున్నాడు.

నాకు కాళ్ళూ చేతులూ ఆడడంలేదు. ఇంత భయంకరమైన అనుభవం నన్ను సంధులలో కూడా సళ్ళించివేసింది. బావురుమని ఏడవాలనీ, అక్కడనుంచి పారిపోవాలనీ ఉంది. కాని ఎక్కడికి పోను, ఎలా పోను ఆ అడవిలో,

"గుండె బరువెక్కిపోతోంది. భూషణం" రామచంద్రం గొంతు క్షీణిస్తోంది అతని నుదుటిమీద చెమట బిందువులు- అంత చలి గాలిలో కూడా.

"ఆపద్బాంధవా! జగద్రక్షకా! నా రామచంద్రాన్ని రక్షించు" తడబడుతూ భూషణం రెండు చేతులూ పైకెత్తి జోడించాడు.

రామచంద్రం వగరుస్తున్నాడు. అతని కళ్ళు పిచ్చిగా ఉన్నాయి. పెదవుల చివరినుండి నురగ కక్కుతున్నాడు. అది చూసిన నాగభూషణం "బాబోయ్" అని వెర్రికేక పెట్టాడు. నిలువునా వణికిపోతున్నాడు. "వీడి శవాన్ని యింటికి తీసుకువెళ్ళి చెల్లెలికి ఎలా చూపించనురా" అంటున్నాడు. రామచంద్రం కళ్ళు తెరచి "నా పెళ్ళాం...." అని అస్పష్టంగా అని నిస్పృహలోకి జారిపోయాడు.

అవధానిగారు ఆగారు. గత స్మృతుల పునస్స్మరణవలన ఆయన గొంతు ఉద్రేకంతో బాధతో నిండింది. మేమందరం వూపిరాపి వింటున్నాం. లవారి బల్లని రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుని పళ్ళు బిగించి వింటున్నాడు. కొవ్వొత్తిజాలిగా రామచంద్రం ప్రాణంలాగా వెలుగుతోంది. తోటలో ఏమీ ఎరగనట్టు, ఈ మాటలేవీ విననట్టు చెట్లు చీకటిలో నిశ్శబ్దంగా నుంచున్నాయి. ఒక నిముషం ఆగి అవధానిగారు చెప్పడం సాగించారు.

భయంకరమైన మృత్యువు ఎదురుగా రామచంద్రం గుండెలమీద కూర్చుంది. ఎవ్వరూ లేరు. ఎవ్వరూ లేరు. అడవిలో మృత్యువులాంటి చీకటి. మృత్యుదేవత నవ్వులాంటి బూడిదరంగు వెన్నెల. నాగభూషణం రెండు చేతులతోనూ నమస్కరించి కళ్ళు మూసుకుని ప్రార్థిస్తున్నాడు. నేను కొయ్యబారిపోతున్నాను. కాలం కదలటంలేదు. తన యినుప పిడికిలితో మా తలలమీద నొక్కుతోంది. కారులో మూడు ప్రాణాలు. ఒక ప్రాణం కథావశిష్టంగా అయిపోతోంది. తక్కిన రెండు ప్రాణాలూ నీరసించి అచేతన స్థితిలోకి జారిపోతున్నాయి. అసలే అడవి-అందులో కాళ్ళ ముందు శవం, శవప్రాయమైన రామచంద్రం. పట్టణంలో సుఖ జీవితానికీ, నౌకర్లకీ, అబద్ధాలకీ, భేషజాలకీ అలవాటైన కృత్రిమ సుకుమారమైన జీవులకి యింతకన్న ఆపద ఏముంది? ఇంతలోకీ అడవిలో కాస్త దూరంలో ఒక చోట గప్పున మంటరేగింది. బలహీనమైన నా మనస్సు ఇంక తట్టుకోలేకపోయింది. "బాబోయ్ దెయ్యం" అని అరచి వెనక్కి పడిపోయాను.

బహుశా అయిదారు నిముషాలలోనే తెలివి వచ్చి వుంటుంది. కళ్ళు తెరచి చూశాను. స్టీరింగుకీ సీటుకీ మధ్యగావుంది నా తల. మెల్లగా లేచి భయంగా వెనుక సీటులోకి చూశాను. నాగభూషణం సీటునానుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"మామయ్యా" అన్నాను నేను.

భూషణంకి దుఃఖం పొరలుపొరలుగా వస్తోంది. ఆడదానిలా ఏడ్చేస్తున్నాడు. నాకేం తోచలేదు. ఏదో చెప్పాలనుకున్నానుగాని నాకూ మాట పెకిలి రావటంలేదు. రామచంద్రం నోటి చివరలనుంచి నురగ వెన్నెలలో పొంగుతూన్న సోడాలాగ వుంది. అతని తెల్లని అందమైన మొహంమీద వెన్నెలపడి ఏడుస్తూన్నట్టుంది. బరువుగా తీసే వూపిరి వలన అతని గుండెలు కిందకీ పైకీ లేస్తున్నాయి. మృత్యువుతో ముఖాముఖి, ముష్టాముష్టి యుద్ధం చేస్తున్నాడు రామచంద్రం-అవతలి ఒడ్డున ఈ బ్రతుక్కీ యీ మిథ్యకీ యీ రహస్యానికి అవతలి తీరాన.

"మనంకూడా చచ్చిపోతాంరా. ఈ అడవిలో దిక్కుమాలిన చావు చస్తాంరా. మన కెంత గతి పట్టిందిరా" ఏడుస్తూనే అన్నాడు నాగభూషణం.

"పారిపోదాం మామయ్యా" అంతకంటె ఏడుస్తూ అన్నాను నేను.

"ఎక్కడికి?"

"పరుగెత్తుకుపోదాం. గూడెంవరకూ పరుగెత్తుకుపోదాం."

"రామచంద్రం?"

"వదిలేద్దాం. ఎలాగూ చచ్చిపోతాడుగా."

నాగభూషణం ఆలోచనలో పడ్డాడు. అవును. చచ్చే రామచంద్రం కోసం యిద్దరుకూడా ఎందుకు చావాలి? అయితే పరుగెత్తగలమా. మాట రావడంలేదే. యింక కందలలోకి వోపిక ఎలా వస్తుంది? కొంతదూరం వెళ్ళి ఆగిపోతే అక్కడ గతి ఏమిటి? ఈ కారుకూడా ఉండదే పడుకొని చావడానికి!

ఆ నిముషంలో స్వార్థంకన్నా గొప్పశక్తి ప్రపంచంలో లేదని తెలిసిపోయింది నాకు. ఈ ఆదర్శాలూ, ఆశయాలూ అన్నీ ఆ ప్రాథమిక స్వార్థానికి అంతరాయాన్ని కలిగించనంతవరకే, ప్రతీ మనిషి లోపల్లోపల ఒక పాము!

"అయితే రోడ్డుమ్మట పాములుంటాయి ఎలాగ?" అన్నాడు నాగ భూషణం.

అవును అక్కడ వుండలేం. అలాగని ఎక్కడికీ వెళ్ళలేం. అరణ్యం మా చుట్టూ కనపడని ఉచ్చులు పన్ని వుంచింది. ఏన్నో మైళ్ళు పరుగెత్తితేకాని గూడెం రాదు. భగవాన్, ఏందుకిలాగ బాధిస్తున్నావు? ఆశ లేదు. ధైర్యంలేదు. అక్కడ చెట్ల ఆకుల్ని తిని బతికే కీటకంకన్నా హీన పుప నికృష్టంగా అయిపోతున్నాను. నీచంగా దిక్కులేకుండా చచ్చిపోతు న్నాడు.

రామచంద్రం కదలినట్లయింది. "రామచంద్రం" అని పిలిచాడు నాగ భూషణం. రామచంద్రం మెలికలు తిరుగుతున్నాడు. గుప్పిట మూస్తు న్నాడు. మళ్ళీపిలిచాడు భూషణం. రామచంద్రం తెలివిలో లేడు. అతని ప్రాణం విపరీతమైన బాధపడుతోంది. అతని దేహం వంకరలు తిరుగు తోంది. భూషణం చూడలేక కళ్ళు మూసుకున్నాడు. "దేవుడా!" అంటూ కాతరంగా ఆర్తనాదం చేశాడు. అడవి అంతా ప్రతిధ్వనించినట్టయింది. నాకు నాలిక పిడచకట్టుకుపోతోంది. నాకు తెలుసును. ఏ పామూ కరవ

కుండానే మేం యిద్దరమూ కూడా ఉదయానికల్లా ఈ కార్లో చచ్చిపడి ఉంటామని.

ఇంతలో ఏదో మువ్వల చప్పుడు వినిపించింది. మా ప్రాణాలు మరీ పైకి పోయాయి. కర్ర నేలని తాటించిన చప్పుడుతో కలసిన మువ్వల చప్పుడు, క్రమంగా దగ్గరవుతూన్న చప్పుడు. నేను భూషణాన్ని గట్టిగా కౌగలించుకున్నాను. ఇది తప్పకుండా ఏదో దెయ్యమే అయివుంటుంది. గజ్జెలు కట్టుకుని అడవుల్లో అర్ధరాత్రి పిశాచాలు నృత్యం చేస్తాయి కాబోలు. మమ్మల్ని చూసి వుంటుంది ఏదో దయ్యం- తింటానికి యిటువైపే వస్తోంది.

"ఎవరది బాబూ !-" మనిషి గొంతు, మనిషి భాష !

చటుక్కున భూషణం నేనూ ఎగిరిపడ్డాం. నా చెయ్యి రామచంద్రం పాదంమీద పడింది. చల్లగా తగిలింది. వెర్రికేక వేశాను. పాపం రామ చంద్రం భయపడే స్థితిలో లేడు.

"ఎవరు బాబూ కేకవేసింది ?" మళ్ళీ మనిషి ప్రశ్న !

భూషణం కళ్ళు గట్టిగా మూసుకునే తడబడుతూ అన్నాడు "ఎ.... ఎ ఎవరది ?"

"నేను మనిషినేనయ్యా, భయపడకు" - ఆ మనిషి సమాధానం.

కళ్ళు తెరచి చూశాం. ఒక ముసలివాడు రోడ్డుమీదనున్న పొదల్ని తప్పించుకొని వస్తున్నాడు. నల్లని వంగిపోయిన వళ్ళు, తెల్లని నెరిసిన గుబురులాంటి జుట్టు. మాకు నమ్మకం చిక్కలేదు. పైగా అనుమానం యింకా దృఢమైంది.

"ఎవరు నువ్వు ? ఈ అడవిలో ఎందుకున్నావు?" భూషణం ఎంత ధైర్యాన్ని కూడదీసుకుని ప్రశ్నించినా, కంఠస్వరంలో వణకూ, భయమూ తెలిసిపోతున్నాయి.

"సిద్దయ్యని బాబూ పాములవాణ్ని" అన్నాడు ముసలివాడు.

"పాములవాడివా ?"

"అవును బాబు."

"ఇక్కడ ఎందుకున్నావు?" భూషణం గొంతులో కొంచెం ధైర్యం కనిపించింది.

"నల్లతాసు గరళం తియ్యాలి బాబూ - జమీందారుగారు పురమాయించారు బాబయ్యా. నేనూ, నా కూతురూ ఈ అడవికి కొంత లోపల్నే పాక వేసుకున్నాం. ఈ రేతిరేల యిక్కడుండిపోయారేం బాబూ ?" అన్నాడు సిద్దయ్య.

మాకు కొంత ధైర్యం కలిగింది. అంతవరకూవున్న బ్రహ్మాండమైన ఒంటరితనమూ నిస్సహాయతా పోయినట్లనిపించింది. భూషణంలో ఒక్కసారిగా వివేకమూ, వోపికా కలిగాయి. దైవసంకల్పం వుంటే కాని ఈ అడవిలో ఇటువంటివేళ ఒక మనిషి, అందులో పాములవాడు కనుపించడం, ఒక్క గంతులో కారులోంచి దూకాడు. సిద్దయ్య రెండుచేతులూ పట్టుకున్నాడు. "చూడు సిద్దయ్యా, నీకు మంత్రం వచ్చునా ? మా వాడికి పాము కరచింది. చచ్చిపోవడానికి సిద్ధంగా వున్నాడు" అన్నాడు మినుకు మినుకుమనే ఆశ కలసిన భయంతో దుఃఖంతో పూడిపోయిన గొంతుకతో.

సిద్దయ్య రామచంద్రాన్ని పరీక్షగా చూశాడు, "ఇంకా బతికే వున్నారు బాబయ్యా" అన్నాడు బాధతో తోక తెగిన బల్లిలా గిజగిజలాడుచున్న ప్రాణిని చూసి.

"రక్షించాలి సిద్దయ్యా, దేవుడిలాగ వచ్చావు. పెద్ద కుటుంబీకుడు. పాపం భార్యా పిల్లలూ వున్నవాడు, మంత్రంవేసి బతికించావా సగం ఆస్తి నీకు రాయిస్తాను."

సిద్దయ్య ఓ సెకను ఆలోచించాడు. ఆకాశంకేసి చూశాడు. నల్లని మేఘం చంద్రుణ్ని కప్పివేస్తోంది ! "అదృష్టం వుంటే బతకొచ్చును బాబయ్యా. అక్కడ పాకలోకి తీసుకురండి బాబూ! వేరుముక్కతో మంత్రం వెయ్యాలి" అన్నాడు.

"ఎలాగ తీసుకురావడం?" భూషణం ప్రశ్నించాడు అయోమయంగా చూస్తూ.

"ఇప్పటికే ఆలస్యం అయిపోయింది బాబయ్యా. ఆలోచిస్తూంటే అపాయం. మీ రిద్దరూ మోసుకురావాలి బాబూ."

"అడవి లోపలికే ! పాములుంటాయేమో" - అంత అదుర్దాలోనూ జాగ్రత్త వహించడం భూషణానికి తెలుసును.

"నేను ముందుండి దారి చేస్తుంటాను. మువ్వల చప్పుడికి పురుగూ పుట్రా దూరంగా పోతయ్ బాబూ. రండి" అంటూ ముందుకు వెళ్ళి రోడ్డు వారనున్న పొదల్ని పక్కకి వంచి పట్టుకున్నాడు.

భూషణం రామచంద్రం భుజాలకింద నుంచి చేతులు పోనిచ్చి పైకెత్తి పట్టుకున్నాడు. నేను కాళ్ళు పట్టుకున్నాను. అడవిలోపల చీకటి. శవప్రాయమైన ఒక మనిషిని అంత చిన్న వయస్సులో మోయవలసి వచ్చిన భయంకరమైన అనుభవం నన్నిప్పటికీ తలచుకున్నప్పుడల్లా విచలితుణ్ని చేస్తుంది. చంద్రుడు మబ్బుల చాటుకి పోవడం మూలాన ఉన్న వెన్నెలకూడా లేకుండా పోయింది. కాళ్ళకి తగిలే ఎండుటాకులూ విరిగిన రెమ్మలూ కూడా మమ్మల్ని పాముల్లాగ భయపెడుతున్నాయి. గుండె దిటవుచేసుకుని సిద్దయ్య అడుగులో అడుగు వేసుకుని నడుస్తున్నాం. చేతులు లాగుతున్నాయి. భూషణం నేనూ వగరుస్తున్నాం. ఏదేనా చిరుతపులి పక్కనున్న పొదలోంచి చూస్తూన్నట్టే అనిపించింది. సిద్దయ్యతో చెప్పాలనుకున్నాను. రాత్రి నిద్రలో పీడకలలో గొంతు నొక్కుకుపోయినట్లుగా మాట విడివడడం లేదు. రెండు ఫర్లాంగులు నడచి వెళ్ళేటప్పటికి చెట్టూ చేమాలేని శూన్య ప్రదేశం కనిపించింది. ఎత్తయిన రాతి ప్రదేశంలాగా వుంది. అక్కడ నుంచి మినుకు మినుకుమని దీపపు వెలుతురు వస్తోంది.

"కొవ్వొత్తి ఆఖరయిపోతోంది అవధానిగారూ" అని హఠాత్తుగా అన్నాడు ఆచారి- అవధానిగారి కథనానికి అంతరాయం కలిగిస్తూ.

అవధానిగారు ఆచారికేసి నిరసనగా చూసి సొరుగులోంచి ఆఖరు కొవ్వొత్తి తీసి వెలిగించారు. ఒక్క మాటకూడా మాట్లాడకుండా. ఆచారి పెదవులు వణకుతున్నాయి. ఎప్పుడు నారాయణ దగ్గరికి చేరాడో కాని ఒక చేత్తో నారాయణ నడుముని గట్టిగా కౌగలించుకున్నాడు. తోటలోంచి కీచురాళ్ళ మోత వినపడుతోంది. అవధానిగారు మళ్ళీ ప్రారంభించారు.

"ఇదే బాబయ్యా గుడిసె" అన్నాడు సిద్దయ్య.

"ఇక్కడ అపాయం కదా నీకు! పురుగు పుట్రా...." భూషణం ఆయాసపడుతున్నాడు.

"మంత్రించిన యిసుక చుట్టూ జల్లుతాం బాబయ్యా. పురుగు రానే రాదు."

సిద్దయ్య తలుపు తోసుకుని లోపలికి వెళ్ళాడు. మేమూ వెళ్ళాం. గుడిసెలో ఒక ప్రక్కన కుండలూ, యిటుకలతో అమర్చిన పొయ్యి వున్నాయి. మరొక ప్రక్కన దండెంమీద బట్టలూ, అక్కడే ఒక నులక మంచమూ వున్నాయి. మంచంమీద సిద్దయ్య కూతురు కావోలు పడుకుంది.

"సూరీడూ లే లే" అంటూ తట్టి లేపాడు సిద్దయ్య. ఒక యువతి కళ్ళు తెరచి మమ్మల్ని చూసి గబుక్కున లేచింది. ఆ వూపుకి ఆమె కొప్పు విడివడి వినీల జలపాతంలాగా ఆమె జుట్టు జర్రున జారి పిరుదుల్ని తాకింది.

సిద్దయ్య చెప్పిన ప్రకారం రామచంద్రాన్ని మంచంమీద పడుకో బెట్టాం. యువతి ఆశ్చర్యంగా, భయంగా చూస్తూ నిలుచుంది. సిద్దయ్య తొందరగా రెండు మూడు సంచీలలో చెయ్యి పెట్టి వెదుకుతున్నాడు. చివరికి కింద బోర్లించాడు. పూసలు, పెంకులు, వేరు ముక్కలూ, రాళ్ళు ఏవేవో వున్నాయి. కోడిగుడ్డు దీపం వెలుగులో దేనికోసమో చూస్తున్నాడు. సిద్దయ్య.

యువతి చటుక్కున ఆతృతతో "ఈ అయ్యకి పెదవులు నల్లపడి పోతున్నాయి బాబూ" అంది.

భూషణం అదిరిపడ్డాడు. "సిద్దయ్యా! త్వరగా మంత్రం వెయ్యి. ఆలస్యం చెయ్యకు"అని కేకలేశాడు. సిద్దయ్య నిరుత్సాహంగా, విషాదంగా లేచినుంచున్నాడు. "కావలసిన వేరుముక్కలేదు బాబూ. ఉందనుకున్నాను" అన్నాడు.

"అయితే యిప్పుడెలాగా?" భూషణం భయంతో ప్రశ్నించాడు.

"ఏం చెయ్యనుబాబూ, లేదని తెలిస్తే ముందే తెచ్చి వుంచుకుందును. దూరంగా వెలగచెట్టు అవతల పొదలకాడ యీ వేరుగల మొక్క లున్నాయి. రాత్రి చీకట్లో అక్కడికి వెళ్ళలేం. పాము పుట్టలూ ముళ్ళ పొదలూ జాస్తిగా ఉంటయ్."

"ఎక్కడుంది వెలగచెట్టు?"

"శానాదూరం బాబయ్యా. రెండు మూడొందల గజాలు పోవాలి."

"ఎలాగో వెళ్ళు సిద్దయ్యా నీ మేలు మరచిపోను. నీ కాళ్ళు పట్టు కుంటాను."

"చెప్పాలా బాబయ్యా. నిష్కారణంగా బాబు సచ్చిపోతూంటే వూరుకుంటానా! అందులో నాకు చీకటిపడితే చూపు ఆనదు సరీగా. ఏది ఏమిటో తెలియదుగదా - ఈ చీకట్లో మొక్క ఆనవాలు ఎట్లా తెలుస్తుంది బాబయ్యా."

భూషణం జేబులోంచి పర్సు తీశాడు. అందులోంచి రెండు వందల రూపాయలనోట్లూ, కొన్ని పదులూ పైకితీసి "ఇదిగో సిద్దయ్యా ఇంకా యిస్తాను. ఎంతయినా యిస్తాను. నా రామచంద్రాన్ని రక్షించు నువ్వే ప్రాణ భిక్ష పెట్టాలి." అంటూ సిద్దయ్య ఒళ్ళో పడేశాడు.

సిద్దయ్య కంగారుగా పక్కకి తప్పుకున్నాడు. నోట్లు చిందర వందరగా పడిపోయాయి.

"ముందా డబ్బు తీసి లోపల పెట్టుకోబాబూ. మీ డబ్బుకి ఆశ పడ్డానా నామంత్రం పనిచెయ్యదు" సిద్దయ్య కఠినంగా అన్నాడు. "తియ్యండి బాబూ తియ్యండి"

భూషణం విధిలేక నోట్లని ఏరి పర్సులో కుక్కి "ఇంక లాభం లేదా" అన్నాడు దిగులుగా.

సిద్దయ్య లేదన్నట్టు తలవూపాడు. భూషణం గుండెలు బాదుకుని "రామచంద్రం!" అంటూ ఏడుస్తూ కూలబడ్డాడు. అతనిలో యింతకుముందు రేగిన ఆశ ఒక్కసారి గప్పున ఆరిపోవడంతో దుఃఖంతో విలవిల్లాడి పోయాడు.

"పోనీ నేను వెళ్ళి తీసుకురానా బాబూ"....సూరీడు సన్నని గొంతు అదిరిపడి చూశాడు భూషణం.

"నువ్వా?" కంగారుగా అన్నాడు సిద్దయ్య. "వద్దు ప్రమాదం సూరీడూ అక్కడ పాము....అమ్మో"

"ఈ అయ్య చచ్చిపోతూంటే....పాపం."

"వద్దు వద్దు" అంటున్నాడు సిద్దయ్య.

"వెళ్ళొస్తాను" సూరీడు గొంతులో నిశ్చయం. జుట్టుముడి వేసుకుని క్షణంలో గుడిసె అవతలికి దూసిన బాణంలా వెళ్ళిపోయింది.

"వద్దు సూరీడు నా మాట విను వెళ్ళొద్దు" అంటూ సిద్దయ్య గట్టిగా కోపంగా అరుస్తూ వెనకాలే వెళ్ళాడు. అప్పటికే సూరీడు దూరంగా వెళ్ళి

అడవిలో చీకటిలో కలిసిపోయింది. వెనక్కి తిరిగి వచ్చాడు. కోపంతో భయంతో వణికిపోతున్నాడు. గోడకి చేరగిలబడిపోయి నీరసంగా; "ఓపలేని మనిషి బాబూ, విన్నది కాదు" అంటూ వణకే చేతులతో మొహం కప్పుకున్నాడు.

ఘోషణానికి ఏమనాలో తోచలేదు. సిద్దయ్య ప్రాణం బిగబట్టుకున్నట్టుగా కూర్చున్నాడు. ఏ చప్పుడైనా అదిరిపడి చూస్తున్నాడు. అతడి కడుపు తీపి అతనిది. మంచం మీద రామచంద్రం చివరి ఘడియల్లో వున్నాడు. ఒక పక్క కటిక చీకట్లో అడవిలో విపత్తుని కోరి తెచ్చుకుంటోంది వయుస్సులో ఉన్న యువతి. ఇదంతా ఏమిటో, ఏ ప్రళయానికి దారి తీస్తుందో- సరదాకి వీళ్ళతో ప్రయాణం చేస్తూన్న నాగతిఏమవుతుందో తెలియక ఒక్క క్షణం ముందుకు ఆలోచించే శక్తికూడా లేక నిశ్చేష్టుడనై ఉన్నాను నేను. మేకలు గుడిసె అవతల సిద్దయ్యావి కాచోలు—అరుస్తున్నాయి. మృత్యుచ్ఛాయలు వికటంగా గుడిసెలోకూడా పరచుకొన్నాయి. ఇదంతా నిజం కాదన్నంత అనుమానం కలిగింది.

ఒక్కొక్క నిముషమే బలవంతంగా గడుస్తోంది. ఎవరో పిస్తోలుని గుండెకి సూటిగా పెట్టి ట్రిగ్గర్ మీద వేలు నొక్కుతూన్నట్టుంది. సిద్దయ్య మెల్లగా లేచాడు. దీపం వెలుగులో అతని కళ్ళు నిశ్చయంతో మెరిసాయి. "పట్టి మంత్రమైనా ఈలోగా వేస్తాను బాబూ" అన్నాడు. రామచంద్రాన్ని పరీక్షించాడు. చిటికెలు వేస్తూ, పెదవులు కదుపుతూ మంచంచుట్టూ తిరుగుతున్నాడు. మంత్రావేశంతో సిద్దయ్య చూపుకి శూలంవంటి నైశిత్యం కలిగినట్టనిపించింది. ఆ సమయంలో అతను ముసలివాడులా లేడు. శక్తిమంతమైన ఒక విద్యుత్తలంలా వున్నాడు. ఘోషణం ఏదో అనబోయి మానివేశాడు. సిద్దయ్య తదేకమైన తత్పరతలో గదిలోని నిశ్శబ్దం కూడా గంభీరమైన ఉద్రేకంలా ఉంది. భౌతికమైన ప్రపంచాన్ని శాసించే మనస్సుయొక్క శక్తిని నాకు చూస్తోన్నట్లు అనిపించింది.

సూరీడు తలుపు తోసుకుని లోపలకు వచ్చింది. మొహంమీద చేతులమీద గీరుకుపోయిన యెరుపు చారలు—ఆయాసపడుతూ వుంది. "బాబూ తెచ్చాను" అంది. ఆమె చేతిలో అయిదారు మొక్కలున్నాయి. సిద్దయ్య అదే చలించని చూపుతో సంజ్ఞ చేశాడు. సూరీడు గబగబా వేద

అరగదీసి రామచంద్రం కంట్లోనూ నోట్లోనూ పెట్టింది. అతని అరిపాదాల్ని ఒళ్ళో పెట్టుకుని చేతుల్తో రాస్తూంది.

అరగంట గడిచింది. సిద్దయ్య వేసిన మంత్రమే వేస్తూ మంచం చుట్టూ తిరుగుతున్నాడు; భూషణం తలపైకి రెండు చేతులూ యెత్తి పట్టుకుని మౌనంగా దేవుళ్ళని ప్రార్థిస్తున్నాడు. నేను రామచంద్రంకేసి ఆదుర్దాగా చూస్తోన్నాడు. క్రమంగా అతని మొహంలోని చావు నీడలు తప్పుకున్నాయి. జీవకళ కొంచెంగా తిరిగి వస్తోంది. శ్వాస తేలికగా యథాస్థితికి వస్తుంది. సూరీడు నొసటని చిరు చెమట కమ్ముకుంది పరిశ్రమ వలన. రామచంద్రం మొహం తేటపడింది. సూరీడు ఆనందంతో "బాబూ బతికాడు రా అయ్యా" అని కేకవేసింది. భూషణం "ఆ!" అంటూ లేచి రామచంద్రాన్ని చూసి వెర్రిగా అరచి నవ్వాడు. "ఇదంతా నీ చలవ సూరీడూ" అంటూ ఆమె కాళ్ళమీద పడ్డాడు. సూరీడు సిగ్గుపడుతూ, "అదేవిటి, తప్పండి బాబూ" అంటూ లేచి దూరంగా వెళ్ళింది. సిద్దయ్య మంత్రోచ్ఛారణ ఆపి ఒకసారి రామచంద్రాన్ని చూసి, నిట్టూర్చి వెదురుగోడ నానుకునించున్నాడు. అతను చాలా అలసిపోయినట్టున్నాడు. సూరీడు దగ్గరగా వెళ్ళి తండ్రిని కౌగిలించుకుని "నా మీద కోపం వచ్చిందా బాబూ?" అంది. సిద్దయ్య ప్రేమగా జాలిగా కూతురు తలనిమిరాడు. "వెర్రిపిల్లా!" అన్నాడు ఆప్యాయంగా గాద్గదికంగా.

దిక్కులేకుండా అడవిలో చచ్చిపోతాననుకున్న యీ రాత్రి పాములవాడి గుడిసెలో అదృష్టవశాత్తు సుఖాంతం అయింది. బిగుసుకు పోయిన నరాలు ఒక్కసారిగా సళ్ళి ఒక్కసారిగా ఒళ్ళంతా తేలికై పోయినట్టనిపించింది. రామచంద్రం కళ్ళు తెరచి సన్నగా మూల్గి పక్కకి చూశాడు. భూషణం దగ్గరగా వెళ్ళి వెర్రి ఆనందంతో జరిగిందంతా చెప్పేస్తున్నాడు. "బతికావురా రామచంద్రం. ఇంక భయంలేదురా. దేవుడు మన పాలిట ఉన్నాడు. తెల్లారకుండా బస్సు వస్తుంది. దానిలో వెళ్ళితే కలక్టరుగారింట్లో పెళ్ళి ముహూర్తానికి తప్పకుండా వెళ్ళొచ్చును. అసలు నువ్వు లేకపోతే అక్కడ కథ లేదు" అంటూ వాగేస్తున్నాడు. బడలుగా నీరసంగా వున్న రామచంద్రం కళ్ళల్లో చిన్ననవ్వు తొలుకు వెలుగు అలలాగా మెదిలింది. అంతలోనే భూషణం మెడకి చేతులు తగిలించి గబుక్కున ఏడ్చాడు.

"ఛఛ ఇప్పు డేడుస్తావేమిటి ప్రమాదం తప్పిపోయింది, పడుకోపడుకో మళ్ళీ ఉదయం పెళ్ళికి రెడీగా వుండాలి" అన్నాడు భూషణం. అతను బత కడంలోని పరమార్థం కలక్టరుగారింట్లో పెళ్ళికి హాజరపడం కాబోలు అని సుబ్రహ్మణ్యం నా మనస్సుకి అనిపించకపోలేదు. అసలు పెద్ద ఉద్యోగస్థుల ఇళ్ళల్లో జరిగే శుభకార్యాలకి ఇంతగా అవసరమైన పెద్ద మనుషులకి హఠాత్తుగా చచ్చిపోయే హక్కు 'లా' ప్రకారం వుండివుండదు కూడా. సూరీడు నవ్వుతూ చేత్తో ఒక పాత్రని పట్టుకువచ్చి "తప్పుకో బాబూ, ఆయన్ని కొంచెం పడుకోనివ్వండి" అంటూ రామచంద్రం తలని ఒళ్ళోకి తీసుకుని నోట్లో పాత్రలో వున్న పాలు పోసింది.

"ఏమిటిది?" అన్నాడు భూషణం.

"మిరియపొడీ పాలూ - ధారకంగా వుంటది" అంది సూరీడు.

"ఈ అడవిలో మీకు పాలు సప్లయ్ అవుతాయా యేమిటి?" భయం పోగానే నాగభూషణం సహజమైన వివేకాన్ని విచక్షణనీ తిరిగి పొందాడు.

సూరీడు ఫక్కున నవ్వింది. "మేక పాలు బాబూ" అంది.

"రామ రామ. మేక పాలు తాగడమే! సరే సరే__ఆపద్ధర్మం" అన్నాడు భూషణం.

సిద్దయ్య రెండు "చిరిగిన సంచుల్ని ఒకపక్కగాపరచి "కొంత సేపు పరుండండి బాబూ" అన్నాడు, రామచంద్రం పాలు తాగి నిద్రపోయాడు.

"అలసిపోయారు బాబుగారు. రెండు జాంపళ్ళు కోసి ఇవ్వనాండీ" అంది సూరీడు.

"నిజమే, ఏదేనా తినాలనిపిస్తోంది" అంటూ గోనెపట్టామీద చతి కిలబడి "ఏం సిద్దయ్యా, నీ అల్లుడేం చేస్తున్నాడు?" అన్నాడు భూషణం.

"మొగుణ్ని ఒగ్గేసింది బాబూ మా సూరీడు."

"ఏం?" అన్నాడు ఉలిక్కిపడి భూషణం.

"వాడంటే మొదటినుంచీ దీని కిష్టంలేదు బాబూ. వద్దు వద్దంటూంటే నేనే బలవంతాన పెళ్ళిచేశాను" అన్నాడు సిద్దయ్య.

"కట్టుకున్న మొగుణ్ని వదిలెయ్యడమే!" ఆశ్చర్యంగా అన్నాడు భూషణం "పాపం సుమీ సిద్దయ్యా."

"ఇష్టం లేకపోతే కాపురమెట్టా చెయ్యడం బాబూ. నా కర్మంకాదు" అంది సూరీడు. కోడిగుడ్డుదీపం ముందు కూర్చుని చాకుతో జామిపళ్ళు ముక్కలకింద కోస్తోంది. మధ్య మధ్య మొహం మీదపడే జుట్టుని చేత్తో వెనక్కి తోసుకుంటోంది. చామనచాయ రంగైనా, నవలావణ్యంతో అంగ సౌష్టవంతో ఆమె ఆకర్షణీయంగా వుంది. నుదుటిమీద గిరుకుపోయిన చార లేత ఎరుపుతో మెరుస్తోంది.

"నాతోనే చాలాకాలం తిప్పుకున్నాను బాబూ మా సూరీడుని. సికా కుళం, సాలూరు, బొబ్బిలి - యివన్నీ తిరిగొచ్చాం. తాడునుపట్టి గరళం తీయడంలో నాదే పేరండి ఆ రోజుల్లో. ఇప్పుడు శరీరంలో జవపోయింది. ముసలివాణ్ణయిపోయాను. నా సూరీణ్ని చూసుకునే బతుకుతున్నాను. దానికైనా నేను తప్ప ఎవరూ లేరు సామి. చంద్రంబాబు ఎప్పుడొస్తాడో ఏమో...." అన్నాడు సిద్దయ్య.

"అతనెవరు ?" భూషణం ప్రశ్నించాడు.

"నూజివీడులో సూరీడు కా బాబుతో సావాసం అయింది. ఒకరి కొకరు పడిచచ్చేవారు. ఈ చంద్రంబాబు పెద్దింటి అబ్బాయి బాబూ. సూరీడునే పెళ్ళాడతానన్నాడు. తండ్రి కోపంవచ్చి ఇంట్లోంచి తగిలేశాడు. ఆ పోత పోక ఎక్కడికి పోయినాడో సామి, ఉద్యోగం సంపాదించుకుని వస్తానని చెప్పిపోయాడు సూరీడుతో. నాలు నెలలాయె. అతీ గతీ లేదు, సూరీడు కడుపులో బిడ్డ చంద్రంబాబు బిడ్డే బాబూ" అన్నాడు సిద్దయ్య. "చంద్రంబాబు రాకపోతే దీని గతేంకానా" అని బెంగబాబూ. అతనిమీదే ధ్యాస...."

"తప్పకుండా వస్తాడు బాబూ. ఎప్పటికైనా వస్తాడు. ఎందుకురాడు? నన్నొదిసి వుండగలడా" సూరీడు కళ్ళల్లో విశ్వాసం మెరుస్తోంది.

"ఎన్నవ నెల నీ కూతురికి" అని అడిగాడు భూషణం.

"నాల్గోనెల బాబూ."

సూరీడు జామిపండు ముక్కల్ని తీసుకువచ్చి ఎదురుగా పెట్టింది. నన్నుకూడా తీసుకోమన్నాడు భూషణం. నాకు నిద్ర వచ్చేస్తుంది. సిద్దయ్య లేచి "మేం కూడా కొంచెం నడ్డి వాలుస్తాం బాబూ. కాసేపు పరుండండి" అన్నాడు.

"నీ మేలు మరచిపోను సిద్దయ్యా. నీ ఋణం ఎలా తీర్చుకుంటామో తెలియడంలేదు. డబ్బు తీసుకోనన్నావు."

"డబ్బు ఎంత చేస్తుంది బాబూ. మీ దయవుంటే చాలు. బాబూ నేనుగుడిసె అవతల పడుకుంటాను, లోపల చోటులేదు. అవసరమైతే పిల వండి" అన్నాడు సిద్దయ్య.

"వద్దు బాబూ. చలివేస్తది" అంది సూరీడు.

"చూరుకింద కంబళీ కప్పుకుని పడుకుంటాను, నువ్వు పడుకో."

"సిద్దయ్యా ఆరుగంటలకి బస్సులో వెళ్ళిపోతాం. కలక్టరుగారింట్లో పెళ్ళిసమయానికి వెళ్ళాలి. ఇప్పుడు దాదాపు మూడుగంటలవుతుంది. ఒక వేళ మెలకువ రాకపోతే లేపు సుమీ'' అన్నాడు నాగభూషణం ఆవలిస్తూ.

"చిత్తం" అని సిద్దయ్య కంబళి తీసుకువెళ్ళాడు. రామచంద్రం ప్రక్కగానే నేలమీద గుడ్డ పరచి సూరీడు పడుకుంది. భూషణం నావైపు తిరిగి "వీళ్ళకి నీతిలేదు ధర్మంలేదు చూశావా" అని మెల్లగా అన్నాడు. నాకు నిద్రముంచుకువచ్చేస్తుంది. అడవిలోంచి అస్పష్టరవాలు ఏవో వినపడు తూనే ఉన్నాయి. నాకు నిద్ర పట్టేసింది.

సుమారు వో గంటకు నా పక్క నెవరో కదలినట్టనిపించింది. కళ్ళు తెరచి చూచాను. భూషణం లేచి సూరీడు వంటిమీద చెయ్యివేసి లేపు తున్నాడు. సూరీడు లేచి "ఏవిటి బాబూ" అంది. భూషణం జేబులోంచి డబ్బు తీశాడు. మెల్లగా అంటున్నాడు. "నా మనసు తీర్చు – ఇదిగో డబ్బు.''

సూరీడు ఇటూ అటూ చూసింది. చిన్నగా నవ్వింది. "అందుకు డబ్బెందుకు బాబూ'' అంది.

"అయితే"– ఆశగా అడిగాడు భూషణం.

"నే నలాంటిదాన్ని కాను. పోయి పడుకో అయ్యా. నవ్వుతారు కూడా" అంటూ మరోవైపు తిరిగి పడుకుంది.

భూషణం అనుమానంగా చూస్తూ నా పక్కకి వచ్చి పడుకున్నాడు. రామచంద్రం గుర్రు బరుకు బరుకుమంటూ వినిపిస్తోంది. నేను నవ్వాపు కుని పడుకున్నాను. గుడిసె బయట మేకపిల్ల అరుస్తోంది....

భూషణం నన్ను లేపుతున్నాడు. "లేరా లే - బస్సు వచ్చే వేళయింది" అంటున్నాడు. ఉలిక్కిపడి లేచాను. తెల్లారిపోతోంది. గుడిసె చూరులోంచి చీకటి పలచబడిపోవడం కనిపిస్తుంది. రామచంద్రం అంటున్నాడు "ఇంత మొద్దునిద్ర పోయేవాడు పరీక్షలో ఏం చదువురాడు?" మంచి గంభీరంగా ఉత్సాహంగా వుంది రామచంద్రం గొంతు. రాత్రి మేం పడిన బాధ భయమూ అంతా పీడకల ఏమో అనిపించినట్టుంది రామచంద్రం తీరుచూస్తే. రామచంద్రం మామూలు పెద్దమనిషి, శ్రీమంతుడూ, పెన్షన్ ఛాంపియనూ అయిపోయాడు.

"నువ్వేం తీసుకోనన్నావుట సిద్ధయ్యా. నాకు తృప్తిగా లేదు" అన్నాడు రామచంద్రం,

"మంత్రం పట్టివ్వదు బాబూ. పైగా బెడిసికొడుతుంది బాబూ. బస్సు వచ్చేస్తుంది" అన్నాడు సిద్ధయ్య.

"సిద్ధయ్యా, కూతురూ ముందు నడుస్తుంటే వెనకాల మేం వెళ్ళాం. అడవి అంతా మేల్కొంది. పక్షుల కిలకిలలతో కోలాహలంగా వుంది. కాళ్ళకి చల్లని గడ్డీ, ఆకులూ తగిలి జివ్వుమంటోంది. అర్ధరాత్రి భయంకరంగా వున్న అడవి ప్రాతఃకాంతిలో పచ్చపచ్చగా తేలిగావుంది. సూరీడు దారిలో తీగలు మా కాళ్ళకి తగలకుండా పక్కకు వంచుతోంది. ఒడ్డూ పొడుగూ నల్లటి పెద్ద జుట్టువున్న ఆమె ఆ అడవిలాగ స్వచ్ఛంగా ప్రాకృతికంగా కనిపించింది.

రోడ్డుమీదకి వచ్చి నిలుచున్నాం. సిద్ధయ్యా, కూతురూ "ఇంక మేం వెళ్ళవస్తాం బాబయ్యా సెలవు తీసుకుంటాం" అన్నారు.

"ఎప్పుడైనా మా వూరు వస్తే కనిపించు సిద్ధయ్యా. నీ కూతుర్ని కూడా తీసుకురా. బహుమతి తీసుకుందువుగాని" అన్నాడు రామచంద్రం కృతజ్ఞతాభావం ఉట్టిపడేలాగ.

"చిత్తం" అని వాళ్ళు వెళ్ళిపోయారు. ఇటూ అటూ చెట్లు బారులు తీరిన రోడ్డు లేత వెలుగులో ఎంతో అందంగా వుంది. చల్లని గాలి ఉత్సాహాన్ని రేకెత్తిస్తోంది. "చిరుతపులులు ఈ అడవిలో కనిపించవేం మామయ్యా" అన్నాను నేను రాత్రి సంఘటనని తలచుకుంటూ.

"ఆగరా వెధవ వేలులూ నువ్వూ. కలక్టరుగారింటికి పెళ్ళివేళకు చేరుకోకపోతే-" ఘోషణం ఎంతో ఆతృతిగా ఉన్నాడు. ఎన్నో బాధ్యతలూ గౌరవాలూ వహించవల్సిన మామయ్య విధ్యుక్తధర్మం మరచిపోడు.

"పాపం వాళ్ళేం తీసుకోలేదు" అన్నాడు రామచంద్రం తన ప్రాణదాతల్ని గురించి "అన్నట్టు ఘోషణం-మన కారు!" లన్నాడు.

కారు దగ్గరికి వెళ్ళాం. తడిసిపోయివుంది మంచులో. తణుకు వెళ్ళగానే దీన్ని తీసుకువచ్చే ఏర్పాటు చేయాలని నిశ్చయించారు.

"ఒరేయ్ రామచంద్రం ఈ వెధవ కారు అమ్మేసేయ్. ఇప్పటికైనా నా మాట విను"అన్నాడు ఘోషణం.

"ఇలా అమ్మితే అంతా నష్టమే. రిపెయిర్ చేయించి రంగు వేయించి కండిషన్‌లో పెట్టి అమ్ముతాను. ఘోషణం - ఇన్ని సెకండ్ హాండ్ కార్లు కొన్నాను. ఒక్కదానిలో అంటే ఒక్కదానిలోనైనా నష్టం వచ్చిందా ?" అన్నాడు రామచంద్రం గర్వంగా.

"బాబయ్యా" అని అడవిలోంచి కీచుగా కేక వినపడింది. అందరం అటు చూశాం. సూరీడు పరుగెత్తుకు వస్తోంది.

"బాబూ మా అయ్యని పాము కరిచింది. ఒక్కసారి రండి బాబూ, రండి" వగరుస్తోంది సూరీడు. ఆమె కళ్ళల్లో భయం సుళ్ళు తిరుగుతోంది.

"అరెరెరె !"—అన్నాడు ఘోషణం. అందరం ఈ దుర్వార్తకి స్తంభించిపోయాం.

"రండి బాబూ. సగం దూరం వెళ్ళగానే వేరుముక్కకోసం పొదలో చెయ్యిపెట్టి మొక్క పీకబోయాడు బాబు. బుస్సనిలేచి కాటువేసింది. తాచు బాబూ తాచుపాము" సూరీడు దీనంగా అడుగుతోంది.

"ఎలాగ ! ఈ బస్సు దాటిపోతే కలెక్టరుగారింట్లో పెళ్ళికి ఎలాగ వెళ్ళడం. రిసెప్షన్ అంతా నేను చూసుకుంటానని మాట యిచ్చాను"- అన్నాడు రామచంద్రం. పెద్ద సమస్య వచ్చిపడింది రామచంద్రానికి.

"అయినా మనం ఏమి చేయగలం ?" ఘోషణం నిరీహుడై జాలిగా అన్నాడు.

నేను వెర్రిగా సూరీడు కేసి చూస్తున్నాను. "నే నొక్కర్తెను చూడలేను బాబూ. మీరుంటే ధైర్యం బాబూ, రక్షించండి బాబూ!" ఏడుస్తోంది సూరీడు.

"అదిగో బస్సు వస్తోంది" అన్నాడు భూషణం. రామచంద్రం చెయ్యి ఎత్తి ఆపమని సంజ్ఞ చేశాడు.

బస్సు ఆగింది. "త్వరగా ఎక్కండి బాబూ" అంటున్నాడు కండక్టరు. రామచంద్రం గబుక్కున రెండు పదిరూపాయల నోట్లు జేబులోంచి తీసి సూరీడు చేతిలో పెట్టి "మేం వుండి మాత్రం ఏం చెయ్యగలం సూరీడూ, మంత్రం వచ్చునా తంత్రం వచ్చునా? అవతల కలక్టరుగారింట్లో పెళ్ళి. ఈ డబ్బుతో ఎక్కడికేనా తీసుకెళ్ళి చూపించు మీ బాబుని" అని కారు ఎక్కాడు. భూషణం నిశ్చేష్టుడై చూస్తూవున్న నన్ను జబ్బ పట్టుకుని కార్లోకి తోసి, తనూ ఎక్కాడు, "సూరీడూ! ఏమనుకోకు, కలెక్టరుగారింట్లో...." అంటున్నాడు. కారు బర్రున సాగింది. సూరీడు విచిత్రంగా నోరావలించి గుడ్లప్పగించి చూస్తూ నిలబడింది. పది రూపాయల నోట్లు రెండూ ఉదయపు చల్లని గాలిలో పావురాలులా పల్టీలు కొట్టుతున్నాయి.

కారు వేగంగా వెళ్ళిపోతోంది. "పాపం మనం చెయ్యగలిగిందేముంది?" అన్నాడు భూషణం యింకా జాలితో!

"అందులో కలెక్టరుగారికి మాట యిచ్చామాయె!" అన్నాడు రామచంద్రం - మాట యిచ్చి తప్పడంలోని అమానుషత్వాన్ని వూహించుకుని భయపడుతూ.

ఇదీ నల్లజర్ల అడవిలో ఆనాటి రాత్రి సంఘటన - అని అవధానిగారు ఆగి మాకేసి చూశారు.

"కావొస్తి అయిపోతోంది. ఎలాగ" అన్నాడాచారి భయంగా.

"డ్రైవరు వంటవాడూ సినిమానుంచి యీపాటికి వస్తూంటారు" అన్నాడు నారాయణ.

"ఈ తోటలో పాములున్నాయండీ" అన్నాడాచారి.

అవధానిగారు మాట్లాడలేదు. పాతిక సంవత్సరాల క్రితం జరిగిన యీ సంఘటనదగ్గరే వుంది ఇంకా ఆయన మనస్సు.

"సిద్దయ్యా చచ్చిపోయాడేమో"అన్నాను నేను.

"మనకేం తెలుస్తుంది ?" అన్నారు అవధానిగారు. "సూరీడు ఏమయిందో కూడా తెలియదు" అన్నారు బరువుగా.

గబుక్కున లైట్లు వెలిగాయి. బంగళా అంతా వెలుగుతో నిండి పోయింది. ఆచారి ఆనందంతో నవ్వుతున్నాడు. అవధానిగారు యింకా ఆలో చిస్తూనే వున్నారు. "డ్రైవరు రాగానే వెళ్ళిపోదాం" అంటున్నాడు నారా యణ. తోట అవతల నుంచి యింకా నక్కల కూతలు వినపడుతున్నాయి. కాని ఆచారి అంత భయపడలేదు,

(ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక - *1964*)

# మణిప్రవాళం

చీకట్లో గదిలో పడుకుని వుంది లత. ఏకాకికా ఏ హృదయమూ స్పందించని ఏకాంతంలో ఎవరూ చూడని నరకంలో ఒదుక్కుని వుంది లత.

అతను మెరపులాగా వచ్చాడు. అటు దక్షిణానిలం వీచే దారినుండి దయాసరస్సులలో విహరించే రాజ హంసనెక్కి నక్షత్ర కిరణం మీదుగా జారుతూ వచ్చాడు.

అతను పాట పాడాడు. పాటకి చీకటి చీకాకుపడి నల్లగా కోప్పడింది.

అతను పాట పాడాడు. చీకటిని చెరిపివేస్తూ వేయి పువ్వులతావి వింతగా గుప్పుమంది.

అతను పాట పాడాడు. జాలిగా తియ్యగా లత గుండెలో కోర్కెలా హాయిలా తెరతెరల్లాగ కదలింది.

ఆమె కళ్ళు తెరచింది. అతను నవ్వాడు. అతను వెళ్ళిపోయాడు. అతను మళ్ళీ మరో రోజున వచ్చాడు. "లతా" అని పిలిచాడు. అతని గొంతులో మాధురీ మందాకిని జలజలించింది.

"ఇంకోసారి పాడు" అంది లత రెప్పల్ని కొంచెం ఎత్తి. నల్లని పొడుగాటి ఆమె తల వెంట్రుకలు చీకట్లో తరంగాలలా కదలుతున్నాయి.

అతను పాడాడు. చీకటి చీకాకు పడింది. గుడ్లగూబలు దిగులుగా ఏడ్చాయి. అతను వెళ్ళిపోయాడు.

"అతను మళ్ళీ ఇంకోరోజున వచ్చాడు. లత పెదవుల మీద సన్నని చిరునవ్వు చెదిరింది. ఆప్యాయంగా అడిగింది. "ఒక్క పాట పాడవూ?"

పాడాడు. లత కళ్ళల్లో నీళ్ళు. నీళ్ళలోంచి చావును దాటిన వెలుగు. అతను నిట్టూర్చాడు.

కొన్నాళ్ళకి మాలతీ సౌరభం వీచిన రాత్రి–

"స్వామి" అంది లత.

అతను మాట్లాడలేదు.

"కవీ" అంది లత.

అతను మాట్లాడలేదు.

"ప్రియా" అంది లత.

అతను పలికాడు. నక్షత్రాలు మెరిశాయి. వెన్నెల కురిసింది. అతని చేయి ఆలంబనగా లత లేచి నిలుచుంది. అతని వొళ్ళో వాలింది. కిటికీ అవతల మందారం ఎర్రగా నవ్వి తల పక్కకు తిప్పుకుంది.

పకుళ వృక్షం విరిసిన రాత్రి–

"ప్రియా" అంది లత.

"లతా" అన్నా డతను.

"మిమ్మల్ని వదలలేను."

ఆబాబుగా ఆమె ఫాలాన్ని ముద్దాడాడు అతను.

"ఎక్కడనుంచి వచ్చావు."

"మంచు పర్వతాల అంచున దయాసరస్సుకి దక్షిణాన మంత్ర విహంగాలు మసలేచోటున - రంగు రంగుల చెట్ల నీడలలో పాడుకుంటూ ఉంటాను."

"అక్కడికి దగ్గరగా మాయలోకం వుంది. భయంలేదా" అంది లత. అతను నిట్టూర్చాడు.

మొగలిచెట్టు మొదటిరేకు తొడిగిన రాత్రి.

"ప్రియా" లంది లత.

"ప్రియతమా" అన్నా డతను.

"ఏమి టాలోచిస్తున్నారు?"

అతను నిట్టూర్చాడు. అతను వెనక్కి చూశాడు. అతని వెనకాల మబ్బులు ....

"పాట పాడవూ" అతని వొడిలో తల పెట్టుకుని అడిగింది లత.

అతను పాడాడు - లత పులకరించింది. పరవశించింది.

అరమోడ్పు కన్నులతో అతన్ని గుండెలకి హత్తుకుంది. అతను బరువుగా నిట్టూర్చాడు.

అతను వస్తున్నాడు. లత చిగురుపట్టింది, మొదటి పువ్వు పూసింది.

అతను వస్తున్నాడు. అతనితోటి మబ్బులు వస్తున్నాయి. మబ్బుల వెనుక రాక్షసులు దాక్కున్నారు.

నక్షత్రం రాలిపోయిన రాత్రి -

అతను వచ్చాడు. అతని గుండెమీద రాక్షసుల మొదటి గోటి గీత - ఎర్రని చార ;

"నన్ను కాపాడగలవా?" అన్నా డతను.

"ఓ" అంది లత.

"అయితే నీ దగ్గరున్న మణిప్రవాళం ఇవ్వు."

"నా దగ్గర లేదు."

"అయితే-?"

"ఇంకోటి ఇస్తాను."

ఆమె ఏదో ఇచ్చింది. రక్తపుచార కనబడలేదు. అతను నవ్వాడు. ఎప్పటిలాగే వెన్నెల....

కొన్నాళ్ళు గడిచాయి. అతను వచ్చాడు. ఈసారి అతని గుండె మీద రెండు ఎర్రని చారలు. అతను కొంచెం వడలాడు.

"నన్ను కాపాడగలవా" అన్నాడు.

"ఓ" అంది లత.

"అయితే మణిప్రవాళం ఇవ్వు."

"లేదు."

"మరి-?"

"ఇంకోటి యిస్తాను."

ఆమె ఏమిటో ఇచ్చింది. రక్తపు చారలు కనపడలేదు.

అతను నవ్వాడు. కాని ఆ నవ్వులో నీరసం వుంది.

లత రెండవ పువ్వు తొడిగింది. అతనికోసం చూసింది. రాత్రీ పగలూ 'ప్రియా' అని పిలిచింది. ఆ పిలుపుకి ఆకాశపు అంచున ఒక బెల్లు రాలి పడింది.

అతను వచ్చాడు. ఈసారి గుండె అంతా రక్తం. ఎర్రని మడుగు లాగా వుంది. అతని వెనుక నల్లని మబ్బులు. నల్లని మబ్బుల వెనుక రాక్షసుల వికటాట్టహాసాలు.

"నన్ను బ్రతికించు. నన్ను చంపేస్తున్నారు" అన్నా డతను.

"ఏం చెయ్యను నేను?" ఏడ్చింది లత మూడవపువ్వుతో సహా.

"మణిప్రవాళం యివ్వు."

"లేదు."

"ఉంది. నాకు తెలుసును."

"దానిమీద నాకు అధికారం లేదు."

"అయితేనేం-మళ్ళీ తిరిగి యిచ్చేస్తానుగా."

లత ఊగిపోయింది. బాధ పడింది. విహ్వాలించింది. కళ్ళుతెరచి జాలిగా యిలా అంది: "నా పెద్దల అభిమానం నావాళ్ళ అనురాగం-అన్నీ పోతాయి. నా వాళ్ళు నాకు కాకుండా పోతారు...."

"వాళ్ళందర్నీ వదిలెయ్యి."

"వదలలేను."

"అయితే మరి....?"

"ఇంకోటి యిస్తాను."

"లాభంలేదు."

ఈసారి అతని కళ్ళల్లో చీకటి. అతని పెదవుల పైన చీకటి. నిర్దయలాంటి చావులాంటి చీకటి.

"వెళ్ళిరానా?" అన్నాడు, అతని స్వరం సన్నగా మెలికలు తిరిగి చీకట్లో గిలగిలలాడింది. గుండెనుండి కారే రక్తాలు పిండుకుంటూ అతను వెళ్ళిపోయాడు. అతని వెనుక మబ్బు లరచుకుంటూ, రాక్షలు లరచు కుంటూ వెళ్ళిపోయారు.

లత ఏడుస్తూ కూలబడింది-మూర్ఛపోయింది.

మళ్ళీ అతను రాలేదు.
లత మళ్ళీ పూయలేదు.
అతని జాడ తెలియదు.
చీకటి అతని ముసుగులా మూసుకుంది.
అతను మళ్ళీ రాలేదు.
అతను మళ్ళీ పిలవలేదు.
అతని పాట అర్ధరాత్రి మబ్బులలోంచి జాలిగా-
ఆమె మూలుగు పాతాళ కుహరంలోంచి బాధగా-
పువ్వులు రాలిపోయాయి. మంచు దట్టంగా పడి మనసులూ, ఆకులూ మూసుకుపోయాయి.
బావురుమనే నిశ్శబ్దం అంతటా....
దేవతలు ఏడుస్తోన్న వర్షం. మనుష్యులు కాలుతూన్న వాసన.
అతన్ని వెతకడానికివెళ్ళినవారికి దారిపొడుగునా అతని గుండె రక్తపు మరకలే కనుపించాయి. కాని అతను మాత్రం కనపడలేదు.
ఆమెను చూడడానికి వెళ్ళిన వారికి గదిలో ఆమె కనపడలేదు. కటిక చీకటి తప్ప.
ఇది ప్రళయం - అంది రాలిపోయిన పువ్వు.
ఇది విలయం - అంది జారిపోయిన చుక్క.
పెట్టెలోపల - గదిలో మూలగా పెట్టెలోపల్లోపల - మణిప్రవాళం మెరుస్తోంది. పక్కన నవ్వింది ఇలా అంది:
"నా శక్తి అనంతమైనది. నేను కరుణనీ, ప్రేమనీ, సౌందర్యాన్నీ నశింప చేస్తాను. దైవీయశక్తుల్ని ఓడిస్తాను. ఈ జగత్తు నాకు దాసి- అవునా?"
అవును అన్నాయి మబ్బులు.
అవును అన్నారు రాక్షసులు.
అవును అన్నాయి చెట్లూ, చెట్లమీద పిట్టలూ భయంగా.
అవును అన్నాయి పువ్వులు ఏడుస్తూ.
ఒక్కసారిగా నిశ్శబ్దం. కఠిన శాసనంలాగా నిశ్శబ్దం. యుగాలదాకా మళ్ళీ ఏ హృదయమూ పలకలేదు. పలవరించలేదు. (స్వాతి. 1963)

# ఓడిపోయిన మనిషి

తెరచి ఉన్న కిటికీలోంచి వొంటిమీద జల్లుపడి చటుక్కున మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి కిటికీలోంచి చూశాను. సన్న చినుకులతో వాన, గాలి మాత్రం తీవ్రంగా వీస్తోంది. సగం నలుపూ, సగం తెలుపూ గల తెలవారగట్ల సన్నని చినుకుల దారాలు గాలిలో కదలిపోతున్నాయి, చెదిరిపోతున్నాయి; ప్రహరీ గోడ దగ్గర మందార పట్టుపువ్వులు ఎర్రగా వానలో తడుస్తున్నాయి. చల్లని గాలికి వొళ్ళంతా ఏదో హాయిగా వుంది. చల్లదనం మనస్సులోకి వెళ్ళి బాధ్యతల్నీ, సమస్యల్నీ, భయాల్నీ దాచుకున్న వేడి సెరిబెల్లాని కూడా చల్లపరుస్తోన్నట్టు అనిపించింది.

కళ్ళు మూసుకున్నాను. ఎవరో మంచుకొండలమీద స్కేటింగ్ చేస్తోన్న దృశ్యం. విశాఖపట్నంలో డాల్ఫిన్స్‌నోస్ దగ్గర తెల్లని ఓడ కదులుతూన్న దృశ్యం. మద్రాస్ కాలేజి ఆవరణలో, ఎవెన్యూలో నడుస్తూన్న దృశ్యం. ఈ మూడింటికీ ఏదైనా సంబంధం వుందా? హాయిలో హాయి అనే పరుపులో నన్ను నేను చుట్టబెట్టుకున్నట్టు ఏదో ఫీలింగ్; ఈ ఫీలింగ్‌ని పోనివ్వకూడ దనుకుంటూనే వొళ్ళు ముడుచుకుంటూ, కళ్ళు మూసుకుంటూ, చల్లని వానని మనసులో కురిపించుకుంటూ, చెయ్యి పక్కకి జాపాను. మెత్తగా ముదురుగా లావుపాటి పాత రబ్బరులాగా చేతికి తగిలింది. అంతవరకూ పక్కమీద నా పక్కనే సుభద్ర పడుకుని వుందన్నమాట మరిచిపోయాను. పంద్రెండేళ్ళ క్రితం తాకగానే కొత్త ఉద్రేకాలూ, రహస్యాలూ నాలో ప్రసరింపచేసిన యీమె శరీరం, ఇన్నేళ్ళ పరిచయంలో, అనుభవింపబడడంలో, పిల్లల్ని కనడంలో వయస్సు పెరిగి ఈనాడు ఆకర్షణని కోల్పోయి "ఇల్లాలు" అనే ఒక

వ్యర్థ గౌరవప్రదమైపోయిన యీమె శరీరం, నా చేతికి తగలగానే వానా, వేకువా, మందారచెట్టూ గబుక్కున మాయమైపోయాయి.

వాటిస్థానే పెళ్ళికి ఎదుగుతూన్న ఆడపిల్లా, టాన్సిల్స్ ఆపరేషన్ చేయించవలసిన చిన్నకొడుకూ, బ్యాంకిలో తరిగిపోతూన్న డబ్బూ, ఎప్పుడూ రిపెయిర్స్‌కొచ్చే కారూ వచ్చి నిలుచున్నాయి. కాసేపుకూడా కల్పనా సుఖాన్ని ఊహించుకోనివ్వని కఠిన వాస్తవికతలా కనపడింది భార్య. ఆమెవైపు తిరిగి చూశాను. వొంటిమీద సగం సగం బట్టతో, రేగిన జుట్టుతో, గృహిణీ ధర్మాన్ని రోజంతా నిర్వహించిన అలసట కనుపించే కనురెప్పలతో, లావెక్కి వొంపులు మాయమైపోయిన వొంటితో జాలిగా కనుపించింది. ఏదో బాధ అనిపించింది. ఎవరో నన్ను దగా చేస్తున్నా రనిపించింది. మాంచి ట్యూన్ వినిపించే రేడియో గొంతుని ఎవరో నొక్కేసి వికటంగా నవ్వినట్టనిపించింది, ప్రథమ యౌవన దినాలు లీలగా జ్ఞాపకం వచ్చాయి. సుతారపు అత్తరువాసనలాంటి జ్ఞాపకాలు – ఆ రోజులు !

మళ్ళీ అటు తిరిగి పడుకున్నాను. చల్లని గాలి మొహానికి తగులుతోంది. వెనక్కి వెళ్ళిపోతున్నాను – ముదిరిన ఏళ్ళ పర్వతాల మీదనుంచి వెనక్కి వెనక్కి లోయల్లోకి, పచ్చిక బయళ్ళలోకి వెళ్ళిపోతున్నాను. రొమాన్సూ, ఆదర్శాలూ, అమాయకత్వం కలిసిన వేడి వేడి రక్తం. పడుచు పిల్లలన్నా, కవిత్వం అన్నా, సోషలిజం అన్నా బలే బలే యిష్టం. జేబు నిండా డబ్బూ, సినిమాలూ పైలా పచ్చీసుగా ఉండేది. భావ కవిత్వం మీదా, సుభాస్‌బోస్ నాయకత్వం మీదా మోజు, ఇంగ్లీషువాళ్ళన్నా, ఉద్యోగస్తులన్నా చిరాకూ, ద్వేషమూ.

ఆ వయస్సులోనే చిన్న చిన్న రొమాన్సులు ప్రారంభం. రెండు కలువ రేకులలాంటి కళ్ళగాని, చివరకి – జవ్వాడే నడుంమీద నాట్యం చేసే వాల్జడగాని కవిత్వంలోకి పంపివేసేది. సామ్రాజ్యవాదాన్ని, సంప్రదాయాన్ని ఎదిరించాలనే సాహసం. కాని మరికొంచెం ఎదిగేటప్పటికి నాకు తెలియకుండానే ఎన్నో జాగ్రత్తలు వచ్చి కూర్చున్నట్టే తెలుసుకున్నాను. లోపల–నా లోపల ఎవడో పెద్దమనిషీ బుద్ధిమంతుడూ అయిన వాడు పరివ్యాప్తమౌతున్నాడు. మెడచుట్టూ కండువా వేసుకుని, కొంచెం

వొంగి, కర్రనానుకుని జీవితాన్ని భద్రంగా ఇటూ అటూ చెదరిపోకుండా తాళం వేసుకుంటున్నాడు. బాలని ప్రేమించాను. అలాగని చెప్పానుకూడా. అయినా చివరకి ఏమీ ఎరగనటుగా తప్పుకున్నాను. పెళ్ళి పందిట్లో ఆ రాత్రి నేను తలనొప్పితో విడిదీ మేడగదిలోనే పడుకున్నాను. అందరూ పందిట్లో వున్నారు. పెట్రోమాక్సులైటు ఆరి పోయింది. కిటికీలోంచి వెన్నెల పడుతోంది. మెట్ల మీద చప్పుడు వినపడింది. ఎవరా అని చూశాను, బాల ! కళ్ళని కాటుకతో, బుగ్గమీద చుక్కతో బాల. నా దగ్గరికి వచ్చి తట్టి లేపింది. ఏమీ ఎరగనట్టుగా "ఎవరూ !" అన్నాను.

"నేను బాలని" ఆమె గొంతులో బాధ, ఆవేశం. "రేపు ఉదయమే నాకు పెళ్ళి అయిపోతోంది."

నేను మాట్లాడలేకపోయాను.

"ఏం, నిద్రపోతున్నావా ?" అంది.

"లేదు."

"ప్రేమించాననీ, పెళ్ళిచేసుకుంటాననీ అన్నావు. పల్లెటూరి పిల్లననీ, ప్రతి మాటా నమ్ముతాననీ, ఏం చేసినా వూరుకుంటాననీ అనుకున్నావా !"

"..........."

"ఏం మాట్లాడవేం ?"

"అదికాదు బాలా, ఇలా జరుగుతున్నందుకు నేనెంత బాధపడుతున్నానో దేవుడికి తెలుసును."

"మరి - ?"

"మావాళ్ళెవరికీ ఇష్టంలేదు. మీ కుటుంబానికీ మాకూ శత్రుత్వముందిట. మీ చిన్నాన్న మా నాన్నని చంపడాని కొచ్చాడుట."

"ఇదివరకు నీకు తెలియదా !"

"తెలియదు."

"అది జరిగి ఇరవై ఏళ్ళయింది. ఇప్పుడు దెబ్బలాటలు లేవుగా, ఒకరిళ్ళ కొకరు వస్తున్నారు. మాట్లాడుకుంటున్నారు...."

"అయినా మావాళ్ళెవరికీ ఇష్టంలేదు."

"మీవాళ్ళంటే.... ?"

"మా నాన్న, అమ్మ, మా అక్కయ్య, అన్నయ్య, మా మేనత్త....ఆఖరికి మా పాలేరుకి కూడా."

"అయితే యీ పళంగా ఎక్కడికేనా పారిపోదాం. నావంటిమీద నాల్గువేల బంగారం వుంది. నిన్ను వొదిలి వుండలేను"

"ఛ-ఛ యిప్పుడెలాగ-నలుగురూ ఏమనుకుంటారు ?"

ఆమె ఏడుస్తూ కూర్చుంది. చాల చాలా అందమైనది. అదొక విలక్షణమైన ఉజ్జ్వలమైన అందం. అటువంటి అందం అన్నిచోట్లా కనుపించదు. నాకు బాధగా వుంది. నిజమే కాని ఎంతమందిని ఎదిరించి, ఎన్ని అడ్డంకుల్ని దాటి నా భవిష్యత్తుని ఏం చేసి యీమెని నాదాన్ని చేసుకోగలను ? కోపంతో మరీ ఎరుపెక్కిన జీరలుగల కళ్ళుకల నాన్న మొహం. నిరసనతో చూసే అమ్మ మొహం, పద్దెనిమిదివేల కట్నంతో జడ్జీగారి సంబంధం. రాజకీయంగా వేసుకున్న ప్లానులు....యివన్నీ ఏమౌతాయి ?

"కిందికి వెళ్ళిపో బాలా, ఎవరేనా వొస్తారు" అన్నాను.

చాల కోపంగా లేచి నుంచుంది. వెన్నెల రేకలో ఆమె పెదవి వణకడం కూడా కనపడింది. కోపమూ ఏడుపూ కలిసిన కంఠంతో "నూతిలో పడి చద్దామనుకున్నాను. కాని తప్పు నీది కాదు. నువ్వు మగవాడివి కాదు. నీకన్నా ఏ వెధవైనా వెయ్యిరెట్లు నయం" అని విసవిస వెళ్ళిపోయింది. సంధించిపోయిన నా లోపల్లోపల యీ సమస్య యిలా పరిష్కారమైనందుకు సంతోషించానో, ఆమె దూరమైపోతున్నందుకు బాధపడ్డానో నాకు తెలియలేదు.

నాలుగేళ్ళ అనంతరం ఆమె చాలా జబ్బుతో జనరల్ ఆస్పత్రిలో వుందని తెలిసి మనసు పట్టలేక వెళ్ళాను. నర్సు వచ్చి "మిమ్మల్ని చూడడానికి వీల్లేదంది ఆమె. మిమ్మల్ని పంపించివెయ్యమంది" అని చెప్పింది. నర్సును బతిమిలాడాను. ఆమె నావల్లనే నా - కోసమే ఇలా అయిపోయిందన్న బాధతో, పశ్చాత్తాపంతో కాలిపోతున్నాను. చివరకి ఆమె దగ్గరకు వెళ్ళాను. వంద కేరెట్ల రత్నాన్ని చెక్కివెయ్యగా చెక్కివెయ్యగా మిగిలిన అణువులా ఆమె కృశించిన శరీరమూ, మోహమూ మెరుస్తున్నాయి. నన్ను చూసి ఆమె పక్కకు తిరిగి పడుకుంది.

"బాలా."

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"నన్ను క్షమించు ఒకటి చెబుతున్నాను. ఏనాడూ నా హృదయం నుండి నువ్వు తొలగిపోలేదు. నేను పిరికివాణ్ణి. కాని ఆజన్మాంతం నిన్ను మరచిపోను. మనసార నేను నీ వాడిని."

ఆమె చెయ్యి చేతిలోకి తీసుకున్నాను. నా మాటలు ఆమె నమ్మలేదు. అవిశ్వాసంతో, ఆశ్చర్యంతో, పెద్దవైన కళ్ళతో నన్ను చూసింది. నాకు కన్నీరాగలేదు.

"వస్తాను బాలా" అని డగ్గుత్తికతో గబగబా ఆమెని విడిచి వచ్చేశాను.

ఒక నెల్లాళ్ళ తర్వాత ఆమె చనిపోయినట్టు తెలిసింది.

ఈ జ్ఞాపకాలతో నా వొళ్ళంతా వేడెక్కిపోయింది. ఊపిరాడనట్టనిపించింది. గది గోడలు దగ్గరగా వచ్చి నన్ను నొక్కుతూన్నట్టు అనిపించింది. లేచి, గొడుగు తీసుకుని వీధిలోకి వచ్చేశాను. వాన యింకా కురుస్తూనే వుంది. స్వేచ్ఛగా విశాలంగా తిరిగివస్తేనే కాని ప్రాణం కుదుట పడుతుందనిపించలేదు. కాలవ వారనే బయలుదేరి వెళ్ళుతున్నాను. కాలవ అవతల మా పొలాలున్నాయి. తెల్లవారిపోతోంది. వాన నీటికి రాత్రి వొంటి రంగు కరిగి తెల్లబడుతూన్నట్టుగా వుంది. రేగడి మట్టి కాలి జోళ్ళకి అంటుకుని బరువుగా అడుగులు వేస్తున్నాను. చల్లని గాలి రివ్వుమని తగులుతూంటే కొంత ఉత్సాహం కలిగింది. ఆకాశం మబ్బులతో నిండి వుంది. కాలవ వారనున్న చెట్ల ఆకులమీదనుంచి జల్లుమని జడి పడుతోంది. కాకులు అరుస్తూ అటూ ఇటూ పోతున్నాయి. కాలవ అవతలివైపున అరటి తోటలూ, వరిచేలూ పొడుగ్గా పరచుకొని అందంగా వున్నాయి.

కర్రవంతెన వచ్చింది – వంతెనకింద కాలవ సుడి తిరుగుతూంటే కొంతసేపు చిత్రంగా చూశాను. వంతెన దాటి పొలంగట్టునే వెళుతూంటే "ఏమండోయ్" అన్న పిలుపు వినిపించింది. వీరన్న మామిడితోటలోంచి ఆ పిలుపు. తోటలో పైన గడ్డికప్పిన యిటికల యింటి ముందరుగుమీద ఎవరో ఆడమనిషి నిలుచుంది. నన్నేనా అనుకున్నాను. తోటలోకి రెండడుగులు వేశాను. అరుగుమీద చామన చాయగా, బొద్దుగా, పొడిపొడిగా ఉన్న

జుట్టు బుగ్గలమీద పడుతూంటే నవ్వుతూ సుబ్బులు. మంచి పొంకంగా, ఆరోగ్యంగా ఉన్న యౌవనం అసూయని కలిగించేటట్టు వుంది. సుబ్బుల్ని నేను చిన్నతనంనుంచీ ఎరుగుదును. అయిదోక్లాసువరకూ నాతో కలిసి బళ్ళో చదువుకుంది. అయినా ఆమె నాకన్నా చిన్నదిగా, చాలా చిన్నదిగా వుంది. పాతికేళ్ళంటే నమ్మతారు సుబ్బులు వయస్సు.

"ఎప్పుడొచ్చావు సుబ్బులూ....?" అన్నాను నవ్వుతూ.

"రావయ్యా లోనికి రా. వర్షంలో తడుస్తూ ఎంతసేపుంటావ్."

నేను తటపటాయించాను.

"ఎవరూ సూడ్డంలేదు. అబ్బో, మా పెద్దమనిషివై పోయావు" కనుబొమ లెగరవేసి చేతులూపుకుంటూ అంది. నేను లోనికి వెళ్ళాను. సుబ్బులు ఇంట్లోంచి ఒక కుర్చీ తీసుకువచ్చి వేసింది.

"సిన్నప్పుడు నువ్వీ దారిని యెల్తావుంటే చెరుకు పానకం ఇచ్చే దాన్ని. గ్యాపకం వుందా ? ఎప్పుడేనా సాటుగా ముద్దెట్టుకుంటావేమో అనుకునేదాన్ని. అయ్యో రాత ఆ సరదాయే లేదు...." ఫక్కున నవ్వు తోంది.

నాకు సిగ్గుగా బెదురుగా వుంది. ఆమె ముందు నేను ముడుచుకు పోతున్నాను.

"అలా సిగ్గుపడుతూ కూర్చో, కొంచం కాఫీ కాచి తీసుకొస్తాను" అంటూ లోపలకు వెళ్ళింది. సుబ్బులు యాసనీ, నాగరికాన్ని కలిపి మాట్లాడుతోంది. అలాగే ప్రవర్తిస్తుంది. పట్టణాల్లో చాలా కాలం వుంది.

సుబ్బులు మొహంలో విచారం తాలూకు నీడకాని, వయస్సు తాలూకు నీరసంకాని లేదు. జీవితంలోంచి ఎంతో సుఖాన్నీ, స్వేచ్ఛనీ పొందినవాళ్ళు తప్ప అంత హాయిగా నవ్వలేరు. ఆమె నాకన్న మూడేళ్ళు చిన్నదైనా పదిహేనేళ్ళు చిన్నదిలా కనపడుతోంది, వింతగా ఆలోచిస్తు న్నాను ఆమెను గురించి.

ఆమె కాఫీ తెచ్చి యిచ్చింది. కాఫీ మంచి రుచిగా వుంది. నా ఎదురుగా ముక్కాలిపీటమీద కూర్చుని జుట్టు విప్పుకుంది. నల్లని జుట్టు వొత్తు వొత్తుగా తరంగాలుగా పిరుదులదాకా ప్రవహిస్తోంది. కళ్ళల్లో ఆరోగ్యపు వెలుతురు, ఆందోళనలు లేని వెలుతురు.

"ఏడెనిమిదేళ్ళయింది నిన్ను చూసి సుబ్బిలూ, రంగడు కులాసా యేనా?" అన్నాను ఆమె భర్తనుద్దేశించి.

ఆమె మళ్ళీ విరగబడి నవ్వింది. "రంగడా! ఇంకా ఆడెక్కడ? బలేవాడివయ్యో తెలియనట్టు మాటాడుతావ్" అంది.

"ఏం, రంగడు పోయాడా" ఆత్రుతగా అన్నాను.

"ఛఛ-దుక్కలా వున్నాడు. నేనే వాడిని వొగ్గేశాను."

"ఏం?"

"నా కిష్టం లేకపోయింది. భయమా?"

"ఇన్నాళ్ళూ మరి ఏం చేస్తున్నావు."

"వీరాస్వామితో గుంటూరు వెళ్ళిపోయాను. అతను పెద్ద మేస్త్రీ. మాంచి డబ్బున్నవాడు కూడా."

"అతన్ని పెళ్ళి చేసుకున్నావా,"

"ఆఁ-గుంటూరులో మాబలేగా వుందిలే. నగలూ బట్టలూ సినీమాలూ-ఓ, దర్జాగా వుండేది. వీరాసామి కూడా బాగుండే వాడు. కాని...."

"అతనితో కూడా చెడిందా."

"అతను దేన్నో మరిగాడు. నాకు శానా కోపం వచ్చింది. నీకింటి దగ్గర దెబ్బలుతిని శాకిరీ సెయ్యడానికి నేనేం యెదవని కానని చెప్పి నా నగలూ డబ్బూ తెచ్చుకుని వేరే వెళ్ళిపోయాను."

"ఇప్పుడు కలుసుకున్నారా మళ్ళీ-"

"ఆడినీ ఒగ్గేశాను."

నేను తెల్లబోయి చూస్తున్నాను.

"అదేంటలా చూస్తావ్! యిష్టంలేని వాడితో కాపురం చేసి ఏడుస్తూ చావనా? నా దగ్గర అటువంటిదీ లేదయ్యోయ్. బతికి నన్నాళ్ళు కులాసాగా బతుకుతా. నా కన్నాయం ఒహరుచేస్తే ఊరుకునేది లేదు."

"మరి యిప్పుడొకర్తివే ఉన్నావా?"

"నువ్వున్నావు కాదయ్యో. నీకోసమే వచ్చినాను. అబ్బ. నువంటే నేటికీ మనసే నాకు, పాడు మనసు...." గమత్తుగా చూస్తూ పవిట కొంగు నోటికి అడ్డం పెట్టుకు నవ్వుతోంది.

"బాగుంది నీ హాస్యం" అన్నాను నేను సిగ్గుపడుతూ.

"బెజవాడ రైల్వేలో పనిచేస్తున్నాడు రాఘవులు. అతనితో వుంటున్నా" అంది మళ్ళీ.

"మనువా?"

"మనువూలేదు శ్రాద్ధంలేదు. నాకంటె చిన్నోడు. అయినా మా అందగాడు. స్టోర్సులో పనిచేస్తున్నాడు. నేనంటే వల్లమాలిన అపేక్ష రాఘవులికి. నొక్కుల జుట్టుతో చిన్న పెదాంతో బలే అందంగా వుంటాడు" అంది అప్యాయత కళ్ళల్లో కనపడేటట్టు. నేను లేచాను. కోర్టు పని వుంది ఇవాళ ఎన్నో కాగితాలు చూసుకోవాలి.

"ఇంకా ఉంటావా సుబ్బులూ."

"మా బాబుని చూసి పోదామని వచ్చాను, రేపో ఎల్లుండో వెళ్ళి పోతాను."

"ఓ సారి మా యింటికిరా. మా ఆవిడను కనిపించు" అంటూ అరుగు దిగాను.

"నే నెందుకొచ్చి చూస్తానూ నా సయితినీ ! సర్లే ఒక్కసారైనా నా కోరిక తీర్చలేదు. అందమైన వాడినని నీకు గర్వం లేవయ్యా." నవ్వుతూ చేతు లూపుతూ అంది.

వానలో తిరిగి యింటికి బయల్దేరాను. ఆమెలో ఆనందానికీ, ఆరోగ్యానికీ, నవ నవోన్మేషతకీ కారణం ఏమిటా అని ఆలోచిస్తున్నాను. జీవితాన్ని తేలిగ్గా సహజంగా తీసుకోవడమా ! కృత్రిమమైన నీతులూ భయాలూ పెద్దరికాలూ అడ్డురాక పోవడమా? ఇంత చదువూ డబ్బూ వుండి నాలో యీ అసంతృప్తి దిగులూ ఏమిటి! ఏదో చెయ్యలేక పోయానన్న వేదన, కలలు కాగితపు పేలికల్లా రాలిపోయిన క్షోభా. చెంపల దగ్గర నెరిసిన జుట్టు క్రమంగా అంతటా తెల్లబడి ముసలి వాణ్ణీ, మృత్యు పథాభిముఖుణ్ణీ, అయిపోతున్నానన్న బెదురూ ఏమిటి యిదంతా? ఎక్కడ నేను జీవిత రహస్యాన్ని మరచిపోయాను? ఏ సమయంలో జీవించడంలోని కీలకం జారిపోయింది. ఈమె – చదువూ, సంస్కారమూ లేని సుబ్బులు ముందు నేను చాతకాని వాడిలా ఎందుకయిపోయాను?

బరువుగా బాధగా అడుగులు వేసుకుంటూ కర్రవంతెన దాటాను. కాలవ వారనే జనం బాగా తిరుగుతున్నారు. వర్షానికి కాకులు తడుస్తూ చెట్ల కొమ్మల మీద వణుకుతూ కూర్చున్నాయి. మనసులో ఆలోచన లేచినకొలదీ అడుగులు వేగంగా వేస్తున్నాను. జీవితపు పందెంలో ఓడిపోయినవాడిని...

(జ్యోతి. 1963)

# సీతాపతి కథ

సీతాపతి తాపీగా కలం తీశాడు. ఒక తెల్లకాగితం తీసుకున్నాడు. ఇటూ అటూ చూశాడు. ఎవరూ లేరు. సోఫాలో బొచ్చుకుక్క కళ్ళు మూసుకుని పడుకుని వుంది. గోడమీద గడియారమూ, గడియారం పక్కనే గాంధీగారి బొమ్మా నిర్మలంగా వున్నాయి. బల్లమీద వెండిగిన్నెలో కాఫీ చల్లారిపోతోంది. కాఫీ తాగి రాయనా, రాశాక తాగనా అన్న ఆలోచనలో ఓ నిమిషం వుండిపోయాడు.

కనుబొమలు కుంచించి, పెదవులు బిగించి, కాఫీ తాగకుండానే కాగితం మీద యిలా రాశాడు.

"పెళ్ళాన్ని చంపెయ్యాలి."

అమ్మయ్య! అనుకున్నాడు. స్థిమితంగా కలం టేబిలుమీద పెట్టి వెండిగిన్నె తీసుకుని కాఫీ ఓ గుక్క తాగాడు. అతనికి వొళ్ళు తేలికపడ్డట్టు అనిపించింది. ఆ ఆలోచన తన మనసులో వుండి తనని బరువుగా అస్థిమితంగాచేసి వేస్తోంది. ఇప్పుడా ఆలోచనని ఎత్తిపట్టుకుని నీట్ గా కాగితంమీదికి దింపేశాడు.

ఆలోచన వుత్తినే మనస్సులో వుంటే పాదరసంలా పరుగెడుతుంది. కంగారుపెడుతుంది. రూపమూ గుణమూ ఉండవు ఆలోచనకి. ఇప్పుడు కాగితంమీద అక్షరరూపం దాల్చేటప్పటికి ఆలోచనకి ఒక మూర్తీ ఒక ప్రాణమూ ఒక వ్యక్తిత్వమూ వచ్చినట్టు అనిపించింది.

మళ్ళీ ఓ గుక్క తాగాడు. కాగితం మీద మళ్ళీ యిలా రాశాడు.

"బొచ్చుకుక్కని చంపెయ్యాలి."

కొంచెం నవ్వుకున్నాడు. తను కొంచెమే నవ్వుతున్నట్లు తెలుసు కొని తిరిగి నవ్వుకున్నాడు. కాఫీ తాగడం పూర్తయేసరికి కాగితంమీద అతని ఆలోచనలు ఇలా వ్రాయబడి వున్నాయి.

"పెళ్ళాన్ని చంపెయ్యాలి.
బొచ్చుకుక్కని చంపెయ్యాలి.
పోస్టు మాన్ని చంపెయ్యాలి.
డాక్టర్ని చంపెయ్యాలి.
పక్కింట్లో వాళ్ళ అబ్బాయిని చంపెయ్యాలి."

సీతాపతి సంతృప్తిగా పడక కుర్చీలో వెన్నువాల్చాడు. ఇటువంటి ముఖ్యమైన అయిదు హత్యలను చేసే గురుతర బాధ్యత తనమీద పెట్టు కున్నాడు. సీతాపతి పనిలేనివాడనీ, చాతకానివాడనీ యింకెవరూ అనుకోరు. పేపర్లో సినీమాహాళ్ళలో, శృంగాటకాలలో తనని గురించే చెప్పుకుంటారు. "అదుగోవాడే సీతాపతి" అంటూ ఆడవాళ్ళు కిటికీల లోంచి చూసిభయంగా గుసగుస లాడుతారు. మళ్ళీ నవ్వుకున్నాడు.

మనిషి అన్నవాడికి సాహసం వుండాలి. ధైర్యం వుండాలి. కత్తిలా దూసుకుపోవాలి. గుచ్చుకు పోవాలి.

"కాఫీ తాగారా ?"-సన్నని మృదువైన కంఠస్వరం గుమ్మంలో తెరవెనుకనుండి.

ఉలిక్కిపడ్డాడు సీతాపతి. తానింకా ప్రథమ కార్యక్రమం అయిన భార్యా హననాన్ని కొనసాగించనేలేదు. ఆమె బతికేవుంది. గుమ్మం తెర చాటునవుంది. భౌతికమైన, ఖచ్చితమైన, యథార్థమైవుంది. తాను వూరికే ఉత్తి ఆలోచనకే తృప్తిపడి పోతున్నాడు. గర్వపడిపోతున్నాడు.

"అయితే స్నానానికి లేవండి. వేణ్ణీళ్ళు తోలిపి పెట్టాను."

"అబ్బ ! బద్ధకంగా వుందే-" అన్నాడు విసుగ్గా. తన బతుకే ఒక విసుగు. ఒక అర్థంలేని పిచ్చిగీత.

తెర తొలగించుకుని "పోనీ టానిక్కు యివ్వనా, స్నానం తర్వాత చేద్దురుగాని లెండి." అందామె.

సోఫాలో పడుకుని వున్న బొచ్చుకుక్కవైపు చూశాడు- దీనంగా. తన భార్య తననీ, ఆ బొచ్చుకుక్కనీ ఒకలాగే పెంచుతోంది. తనకి యిష్టా

యిష్టాలు లేవు. వ్యక్తిత్వం లేదు. తన మనస్సునీ, శరీరాన్నీ ఆమె ఎప్పుడో వప్పగించేసుకుంది. తనకి విముక్తిలేదు. బొచ్చుకుక్కకీ లేదు. కుక్కని చూస్తూన్న కొలదీ తనకి తనే జ్ఞాపకం వస్తాడు. అందుకే తన ఆలోచనలలో రెండవ హత్యకి బొచ్చుకుక్కని లక్ష్యం చేశాడు.

"ఇదిగో తాగండి" పద్మావతి మృదువుగా మందుగ్లాసు నోటిదగ్గర పెట్టింది. లాలనగా తియ్యగా కళ్ళల్లోకి చూసింది. అందులోనూ అందమైన పద్మాలలాంటి కళ్ళతో సింపిల్‌గా నాజూకుగా టాయిలెట్ అయి, దుస్తులు వేసుకున్న ఆమె వొంటిమీద నుండి యుడికిలోన్‌వాసన సుతారంగా వస్తోంది. ఇక్కడే వచ్చింది గట్టిచిక్కు. తన భార్య అసహ్యంగా లావుగా వుండకూడదూ? వెకిలిదీ, వెర్రిదీ కాకూడదూ? అప్పుడు తనకి భర్తగా ఒక ప్రాముఖ్యం అయినా వుండేది. దేవుడు తనమీద కసికొలదీ ఆమెని అందంగా, పొడుగ్గా చేశాడు. తియ్యగా, హాయిగా మాట్లాడుతుంది. అందరికీ పద్మ అంటే ఇష్టం. ఎవరికిష్టం కాదు. పువ్వులతో ఉన్న పున్నాగచెట్టూ, నగిషీల దంతపు గిన్నెలో వున్న అగరువత్తుల గుత్తీ, నక్షత్రాలతో మెరుస్తూన్న శరదాకాశమూ?

మందు తాగాడు. తన జుట్టులోకి వేళ్ళు పోనిస్తూ అంది పద్మ. "వేణ్ణీళ్ళు కాగులో కాగుతూ వుంటాయి. పదిగంటలకి స్నానంచేస్తారా చెప్పండి? ఈలోగా లైఫ్ పత్రిక చదువుకోండి. ఏం?"

ఏ పత్రిక ఎప్పుడు చదవాలో కూడా పద్మ చెపుతుంది. చదివిస్తుంది. ఏం-తాను మాంచి డిటెక్టివ్ నవల చదవకూడదా? పద్మ లైఫ్ పత్రిక అతని చేతికిచ్చింది. విసుగ్గా అందిపుచ్చుకున్నాడు.

"టొమాటో పెరుగుపచ్చడీ, ములక్కాడ సాంబారూ చేయిస్తున్నాను. ఇష్టమేకదూ" అంది పద్మ.

ఎటువంటి బానిస అయినా చరిత్రలో తిరగబడిన ఘట్టాలున్నాయి. చరిత్ర చదివాడు సీతాపతి. స్వాతంత్ర్యం కోసం ప్రాణాలిచ్చిన మహామహులున్నారు తానుమాత్రం!

"నాకు టొమాటో వద్దు" అన్నాడు ధైర్యంచేసి.

"మరేం కావాలీ?"

"గోంగూర పచ్చడి."

"గోంగూర పైత్యం. మీ వొంటికసలు పడదు. డాక్టరేమన్నాడో మరచిపోయారా? అదీకాక టొమాటోలో కాలరీలు వుంటాయి. ఏం, నా బాబు కదూ?" గడ్డం పట్టుకుని గోముగా అడిగింది పద్మ.

"నేను అన్నమే తినను, విషం మింగి చస్తాను"— అని అందామనుకున్నాడు సీతాపతి. కాని పద్మ అంతలో వెళ్ళిపోయింది. వానిస నోరు మూసేసుకోవాలి. లైఫ్ పత్రిక చదవాలి. టొమాటోలు తినాలి. తప్పదు. రాజ శాసనం.

నీరసంగా వెనక్కి వాలిపోయాడు సీతాపతి. తనకి వివాహం అయిన దుర్ముహూర్తాన్ని నిందించుకున్నాడు. పట్టభద్రుడై, ఆస్తిలేక ఉద్యోగం లేక నా అన్నవాళ్ళు లేక (పెంచిన మేనమామ తప్పించి) ఉన్న తనని చూసి వరించి వలచి పెళ్ళి చేసుకుంది పద్మ. పాతిక ఎకరాల ఆస్తితో పెద్ద మేడతో వచ్చింది. ఇదిగాక యింకో ముప్ఫైవేలు ఆమె పేర బ్యాంకిలో ఉన్నాయి. తను అనుభవించే డబ్బూ తిండీ పద్మవి. ఎప్పుడేనా తనని నీచంగా, లోకువగా చూసుందేమో—తన నిరుద్యోగాన్ని హేళన చేస్తుందేమో! అది సాకుగా తీసుకొని దెబ్బలాడి తన అధికారాన్ని నిరూపించుకో వచ్చుననుకున్నాడు. కాని పద్మ ఏనాడూ పల్లెత్తుమాట అనలేదు. పైగా మీరే నా సర్వస్వం అంటుంది. ఆ యింట్లో అలా తింటూ తానుండడమే ఓ మహద్భాగ్యంగా ప్రవర్తిస్తుంది.

"పోనీ పొలం వెళ్ళి మక్తాలు వసూలు చేసుకురానా" అన్నాడొకసారి తనవల్ల ప్రయోజనం ఉందని తనని తానే నమ్మించుకోవాలని.

"మీరా!" పద్మ నవ్వింది. ఆ నవ్వు అలాగ ఆడవాళ్ళే నవ్వగలరు. ఆ నవ్వులో ఆరుగురు ఆనందవర్ధనుల ధ్వన్యాలోకాలు ప్రతిధ్వనించాయి.

"ఏం-ఆమాత్రం చాతకాదా నాకు?" అన్నాడు కోపంగా.

"ఎండలోపడి పొలాలమ్మట ఏం తిరిగిరాగలరు చెప్పండి. అసలే మీరు సుకుమారులాయిరి....పాత బకాయీ లుంటాయి. పైగా రైతులు పండలేదనీ ఏదో యిబ్బంది వచ్చిందనీ, ఏవేవో చెపుతారు, నిజానిజాలు గ్రహించగలిగి వుండాలి. అవసరమైతే బెదరించాలి. కొత్త రైతులకి

భూములు మారుస్తామనాలి....గోవిందయ్య అనుభవం ఉన్నవాడు. నమ్మక మైనవాడు ...."

పద్మ చెప్పుకుపోతూంటే సీతాపతి యింక వినలేకపోయాడు. గోవిందయ్యఅంటే గుమాస్తా. నొసటిమీద నామాలూ, భుజంమీద గళ్ళతువ్వాలూ, చంకలో గొడుగుతో ప్రత్యక్షమయ్యే నడివయస్సుదాటిన ఈ గుమాస్తా తనకన్న తెలివైనవాడా ? నమ్మకమైనవాడా ? తన ప్రశ్నల్నీ, బాధల్నీ మాట్లాడకుండా నమిలి మింగేసి ఊరుకున్నాడు సీతాపతి.

మక్తాలు పద్మ వసూలు చేయిస్తుంది. పన్నులు ఆమె కట్టిస్తుంది. కూరలు ఆమె కొంటుంది. ఒక గుమాస్తా, ఒక పాలేరూ, ఒక వంటావిడా ఆమె సిబ్బంది. జమా ఖర్చు ఆవిడ చూసుకుంటుంది. రాత్రి పడుకోబోయే ముందు ఇంటి తలుపులన్నీ వేసివున్నాయో లేదో ఆమె చూసుకుంటుంది. తనకి క్లబ్‌లో మెంబర్‌షిప్పుకి నెలనెలా రెండు రూపాయలు క్లబ్బు పత్రాడికి ఆమె యిస్తుంది. తను క్లబ్‌కి వెడుతూంటే పేకాడవద్దనీ, అంతగా ఆడితే బ్రిడ్జిలాంటి గేమ్, తక్కువ స్టేక్సుతో వేసుకోమనీ ఓ పదో ఇరవయ్యో తన జేబులో పెడుతుంది. తన మందులు ఆమె కొంటుంది, తన ఆరోగ్యాన్ని ఆమె రక్షిస్తుంది. తన అవసరాన్ని ఆమె నిర్ణయిస్తుంది.

తనకి పనిలేదు. బాధ్యతలేదు. తనకి అస్తిత్వం లేదు.

ఒకరోజున దెబ్బలాడి తన ఉనికి స్థిరపరచుకోవా లనుకున్నాడు. క్లబ్బునుండి ఆలస్యంగా రావాలనే వచ్చి, వక్కపొడి నముల్తూ మంచం మీద పత్రికని తిరగేస్తూ కులాసాగా కనపడిన భార్యని చూశాడు.

"నేను రాకుండా అన్నం తినేసి కూర్చున్నావు. నేనంటే కొంచె మైనా విలువ వుందా నీకు ? ఈ యిల్లు నీది. భూమినీదీ.... నే నెవణ్ని ఉత్తిదానిసని ....వెధవని...నాకొక గౌరవమూ గొప్పా యీ యింట్లో".... కోపంతో గట్టిగా అరిచాడు.

"ఎవరు చెప్పారండీ మీకు. ఈవేళ శనివారం. నేను భోంచెయ్యనని మీకు తెలుసుగా" అంది పద్మ భర్తకేసి ఆత్రుతగా, జాలిగా చూస్తూ.

అతని ప్లానంతా వృధా అయిపోయింది. శనివారం మాట మరచిపోయి ఫూల్ అయిపోయాడు. అయినా ఊరుకోలేదు సీతాపతి.

"అలా జాలిగా మాట్లాడుతావేం? నేను అనాథ ననుకున్నావా, మతి లేనివాడి ననుకున్నావా"

"అదికాదండీ, మీరు కోపంతో కేకలు వేస్తూంటేని. మీ డైజషన్ అసలే పంచిదికాదు. డాక్టరు చెప్పాడు. జీర్ణశక్తి పాడైపోయినప్పుడల్లా కారణం లేకపోయినా ఫిట్సులాగ యిలాగ కోపం, చిరాకూ వస్తూంటాయని ఉద్రేకం అసలు పనికిరాదన్నాడు. ఇలాగ మీరు అలిసిపోతే ఎలాగ చెప్పండి. పోనీ, పళ్ళరసం, గ్లూకోజూ కలిపి ఇవ్వనా, సత్తువ చేస్తుంది."

ఓడిపోయాడు సీతాపతి. ఆమెకి కోపం రాదు. మరీ రెచ్చిపోయాడు సీతాపతి. టేబిల్ మీద వున్న రాధాకృష్ణ విగ్రహం పట్టుకొని నేలకేసి కొట్టాడు. రాధా, కృష్ణుడూ ముక్కలుముక్కలై వియోగం పొందారు.

ఆమె చెదరిపోయింది. భర్త మానసిక స్థితి ఆమెకి ఆందోళన కలిగించింది. అయినా అంతలోనే నవ్వింది.

"ఆ బొమ్మంటే మీ కిష్టంలేదని తెలిసికూడా కొనడం నాదే పొరపాటు. పోనీ బొమ్మ బద్దలైనంత మాత్రాన వచ్చిన నష్టం ఏమిటి. ఈ సారి మీకు నచ్చినదే కొంటాను" అంది.

సీతాపతి గదిలోకి వెళ్ళిపోయాడు. జుట్టు పీక్కున్నాడు. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాడు. అనుకుంటూనే నిద్రపోయాడు. ఆమె వచ్చి కాశ్మీర శాలువ కప్పడమూ, కాళ్ళు వొత్తడమూ అతను నిద్రలో కూడా అలవోకగా గుర్తించాడు.

మధ్యాహ్నం భోజనంచేసి తను మంచంమీద వాలగానే వస్తాడు పక్కింటి వాళ్ళ అబ్బాయి. వాడి పేరు రవి. గుర్రపు జూలు లాంటి జుట్టు కళ్ళమీద పడుతూంటుంది. నన్నుని పెదాలు హేళన చేస్తున్నట్టుగా వుంటాయి. చిన్న లోతైన కళ్ళు- తుపాకీ గుళ్ళలా వొంట్లోకి గుచ్చుకుంటాయి. తీరికగా, బద్ధకంగా, రాజకుమారుడిలా వస్తాడు. ఇటూ అటూ చూస్తూ, తనమీద సూపర్వైజింగ్ ఆఫీసర్ లాగ వచ్చి "హిహిహి" అని పెదవులు మూసి నవ్వుతాడు. నవ్వి "మా అమ్మ నన్ను తిట్టింది" అంటాడు.

"ఏం?" అడిగాడు సీతాపతి "ఏమనీ?"

"పనీ, పాటాలేకుండా పద్మమ్మ మొగుడిలా తయారవుతున్నావు వెధవా" అంది అన్నాడు. నీచోపమకి బాధపడుతున్నట్టుగా. సీతాపతి కోపంతో "నిద్రవస్తోంది, వెళ్ళు" అన్నాడు.

రవి అక్కడున్న లైఫ్ పత్రిక తీసి బొమ్మలు చూస్తూ "అస్తమానూ నిద్దరేనా, నిజంగా మీకు పనీ పాటా ఏం లేదా?" అన్నాడు.

సీతాపతికిఅక్కడున్న సిరాబుడ్డి విసిరికొట్టాలనిపించింది. "నీకెందుకు ఫో కిందికి" అన్నాడు.

"పద్మత్త మీరు నిద్ర పోకుండాచూస్తూండమని చెప్పింది. మీ డైజషన్ బాగాలేదట కదూ."

వొళ్ళుమండి మరోవైపు తిరిగి పడుకున్నాడు సీతాపతి. రవి లేచి యిటూ అటూ తిరిగి "రోజూ నడవకూడదూ మీరు! అన్నమరుగుతుంది. మా సైన్సు వాచకంలో వాకింగ్ చాలా మంచిదని రాశారు" అన్నాడు.

సీతాపతి జవాబివ్వలేదు. ఈ కుర్ర వెధవకి తనింత లోకువ ఎందుకై పోయానా అనుకున్నాడు.

"మీకు ఉద్యోగం ఎవరూ యివ్వరాంటీ, మీకు చేతకాదా?"

"విసిగించకు ఫో" అని గట్టిగా అన్నాడు సీతాపతి. మామూలుగా అడిగితే అంత బాధ లేక పోను, కాని వీడు అడగడంలో, ఆ గొంతులో, ఆ మాటల్ని మెల్లగా వెడల్పుగా ఉచ్చరించడంలో ఒక అవహేళన, భరించరాని అసహ్యం ఉన్నాయి.

"మేం రోజూ చెడుగుడు ఆడుకుంటాం. మీరుకూడా వచ్చి ఆడకూడదూ."

సీతాపతి కోపంగా చూసి "హుఁ" అన్నాడు.

మళ్ళీ బల్లి నవ్వినట్లు నవ్వి "అదీ రాదా. షేమ్ షేమ్" అన్నాడు రవి.

సీతాపతి కోపం పట్టలేక మంచం మీద నుంచి దూకడమూ, రవి పారిపోవడమూ ఒకేసారి జరిగాయి.

రవి వచ్చినప్పుడల్లా యీ మాటలే యీ సంఘటనలే పాఠాంతరాలు పొంది ప్రదర్శిత మవుతూంటాయి. మెట్లమీద వాడి అడుగుల చప్పుడు వినపడగానే సీతాపతి వొళ్ళు భయంతో, అసహ్యంతో ముడుచుకు

పోయింది. వాడు తన మేడ పిట్టగోడ నానుకుని నుంచున్నప్పుడు వెనకాలే వెళ్ళి అమాంతంగా వాడి రెండు కాళ్ళూ ఎత్తి కిందకి పడవెయ్యాలన్న ఉబలాటాన్ని ఎంతో కష్టంమీద అణచుకొన్నాడు సీతాపతి.

మధ్యాహ్నం కునుకుతీసి లేవగానే పోస్టుమాన్ కేక వినపడుతుంది. సీతాపతి గబగబా మెట్లు దిగుతాడు. అప్పటికే పద్మకూడా గుమ్మం దగ్గర కు వచ్చి నిలుచుంటుంది.

పోస్టుమాన్ సీతాపతిని చూసి నవ్వి "మీకేమీ లేవండి సార్. అన్నీ అమ్మగారికే" అంటూ ఓ దొంతర ఆమె కిస్తాడు.

పద్మ వాలిపోయిన సీతాపతి మొహాన్ని చూసి "అదేమిటోయ్. ఆయన్నిబట్టిగదా నాకీ ఉత్తరాలు వచ్చేది? నేనాయన సెక్రట్రీని" అంటుంది.

"ఆయనకేం మహారాజు. హాయిగా తిని పడుకుంటే దొరలా వెళ్ళి పోతుంది. మా దొడ్డ జాతకంలెండి అయ్యగారిది" అని పోస్టుమాన్ చిరు నవ్వుతో వెళ్ళిపోతాడు.

ఆతనెంత మంచి మనస్సుతో అన్నా ఆ మాటలన్నీ ఈటెలై సీతాపతి అభిమానపు గుండెలో గుచ్చుకుంటాయి. గబగబా లోపలికి వెళ్ళి సోఫాలో దిగులుగా కూర్చుంటాడు. పద్మ బెదురుగా మెల్లిగా లోపలికి వచ్చి "ఏమండీ. వీటికి జవాబులు రాసిపెట్టకూడదూ" అంటుంది అతన్ని సంతోషపరుద్దామని.

"నేను రాయను. రాయాల్సిన అవసరం నాకేమీ లేదు. అసలు ఆ ఉత్తరాలెందుకో, సంగతీ సందర్భాలేమిటో నాకేం తెలుస్తుంది?" అంటాడు పెడసరంగా సీతాపతి.

అతని కెవరూ ఎందుకు ఉత్తరాలు వ్రాయరో అతనికి అంతు పట్టదు. తాను వ్రాసిన ఉత్తరాలకికూడా భార్య పేర జవాబు వస్తుంది. కర్మ! "మీ ఆయన కోరిన పుస్తకం ఈ ఊళ్ళో లైబ్రరీలో కాని, బుక్ సాల్ లోకాని లేదు అని చెప్పవలసింది" -ఇలా వుంటాయి జవాబులు. ఏడాది పొడుగునా అతనెంతమందికి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా, ఒక్క యిన్సూరెన్సు కంపెనీవాళ్ళు మినహా అతని పేర వ్రాయదు.

ఓ సారి పద్మ వచ్చేఎన్నికలని తలచుకుని "ఏఁవండీ మీరు ఓటెవరికి వేస్తారు?" అంది.

"నాకు ఓటు వుండదు" అన్నాడు మూతి బిగించి సీతాపతి.

"ఏం?"

"నేను మైనరుని. కేరాఫ్ పద్మాదేవిగాడిని."

ఫక్కున నవ్వింది పద్మ. అతన్ని వక్షానికి అదుముకొని "ఛ— అలాగ అనవొచ్చునా, మిమ్మల్ని బట్టి కదా నాకున్న విలువా, పలుకుబడీ, ఉదయం నుండి రాత్రి వరకూ ఇన్ని పనులు చూచుకోగలుగుతున్నానంటే అదంతా మీరిచ్చిన బలమే కదా?" అంది.

ఆమె కళ్ళల్లో మెత్తని వెలుతురు తడితడి నేలమీద నీరెండలా మెరిసింది. కాని సీతాపతి అదేమీ గమనించలేదు. ఆ మాటలోని అర్థమూ, వాటిలో వ్యక్తమైన అపార ప్రేమా అతను తెలుసుకొనే స్థితిలో లేడు. విద్రోహ బుద్ధితో నిండిపోయింది సీతాపతి మనస్సు. అరబ్ దేశాలలో అర్థరాత్రికి అర్థరాత్రి coup (కూప్) జరిపే సేనానాయకుల ప్రవృత్తి అతనిలో భీకరంగా ప్రబలిపోయింది.

అతను కోరినవి తినేందుకు వీల్లేదు. డాక్టర్ నిషేధం వుంది. అతని దినచర్య అతని వశంలో లేదు. డాక్టర్ అంతా ఏర్పరచి వుంచాడు. దాన్ని తూ చా తప్పకుండా పద్మ అమలు జరుపుతుంది. అతనికి తనకేమీరోగం లేదని గట్టినమ్మకం. కాని పద్మకి నమ్మకంలేదు. అజీర్ణంకాని అస్వస్థత కాని ఏమైనా వుంటే నిర్వ్యాపారత్వంవల్ల కలిగిన ఫలితం మాత్రమే అని అతనిఉద్దేశ్యం. దేశంలో, ఖండాంతరాలలో వ్యాపించే రోగాలన్నీ కూడబలుక్కుని అమాయకుడైన అందగాడైన తన భర్త దేహంలోకి ప్రవేశిస్తాయేమో అని ఆమె హమేషా కావలా కాస్తూంటుంది.

ఓసారి అతను క్లబ్బు మిత్రులతో కలకత్తా షికారు వెళ్ళిరావాలని అనుకున్నాడు. ఎంతో ఉత్సాహంతో పద్మతో చెప్పాడు. పద్మమొహం వెలవెలబోయింది. డాక్టర్ని పిలిపించింది.

"మీ ఆయనకి విశ్రాంతి అవసరం—ఇలాగ ఎండలో ప్రయాణం చేయడం మంచిదికాదు" అన్నాడు డాక్టరు.

సీతాపతికి వొళ్ళు మండిపోయింది. తనకి ఉన్నదే విశ్రాంతి; ఆ విశ్రాంతి బరువుకింద అతను నలిగి పోతున్నాడు. వ్యంగ్యంగా మంటగా యిలా అన్నాడు.

"డాక్టర్, చేతనత్వం లేకుండా వుంటే విశ్రాంతి బాగా లభిస్తుంది. అలా మార్చివేయండి గట్టిమందిచ్చి. మీకూ పద్మకి కూడా విశ్రాంతి వస్తుంది."

డాక్టరు చనువుగా తెలివిగా నవ్వాడు. "అమ్మాయ్. చూశావా చిరాకు, Nerves! Nerves!-నాకు నీమీద కక్ష ఏముందోయ్ సీతాపతీ. అంతగా వెళ్ళాలని వుంటే, అమ్మాయినికూడా తోడు తీసుకువెళ్ళు. ఇవీ అవీ తింటూంటే ప్రయాణంలో చటుక్కున ఏ డయాబిటీస్‌లోకో, గాస్ట్రిక్ ట్రబుల్ లోకో దింపుతుంది. మన జాగ్రత్తలో మనం వుండాలి. దేశానికీ దేహానికీ ఎప్పుడూ గట్టి డిఫెన్సు ఉండాలి" అన్నాడాయన. పద్మకి పదేళ్ళనుండి ఫామిలీ డాక్టరాయన. వయస్సు అరవై దాటడం వలన ఆయన అనుభవజ్ఞుడనీ ఆయన చెప్పిన మాటలకి ప్రత్యేక విలువ ఉందనీ పద్మ నమ్మకం.

తాను మిత్రులతో కూడా కలకత్తా సరదాగా వెళ్ళిరావాలని అనుకుంటూవుంటే భార్యనికూడా తోడు తీసుకు వెళ్ళమన్న డాక్టరు సలహాలోని అవమానమూ, అపహేళనా సూదులు గుచ్చినట్లు బాధించింది సీతాపతిని. అసలు ఈ డాక్టరూ, పద్మా కలిసి ఏదో కుట్రచేసి, ముందుగానే పెళ్ళికాక ముందే-నిషేధాల పట్టీ తయారుచేసి-తనమీద ప్రయోగించి తనని అస్వతంత్రుడినీ, అసహాయుడినీ చేసేస్తున్నారని గట్టి శంక కలిగింది సీతాపతికి. ఈ డాక్టర్ని, వృద్ధజంబుకాన్ని-కడతేరిస్తేకాని తన వొళ్ళూ తన మనసూ తనది కావని నిశ్చయం చేసేసుకున్నాడు.

## 2

కమ్యూనిజం యొక్క సిద్ధాంతాలు తెలిసినవాళ్ళకి తెలుస్తున్నవి. Exploitation-అంటే పరపీడన-అంటే ఏమిటో; చావకుండా బ్రతక

కుండా అభ్యుదయ మార్గాన్ని నిరోధించడం ఈ పరపీడన సాధనాల్లో ఒకటి. పద్మ ఓ వేళ మార్క్సిజం క్షుణ్ణంగా చదివి దాని నిజానిజాలు తనమీద ప్రయోగాత్మకంగా ఋజువు చేసుకుంటోందా అని సందేహించాడు. అయితే అతనూ నాలుగూ చదువుకున్నవాడూ, నేర్చుకున్న వాడూను. ధనిక వాదుల్నీ, సామ్రాజ్యవాదుల్నీ మంచితనం ద్వారా మనసు మార్చలేమని మార్క్సు తెగేసి చెప్పాడు. దీనికి విప్లవమూ, హింసాయుతమైన తిరుగు బాటు ఒకటే మార్గం.

అందుకే సాహసుడైన సీతాపతి అయిదు హత్యల్ని చేయాలని సంక ల్పించాడు. కాని ఏ ఒక్కటీ కూడా చేయలేకపోయాడు. ఇందుకు పిరికితనం మాత్రం కారణం కాదు. రేగిన ముంగురులతో, సోగకళ్ళతో ఎర్రని రెండు చిన్న పెదవులతో 'ఏఁవండీ' అని ఎంతో ముద్దుగా పిలిచే లాలించే భార్యని, మీదకురికి, మెడవాటేసుకుని పీక గబుక్కున నొక్కి తఫీమని చంపి వెయ్యడం మరీ ఘోరంగానూ భారతీయ సంప్రదాయానికి సంపూర్ణ విరు ద్ధంగానూ అనిపించింది. అందులో పద్మవంటి పద్మాన్ని ఏ కఠోర హస్తం అయినా నలిపి రేకుల్ని తెంపి పారవెయ్యగలదా!

ఈ సమస్యా పరిష్కారం మార్క్సిజంలో లేదని గ్రహించేశాడు సీతాపతి. ఒక్క గాంధీజం ఒక్కటే అటువంటి క్లిష్ట పరిస్థితిలో దారి చూపించ గలదు! భారతదేశం ధర్మాన్ని విడిచి పెట్టితే తాను భారతదేశాన్నే విడిచి పెట్టి వెళ్ళిపోతానన్నాడు గాంధీజీ. అదే మార్గం ఇప్పుడనుసరణీయంగా తోచింది సీతాపతికి. పద్మనీ, పద్మయిచ్చే సౌఖ్యాన్నీ, భోగాల్నీ, భద్రత నీ, విడిచి తన వ్యక్తి స్వాతంత్ర్య రక్షణార్థమై వెళ్ళిపోవాలనుకున్నాడు.

ఆషాఢ శుద్ధ ఏకాదశీ సోమవారం నాటి సాయంత్రం పద్మతో క్లబ్బుకి వెళుతున్నానని చెప్పి తిన్నగా రైలుస్టేషనుకి వెళ్ళిపోయాడు సీతాపతి. అంతకు ముందురోజున భార్య తన జేబులో పెట్టిన పదిరూపాయల నోటు ఒక్కటే వుంది సీతాపతి దగ్గర. ఏవూరు వెళ్ళాలో ముందే ఆలోచించు కున్నాడు. పెళ్ళి కాకముందు విద్యానంతరం తన సహాధ్యాయుడైన రామ కోటితో కలసి అతని వూరు వెళ్ళాడు. ఎంతో అందమైన వూరది! పెద్ద చెరువూ, కొబ్బరితోటలూ, అరటితోటలూ, స్వచ్ఛమైన పుష్కలమైన గాలీ, ఆ గాలిలాంటి సుఖమైన మనుష్యులూ, పెద్ద కోవెలా, కోవెల నానుకుని

వున్న సత్రమూ-ఆ పూళ్ళో ప్రశాంతంగా తన శేష జీవితం గడపాలను కున్నాడు. రామకోటి అనాడన్నాడు యిలాగ, "ఒరేయ్ సీతాపతి ఏదేనా ఉద్యోగం దొరికేవరకూ యీ పూళ్ళోవుండి ట్యూషన్లు చెప్పుకోరాదూ. దగ్గర్లో హైస్కూలూ, కాలేజీ లేవు. ఎందరో ధనికుల బిడ్డలు మెట్రిక్‌కీ, బెనారస్ పరీక్షలకీ ప్రైవేటుగా కట్టాలని వుబలాటపడుతున్నారు. నెలకి రెండువందలు దొరుకుతాయి నీకు శ్రద్ధవుంటే."

ఇప్పుడైనా తానక్కడ ఆ పూళ్ళో ట్యూషన్లు చెప్పుకొని సుఖంగా జీవించవచ్చుననుకున్నాడు. రామకోటి ధనవంతుడూ. పలుకుబడి గలవాడూ కూడా. ఈ ఏడెనిమిదేళ్ళలోనూ ఆగ్రామంలో హైస్కూలు వెలిసేదుర్యోగం పట్టి వుండదు. ఆ ఊర్లో తనని కాని తన భార్యని కాని ఎరిగున్నవాళ్ళు లేరు. కాబట్టి తన ఉనికి ప్రసారమయ్యే వీలుండదు. అజ్ఞాతంగా హాయిగా బతకొచ్చును అని అనుకున్నాడు సీతాపతి.

ఎటొచ్చీ ఆ పూరు రైలు స్టేషనుకి దగ్గర్లో లేదు. ఫలానా స్టేషనులో దిగి కాలినడకనో, బండిమీదనో నాల్గుమైళ్ళు వెళ్ళితేకాని ఆ ఊరు చేరుకో లేరు. అయితేనేం - రాత్రి పదిగంటలకి ఆ వూరు చేరుకుని రామకోటి యింట్లో హాయిగా పడుకుని....

సీతాపతి మనస్సు చివుక్కుమంది. తను యింట్లో లేకపోవడం ఇంటికి రాకపోవడం చూసి పద్మ ఎంత బేజారై పోతుందో, సోగలైన ఆమె కళ్ళనుండి నిరంతర ధారగా కన్నీరు కారుతూండగా కిటికీలోంచి వీధి వైపు తనకోసం రాత్రంతా చూస్తూ నిట్టూర్పులు విడుస్తూ ఉంటుందో తలచు కునేటప్పటికి ఏదో బాధ కలిగింది. వెనక్కి వెళ్ళిపోదామా అనుకున్నాడు ఓ క్షణం. కాని యింతలో హరిశ్చంద్రుడూ, రామచంద్రుడూ, బుద్ధుడూ మొదలైన భార్యల్ని అమ్మేసిన, వదిలేసిన, విడిచేసిన -ఆర్యవీరులందరూ జ్ఞాపకంవొచ్చి అతన్ని కర్తవ్యపరుణ్ని చేశారు.

రైలు వేగంగా వెళ్ళిపోతోంది. కొత్తగా సంపాదించుకున్న స్వేచ్ఛతో అతనికి రైల్లో మనుష్యులూ ఇటూ అటూ, పొలాలూ,కొండలూ అన్నీ కొత్తగా ఉత్సాహంగా అనిపించాయి. మందు తీసుకోమనీ, కంది పచ్చడి తినకూడదనీ, రాత్రి పది దాటాక మేలుకోకూడదనీ ఇలాగ అడు

గడుక్కీ అడ్డంకులు, నిషేధాలూ లేని స్వర్గంలోకి సజీవంగా ఎగిరిపోతూ న్నట్టు అనిపించింది సీతాపతికి. చల్లనిగాలి వొంటికి తగిలింది. ఏఁవిటా అని ఆకాశంకేసి చూశాడు. మబ్బులు నల్లనల్లగా, దొంతర్లుగా క్రమ్ముకుంటు న్నాయి. గాలి వేగం హెచ్చింది. కోపన అయిన ప్రియురాలు చెంపమీద విసురుగా కొట్టినట్టుగా మొహానికి చురుకుగా తగులుతోంది చల్లగాలి. భావు కుడైన సీతాపతి మనస్సు ఆనందంతో ఆలోచనలతో నిండిపోయింది.

రాత్రి ఎనిమిది గంటలకి ఆగవలసిన స్టేషన్‌లో ఆగింది రైలు. ఊహాలోకంలోంచి చటుక్కున విడివడి సీతాపతి రైలు దిగేటప్పటికి కాని అతనికి వర్షం కురుస్తోన్నట్టు తెలియలేదు. ఆషాఢమాసంలో మేఘాలు మేఘాల్లా వుండిపోక వర్షం అనే రూపాంతరం పొందుతాయన్న సంగతి అతను ఇందాకటి ఉత్సాహంలో మరిచిపోయాడు. స్టేషన్ దాటి వచ్చేసరికి ఉన్న ఒకటి రెండు బళ్ళని ఆడవాళ్ళతో దిగిన ఆసాములు చటుక్కున కుదిర్చేసుకున్నారు. సీతాపతికేమీ తోచలేదు. ఇంతవరకూ నీడపట్టున ఒకరి సంరక్షణలో తనని గురించి తాను ఆలోచించుకోవల్సిన అవసరం ఏ మాత్రమూలేని ఒక పరిస్థితిలో బతికిన సీతాపతికి ప్రాక్టికల్‌గా బతికే, ఆలో చించే అలవాటు పూర్తిగా తప్పిపోయింది.

కొందరు వర్షంలో గొడుగులు వేసుకునీ, కొందరు తడుస్తోనూ వెళ్ళి పోయారు. మరికొందరు లోపలే నిలబడిపోయారు. నాలుగుమైళ్ళ దూరం వర్షంలో నడిచి వెళ్ళడం అసాధ్యమూ, అవివేకమూ అనుకున్నాడు సీతా పతి. ఏం చేయాలా అని ఆలోచిస్తూ చూరునుంచి ధారలు ధారలుగా కారు తూన్న వాన నీటిని చూస్తూ నిలబడ్డాడు.

"బాబూ, మీ రెక్కడికి వెళ్ళాలి ?"

ఎవరా అని తిరిగి చూశాడు. తన ప్రక్కనే ఓ కుండలాల బ్రాహ్మణ వృద్ధుడు నిలబడి ఉన్నాడు.

ఫలానా ఊరని చెప్పాడు సీతాపతి.

"నేనూ అక్కడికే వెళ్ళాలి. ఎవరింటికి వెడతారు తమరు?" అన్నాడు వృద్ధుడు, సీతాపతి ధరించిన పల్చని శాంతిపురం పంచెనీ, తెల్లగా మిసమిసలాడే సిల్కు లాల్చీనీ భక్తియుతంగా చూస్తూ.

"ఒక మిత్రుని యింటికి-" ముక్తసరిగా చెప్పాడు సీతాపతి, తన ఆలోచనలు పద్మవైపు పోతూండగా.

కొంతసేపటికి వాన తగ్గింది. వృద్ధుడు గౌరవంగా "వాన తగ్గింది బాబూ, తుంపరకేంలెండి. ఇలాగ కూర్చుంటే రాత్రంతా యిక్కడే జాగారం చెయ్యాలి. రండి అడుగేస్తూ వుందాం. అరగంటలో మన ఊరు వెళ్ళిపోవచ్చును" అన్నాడు.

సీతాపతి సమ్మతించి వృద్ధుడితో బయలుదేరాడు. మబ్బుల మూలాన చీకటి ఎక్కువగా వుంది. వృద్ధుడు తనని గురించి చెప్పుడు పోతున్నాడు. ఆ ఊరి కోవెలకు తాను పూజారిననీ, కోవెలనే ఆనుకుని వున్న సత్రానికి యాజమాన్యంకూడా తనదేననీ, తనకి పిల్లలు లేరనీ, బంధువుల పిల్ల నొకదాన్ని పెంచుకుంటున్నాననీ, దానికి పెళ్ళి చేయాల్సిన బాధ్యత వొకటి తనమీద ఉందనీ....

సగందూరం వెళ్ళేసరికి వర్షం డబడబ మొత్తింది. హోరున కురిసే వర్షంలో యిద్దరూ గబగబా నడవడం మొదలుపెట్టారు.

"అనుకున్నంత పనీ అయిందీ'' అని సాగదీశాడు బ్రాహ్మణుడు వానమీద కోప్పడుతూ.

సీతాపతి తడిసిపోయాడు. పూర్తిగా మొత్తంగా, ఘోరంగా తడిసిపోయాడు. పంచె, లాల్చీ వొంటికిపట్టుకుని పోయాయి. పాపం చన్నీళ్ళ స్నానమైనా ఎప్పుడూ అలవాటు లేదతనికి. లోపల్నుంచి చలి గుబులు గుబులుగా బయలుదేరింది. పద్మ కళ్ళు ఆత్రంగా బాధగా చూస్తూన్నట్టు అనిపించి చలించిపోయాడు. కాని మళ్ళీ ధైర్యంగా, మొండిగా ఊపిరి బిగించి నడవసాగాడు.

ముసలాయనికి ప్రతిరోజూ సూర్యోదయాత్పూర్వం ఎంత చల్లని నీళ్ళల్లో అయినా మునిగే అలవాటేమో, ఈ వర్షం పిసరైనా బాధించలేదు. అయితే ఆయన ఆందోళనల్లా చంకలో తడిసిపోతూన్న మూట గురించి మాత్రమే.

ఊరు చేరుకునేసరికి వర్షమూ తగ్గింది. విద్యుద్దీపాలు మందకొడిగా మెరుస్తున్నాయి. సీతాపతికి ఉత్సాహం వచ్చింది.

"రామకోటి ఇల్లు తెలుసునా తాతగారూ మీకు ?" అని అడిగాడు.

"రామకోటి అంటే ?"

వివరించి చెప్పాడు సీతాపతి.

"అయ్యో నాయనా, ఈ ఊళ్ళో పొలమూ ఇల్లూ అమ్మేసి పట్నం వెళ్ళిపోయాడు రామకోటి తండ్రిపోగానే. మీకు తెలియదా బాబూ?"

సీతాపతి నెత్తిన పిడుగు పడినట్టయింది. ఏ ఆశతో వచ్చాడో ఆ ఆశ సమూలంగా పెకలింపబడినట్లయింది. అతనికి కాళ్ళాడలేదు. మళ్ళీ కడుపులోంచి వొణుకు వచ్చింది.

"అయితే ఎలాగ ఈ రాత్రికి ఎక్కడ బస చెయ్యాలో ఏమో...." తనలో తనే గొణుక్కున్నాడు సీతాపతి.

"ఎంత మాట ! ఎంత మాట ! మీకు లోటు రానిస్తానా ! సత్రంలో బస చేద్దురుగాని" అన్నాడు పూజారి.

ఆ వూరు పల్లెటూరయినా మంచి రోడ్లతో పెంకుటిళ్ళతో అక్కడక్కడ మేడలతో సుఖంగా ధనవంతంగా కనపడింది. విద్యుద్దీపాలు వుండడంవలన ఊరికి ఒక సందడి వచ్చినట్టుంది. పూజారి వెనుకనే వొణుకుతూ సీతాపతి సత్రానికి వెళ్ళాడు.

సత్రంలో ఓ గదిలో ఒక పొడుగాటి మొద్దుబల్లమీద పరుపు అని పొరపాటుగా అనుకొనబడే వస్తువు నొకదాన్నిపరచి, దానిమీద ఓ దుప్పటీ వేసి పక్క తయారుచేశారు పూజారి కుటుంబం. సీతాపతి భోజనం వద్దన్నాడు. కాని వాళ్ళు (భార్యా భర్తా) జమిలిగా బలవంతం చేయగా, విధిలేక అంతకుముందే వాళ్ళిచ్చిన బట్టలు కృతజ్ఞతతో ధరించిన సీతాపతి భోజనానికి లేచాడు. మేకులలాంటి ఎర్రన్నమూ, ఊరగాయా, కూరా రుచి చూసేసరికి తాతలు కనిపించారు సీతాపతికి. వాటిని నమలడం ఒక భారీ పరిశ్రమగా, ముద్ద గొంతు దిగడం ఓ గండంగా గడిచింది. నిజానికి అతనికి ఆకలిగా లేదు. అయినా తినకపోవడం అంత బతిమాలినప్పుడు బావుండదనుకున్నాడు. ఒకరు చెప్పినట్టు చేసే ప్రకృతి అతనిలో సిరపడిపోయింది. భోజనం చేస్తూ సీతాపతి అడిగాడు "ఈ ఊళ్ళో ట్యూషన్లు ఏమైనా మంచివి దొరుకుతాయాండీ ?"

ముసలాయనా, భార్యా తెల్లబోయి ఒకరి కేసి ఒకరు చూసుకున్నారు. సీతాపతి ధనవంతుడన్న వారి అభిప్రాయాన్ని ఆ ప్రశ్న చెదరగొట్టింది. ఇతని వాలకమూ, దుస్తులూ, వొంటి మిసమిసా, వేళ్ళని రాళ్ళు పొదిగిన రెండు ఉంగరాలూ-ఇవన్నీ బ్రతుకుతెరువులేని ఒక ప్రయివేటు మేష్టారి పోలికని నమ్మడం కష్టంగా వుంది. అయినా ముసలాయన తిరిగి ప్రశ్నించగా, ట్యూషన్లు ఇక తన జీవనాధారం అని జవాబిచ్చాడు సీతాపతి. ముసలాయన మనస్సులో చటుక్కున గొప్ప వూహ మెరిసింది. ఇతడు సామాన్యుడే అయితే ఎదిగిన తన కూతురునిచ్చి పెళ్ళిచేసి ఇంట్లో వుంచుకుంటే....? ఎదిగిన ఆ పెంపుడి కూతురే ఇప్పుడు పడ్డన కావిస్తోంది. పళ్ళు కొంచెం ఎత్తూ, కళ్ళు కొంచెం చిన్నవీ అయినా భారీగా కన్ను చెదిరేట్టుగా వుంది. ముసలాయనకీ పిల్ల-సుబ్బలక్ష్మి అంటే ఎంతో ప్రేమ.

"ట్యూషన్లా! వాకబుచేద్దాం నాయనా, నలుగుర్నీ అడిగి తెలుసుకుంటాను. ఇంతకీ మన దేవూరు నాయనా?"

సీతాపతి సరీగా జవాబివ్వలేదు. మజ్జిగ చల్లగా కడుపులో పడేసరికి మళ్ళీ వణుకు వచ్చింది. ఎలాగో కళ్ళు మూసుకు తినేసి గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. సుబ్బలక్ష్మి వచ్చి కంచెంబుతో నీళ్ళు అతని పక్కదగ్గర పెట్టి వెళ్ళిపోయింది.

తెల్లవారి లేచేటప్పటికి సీతాపతి కళ్ళు మంటలుగానూ, వొళ్ళు నొప్పులుగానూ వుంది. అప్పటికే ముసలాయన మూడుసార్లు వచ్చి చూశాడు సీతాపతి లేవాడేమోనని. రాత్రి ఆయన భార్యతో సంప్రతించాడు, సీతాపతిని అల్లుణ్ణి చేసుకునే విషయమై.

"కుర్రవాడు బుద్ధిమంతుడూ, మంచివాడూ, నా అనేవాళ్ళెవరూ లేనివాడూ అయివున్నాడు. కట్నం ఏమీ అడగడు బహుశా. అడిగినా ఇచ్చుకొనే స్థితిలో మనం లేంకదా. ఏమంటావ్?" అన్నాడు.

"సెబాస్" అంది ముసలావిడ.

చాటుగా ఈ సంభాషణని ఆలకించిన సుబ్బలక్ష్మికి వొళ్ళంతా విద్యుత్తు పాకినట్టయింది. సిగ్గు దొంతరలు దొంతరలుగా వొళ్ళంతా వ్యాపిం

చింది. ఈ పెంపుడు తండ్రి తనకింక పెళ్ళిచేయగలడనే నమ్మకమూ, ఆశా లేదు ఆమెకి. దిగులుగా వుంది. ఇప్పుడు వయస్సులో కొంచెం పెద్దవాడైనా, అందగాడైనవాడూ, చదువుకున్నవాడూ భర్తగా దొరుకుతాడన్న ఆశ ఆ వర్షాకాలంలో ఆమె గుండెల్లో వసంతాగమనాన్ని సూచించింది.

సీతాపతి కళ్ళు తెరచి మళ్ళీ మూసుకున్నాడు. అతనికి వొళ్ళు స్వాధీనంలో ఉన్నట్టు లేదు. ఊరికే కళ్ళు మూసుకుని నిద్రపోవాలని ఉంది. ఏదో కొత్తగా, చిరాకుగా వుంది. ట్యూషను మంచివి సంపాదించుకోవాలన్న తహ తహ మనస్సులో ఎక్కువైపోతోంది, గది కిటికీలోంచి ఎండ నేలమీదకి పాకింది.

"నాయనా లేచావా!" అన్నాడు నాల్గోసారి వచ్చిన ముసలాయన.

సీతాపతి లేచి కూర్చున్నాడు.

"అమ్మాయి నీకు కావల్సినవన్నీ చూస్తుంది బాబూ. మొహమాట పడకు. ఇది నీ ఇల్లే లనుకో" అన్నాడు ముసలాయన.

"అలాగేనండి."

కాసేపట్లో "కాఫీ తీసుకురానాండీ" అన్న సన్నని గొంతుక తలుపు చాటునుంచి వినపడింది. ఉలిక్కిపడి తలెత్తాడు. సుబ్బలక్ష్మి ఎడం జబ్బా, చీర కుచ్చెళ్ళూ కనపడుతున్నాయి.

"ఊఁ" అన్నాడు సీతాపతి.

సుబ్బలక్ష్మి ఇచ్చిన కాఫీ నోట్లో పోసుకుని తెల్లబోయి ఆమెకేసి చూశాడు.

"ఏమిటిదీ?" అన్నాడు.

"కాఫీ అండి."

ఈ ద్రవాన్ని ఏమని పిలిచినా అతనికి బాధలేకపోవును. కాని బాధనీ కాఫీనీ గుటకవేశాడు తప్పనిసరిగా.

"బావులేదా?" అంది పెళ్ళికూతురు సిగ్గుగా.

"బావుంది" అన్నాడు అరుచిని నోట్లో అనుభవిస్తూ.

"మరికాస్త కలిపి తీసుకురానాండీ?"

"వద్దు వద్దు" అన్నాడు కంగారుగా.

కాఫీతాగి తలెత్తి చూశాడు. తలుపు చాటునే ఉందామె.

"మీరింక బట్టలేమీ తెచ్చుకోలేదా?"

"లేదు-" సీతాపతికి తన పొరపాటు తెలిసింది. కట్టుబట్టలతో ఇల్లు వదలి వచ్చేశాడు.

"రాత్రి విప్పేసిన మీ పంచె, లాల్చీ ఉతికిపెట్టనా?" అంది సుబ్బ లక్ష్మి. సీతాపతి రేగిన జుట్టునీ, వెల్లని పొంటినీ చూస్తూ ఆప్యాయంగా.

"ఊఁ...." అన్నాడు సీతాపతి. ఈ కించిత్పరిచిత కన్యమీద అతని హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.

సీతాపతి ఊళ్ళోకి వెళ్ళి రామకోటిని గురించి, ట్యూషన్ల గురించీ వాకబు చేదామనుకున్నాడు. ఈ పూజారి ఇంట్లో తిష్టవేయడం ఎంత నిర్లజ్జా కరమో అతనికి తెలియకపోలేదు. మంచం మీదనుంచి లేచాడు. గుమ్మం వరకూ వచ్చాడు తల తిరిగింది. కణతలు టకటక కొట్టుకున్నాయి. ఒళ్ళు వణికింది. వెనక్కి వాలిపోయాడు మంచంమీద. తనకి తీవ్రంగా జ్వరం- రాత్రి వానలో తడిసిన కారణంగా వచ్చిందని తెలుసుకున్నాడు. హతాశుడై పోయాడు. బెదరిపోయాడు కూడా. మెత్తని పరుపులతో మంచమూ, డాక్టర్లూ, నౌకర్లూ, వీళ్ళందరిపైనా వేయికళ్ళతో కనిపెట్టే పద్మ మనసులో మెదిలారు. అయితే తన ఈ పరిస్థితికి పద్మే కారణం అని తీర్మానించు కున్నాడు. అతనిలో పద్మమీద కసి విపరీతంగా పెరిగిపోయింది. రాత్రి జేబులోనే తడిసిన డైరీ తలవేపునుండి తీశాడు. తెరిచాడు. తడితడిగా వున్న ఒక పేజీమీద యిలా రాశాడు.

"పద్మ రాక్షసి"

అతని మనస్సులో ఒక్కసారిగా అతనికే జాలి కలిగింది. అతనికి చచ్చిపోవాలనిపించింది. అప్పటికి గాని పద్మకి పశ్చాత్తాపం కలగదు. పశ్చాత్తాపం ఎందుకు కలగాలో అతను స్పష్టంగా ఆలోచించలేదు, కాని కలగాలని మాత్రం అనుకున్నాడు. అతని కళ్ళు తడి అయ్యాయి. సీతాపతి అనే ఉత్తముడికి కలగవల్సిన కష్టాలు కావు ఇటువంటివి అని నచ్చచెప్పు కున్నాడు. మళ్ళీ డైరీలో యిలా రాశాడు :

"ఒకవేళ నేను చచ్చిపోతే-కాకినాడ సూర్యారావుపేటలో వున్న నా భార్య అనగా పద్మాదేవి ఇంట్లోవున్న నా తాలూకు స్వంత ఆస్తి అయిన పుస్తకాలు ఏదేనా గ్రంథాలయానికి నా పేర నివ్వవల్సింది."

భోజనం వేళకి పూజారి వచ్చి చూశాడు - సీతాపతి అస్వస్థతకి ఎంతో ఆతృత కనపరిచాడు. భార్యతో కలిసి ఆలోచించి సుబ్బలక్ష్మి చేత మిరియం, వాము మొదలైన వాటితో కషాయం తీయించి ముగ్గురూ సీతాపతి దగ్గరకు వెళ్ళి తాగమని బలవంతం చేశారు. దీనంగా చూశాడు సీతాపతి దేవుడి దిక్కువైపు. తేనె, గ్లూకోజు, పళ్ళరసం లాంటి అనుపానాలు లేకుండా అతను తలనొప్పి మాత్ర అయినా మింగలేదు. ముసలాయన ఆదేశంతో, సుబ్బలక్ష్మి తలాపి దిక్కున కూర్చుని సీతాపతి తల ఎత్తి నోట్లో చప్పున పోసింది కషాయం. సుబ్బలక్ష్మికి వొళ్ళంతా పులకలూ, సీతాపతికి చెమటలూ పట్టాయి.

"నీకు దగ్గరవాళ్ళెవరేనా ఉన్నారా నాయనా. కబురంపనా" అన్నాడు ముసలాయన-

"లేరు" అన్నాడు సీతాపతి.

ముసలాయన కోరుకుంటున్నదీ యిదే. నలుగురున్నవాడూ, నాలుగూ వున్నవాడూ తనకి అల్లుడయేందుకు సులువుగా అంగీకరించడని ఆయనకి తెలుసును. కోవెలలో అర్చకుడిగా తానిన్నాళ్ళూ చేసిన సేవకి భగవానుడి అనుగ్రహం ఈ సీతాపతి రూపంలో కలిగిందని నమ్మకం కలిగింది ఆయనకి.

"అయితే నువ్వొంటరివాడివే అన్నమాట. సంసారమూ, జంజాటమూ ఏవీ లేవన్నమాట."

"నా కెవ్వరూ లేరండి - ఎవ్వరూ...." నొక్కిపలికాడు సీతాపతి. అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ముసలాయన ముసలావిడకేసి, ముసలావిడ సుబ్బలక్ష్మివైపూ సాభిప్రాయంగా చూపుల్ని బట్వాడా చేశారు. సుబ్బలక్ష్మి సిగ్గుపడింది.

"జ్వరం తగ్గిపోతుంది నాయనా. జలుబున వచ్చి వుంటుంది. ఏమీ కంగారుపడకు నీకేలోటు రానివ్వను. ఇంక ట్యూషన్లన్నావూ — బోలెడు దొరుకుతాయి. జ్వరం తగ్గాక యిద్దరం కలసి పెద్ద లందర్నీ కలుసు

కుందాం. ఈ సత్రం వసారాలోనే చదువుకునే పిల్లల్ని పిలిచి పాఠాలు చెప్పొచ్చును. దివ్యంగా వుంటుంది'' అని భరోసా యిచ్చాడు పూజారి.

సుబ్బలక్ష్మి సీతాపతికి ఎప్పుడు ఏం అవసరమో అని ఆ గది ఛాయలనే రోజంతా తిరుగుతోంది. సాయంత్రం పూజారి వచ్చి మళ్ళీ కషాయం యిప్పించాడు. ఈసారి ఏవో ఆయుర్వేదపు మాత్రల్ని కూడా మింగించాడు. రాత్రికి జ్వరం ఎక్కువైంది. వొళ్ళు నొప్పులూ ఎక్కువయ్యాయి. సీతాపతి పూజారితో నీరసంగా యిలా అన్నాడు.

"ఖర్చులకి భయపడకండి. నా వేలి ఉంగరాలు రెండూ మీరు తీసుకోండి. ఒక ఇంగ్లీషు వైద్యుడిని పిలిపించండి. తెలుగు మందులు నాకు పడవు తాతగారూ!''

"ఎంత మాట, ఎంతమాటన్నావునాయనా. ఈ మాత్రం దానికి మేం చెయ్యలేమూ. మేమేమైనా పరాయివాళ్ళమా, రేపు ఉదయమే ఫస్టుక్లాసు డాక్టర్ని తీసుకొస్తాను. ఆంజనేయులు సామాన్యుడుకాదు. గొప్ప హస్తవాసి ఉన్నవాడు. ఒక్క ఇంజక్షన్ యిచ్చాడా, జ్వరం పిలక పుచ్చుకుని లాగినట్టు చర్రున దిగిపోతుంది."

సీతాపతి తలవూపి కళ్ళు మూసుకున్నాడు.

"చూడు నాయనా, నీతో మనసులోమాట చెప్పకపోవడ మెందుకూ? మా సుబ్బలక్ష్మి వుంది చూడు మహా ఉత్తమురాలు. దానికి పెళ్ళిచేసే బాధ్యత నాదేకదా. పిల్లకి పెళ్ళిచేసి, పిల్లనీ, అల్లుణ్ణీ యింట్లో పెట్టుకొని. వాళ్ళని చూసుకుంటూ రామా కృష్ణా అంటూ కాలక్షేపం చేయడమే నా అభిమతం. నీకూ ఎవరూ లేరు. సుఖంగా యిక్కడే వుండిపోవచ్చును. మా పిల్ల వొళ్ళు దాచుకునే మనిషి కాదు. శ్రద్ధగా నిన్ను కనిపెట్టుకుని ఇంటిపనులన్నీ దివ్యంగా చూసుకుంటుంది. నెలకి వంద తక్కువ కాకుండా నీకు ట్యూషన్ల మీద జీతం వచ్చేటట్టు చూసే పూచీ నాది. మూప్పైయేళ్ళు పైగా యీ పూజాపునస్కారాలు చేస్తూ నలుగురిలో ఓహో అనిపించుకున్నానే కాని వేరుకాదు. మా అల్లుడు చదువుకున్నవాడు, పాఠాలు చెప్తాడు అంటే ఎగిరి గంతేసి వస్తారు. ఏమంటావ్ పిల్లదాని వొంటిమీద రెండు

తులాల బంగారం వుంది. కడుపున కన్న పిల్లలా చూసుకుంటున్నాం నాయనా. అంగీకారమేనా నీకు ?''

ముసలాయన వుండబట్టలేక తన అభిలాషని తెలియజేశాడు. సీతాపతి ఊఁ అంటే ఆయన జీవితాన్ని వేధించే ఒకే ఒక సమస్యకి పరిష్కారం దొరికి శాంతి సుఖాల్ని పొందగలడు. సీతాపతి చెప్పినదంతా విన్నాడో లేదో తెలియదు. జ్వర తీవ్రత, తలనొప్పి, మనసులో తెలియని కసి. దాని పక్కనే కొండంత దిగులూ – యిన్నింటితో మనస్సు మనస్సులో లేని ఒక దయనీయ పరిస్థితిలో వున్నాడు. ముసలాయన 'ఏమంటావ్ నాయనా' అని మళ్ళీ రెట్టించి అడగ్గానే తల వూపాడు. ఎందుకు వూపాడో సీతాపతికి తెలియనే తెలియదు. కానీ పూజారి మొహంలో సంతోషపు వెల్తురు అలము కుంది.

సుబ్బలక్ష్మి వింటూండగా భార్యతో సీతాపతి అంగీకారాన్ని తెలి పాడు పూజారి. ఆవిడ సుబ్బలక్ష్మిని కౌగలించుకొని బుగ్గలు పుణికి దీవనలు కురిపించింది.

మూడవరోజు ఉదయం సీతాపతి ఇల్లువదలి రెండురోజులు పూర్తి అయాయి-ఉత్సాహంలాంటి లేతఎండ ఇళ్ళమీదా, చెట్లమీదా, పొలాలమీదా, సీతాపతి పడుకున్న కిటికీ అంచులమీదా సమబుద్ధితో ప్రసరించినా గ్రామం అంతా చైతన్య కోలాహలంలో మునిగివున్నా. సుబ్బలక్ష్మి తలదువ్వు కుంటూ పాటలు పాడుకుంటూన్నా ఒక్క సీతాపతి మాత్రం ఆ ఆనందాన్ని పంచుకోలేక పోయాడు. పైగా బరువుగా మూలిగాడు. జ్వరం ఏమాత్రం తగ్గలేదు. అతనికి వొంటిమీద ఎవరో కాల్చిన ఇనుప కడ్డీలతో వాతలు పెడుతూన్నట్టు వుంది. సుబ్బలక్ష్మి తీసుకొచ్చి యిచ్చిన కాఫీ చేదుగా హాలాహలంలా వుంది. మరి కాసేపటిలోనే పూజారి ఇంగ్లీషు వైద్యుడు ఆంజనేయులుని తీసుకొచ్చాడు.

"చూడు నాయనా, డాక్టరుగారు వచ్చారు'' అన్నాడు పూజారి.

సీతాపతి కళ్ళు తెరిచాడు. ఎదురుగా పంచెకట్టుమీద రంగుచొక్కా, దానిమీద ఇంకో రంగుకోటూ, చేతిలో స్టెతస్కోపూ, మరో చేతిలో

మందుల సంచితో ఆంజనేయులు కనిపించాడు. గుబురుగా పెరిగిన కను బొమ్మలూ, లావాటి పెదవులూ, సగం బట్టతలా, సన్నంగా మనిషి, చాలా అసందర్భంగా వదులుగా వున్న అవయవాలూ సీతాపతి నీరుకారి పోయాడు.

ఆంజనేయులు నవ్వుతూ "మీకు ఏ వైద్యం కావాలి'' అని అడిగాడు.

ప్రశ్నార్థకంగా చూశాడు సీతాపతి.

"ఆంజనేయులుగారు ఇంగ్లీషు వైద్యమొక్కటే కాదు నాయనా, హోమ్యోపతీ, ఆయుర్వేదం, యునానీలో కూడా సిద్ధహస్తులు. ఏమైనా ఇంగ్లీషు వైద్యానికే గిరాకీ యిక్కడ. నాలుగేళ్ళు పట్నంలో కాంపౌం డరుగా వుండి వైద్యంలోని మెలకువలన్నీ గ్రహించేశారు. మహా సూక్ష్మ బుద్ధి. గ్రామం అంతా వైద్యానికి వీరిమీద ఆధారపడి వుంది. పది పదిహే నేళ్ల అనుభవం వుంది.''

సీతాపతి నిస్పృహతో తలవూపాడు. కాకినాడలో పెద్ద డాక్టర్లందరూ ఠపాటికి తన పాదాల దగ్గరుండేవారు కదా అని లోపలే వాపోయాడు.

ఆంజనేయులు భయంలేదని చెప్పి మాత్రలిచ్చి, తగ్గకపోతే యింజీ షన్ (ఆంజనేయులు అలాగే వుచ్చరిస్తాడు) యిస్తానని చెప్పి వెళ్ళి పోయాడు.

మధ్యాహ్నం వేళకి సీతాపతికి నీరసంగా ఆకలిగా అనిపించింది. గుమ్మం అవతల సుబ్బలక్ష్మి కుంపటి అంటించి సీతాపతి తాగడానికి వేడి నీళ్ళు కాస్తోంది. "అమ్మాయ్'' అని పిలిచాడు. సుబ్బలక్ష్మి పవిట సవ రించుకొని కాస్త దూరంగా నిలబడింది.

"నాకు ఆకలేస్తోంది'' అన్నాడు మెల్లగా.

"కాఫీకాచి తీసుకురానా?''

"వద్దు నాకు తినేందు కేమైనా కావాలి."

"అయ్యబాబోయ్, అన్నం తినకూడదు. లంకణం వుండా లన్నాడు నాన్న."

"పోనీ అన్నం వద్దు-ఇంకేమైనా—" బతిమాలుతూ చూశాడు. సీతాపతి.

"జంతిక లున్నాయి."

"కాసిని తెచ్చిపెట్టు."

తటపటాయించింది సుబ్బలక్ష్మి.

"ఎవరికీ చెప్పొద్దు. ఏదేనా తింటేగాని నాకు జ్వరం తగ్గదు."

సుబ్బలక్ష్మి చాటుగా రెండురోజుల క్రితం చేసి డబ్బాలో దాచిన జంతికల్ని భక్తియుతంగా సీతాపతి చేతిలో పెట్టింది. కర కర నమిలి గ్లాసుడు మంచినీళ్ళు తాగి నిద్దరపోయాడు సీతాపతి. పద్మ వుంటే పండో, రొట్టె (బ్రెడ్) గాని ఇచ్చివుండేది. కాని ఆ సదుపాయాలు ఇక్కడ వీళ్ళకి తెలియవు, అర్థంకావు అనుకున్నాడు సీతాపతి.

సీతాపతికి మెలకువ వచ్చేసరికి చీకటి పడుతోంది. అతనికి తల బోటుగా దిమ్మగావుంది. వొళ్లు కాలిపోతోంది. అతనికి పరిసరాలూ, పరిస్థితులూ అన్నీ మసకగా వున్నాయి. ఆంజనేయులు వచ్చి జ్వరం చూసి నూటనాలుగు డిగ్రీ లుందనడం, ముసలాయన ఆత్రుతగా ఏవేవో అనడం, సుబ్బలక్ష్మి తడిగుడ్డ తలమీద వేయడం-ఇవన్నీ ఎక్కడో ఎవరిని గురించో జరుగుతూన్నట్టు ఉంది సీతాపతికి.

రాత్రి సీతాపతి పక్కగానే తనపక్క వేయించుకున్నాడు ముసలాయన. సుబ్బలక్ష్మి తలాపి దిక్కున కూర్చుని తల రాస్తోంది. ముసలావిడ భయం భయంగా గుమ్మం అవతల కూర్చునివుంది. సీతాపతి అశాంతిగా నిద్రలోనే దొర్లుతున్నాడు. కలవరిస్తున్నాడు. పద్మ అంటున్నాడు. హత్యలంటున్నాడు. సందర్భంలేని ఆ మాటలకు అందరూ హడలిపోతున్నారు.

"సంధి లక్షణాలేమో" అంది ముసలావిడ.

"ఆంజనేయులుగార్ని పిలుచుకొస్తాను." అంటూ ముసలాయన రంగారుగా వెళ్ళాడు.

సుబ్బలక్ష్మి కనుకొలకులలో నీరు నిండింది. అయిదారేళ్ళ నుండి తండ్రి తనకి వివాహ ప్రయత్నాలు చేసి చేసి విఫలుడయ్యాడు. ఇన్నాళ్ళకి-ఇన్నేళ్ళకి తనకి మొగుడంటూ ఒకడు దొరికే అదృష్టం కలిగి-ఇంతలోనే

వంచించబడడంలోని అవమానమూ, బాధ ఆమెని దహించి వేస్తున్నాయి. మనసులో వేయి దేవుళ్ళకి మొక్కుకుంది.

ఆంజనేయులు వచ్చి చూసి ఇంజక్షన్ యిచ్చి ఫరవాలేదని చెప్పి వెళ్ళాడు. ముసలాయన మెలకువ వచ్చిన సీతాపతికి ధైర్యం చెప్పాడు. సీతాపతికి మళ్ళీ నిద్రపట్టింది నిద్రలో మళ్ళీ కలవరింతలు....

తల పట్టుతూన్న సుబ్బలక్ష్మికి తలగడ కింద డైరీ చేతికి తగిలింది. "ఏదో పుస్తకం నాన్నా" అంటూ తండ్రికిచ్చింది. ముసలాయన కళ్ళజోడు సవరించుకొని డైరీ పేజీలు పరిశీలించాడు. దీపకాంతిలో వేగంగా మారుతున్న ఆయన ముఖ కవళికల్ని సుబ్బలక్ష్మి తల్లీ తదేకంగా పరికిస్తున్నారు. ముసలాయన ముఖంలో భయం, ఆశ్చర్యం పెనవేసుకున్నాయి.

"ఏమేవ్. ఏదీ నా అంగవస్త్రం యిలా పడెయ్యి" అన్నాడు తొందరగా.

"ఏం జరిగిందీ?" అంది ముసలావిడ కంగారుగా.

"ఒంటిగంటకి కాకినాడ వెళ్ళే బండి వుంది. నేను వెళుతున్నాను. ఇతగాణ్ణి జాగ్రత్తగా చూస్తూ ఉండండి. అవసరమైతే ఆంజనేయుల్ని పిలవండి" చెప్పులు తొడుక్కుని గుమ్మంవరకూ వెళ్ళాడు పూజారి.

"ఇంత రాత్రివేళ ఈ ప్రయాణమేమిటీ, అసలేం జరిగిందీ అంట?"

"ఇతగాడికి ఇల్లూ వాకిలీ అన్నీ ఉన్నట్టే కనబడుతున్నాయి. కలవారి కుటుంబంలోంచి వచ్చాడు. నేను ముందే అనుమానించాను ఇక్కడ ఏ ప్రమాదం జరిగినా పీకలమీద కొస్తుంది. ఏ క్రిమినల్ కేసో వచ్చి జైల్లో కూర్చుంటాము."

పూజారి మళ్ళీ జాగ్రత్తగా సీతాపతిని సంరక్షిస్తూ ఉండమని హెచ్చరించి వెళ్ళిపోయాడు. నోరావలించి చూస్తూ ఉండిపోయారు భార్యా కూతూరూ. ఇల్లూ వాకిలీ అన్నాడేకాని భార్య ఉందా లేదా అన్న సందేహంతో సతమతమౌతూంది సుబ్బలక్ష్మి.

మరునాడు మధ్యాహ్నంవేళకి సీతాపతి చుట్టూ కూర్చున్న ఆంజనేయులూ, సుబ్బలక్ష్మి. ముసలావిడ తమ గుమ్మం ముందు కారు ఆగినప్పుడు

విని ఆతృతగా వచ్చారు. ఒక పెద్ద టాక్సీ ఆగివుంది గుమ్మంలో. పూజారి ముందుగా దిగాడు. వెనకాలే పద్మ, పద్మ తర్వాత స్టెతస్కోపు చేత్తో పట్టుకొన్న ఫామిలీ డాక్టరూ, గుమాస్తా గోవిందయ్యా దిగారు. గోవిందయ్యా, డ్రైవరు కలసి రెండు మూడు బుట్టల సామానూ, హోల్డాలూ వగైరాలు దింపారు.

"ఎలా ఉంది ఆయనకి?" ముసలావిడని అడిగింది పద్మ. ఆ గొంతులో ఆతృత, వేదనా యుగయుగాల్నీ దశదిశల్నీ చీల్చుకుపో గలదు.

"సెతాపతిగారి ధర్మపత్ని పద్మావతీదేవిగారు వీరు. అలా రాయిలా నిలబడ్డావేం-లోపలికి తీసుకువెళ్ళు" అన్నాడు పూజారి భార్యతో.

"రండమ్మా రండి-'' అంది. అప్పటికి అర్థమై తేరుకున్న ముసలావిడ. "మీ ఆయనకేం భయంలేదు. ఇంక మీరే వచ్చారుగా.''

ఆంజనేయులు పెద్ద డాక్టరు రావడం చూసి ఏ సందులోంచి ఏ నిముషంలో జారిపోయాడో ఎవరికీ తెలియదు.

సీతాపతి నీరసంగా కళ్ళెత్తి చూశాడు. ఫామిలీ డాక్టరు పరీక్ష చేస్తున్నాడు. తన తల ఏదో పరిచితమైన మెత్తని తొడమీద ఆనించి ఉండడం గ్రహించాడు. కళ్ళెత్తి పైకి చూశాడు. పద్మ-నీరసించి కృశించిన విదియ చంద్రుని రేకలాగా, వడలిన రాలిన పువ్వురేకులా-తన తలనే నిమురుతోంది. ఆమె కన్నుల వెంబడి సంతత బాష్పస్రవంతి చెక్కిళ్ళనీ, పవిటనీ తడిపివేస్తోంది.

సీతాపతి మొహంలో చటుక్కున ఏదో శాంతి. కాంతివంతంగా అలముకుంది. "వచ్చావా పద్మా''అన్నాడు మెల్లగా.

రుద్ధమైన పద్మ కంఠం నుండి మాట రాలేదు. జవాబుగా తల. వూపింది.

గోవిందయ్య బుట్టలు తెరచి పళ్ళూ, గ్లూకోజూ, హార్లిక్సూ, మందులూ మొదలైన సరంజామాని గది అలమారాలో సర్దుతున్నాడు.

"మహాయిల్లాలు సాక్షాత్తు లక్ష్మీదేవి. ఆమె ఎంత బెంగపడి పోయిందో. ఎంతమందిని ఎన్ని దిక్కులకు పంపించిందో. ఓహోహో ఎంత అందమైన భవంతీ-నౌకర్లూ చాకర్లూ ఏం సిరీ ఏం సంపదా-నిష్కారణంగా

ఇల్లు వదలి యీ వూరు రావడమేఁవిటీ విడ్డూరం కాకపోతే-ఇంకోరోజు లస్యమైతే ఆవిడ ప్రాణాలే వదిలేసును-రామ రామ, ట్యూషన్లు చెప్పు కుంటానంటూ ఈయన దేవిరించడమేఁవిటీ'' ముసలాయన మాటలోంచి మరో మాటలోకీ, భావంలోంచి మరో భావంలోకి గంతులేస్తూ ఉత్సాహంగా చెపుతున్నాడు. వీరి సిరిసంపదలకీ, పద్మ పతిభక్తికీ ఆయా హృదయం గౌరవపూజ్య భావాలతో నిండిపోయింది.

సుబ్బలక్ష్మి ఎంతో నిరాశ చెందినా పద్మ అందాన్నిచూసి లోప ల్లోపల మెచ్చుకోకుండా వుండలేకపోయింది. ఇదంతా సినిమాలా, కలలా వింతగా వుంది ఆమెకు,

డాక్టరుగారు పరీక్ష పూర్తిచేసి, ఇది మామూలు ఫ్లూజ్వరమనీ, జ్వరం కన్న మానసికాందోళనవల్ల ఎక్కువగా సీతాపతి బాధపడుతున్నా డనీ, భయపడవల్సిన అవసరం ఏమీ లేదనీ చెప్పాడు. పద్మ నిట్టూ ర్చింది.

"డాక్టరుగారూ ఈయన్ని కదిపి మనవూరు తీసుకు వెళ్ళొచ్చునా యింత జ్వరంలో."

డాక్టరు నవ్వాడు "నువ్వు వచ్చాక యింకా జ్వరం ఎందుకుంటుం దమ్మా. చల్లపడగానే సాయంత్రం బయలుదేరుదాం." అన్నాడు

"ఎంతమాట ఎంతమాట ! ఈ పేదవాడి ఇంటికి రానే వచ్చారు. ఒక్కపూట ఆతిధ్యం స్వీకరించి నన్ను ధన్యుణ్ని చేసి-" అర్థోక్తిలో ఆపాడు పూజారి.

గోవిందయ్య కలిపి ఇచ్చిన హార్లిక్సు తాగి పద్మవొడిలో తల పెట్టుకుని నిద్రపోయాడు సీతాపతి. గదిలో ఎవరూ లేరు. పద్మ మెల్లగా విసురుతూ కూర్చుంది. కాసేపటికి సీతాపతికి మెలకువవచ్చింది. దీర్ఘంగా ప్రేమగా చూశాడు పద్మవైపు.

"ఎందుకిలా చేశారు మీరు? గద్గదికంగా అడిగింది పద్మ.

సీతాపతి ఏం జవాబివ్వలేదు.

"ఇంకెప్పుడూ యిలా చేయరుకదా ?"

సీతాపతి చెయ్యనని తల వూపాడు.

డాక్టరూ, సుబ్బలక్ష్మి గదిలోకి వచ్చారు. సుబ్బలక్ష్మి చేతిలో పళ్ళెంలో పళ్ళూ, ఫలహారాలూ వున్నాయి.

"అమ్మాయ్, నువ్వీ నాలుగు రోజులూ నిరాహారదీక్షతో వున్నావు నీ భర్తకన్న నువ్వు నీరసంగా వున్నావు. కాస్త ఫలహారం తీసుకుని పాలు పుచ్చుకో" అన్నాడు డాక్టరు.

పద్మ డాక్టరు ఆదేశాన్ని పాటించింది. ఈలోగా సీతాపతి తలగడ కింద వున్న డైరీ తీశాడు. మెల్లగా యిలా రాశాడు.

"పద్మ దేవత."

ఏం రాస్తున్నాడా అని కొంచెం వొంగి చూసిన పద్మ తృప్తిగా నవ్వింది. ఎందుకో తెలియని సుబ్బలక్ష్మి నవ్వింది. డాక్టరూ నవ్వాడు.

సాయంత్రం భర్తతో వెళ్ళిపోయేముందు పద్మావతి పూజారి కుటుంబానికి తన కృతజ్ఞతను తెలియపరచింది. పూజారిపల్లె కథ అంతా ఆమె ముందే వినివుంది. సమయానికి ఈ అర్చక మహాశయుడు తోడుగా లేనట్లయితే సీతాపతి ఏమై వుండేవాడో ఊహించటానికి కూడా ఆమె భయపడింది. పూజారికీ పూజారిభార్యకీ నమస్కరించి సుబ్బలక్ష్మి బుగ్గలు పట్టుకుని "నీకు మంచి మొగుడు రావాలని ఆశీర్వదిస్తున్నాను నా భర్తలాంటివాడిని కట్టుకున్నా సుఖపడేది ఏమీ వుండదు. రాత్రీ పగలూ ఆయనకి ఎంతో సేవ చేశావు. లక్ష్మీ నీ మంచితనం నీకు సౌభాగ్యాన్ని చేకూరుస్తుంది. నీ పెళ్ళికి రాగలనో లేదో, ఇప్పుడే నీకు నా కానుక ఇచ్చేస్తాను. నీ అక్కనీ, ఆమె ప్రేమనీ మరిచిపోకమ్మా." అంటూ మెడలోంచి రెండు పేటల గొలుసు తీసి సుబ్బలక్ష్మి మెడలో వేసింది.

పూజారి ఏదో అనబోయాడు. ముసలమ్మ ఏదో అనబోయింది. సుబ్బలక్ష్మి సిగ్గుగా తికమకగా చూసింది. కాని ఏమీ వినకుండా పద్మ చరాలున కారులో కూర్చోవడమూ, బుర్రున కారుకదలడమూ జరిగింది.

*(జ్యోతి, 1963)*

# అతని కోరిక

లక్ష్మీ మోహనరావు నిద్రనుంచి లేచాడు. లేచి భార్యకేసిచూచాడు. ఆమె యింకా నిద్ర పోతోంది. ఆమెను లేపటం ఇష్టంలేదతనికి. ఆమెతో పాటు ఎన్నో బాధలూ, గాథలూ మేల్కొంటాయని అతనికి తెలుసు. అసలు నిద్రకన్న సుఖకరమైన స్థితి మరొహటి ఏమీ అతనికి ప్రపంచంలో కనపడలేదు. అర్థాంగి అయిన ఆమెకు ఆ సుఖాన్నుంచి దూరం ఎందుకు చెయ్యాలనుకున్నాడు. అతనికి నిద్ర అన్నా, నోవకేన్ ఇంజక్షన్ అన్నా చాలా యిష్టం. ఇదివరకెప్పుడో తేలుకుట్టి అతనికి కాలంతా మంటలూ, పోట్లూ ఎత్తినప్పుడు డాక్టరు ఆ యింజక్షన్ యిచ్చాడు. దాంతో పాదం తిమ్మిరెక్కి పోయింది. బాధ తెలియలేదు. నిద్ర కూడా అతనికి అలాగే వుంటుంది. బాధల్ని అరుచికరమైన సంగతుల్ని నొక్కివేసి ఉంచుతుంది. అందరికి లాగా అతనికి నిద్ర గాఢనిద్రాకాదు, సుఖనిద్రాకాదు. ఒహరకం తిమ్మిరి లాంటిది. నిద్ర లేవగానే అతనికి మనస్సు సలుపుతూన్నట్టు ఉంటుంది.

దొడ్లోకి వచ్చి వేపపుల్ల విరిచి పళ్ళు తోముకున్నాడు. ఆ సమయం లోనే అతనికి జరిగిపోయిన రోజున జరిగిన ముఖ్య సంఘటన జ్ఞాపకం వచ్చింది. నాలుగేళ్ళ కొడుకు చనిపోవడమూ, తాను మోసుకుని శ్మశానానికి తీసుకు పోవడమూ, తన భార్య గుండెలు బాదుకుని ఏడ్వడమూ- ఇదంతా నిన్ననే జరిగిందా, ఇదివరలో ఎప్పుడైనా జరిగిందా అన్న అనుమానమూ వచ్చిందతనికి. అతనికి జ్ఞాపకం లేక కాదు. అతనికేదేనా కష్టం వచ్చినప్పుడు అతనికి మనస్సంతా చిత్రంగా మొద్దుబారి పోతుంది. కాలం

అనే డైమన్షన్ ఎక్కడికో తప్పుకుంటుంది. ఏమైనా అతనికి అంతగా ఏడుపు రాలేదు. అంతగా బాధ అనిపించలేదు. అంతే, ఇదీ తిమ్మిరే అనుకున్నాడు.

పళ్ళు తోముకుంటుంటే ఇలాగ ఆలోచనలు మంచు పొగలాగ ఎందుకు ముసురుతాయో అతనికి తెలీదు. వాళ్ళమ్మ చిన్నతనంలో 'దరిద్రుడా' అని తిట్టేది. మరి తనకి లక్ష్మి మోహనరావు అని పేరు ఎందుకు పెట్టింది? అతనికి అమ్మమీద కోపం వచ్చింది. తనకి ఆ పేరు పెట్టినందుకు కాదు; తనకి లక్ష్మి అనే పేరుగల భార్యను వెతికితెచ్చి మెడకు కట్టినందుకు. అతను నవ్వుకున్నాడు అతనికి ఎవరేమన్నా కోపం రాదు కాని 'దరిద్రుడా' అని అంటే కోపం వచ్చేది. తల్లిని అలా ఫిలవ్వొద్దని కసురుకునేవాడు. దరిద్రం యాచనలో ఉంది. సోమరితనంలో ఉంది కష్టపడేవాడికీ అభిమానం ఉన్నవాడికీ దరిద్రం ఉండదు. ఎవరూకూడా ఉందనివేలెత్తి చూపించలేరు. అందుకే అతను దొరికిన ఉద్యోగమల్లా చేసేవాడు. అతనికెప్పుడూ టెంపరరీ ఉద్యోగాలే దొరికేవి. బియ్యం కొట్లో గుమాస్తాగా పని చేశాడు. ఎలెక్ట్రిసిటీ ఆఫీసులో పనిచేశాడు. లాటరీ టిక్కెట్లు అమ్మేవారిలో కూర్చొని మైక్ ముందు గొంతుపెట్టి 'రూపాయికి లక్షరూపాయలు' అని కేక వేశాడు. సినిమాలో గేటుదగ్గర నిలబడ్డాడు. కిరాణాకొట్లవాళ్ళకి పద్దులు రాసిపెట్టేవాడు. ఎప్పుడూ అతని జీతం ముఖ్యావసరాలకి సగం సరిపోయేది. పై సగం అవసరాలూ ఎండిపోయి అతని భార్యకి జబ్బు రూపంలో, తనకి భయం రూపంలో, కొడుక్కి ఆకలి రూపంలోదాగి ఉండేవి.

చచ్చిపోయిన కొడుక్కి ఆక లెక్కువ. వాడస్తమానం తిండి కావాలని మారం చేసేవాడు. వాడికి కడుపునిండా అన్నం పెట్టినా ఇంకా యివీ, అవీ కావాలనేవాడు. తోచకపోతే మట్టి తినేసేవాడు. ఒక వైద్యుడికి చూపిస్తే లివర్ పెరిగిందన్నాడు. అందుకే పొట్ట అలా ఎత్తుగా వచ్చిందన్నాడు. పొట్టమీద నీలంరంగు నరాలు పైకి వుబ్బి భూగోళం మ్యాపు మీద నదుల గీతల్లా వుండేవి. వాడికి సరీగా మందివ్వక-మందిప్పించలేక-చంపేశాడన్నారు లక్ష్మి మోహనరావుని కొందరు. కాని అది అబద్ధం.

ఎలాగో అలాగ డబ్బు తెచ్చి మందులిప్పించాడు. కొట్టువాడిని బతిమాలి కొన్ని మందులు అరువు తెచ్చాడు. ఆ జబ్బుకి ఇవి అరువు మందులని తెలిసిపోయి లోపల చేసి కాస్తయినా తగ్గలేదని అతని అనుమానం.

వాడు బతికి వుంటే వాళ్ళమేనమామ అల్లుడు పినతండ్రిలాగ తాసిల్దారయివుండేవాడు అని భార్య లక్ష్మి ఉద్దేశం. అతనికీ అతని భార్యకీకూడా గౌరవంగా, గర్వంగాచెప్పుకోదగినబంధువు ఈతాసిల్దారు ఒక్కడే. ఆ తాసిల్దారుని వీళ్ళెప్పుడూ చూడలేదు. ఆయన వీళ్ళ నెప్పుడూ ఏ కార్యానికీ పిలవనూ లేదు. కానీ ఆ తాసిల్దారు మాత్రం ఈ భూమి మీద ఎక్కడో ఉండడం ఖాయం. లక్ష్మి కుశాయి దగ్గర ఏవో మాటల్లో "మా బంధువొకాయన తాసిల్దారు. ' ఆయన కీ వూరు బదిలీ అయితే బాగుండును. ఈ కుశాయి నీళ్ళు ప్రత్యేకం ముందుగా నేను పట్టుకునేందుకు ఏర్పాటు చేసి వుండును. వేగలేక చస్తున్నాం ఈ అలగా జనంతో-" అంటుండేది.

అలగాజనంలో తానూ ఒకర్తెనని లక్ష్మికి తెలియలేదు. అయితే లక్ష్మి నమ్మకాలూ, ఆశలూ పెట్టుకున్న మనిషి. తన భర్తకి యే నాలుగు వందల ఉద్యోగమో, ఏ లాటరీ ఫస్టుప్రైజో ఏదో ఒకటి అనతి దూరంలో రెడీగా వుందని అనుకుంటుంది. ఒక మేడ, ఒక మంచి కారు, రాళ్ళ నెక్లెసూ ఆవిడ కనీసపు కోర్కెలు. కాని లక్ష్మి మోహనరావుకు ఏనాడూ పెద్ద ఆశలు లేవు. అతనికి చిన్న సరదాలు వుండేవి. చిన్నతనంలో అతను పెద్దవాణ్ణయి పోవాలనుకునేవాడు. చిత్రం ఏమంటే నిజంగా కొన్నేళ్ళకి పెద్దవాడయి పోయాడు. నిజానికి అతనికి తీరిన కోరిక ఇది ఒక్కటే. చిన్నప్పుడు కసరత్తు చేసి 'గామా' లా తయారవాలనుకునేవాడు. దానికి బాదం పప్పు, కోడిగుడ్లూ మొదలైన పుష్టికరమైన ఆహారం తినాలనేవారు. బాదంపప్పు సమృద్ధిగా సంపాదించుకో గలిగిననాడు కసరత్ ప్రారంభం చేయాలనుకోవడం వలన ఈనాటికీ ఆ కోరిక నెరవేరలేదు. సర్కస్అంటే అతనికి యిష్టం. నల్ల కోటువేసుకొని పొడుగాటి కమ్చీని చప్పుడు చేస్తూ గుర్రాల్ని గుండ్రంగా పరుగెత్తించే వాడంటే అతనికి భయం, గౌరవం, అభిమానమూ కూడా. అంతవాడవాలని ఉండేది. తన ఇంటి పెరట్లోకి వచ్చే పోయే రెండు మూడు చచ్చు కుక్కలికి మెడకి నవారుపట్టీ కట్టి వెదురు

పుల్లలు ఎత్తుగా అడ్డం పెట్టి వాటిని దుమదమనేవాడు. అవి మొరిగేవి, మూల్గేవి, కరవబోయేవి. వాటిని తన చాంతాడు కమ్చీతో చావకొట్టేవాడు. అవి వెల్లకితలా పడుకుని ఘోరుమని ఏడ్చేవి. ఇలాగ అతనికి చిన్న చిన్న సరదాలే వుండేవి. ఆ రోజుల్లో లతను లేనివాడని ఎవరూ అనుకునేవారు కాదు. అతనికి కూడా అనిపించేది కాదు. అతని తండ్రి చేసేది గుమాస్తా ఉద్యోగమైనా తెలివిగా, సులువుగా లంచాలు పట్టగలిగిన వాడవడంవల్ల ఇంట్లో ఏ ఇబ్బందీ ఉండేదికాదు. లక్ష్మీమోహనరావుకి చిరుతిండికీ, సినిమాలకీ లోటు ఉండేదికాదు.

అన్నింటి కన్నా అతనికో సరదా ఉన్నట్టుగానే ఉండిపోయింది. అతను పదోక్లాసు చదువుతూన్నపుడు శ్రీరామనవమి ఉత్సవాలకి పందిట్లోకి వెళ్లాడు. అక్కడ మంచి మజాగా మేజువాణి జరుగుతోంది. పళ్ళెత్తుగా ఉన్న చెవత్తో మేళం కడుతోంది. 'ఛా' అనుకున్నాడు లక్ష్మీమోహనరావు ఆమెను చూసి, కాని ఇంతలో రసజ్ఞుడయిన ఒక కారాకిళ్ళీ పస్కండువా ఆసామి ఫిడేలు వాయించే వాడిని పిలిచి చెవిలో ఏదో చెప్పాడు. పళ్ళెత్తు ఆవిడ గజ్జెలు విప్పి ఇంకో సన్నగా నాజూకుగా ఉన్న ఎర్రని పిల్ల కిచ్చింది. ఆ పిల్ల కళ్ళు బాగున్నాయి. బెంగగా వున్నాయి. చిన్నగా, జాలిగా నవ్వి ముందుకు వచ్చి, 'మూరూపు తెలవారె' అని అభినయం ప్రారంభించింది. లక్ష్మీమోహనరావుకి సరదా వేసింది. ఆ కళ్ళనీ, బుగ్గల్నీ ముద్దెట్టుకోవా లనుకున్నాడు.

తర్వాత పెద్దవాడైన కొలదీ భోగం వాళ్ళంటే ఏమిటో, ఎందుకో తెలిసిపోయింది. రాజమండ్రీ మెరక వీధిలో వీళ్ళు ఉంటారని తెలిసింది. వాళ్ళొక మేలిరకం 'హాయి'ని ఇస్తారనీ బతికున్న వాడెవడైనా ఒకసారి ఆ హాయిని పొంది తీరాలని విజ్ఞులైన మిత్రులు కొందరతనికి చెప్పారు. కాని వాళ్ళు ఒక ఇబ్బందైన మాటకూడా చెప్పారు. వాళ్ళకి డబ్బూ, నగలూ మొదలైనవి ఇస్తేనే రానిస్తారనీ; లేందే గడప తొక్కనివ్వరనీ చెప్పారు.

ఈ షరతు మాత్రం అతనికేమీ బాగాలేదు. ఈ సరదా క్రమక్రమంగా అతనిలో అడుగున పడిపోయింది. సంఘానికి వీళ్ళు చీడపురుగు

లనీ,తప్పనీ, అవినీతి అనీ అందరూ అనడంవల్ల కొంత అతనూ నమ్మాడు స్వంతవూళ్ళో మేజువాణీ చూడడానికి సిగ్గువేసినా పొరుగూళ్ళకు వెళ్ళి నప్పుడు బెమరుగా మోతాదుగా చూసి సంతృప్తి పడేవాడు.

మొహం కడుక్కుని యింట్లోకి వచ్చాడు. అతనికేదో జైల్లో వున్న టనిపించింది. అసలీమధ్య అతనికి యింట్లో పట్టుమని పది నిమిషాలు ఉండ డమే కష్టంగా వుంది. కొడుకు బతికున్నప్పుడు, అతనికి కొడుకు బతి కున్నట్టే అనిపించేది కాదు. కాని ఇప్పుడు కొడుకు లేడని ప్రతీ వస్తువూ సాక్ష్యం ఇస్తోన్నట్టు వుంది. తన భార్య నిద్ర లేవకుండానే అతనికి వెళ్ళి పోవాలనిపించింది. పుత్రశోకంతో ఉన్న ఆమెని ఓదార్చడం చాలా కష్ట మైన పని అనిపించింది. పక్కింటావిడ నిన్నవచ్చి కష్టంలో ఆదుకుంది. మళ్ళీ ఈరోజు ఉదయమే తన భార్య నావిడకి వదిలెయ్యడం మంచిదను కున్నాడు. వీధి తలుపు చప్పుడు కాకుండా తెరచి గుమ్మం దాటబోతుంటే అతనికి క్రితం రోజున లక్ష్మి మెళ్ళో మంగళసూత్రాలు తీసి పిల్లాడికి మందులూ, బియ్యమూ తీసుకు రమ్మని చెప్పడం జ్ఞాపకం వచ్చింది. వెనక్కి వచ్చి అల్మారులో మూలగా కాగితం పొట్లంలో కట్టిన మంగళ సూత్రాలు తీసి జేబులో వేసుకున్నాడు. నిన్న వీటి అవసరం లేకుండానే పుత్రాడికి ప్రాణం మీదికి రావడంతో తాకట్టు పెట్టవల్సిన అవసరం లేక పోయింది. ఈరోజున డబ్బు తెచ్చుకోవల్సిన అవసరం ఉంది. లక్ష్మి చాపమీద సగం నేలమీద సగం పడుకుని నిద్రపోతోంది. ఆమె నిప్పు సెగకి ఎండి ముడుత పడిన పాత కాగితంలా ఉంది. ఒక్కసారి ఆమెను చూచి గబగబా వీధిలోకి వెళ్ళిపోయాడు.

లక్ష్మీమోహనరావు వీధిలోకివచ్చి నడవటం మొదలుపెట్టాడు. అతనికొక గమ్యంలేదు. ఇంటికి తిరిగి వెళ్ళకుండా చీకటి పడే వరకూ పొద్దుపుచ్చడమే అతని ప్రస్తుతాశయం. ఎప్పుడో ఒకప్పుడు మంగళ సూత్రాన్ని తాకట్టు పెట్టవచ్చును. ఒక వీధినుంచి ఇంకొక వీధిలోకి, ఒక సందులోంచి ఇంకొక సందులోకీ కులాసాగా నడుస్తున్నాడు. నడవడంలో, ఇటూ అటూ కొట్లనీ, ఇళ్ళనీ, మనుష్యులనీ, చూడడంలో అతని కొక విశ్రాంతి లభించినట్టుగా ఉంది. ఒళ్లూ మనస్సూ ఏదో తేలికైపోయినట్టుగా

బరువు దిగిపోయినట్టుగావుంది. తాను విచ్చలవిడిగా తిరగడానికి ఇంత పెద్ద ఊరు ఏర్పడి ఉండడం ఏదో దైవ సంకల్పంలాగా అనిపించింది. రాజమండ్రి ప్రజల నందరినీ పిలిచి ఒక్కసారి అభినందించా లనిపించింది. ఇంతమంది జనాభాలో ఎవడికీ తన కొడుకు పోయినట్టూ తెలియదు. తెలుసుకోలేరు. తెలుసుకోవాల్సిన అవసరమూ లేదు. జన ప్రవాహంలో తా నొక బిందువు మాత్రమే. నడవగా నడవగా ఆకలి వేసింది. జేబులో ఒక రూపాయికూడా వుంది. హోటల్‌కు వెళ్లి ఇడ్లెను తిని కాఫీ తాగి మిఠాయి కిళ్లీ వేసుకొని నడక ప్రారంభించాడు. ఎదురుగా ఎవడో నున్నగా క్రాపింగ్ దువ్వుకొన్న ఒక లుంగీదారు ఇతన్ని చూసి ఇకిలించినట్టు నవ్వాడు. గబుక్కున లక్ష్మీమోహనరావుకి జ్ఞాపకం వచ్చింది. తాను తల దువ్వుకోలేదని బట్టలు మార్చలేదనీ. పోనీలే అనుకున్నాడు. ఒక దేవాలయం దగ్గర ఎందరో తడి బట్టలతో దేవుడికి మొక్కుకుంటున్నారు. (అతనుకూడా చేతులెత్తి నమస్కరించాడు) ఒకావిడ చాలా ఖరీదైన పట్టుచీరా, మెడకీ చేతులకీ కొన్నివందల తులాల బంగారమూ, విశాలమైన కళేబరంతో వెనకాల మొగుడూ పరిచారికా వెంటరాగా దేవాలయంలోకి వెళుతుంటే చూచి నవ్వుకున్నాడు. ఇంతడబ్బున్న ఆవిడనిచూసి దేవుడు నాలుగడుగులు ముందుకు వేసి 'రండి మహాలక్ష్మమ్మ గారూ! దయచేయండి. మీబోటివాళ్ళు అస్తమానూ వస్తారా!' అంటాడేమో అని కాస్సేపు నిలబడి చూశాడు. అక్కణ్నుంచి సినిమా పోస్టర్లు వరుసగా చూస్తూ చదువుతూ యిన్నీసుపేట వరకూ వెళ్ళాడు. ఒకచోట రోడ్డుకి పక్కగా కాళీజాగాలో ఎవడో గారడీవాడు తన విద్యని ప్రదర్శిస్తున్నాడు. జనం గుండ్రంగా మూగి ఉన్నారు. లక్ష్మీమోహనరావు వాళ్ళలోకి చొచ్చుకుపోయాడు. సర్కస్‌లాగా గారడీ అన్నా అతనికి యిష్టం. గారడీవాడు తురకాన్నీ తెలుగునీ పసందైన పాళ్ళల్లో కలిపి పంచిపెడ్తున్నాడు. కోడిగుడ్డుని ఒక బుట్టతోమూసి కుక్కపిల్లని చేస్తానంటున్నాడు వాడు. తనకి గారడీవస్తే దాన్ని మేకపిల్లనిచేసి గారడీవాణ్ణి ఏడిపించవచ్చు ననుకున్నాడు. గారడీవాడి కూతురు డబ్బులడుగుతోంది. దానిగడ్డంమీద మచ్చ ముద్దొస్తూందనుకున్నాడు. జేబులోంచి పావలా తీసి దానికిచ్చేశాడు. పక్కవాడు అణాయే యిచ్చాడు వాడిని తిరస్కారంగా గర్వంగా చూశాడు.

సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. ఎండ చుర్రుమంటోంది. మళ్ళీ ఆకలేసింది. లక్ష్మీమోహనరావుకి. సత్రంవేపు బయల్దేరాడు. సత్రంముందు ఎవడో బొమ్మలున్న గుడ్డ నేలమీద పరచి "కాయ్ రాజా కాయ్" అంటున్నాడు. సర్కస్ జ్ఞాపకం వచ్చింది లక్ష్మీమోహనరావుకి. గుర్రాలంటే అతనికి ఇష్టం. గుర్రంమీద బేడ కాసేడు. పావలా వచ్చింది. మళ్ళీ రెండో సారి పావలా, బేడ కలిపి కాశాడు పోయింది. ఫక్కున నవ్వాడు.

"ఏం నవ్వుతావ్" అన్నాడు లాటరీవాడు.

"ఈగుర్రం నిజం గుర్రంకాదు" అన్నాడు లక్ష్మీమోహనరావు.

"ఊరుకోవయ్యా ఇది ఫష్టు క్లాసు గుర్రం. చూడు, ఈ ఏనుగుని, మైసూరు మారాజా దీన్నే ఎక్కి ఊరేగేవాడు. కాయ్ రాజా కాయ్" అన్నాడు లాటరీవాడు.

"నే కాయను" అన్నాడు లక్ష్మీమోహనరావు.

"ఏం-ఎందుకు కాయవ్? నాది నిజాయతీ అయిన లాటరీ" అన్నాడు లాటరీవాడు.

"ఎందుకో చెప్పనా" అని అడిగాడు లక్ష్మీమోహనరావు.

"చెప్పవయ్యా చెప్పు. ఏదేనా మోసం ఉందని రుజూచేస్తే పది రూపాయలు నీకు ఈనాం" అన్నాడు కోపంతో లాటరీవాడు.

"అయితే చెప్తావిను. నాదగ్గర డబ్బులేదు. నే నాడను" అని లేచిపోయాడు లక్ష్మీమోహనరావు. అందరూ గొల్లుమని నవ్వారు. లాటరీవాడు. పెద్ద అవమానంగా తలచి " కలేజా వుంటే కాయండి. రూపాయికి రెండు రూపాయిలు. ఊరికే చూస్తే అదురుష్టంరాదు మొగాలకి" అన్నాడు.

లక్ష్మీమోహనరావు సత్రంలోనికి వెళ్ళాడు. సత్రం గుమస్తా ఇతన్ని ఎరుగును. బీడీ పొగ పైకి ఊది "ఏవం య్యోయ్ కులాసానా. కనపడ్డం మానేశావ్" అన్నాడు.

"ఏదీ బీకీవుంటే ఒకటియ్" అన్నాడు రావు.

"అరే నీ కలవాటు లేదుగా?"

"చేసుకున్నానులే" అంటూ బీడీ తీసుకుని అంటించాడు లక్ష్మీ మోహనరావు. అతనికి బీడీ అలవాటులేదు. కాని ఈ వేళ అతనికి ప్రతిపనీ చేసేందుకు స్వతంత్రం వచ్చినట్టుగా ఉంది.

"కులాసాయేనా? ఏంటి ఇలా వచ్చారు" అన్నాడు గుమాస్తా.

"ఆc. ఇలాగ పనిమీద వెళుతున్నాను. ఏదేనా మంచం వుంటే పడెయ్యి కాసేపు నడుం వాల్చిపోతాను" అన్నాడు రావు.

గుమస్తా కాళీ గది ఒకటి చూపించాడు. బీడీ కాలుస్తూ ఉక్కిరి బిక్కిరి అవుతూ దగ్గుతూ మంచంమీద పడుకుని లక్ష్మీమోహనరావు రకరకాల ఆలోచనల్ని తరుముతున్నాడు. అలసిపోయిన అతనికి తెలీకుండా నిద్రపట్టింది.

సాయంత్రం ఆరు దాటాక గుమాస్తా లేపేవరకూ అతనికి మెలకువ రాలేదు. మెలుకువ వచ్చాక అతను చాలాసేపు తికమక పడ్డాడు. తనక్కడ ఎందుకున్నదీ తెలియక. కొంతసేపటికి అతన్ని అతను గుర్తించడానికి వీలయింది. గుమాస్తాకి థాంక్సుచెప్పి ఇన్నీసుపేట గోదావరి ఒడ్డుకి వెళ్ళి మొహం కడుక్కుని మెట్లమీద కూర్చున్నాడు. విశాలంగా చల్లగా పారుతూన్న గోదావరి ముందు అతను చటుక్కున ఏకాకిలా ఫీలయాడు. క్రమ్ముకుంటూన్న లేతచీకటిలో బద్ధకంగా చూస్తూ కూర్చున్నాడు. అతనికి చిన్ననాటి రోజులు జ్ఞాపకం వచ్చాయి. చుట్టనముల్తూ మాట్లాడే తండ్రి, తులసి కోటకి రోజూ పూజచేసే తల్లీ, పకోడీల కొట్టూ, సర్కసూ, తెలుగు మేష్టారూ, శ్రీరామ నవమి ఉత్సవాలూ....అతనికి లోపల్లోపల దాగి ఉన్న కోరిక ఒక్కసారి బయట పడింది. ఒక్కరాత్రి అయినా భోగం దానితో అనుభవించాలని ఉబలాట పడిపోయింది అతని మనసు; పుష్పలత అందంగా వుంటుందనీ బాగా అభినయిస్తుందనీ అంటారు. ఓసారి మెరక వీధిలో వెళుతూంటే పుష్పలత మేడని చూపించారు మిత్రులు. ఈవాళ ఎలాగయినా తాకట్టు పెట్టటానికి సిద్ధమయిపోయింది. రేపటి సంగతి రేపు చూచుకోవచ్చు ననిపించింది. మెరక వీధిలో మేడ వుంది. ఇంకేం అనుకున్నాడు. లేచి బయల్దేరాడు.

విద్యుద్దీపాల కాంతిలో రాజమండ్రి సందులు చవకరకం ఆడదానిలా మెరుస్తున్నాయి. తికమకగా ఉన్న జుట్టుతో మాసిన చొక్కాతో తిన్నగా పుష్పలత మేడసమ్ముఖం ముందు నిలబడ్డాడు. ఏం చెయ్యాలో ఎలా పిల వాలో అతనికి సరిగ్గా తెలియదు. దగ్గాడు. కొంతసేపయాక మళ్లీ దగ్గాడు. చివరికి "ఏమండీ" అని పిలిచాడు. అతనికి సిగ్గుగా భయంగా వుంది. ఇంతలో ఓ గళ్ళచీర కట్టుకున్న యాభై ఏళ్ళ స్త్రీ వచ్చి "ఏం కావాలి?" అంది.జుట్టు పల్చబడి ఆమె తల పెంకు అక్కడక్కడ కనిపిస్తూ అసహ్యం గా ఉంది.

"ఈ మేడలో పుష్పలత వుందా?" అన్నాడు బెరుగ్గా.

"ఆఁ వుంది. ఎవరేనా పంపించారా నిన్ను?"

"కాదు. నాకే కావాలి."

"నీకా!" ఆమె విరగబడి నవ్వింది. నవ్వినప్పుడు గొగ్గిపళ్ళు కనిపి స్తున్నాయి.

"నా దగ్గిర అరకాసు బంగారం వుంది" అన్నాడు ధీమాగా.

ఆమె ఎగాదిగా చూసి, "ఆగు కనుక్కొని చెప్తాను" అని లోప లికి వెళ్ళి కొంతసేపటికి తిరిగివచ్చి "రాత్రి తొమ్మిది దాటాక రండి" అంది.

లక్ష్మీమోహనరావు ఉత్సాహంగా బజారువైపు నడిచి ఒక క్షౌరశాల లోకి వెళ్ళాడు. అక్కడ ఎవరూ లేరు యజమాని తప్ప.

"ఏం సార్ క్రాఫ్ వెయ్యమంటారా?" అన్నాడు వాడు.

"కాదు కొంచెం తలకి నూనెరాసి పెట్టాలి, పౌడరు కూడా కావాలి డబ్బులు తీసుకురాలేదు. ఎప్పుడేనా యిటు వచ్చినప్పుడు యిస్తాను" అన్నాడు లక్ష్మీమోహనరావు ప్రాధేయ స్వరంతో. శాలాధిపతి యితన్ని నిదానించి చూచి "ఏం గిరాకీ పంపులూ?" అన్నాడు.

"ఏముంది"

"పిల్లేదేనా దొరికిందా?"

ఆశ్చర్యంతో లక్ష్మీమోహనరావు "నీ కెలా తెలిసింది!" అన్నాడు.

"ఓస్, అందరి వయినం ఇట్టే పసిగట్టగలను. అనుభవం! అంతే! అనుభవం. నిన్ను చూడగానే అనుకున్నాను. ఈ దెవడో నాసిరకంరా బాబూ అని" అన్నాడు కొట్టువాడు.

ఇలా లోకువచేసి మాట్లాడటం కష్టమనిపించింది లక్ష్మీమోహన రావుకి. అయినా చేసేది లేదు. తల దువ్వుకుని, పౌడరు రాసుకుని తొమ్మిదయేవరకు అక్కడే ఒక బల్లమీద కూర్చున్నాడు. ఒళ్ళంతా బరువుగా వుంది. ఒకపక్కన చెయ్యకూడని పని ఏదో చేస్తూన్నట్టు వుంది. అంతలోనే విపరీత శక్తులమీద తిరుగుబాటు చేస్తోన్న నాయకుడిలాగా గర్వంగా అనిపించింది. తన ఒక్క కోరిక ఎందుకు తీర్చుకోకూడదు? ఎవరు అడ్డు పెడతారు? అతనిలో తెలియని సంతోషం వ్యాపించింది.

ఇదివరకు వెళ్ళిన మెరకవీధి మేడదగ్గరకు వెళ్ళాడు. ఇందాక టావిడ గుమ్మందగ్గర కూర్చుని కాళ్ళకి తైలం రాసుకుంటోంది. ఇతన్ని చూసి "ఆ మెట్లెక్కి పైకి వెళ్ళు. అక్కడుంటుంది" అంది. ఏకవచన ప్రయోగానికి ఒళ్ళు మండింది. కోపంగా చూచి మెట్లెక్కాడు. డాబామీద పిట్టగోడ నానుకుని విలాసంగా నుంచుందొక యువతి. పొడుగాటి వాలుజడ మధ్య బంగారపు చామంతిపువ్వు వుంది. మెళ్ళో నెక్లెసూ ఒక ఒంటిపేట గొలుసూ వున్నాయి. రొమ్ములు ఎత్తుగా వున్నాయి. పౌడరు పూసిన మొహం తెలుపూ, చేతుల చామనచాయ రంగూ విడివిడిగా అసందర్భంగా వున్నాయి.

ఇతన్ని చూసి నవ్వుతూ "రాండి" అంది ఆమె. ఆమె వెనకాలే గదిలోకి వెళ్ళాడు. గది చిన్నదైనా పందిరి పట్టెమంచం, ఒక సోఫా, ఒక డ్రాయరూ ఇరుకుగా సర్ది ఉన్నాయి. పరుపులమీద మొఖమల్ పరచివుంది. డ్రాయరుమీద మిఠాయిలూ, అరటిపళ్ళూ, మరచెంబూ, టేబిలు ఫానూ ఉన్నాయి. గోడమీద వెంకటేశ్వరుడి పటానికి ఇటూ అటూ సినీతారల బొమ్మలూ, క్యాలండర్లూ ఉన్నాయి. ఓ పక్కగా ఉన్న ఒక్క కిటికీ మూసేసి ఉంది. గదిలోకి వెళ్ళగానే లక్ష్మీమోహనరావుకి నిలవవున్న గాలి వాసనా, ఒకరకం ఘుమురు సెంటువాసనా కలిసి గమ్మత్తుగా ఉంది.

ట్యూబ్‌లైటు కాంతిలో ఆమెను తదేకంగా చూస్తూ నిలబడ్డాడు. ఆమె నవ్వి "అలా చూస్తున్నారేం. రావుతేనా?" అంటూ దగ్గరకువచ్చి చెంపల్ని రాకి సోఫాలో కూర్చోపెట్టింది. అతనికి వొళ్ళు పులకరించింది. ఆమె అంత అందంగా కనపడలేదు. అయినా ఆమె చొరవలో, చనువులో ఉద్రేకపరిచే గుణం ఉంది.

తనని పరీక్షగా చూస్తోందని తెలుసుకొని "మీ పేరు పుష్పలతేనా?" అని అడిగాడు.

కిలకిల నవ్వి ఆమె అతని పక్కగా కూర్చొని "ఇలాంటి చోటుకి రావడం మీకు కొత్తా?" అంది.

"ఏం?"

"నన్ను 'మీరు' అని గౌరవిస్తున్నారేం?"

"మిమ్మల్ని గౌరవించకూడదా?"

"ఊహుఁ–" అని కళ్ళు కుంచించి అతనిమీదికి కొంచెం వొంగి "మీది ఈ వూరు కాదా?" అని అడిగింది.

"కాదు" అబద్ధమాడాడు లక్ష్మీమోహనరావు.

"మరి ఏ వూరు?"

"అమలాపురం"

"ఏం చేస్తోంటారు?"

"వ్యవసాయం–అక్కడ నాకు భూములున్నాయి" ధైర్యంగా అనేశాడు.

ఆమె తీవ్రంగా చూచి మళ్ళీ నవ్వుతూ "యీనాందార్లన్నమాట. ఏమాత్రం కమతం వుంది?" అంది.

"యాభై ఎకరాలు–" తన లోకువ పట్టేస్తుందేమోనని నిచ్చెన మెట్లెక్కి పోతున్నాడు లక్ష్మీమోహనరావు.

"మరి ఈ మాసిన బట్టలూ వేషమూ–ఇలాగే వస్తారా మా దగ్గరికి? అయ్యో రామ" అని చెంగు నోటికి అడ్డంపెట్టుకొని నవ్వుతోంది.

"పెట్టె, బెడ్డింగు పోయాయి వస్తోంటే. ఈ వూర్లో పనుంది మరి! ఏం చెయ్యను" కంగారు పడ్డాడు లక్ష్మీమోహనరావు.

"ఉహూఁ-" ఆమె ఏదో ఆలోచిస్తున్నట్టు వుంది.

"పుష్పలతంటే మావైపు మంచిపేరు."

"నేను పుష్పలతని కాను."

"మరి నువ్వు...."

"నన్ను పాప అంటారు. పుష్పలత మా అక్కయ్య. ఓ లక్షాధికారి మా అక్కయ్యను సొంతంగా ఉంచేసుకున్నాడు."

"ఓహో!" అన్నాడు లక్ష్మీమోహనరావు. పోనీ ఇదైతేనేం దాని చెల్లెలే కదా అని సమాధానపర్చుకున్నాడు.

"నన్ను కూడా మీరు తీసుకుపోయి ఉంచుకోరాదు?" చిలిపిగా నవ్వుతూ అడిగింది.

"నేనా-ఎక్కడ ఉంచుకోవటం? ఎలాగ?" తడబడుతూ అన్నాడు లక్ష్మీమోహనరావు.

ఆమె ఏదో పసిగట్టినట్టు "భోంచేశారా?" అంది.

"లేదు."

"ఏం?"

అతను జవాబివ్వలేదు. ఎందుకో అతని మనసంతా కలతపడి పోయింది. అతనికి కొడుకుని స్మశానానికి మోసుకుపోవడం జ్ఞాపకం వచ్చింది.

"మరి బంగారం ఏదీ?" అడిగిందామె.

"బంగారం ఏఁవిటీ?" అన్నాడతను.

"మా పిన్ని చెప్పింది అరకాసు బంగారం ఉందని."

"ఓహ్ అదా-ఓహ్ మర్చిపోయాను" జేబులోంచి మంగళ సూత్రాలు పొట్లంతీసి ఆమె కిచ్చాడు.

"భలేవారే మీరు ఇంతవరకూ ఇవ్వకుండా నన్నాడిస్తున్నారా?" అంటూ ఆమె పొట్లం విప్పి చూచింది. పసుపుతాడుకి మంగళసూత్రాలు కట్టబడి ఉన్నాయి. అప్రయత్నంగా ఆమె "సరే!" అంది. ఆమె చెక్కిళ్ళ లోంచి రక్తం దిగిపోయింది. సందేహంగా అతనికేసి చూసింది.

"అరకాసు ఉండదనా నీ సందేహం?" అని అడిగా డతను.

"ఉంటయ్యేమోలే-" ఆమె పొట్లంకట్టి చేత్తో పట్టుకుని "కొంచెం మిఠాయి తినండి ఇప్పుడే వస్తాను" అని గదిలోంచి వెళ్ళిపోయింది.

అతనికి ఉత్సాహం తగ్గిపోతూన్నట్టనిపించింది. మధ్యాహ్నం భోజనంలేని కారణాన ఏమో అనుకున్నాడు. మంచి చలాకీదే ఈ పాప. తనని లేనివాడని కనిపెట్టేసిందా? అయితేనేం, బంగారం ఇచ్చాడుగా. ఇంకేం అనుకున్నాడు. టేబుల్‌మీద పళ్ళెంలో మిఠాయి తీసుకుని తాపీగా తిన్నాడు. కిందనుంచి ఏవో కేకలు వినిపిస్తున్నాయి. పాప ఎవరిమీదో - బహుశా ఆ గొగ్గిపళ్ళ పిన్నిని తిడుతోందేమో అనుకున్నాడు. రెండు చెక్కరకేళీ అరటిపండ్లు వొల్చుకుని తిన్నాడు, క్రమంగా అతనికి బలం వచ్చింది. దాంతో అతనిమీద అతనికి నమ్మకం కలిగింది. ఇందాకట్నుంచీ నీరసంవల్ల కాబోలు అలా బెదురుగా ఉన్నా ననుకున్నాడు. ఇప్పుడు చూడమను తన ప్రజ్ఞ. తనూ - చమత్కారంగా మాట్లాడగలడు. పాపచేత జావళీ అభినయింప చెయ్యాలి. "తూరూపు తెలవారే" అంటే అతనికి ఇష్టం. మరచెంబు తీసి నీళ్ళు తాగి త్రేన్చాడు. రాబోయే సుఖాన్ని తలచుకుంటుంటే అతనికి వొళ్ళు మళ్ళీ పులకరించింది. లేచివెళ్ళి మంచంమీద పడుకున్నాడు. చిరునవ్వు నవ్వుకున్నాడు తృప్తిగా.

గదిలోకి గొగ్గిపళ్ళావిడ వచ్చింది. ఇదొచ్చిందేమిటీ అని కంగారుపడ్డాడు లక్ష్మీమోహనరావు "లేలే పంతులూ మంచంమీద దొర్లాగ పడుకున్నావు కాని'' అంది మోటుగా ఆవిడ.

"ఏం"

"ఇనస్పెట్టరొత్తన్నాడు. కబురొచ్చింది. ఎల్లుబాబూ నువెల్లిపో-"

"ఎక్కడికి వెళ్ళను?" కోపం వచ్చింది లక్ష్మీమోహనరావుకి.

"నేనెందుకు వెళ్ళాలి" అన్నాడు.

"సాల్లే-ఇనస్పెటరొస్తే నిన్నూ నన్నూ జెయిల్లోకి తోస్తాడు. దయచెయ్యి పంతులూ ఇదిగో నీ బంగారం- "ఆమె పొట్లం మీదికి విసిరింది.

"పాప ఏదీ, ఇలా రమ్మను" మెల్లగా అడిగాడు రావు.

"పాపే చెప్పింది నిన్ను పంపించెయ్యమని, నడు నడు ఊం" అంది.

కోపంతో పొట్లం తీసికొని లక్ష్మీమోహనరావు గబగబా కిందికి దిగాడు. ఇటూ అటూ చూశాడు. గుమ్మం పక్కగా పాప నుంచుని వుంది.

"నన్ను బొమ్మన్నావేం — వాడెవడు ఆ ఇనస్పెక్టరు. నాకేం భయం!" అన్నాడు గట్టిగా.

పాప నవ్వి "కోప్పడకు పంతులూ. మళ్ళీ ఎప్పుడైనా వొద్దువు గానిలే. నా మాట విని వెళ్ళు"

"ఏం"

"ఇదిగో—ఈ పది రూపాయలూ దగ్గరుంచుకో, నాకూ తెలుసు కష్టం ఏమిటో!"

ఎందుకో ఏ అవ్యక్త స్మృతివల్లనో చటుక్కున అతనికి కోపం పోయి సిగ్గుతో అవమానంతో తనమీద తనకి జాలితో బలహీనుడై పోయాడు లక్ష్మీమోహనరావు ఆమె జేబులో పదిరూపాయలు పెడు తూంటే తోసివేయాలనుకున్నాడు. కాని, అతని నరాలూ, ఇంద్రియాలూ స్తంభించిపోయాయి. అలాగే నుంచునిపోయాడు. కోపంగా కేకలేద్దామను కున్నాడు. కాని మాట రావడంలేదు.

"వెళ్ళు పంతులూ" - పాప జాలిగా చూసి అంది.

లక్ష్మీమోహనరావు జేబులోంచి నోటుతీసి ఆమెమీదకు విసిరి వేశాడు. ఒళ్ళంతా అవమానంతో దహించుకుపోతోంది. నిర్జనంగా ఉన్న రాజమండ్రి రోడ్లమీద నడచిపోతున్నాడు. లక్ష్మీవారంపేట, తుమ్మలావ గడచిపోయాడు. పాప జాలిగా చూడటం అతనికి మరీ మరీ గుర్తుకు వస్తోంది.

తను దరిద్రుడని తెలిసిపోయింది. తన శక్తి అంతా ఈ ప్రమాదం రాకుండా ధారపోసినా లాభం లేకపోయింది. తనకి వ్యభిచరించే అర్హత కూడా లేదు. ఎంత దూరం ఆ చీకట్లో అలా నడిచాడో తెలియదు. కాని అతను తనకి తెలియకుండానే తన ఇంటికి వెళ్ళాడు. అతని ఒంట్లోంచి సత్తువంతా ఎవరో తోడేసినట్టయింది. కాళ్ళు వణికాయి. తన ఇంటి మెట్ల మీద చతికిలపడ్డాడు. మొహం చేతులతో కప్పుకున్నాడు. అతని గొంతు నుంచి మూలుగు హీనస్వరంతో బయటికి వచ్చింది.

ఇంటి తలుపు తెరచి భాగ్యలక్ష్మి తొంగి చూచింది. "ఇంతదాకా ఎక్కడెక్కడున్నారు? రండి లోపలికి. అలా బెంగపడిపోతే ఎలాగ" అంటూ అతని చేయి పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది.

"మీరు కూడా ఏమయ్యారో అని భయంతో చస్తున్నాను. చచ్చిన కొడుకెల్లానూ రాడు, మీరుకూడా...." ఆమె కంఠం రుద్ధమయింది.

"పడుకోండి ఇలాగ" అంటూ అతన్ని మంచం మీద పడుకో పెట్టింది.

లక్ష్మీమోహనరావు కళ్ళు మూసుకొని పడుకున్నాడు. కను కొలకుల నుంచి కన్నీటి బిందువులు రాలుతున్నాయి. లక్ష్మి అతని కళ్ళు తుడిచి "కాస్త విశ్రాంతి తీసుకోండి" అని తన కళ్ళు తుడుచుకుంది. లక్ష్మీ మోహనరావుకి కాస్సేపటికి నిద్రపట్టింది.

(జ్యోతి, 1963)



# ఊరి చివర ఇల్లు

హోరున వర్షం కురుస్తోంది. ఆకాశమంతా దట్టమైన నల్లని మబ్బులతో నిండివుంది. ఊరికి శివారునవున్న ఆ పెద్ద పెంకుటిల్లు వర్షంలో మరీ ఒంటరిగా నిస్సహాయంగా వున్నట్టుంది. చూరు వంగిపోయింది. గోడల నుండి పెద్ద పెద్ద బెల్లులు విరిగి పడిపోయాయి. వేగంతో క్రమించిపోయే కాలానికి, పదార్థం మొండితనానికి జరుగుతూన్న అనాది యుద్ధానికి చిహ్నంగా నిలిచినట్టుంది ఆ యిల్లు.

ఊరి కింత దూరంగా ఈ యిల్లెందుకు వుందో ఎవరికీ తెలియదు. కొత్తగా చూసినవాళ్ళు ఈ యింట్లో ఎవరూ నివాసం ఉండడంలేదనుకుంటారు. కాని కాస్త నిదానించి చూస్తే గుమ్మాలకి, కిటికీలకి రంగులూ, తెరలూ వేసి ఉంటాయి. ఇంటి కిటూ అటూ మైళ్ళకొద్దీ పొలాలు పరచుకుని వున్నాయి. అక్కడక్కడ పెద్ద పెద్ద చింతచెట్లూ తుమ్మచెట్లు కూడా భారంగా భూమిమీదకు వంగి వున్నాయి. వారం పదిరోజుల్నుండి వర్షం అవిరామంగా ఏకధారగా కురుస్తోన్నందువలన ఆ ప్రదేశమంతా జలమయమై పోయింది. పొలాలన్నీ నీటిలో మునిగిపోయి వున్నాయి. వరిమొక్కల చివళ్ళుమాత్రం కొన్నిచోట్ల నీటిపైకి కనబడుతున్నాయి.

సాయంత్రం నాలుగు గంటలయినా నల్లని మబ్బులమూలాన్ని చీకటి పడిపోయినట్టు వుంది. ఇంట్లో చీకటి మరీ చిక్కబడుతోంది. మండువాలో ముక్కాలిపీటమీద ఒక యువతి కూర్చుని కిటికీలోంచి ఎదురుగా ఉన్న రోడ్డు కేసి చూస్తూవుంది. ఆమె అలాగ చాలాసేపటి నుండి చూస్తోంది. ఇరవై రెండు-యిరవైమూడు సంవత్సరాల వయస్సుంటుంది. తెల్లని చీర కట్టుకుని

వుంది. ఆమె చూపులో ఒకరికోసం నిరీక్షణకాని, ఏ విధమైన కుతూహలం కాని లేదు, శూన్యంగా విరక్తంగా వున్నాయి ఆ చూపులు. ఎదురుగా ఉన్న వర్షదృశ్యం ఆమెలోని దిగులుని మరింత ఎక్కువ చేస్తోంది. రోడ్డంతా గతుకులతో గోతులతో అసహ్యంగా వుంది. గోతులన్నీ బురదనీటితో నిండివున్నాయి. రోడ్డుకీ యింటికీ మధ్య ఉన్న పల్లపునేలలో వర్షపునీరు చేరుకుని చిన్న మడుగులా తయారయింది.

ఆమె అలాగ చాలాసేపటినుండి చూస్తూ కూర్చుని వుంది-గంట నుండి-రెండుగంటలనుండి-బద్ధకంగా బరువుగా దీనంగా దిగులుగా-చూరు మీద వేసిన రేకుమీద వర్షంపడి టపటపమని మోటుగా చప్పుడవుతోంది. చూరు కిందికి వర్షం ధారలు ధారలుగా జాలరు జాలరులాగ మీదకి పడు తోంది. మధ్య మధ్య వర్షపుజోరు తగ్గుతోంది; కాని అంతలోనే హెచ్చి పోతోంది. వర్షం హెచ్చడంతో గాలి కూడా పేట్రేగిపోతోంది.... విసురుగా వీచే చలిగాలికి తెలీకుండా ఆమె వొంటిమీదికి పైటలాక్కుంటోంది. మొహాన పడే ముంగురుల్ని చేతివేళ్ళతో వెనక్కి నెట్టుతోంది.

ఇంటిలోపల్నుండి మండువాలోకి ఓ ముసలిమనిషి వచ్చింది. ఆమె దేహంలో ఎక్కడా రక్తమూ, మాంసమూ వున్నట్టులేదు. చర్మం ఎండి బిగుసుకుపోయి ఎముకలకి కట్టి లాగినట్టుగా వుంది. మొహం వికృతంగా వుంది. నోరు పెద్దదిగా అసహ్యంగావుంది. గుంటలాంటి కళ్ళు, ముడతలు పడిన రెప్పలసందుల్లోంచి ఆ కళ్ళు ఏవో తెల్లని పురుగుల్లాగ కదులు తున్నాయి.

ముసలిది యువతిని కొంతసేపు పరీక్షగా చూసింది. నాలుగడుగులు వేసి ఆమె దగ్గరగా వచ్చింది. చిన్నగా దగ్గింది. యువతి ఆమె రాకని గమనించలేదు. ముసలిది ఆమె భుజంమీద చెయ్యివేసి 'పద పిల్లా పద. లోపలికి పోయి పడుకో ఏమిటి చూస్తావిలాగ?'' అంది. యువతి మాట్లాడ లేదు.

"నీకే చెప్తున్నాను. ఈ చలిగాలికి దగ్గో జ్వరమో వచ్చిందంటే చచ్చినంత పనవుతుంది. లే లోపలికెళ్ళి పడుకో.''

యువతి కిటికీలోంచి నిశ్చలంగా రోడ్డువైపు చూస్తూవుంది.

'నా మాట వినవు ఎందుకు వింటావులే। ఎప్పుడేనా విన్నావు కన కనా! పోనీలే నా కెందుకు!' అంటూ ముసలిది లోపలికి వెళుతూ ఆగి 'శాలువా తీసుకురానా పిల్లా?' అని అడిగింది.

'వద్దు' అంది యువతి. ఆమె గొంతులో కూడా అదే శూన్యత. అదే విరక్తి.

ముసలిది గొణుక్కుంటూ లోపలికి వెళ్ళింది. మళ్ళీ కాసేపట్లో తిరిగి వచ్చింది.

'పోనీ పిల్లా, కాస్త టీ చేసి తీసుకురానా?' అంది.

'వద్దు' అంది యువతి నుక్తసరిగా.

'సోద్యం, సోద్యం' అంటూ ముసలిది లోపలికి వెళ్ళిపోయింది. వాన ఎక్కువయింది. వానతో పాటు గాలి ఉధృతంగా వీచింది. గుమ్మాలవీ, కిటికీలవీ తలుపులు టపటపమని కొట్టుకున్నాయి. దూరంగా ఉరుములు మెరుపులు.

పది నిముషాల్లో ముసలిది చేత్తో టీ కప్పు పట్టుకుని వచ్చింది. యువతికి ఎదురుగావున్న కిటికీలో పెట్టి 'తాగు పిల్లా, తాగు. పచ్చి వొంటికి టీ నీళ్ళు చాలా మంచివి' అంది. యువతి విసుగ్గా ఆమెకేసి చూసి తల పక్కకి తిప్పుకుంది.

'చచ్చినవాడికోసం ఏడిస్తే ఏమొచ్చిందే పిల్లా! వేలెడులేడు ముననష్టపు వెధవ. వాడికోసం బెంగపెట్టుకుని ఏడ్చేదాన్ని ఎప్పుడూ చూడనే లేదు' అంది ముసల్ది.

ముసలిది ఆగిఆగి నిలిచినిలిచి మాట్లాడుతూంది. మాటల్ని చేపల్లాగ కత్తిపీటమీద తరుగుతూన్నట్టు అనిపిస్తుంది. కీచుగా వున్న గొంతు వొంటిమీద పడి ప్రాకుతున్నట్టుగా వెలపరం పుట్టిస్తుంది.

"వాన కురిసినప్పుడల్లా ఏవేవో జ్ఞాపకం వస్తాయి. కావల్సిన వాళ్ళకోసం, దగ్గరవాళ్ళకోసం మనస్సు పోతుంది. వానలో ఒకళ్ళం ఉండలేం పిల్లా ఉండలేం-నాకు తెలుసు. అయితే అటువంటి ఆలోచనలవల్ల లాభం వుండదు. పిల్లా! వానంటే భయం నాకు వెధవ్వాన వెధవ్వాన ..." అంటూ ముసలది ఆగింది. ఆమె కళ్ళల్లో కోపం మసిబొగ్గులాగ మండబోయి మాడిపోయింది. "ఎందుకే యీ విచారం చచ్చినవాడికోసం? అసలు నీకు పిల్ల

లెందుకే తెలివితక్కువదానివి కాని. అనుమానం కలగ్గానే ఏం చెప్పాను నీకు? ఎరుకలదానిదగ్గర బలే మందులున్నాయి తీసుకొస్తానంటే విన్నావా? నువ్వెందుకు వింటావులే నా సలహా! అలాగ పుట్టాడు అర్ధాయుష్షు వెధవ-ఇలాగ మూడు నెలలకే చచ్చాడు."

యువతి కళ్ళల్లో బాధ ఆకాశంమీద నల్లని మబ్బులాగా క్రమ్మింది. ముసల్ది వూరుకోలేదు.

"నీ వయస్సులో పిల్లలు పుడితే నీకేసి ఎవడు చూస్తాడే యీ రోజుల్లో! వొంటికి బిగువు పోయాక నేనెంతో నువ్వూ అంతే" అసహ్యంగా నవ్వింది ముసలిది.

"నోర్ముయ్యి" అంది యువతి కోపంగా.

"మూస్తాను మూస్తానులే. నోరు మూసుకుంటే నువ్వూ నేనూ అడుక్కుతినాలిసిందేగా! ముసలిముండనైనా దేవుడు నాకు బుర్రలో తెలివిచ్చాడే పిల్లా!"

ఓ నిముషం ఆగి ముసలిది "ఇదిగో పిల్లా నీకొడుకు పుట్టగానే సోదికెళ్ళి అడిగాను. అటువంటి వెధవపిల్లలు బతకరని తెగేసి చెప్పింది సోదె. ఒక తండ్రి ఒక వంశమూలేని ముదనష్టపు పిల్లలకి దేవుడి శాపం వుంది శాపం. నీ కొడుకే కాదు, ఈ యింట్లో ఎప్పుడూ ఏ పిల్లాడు పుట్టి బతికిన పాపాన పోలేదు" అంది.

యువతి భయంతో విహ్వలంగా చూసింది. "నిజంగానా? నిజంగానా అవ్వా?" అని అడిగింది.

"ఆ భయమే వద్దన్నాను. నీ వయస్సూ, నీ అందమూ వుంటే భయపడిన ఆడదాన్ని నే నెరగను. ఇప్పుడు నాలుగు రాళ్ళు చేసుకోక పోతే యింకెప్పుడే పిల్లా! వచ్చిన ప్రతివాణ్ని వెళ్ళకొడతావు. ఎవళ్ళో రాజకుమారులు కాని నీకు నచ్చనే నచ్చరు. ఆసరాగా వుంటావని నిన్ను నమ్ముకొని నే బతుకుతున్నాను. నా మాటా, నేనూ కూడా నీకు చేదయింది." ముసలిదానికి తీవ్రత హెచ్చిపోతోంది. చేతులు వూపుతూ యింకా యిలాగ అంది. "చచ్చినవాళ్ళకోసం చావలేం పిల్లా! నన్ను ముట్టుకోకు నా మాల కాకీ అని కూర్చుంటే ఆకలితో మాడి చస్తాం. నీకేం దొరసానిలాగ కబుర్లు

చెపుతావ్. అప్పుడు నే నాదుకోకపోతే నీ గతి ఏమయ్యేదే ? చాల్చాలు ! వాణ్ని తలుచుకుంటే మాటదక్కదు. మూడు నెలల ముంగి వెధవచచ్చాడు పీడా వదిలింది.''

యువతి కోపంతో బాధతో జేవురించిన మొహంతో కిటికీలో వున్న కప్పు తీసి ముసలిదానిమీద విసిరింది. "ఫో ముసలిముండా ! ఫో దెయ్యపు ముండా ! నా ఎదట నిలబడకు....'' అంటూ వెర్రిగా అరిచింది. ముసలిది ఒడుపుగా దెబ్బ తగలకుండా తప్పుకుని, "పోతాను పోతాన్లే. నే బ్రతికి వన్నాళ్ళే నీ కష్టం సుఖం చూసేది. తర్వాత నీ వూసు ఎవరు పట్టించు కుంటారో చూస్తాను!'' అంటూ కీచుగా ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

యువతి మొహం బాధతో మలినమైంది. కంటి చివరల రెండు నీటి చుక్కలు నిలిచాయి. గుండె బరువెక్కింది ఇనుపతెర మధ్య ఎవరో తన్ని పెట్టి నొక్కుతూన్నట్లు బాధతో "అమ్మా!" అంది.

చీకటి పడుతోంది. పొలాలన్నీ అస్పష్టంగా నల్ల రంగులో కలిసి పోతున్నాయి. చుట్టుప్రక్కల ప్రదేశమంతా నిర్మానుష్యంగా భయంకరంగా వుంది యువతి అక్కడే అలాగే కూర్చుని కిటికీలోనుంచి చూస్తోంది.

ముసలిది మండువాలోకి వచ్చింది. "అన్నంలోకి ఏం వండమన్నావ్ పిల్లా?'' అంది.

"ఏదో ఒకటి.''

"ఇప్పుడేనా చెప్పినమాట విను. చలిగాలి ఎక్కువయింది. వొంటికి మంచిదిగాదు. వెళ్ళు, లోపలికి వెళ్లు.''

"సర్లే."

"చిటికెలో వంటచేసి పిలుస్తాను. వేడివేడిగా కూడు తిన్నావంటే బలం వస్తుంది. లోపలికి పోయి శాలువా కప్పుకో" అంటూ ముసలిది వెళ్లి పోయింది.

యువతి బరువుగా నిట్టూర్చింది. కాని అక్కడనుంచి కదలలేదు. అలాగ కిటికీలోంచి చూస్తూనేవుంది, కొండచిలువలాగ మెలికలు తిరిగి తిరిగి చీకట్లో కలసిపోయిన రోడ్డువైపు. కొంత సేపటికి దూరంగా రోడ్డుమీద

ఏదో ఆకారం అస్పష్టంగా కనిపించింది. దగ్గరౌతున్నకొద్దీ చేతిలో సూట్ కేసూ,మరో చేతిలో గొడుగుతో రోడ్డు బురదలో కాళ్ళీడ్చుకుంటూవస్తూన్న వ్యక్తి కనిపించాడు. గాలికి గొడుగు తిరగబడి పోతూంది. అతి ప్రయత్నం మీద గొడుగుని ఆ వ్యక్తి సమానంగా ఉంచగలుగుతూన్నాడు. ఇంత వర్షంలో యీ ప్రయాణం సాగించే బుద్ధిహీను డెవరా అనుకుంది యువతి. అదేకాదు రోడ్డంతా గోతులు పడివుంది. చీకటి పడ్డాక యీ దారిని వెళ్ళడం ప్రమాదకరం. ఆ వ్యక్తి తన యిల్లుకూడా దాటిపోయాడు. యువతి చప్పున లేచి మండువాలోనుంచి వీధి అరుగుమీదికి వచ్చింది. చప్పట్లు కొట్టింది. "ఏవఁయ్యోయ్! మిమ్మల్నే ఇలా రండి!" అని పిలిచింది గట్టిగా.

ప్రయాణీకుడు కొంచెంసేపు తటపటాయించాడు. మెల్లగా ఇంటి వైపు తిరిగివస్తున్నాడు. ఇంటిముందు పల్లంలో మోకాలిబంటి నీరు ఉంది. ప్రయాణీకుడు గొడుగు ముడిచి చంకన పెట్టుకొని మోకాళ్ళపైకి పంచె లాక్కుని భయం భయంగా అడుగుమీద అడుగులేసుకుంటూ కాలవని దాటాడు. అరుగుమీదకి వచ్చి పెట్టెని, గొడుగునికిందికిదించి 'హమ్మయ్య!' అన్నాడు. ఆ వ్యక్తి అజానుబాహుడు. తెల్లని అతని బట్టలమీద బురదచింది అసహ్యంగా హాస్యాస్పదంగా వుంది. మొహం సరిగా కనుపించలేదు యువతికి.

"నన్ను పిలిచారా?" అన్నాడతను అలసిన గొంతుతో.

"అవును ఎక్కడికి వెడుతున్నారు మీరు?" అంది యువతి.

"రైలు స్టేషన్‌కి."

"అబ్బో! – స్టేషన్ యింకా చాలాదూరం వుంది" అంది యువతి.

"అయినా వెళ్ళక తప్పదుగా!" తడిసిన బట్టల్ని పిండుకుంటున్నాడతను.

"ఈ చీకట్లో యీ రోడ్డుమీద వెళ్ళడం ప్రమాదకరం. రోడ్డంతా గోతులు. పైగా పైన ఎక్కడో గండికూడా పడిందిట. ఈ మాట చెబుదామనే పిలిచాను."

"కృతజ్ఞుణ్ణి. కాని నేను వెళ్ళక చేయగలిగిందేముంది చెప్పండి! ఈ రోజున బయలుదేరడమే బుద్ధిపొరపాటు. మధ్యాహ్నం కొంచెం తెరిపి

యిస్తే ఫరవాలేదుకదా అని బయల్దేరాను. ఎవరినడిగినా నాలుగడుగులు వేస్తే స్టేషన్ వచ్చేస్తుందని చెప్పారే! ఏం మనుషులండీ వీళ్లు! అబ్బ! చేతులు నొప్పి పెడుతున్నాయి.'' అంటూ వేళ్లు సాచి ముడుచుకున్నాడు కీళ్ళు సడిలేందుకు.

"మీకు దూరమని తెలియదా?''

"తెలియదు. నేను యీ దారిని రాలేదుగా వచ్చేటప్పుడు? అసలు నేనీ ప్రాంతాలకి కొత్తవాణ్ణి. అందులో ఈ వర్షాకాలంలో పల్లెటూళ్లకి వెళ్లడం తెలివితక్కువ.''

యువతి చిన్నగా నవ్వింది. "అయితే యిప్పుడేంచేస్తారు మీరు?'' అంది.

"ఏం చెయ్యను! ఎలాగో అలాగ తంటాలుపడి స్టేషన్ చేరుకుంటాను.''

"మీ గొంతు విన్నట్టుగా ఉందే ఎప్పుడో ఎక్కడో!'' అంది విస్మయాన్ని సూచిస్తూ.

"కంఠ ధ్వనిలో పోలికలుంటాయిలెండి. కాని మీరు నన్నుకానీ, నేను మిమ్మల్నికానీ కలుసుకోలేదని నిక్కచ్చిగా చెప్పగలను'' అన్నాడా వ్యక్తి.

"ఎలాగ చెప్పగలరు?" అంది యువతి కుతూహలంతో.

"ఈ ప్రాంతానికి నే నెప్పుడూ రాలేదని చెప్పాను కదా, అదీగాక చాలాకాలం యీ దేశంలోకూడా లేను" అంటూ ఆ వ్యక్తి తిరిగి పెట్టెనీ, గొడుగునీ చేతపట్టుకున్నాడు. "నమస్కారం నేను వెళ్తాను. రోడ్డు విషయమై మీరు చేసిన హెచ్చరికను మరచిపోను" అన్నాడు.

"మీరు నా మాట నర్థంచేసుకోలేదు. మీరింక ప్రయాణం సాగించడం శ్రేయస్కరంకాదు. ఈ రాత్రికి యిక్కడ పరుండి పొద్దుటే వెడితేమంచిది. మీ కభ్యంతరం ఏమీ లేకపోతే" అంది యువతి.

నూతన వ్యక్తి ఆలోచించాడు. "అంతేనంటారా?" అన్నాడు.

"అవును. ఉదయం ఆరుగంటలకి రైలువుంది. అప్పటికి వర్షం కూడా చాలామట్టుకు తగ్గొచ్చును."

వర్షం మళ్లీ హెచ్చింది. వానజల్లు వరండాలోకి వచ్చి పడుతోంది నూతనవ్యక్తి హతాశుడై "సరే సరే. మీరు సూచించిన మార్గమే ఉత్తమం గా కనపడుతోంది. తెల్లవారాక మున్సిపాలిటీవాళ్లు ఏ గోతిలోంచో బురదలోంచో కూరుకుపోయిన నా శవాన్ని పైకి తీయడం అంతగా ఆశించ దగినదిగా లేదు. మీ దయకు కృతజ్ఞుణ్ణి" అంటూ సంకోచంగా నవ్వుతూ అన్నాడు.

ఇంతలో ముసలిది దీపం పట్టుకుని వచ్చింది. దీపపు వెలుగులో అతని ఆకారం మరింత స్పష్టంగా కనబడింది. మనిషి ఒడ్డూ పొడుగూ ఉన్నాడు. బుగ్గలు కొంచెం చిక్కినట్టున్నా మొహం అందంగానేవుంది. చామనచాయ. మొత్తంమీద విగ్రహంలో గాంభీర్యం స్ఫురిస్తోంది. పంచె అంతా బురదతో నిండివుంది. ముసలిది దీపం పైకెత్తి దగ్గరగా పట్టుకుని పరీక్షగా చూస్తూ "ఏ వూరు బాబూ మీది ?" అంది. దీపకాంతిలో మెరసిన అతని వదనాన్ని చూసి యువతి ఉలిక్కిపడింది. తెల్లబోయి రెండు కళ్లూ అప్పగించి అలాగ చూస్తూ నిలబడింది. ముసలిది మోచెయ్యితో యువతిని పొడిచి "దెయ్యం పట్టినట్టు ఏవిటే ఆ చూపు పిల్లా ?" అంది.

యువతి యింకా తేరిచూస్తూ "మీ పేరు ?" అంది.

"జగన్నాథం" అన్నాడా వ్యక్తి.

యువతి కళ్లలో ఆశాభంగం అద్దంలా కనపడింది. అది గమనించిన అతనికి సంకోచం ఎక్కువయింది. "మీరు నన్నాహ్వానించడంలో ఏదో పొరపాటు జరిగిందనుకుంటాను, మీ ధోరణి చూస్తే. ఈ వర్షపు తీవ్రత తగ్గగానే వెళ్లిపోతాను. నేనేమీ అనుకునేవాణ్ణి కాను" అన్నాడు.

యువతి తనలో కలిగిన ఉద్రేకాన్ని అణచుకొని సహజస్వరంతో "కాదు కాదు. మీరు నే నెరిగిన ఒక వ్యక్తిలాగ వున్నారు. అంతే. మీరు అపార్థం చేసుకుని వెళ్లిపోతే నేను చాలా బాధపడతాను" అంది. వ్యక్తి నిట్టూర్చి పెట్టె కింద పెట్టాడు. ముసలిది తేలికగా పెట్టెని ఎత్తి లోపలికి తీసుకువెళ్ళింది.

యువతి జగన్నాథాన్ని ఒక గది దగ్గరకు తీసుకువెళ్ళి "అవ్వ ఈ గదిలోనే మీ పెట్టెని పెట్టింది. మీరు బట్టలు మార్చుకుని విశ్రాంతి తీసు

కోండి. మీకు భోజనం ఏర్పాటు చేసి వస్తాను" అని వెళ్ళిపోయింది. జగన్నాథం గదిని నలువైపులా పరీక్షగా చూశాడు. పాతకాలపు పందిరిమంచం ఒకటుంది. దానిమీద తెల్లని పక్క వేసి వుంది. మంచానికి పక్కగా ఒక ఎత్తయిన ముక్కాలిపీట వుంది. పేముతో అల్లిన కర్ర కుర్చీ కూడా వుంది. ఒక మూలగా హరికేన్ లాంతరు వెలిగించి వుంది. అతను తొందర తొందరగా దుస్తులు మార్చుకున్నాడు. అతని కాకలి ఎక్కువగా వుంది. వొళ్ళంతా చలితో తేమతో ముద్దకట్టుకుపోయి నట్టుంది.

ముసలిదివచ్చి భోజనానికి రమ్మని పిలిచింది.అరిటాకులో అన్నమూ, పదార్థాలూ వడ్డించి వున్నాయి. ముసలిది నిశ్శబ్దంగా వడ్డిస్తూ వుంది. ఏదో చెప్పాలని నోరు తెరుస్తుంది. కాని తలుపుచాటుకి చూసి మానివేస్తుంది. ఆకలితో వున్న అతనికి భోజనం రుచిగా వుంది. ముసలిది మాట్లాడబోయి మానివేయడం గమనించి తలుపుచాటుకు చూశాడు. తలుపు చాటుగా యువతి కూర్చునివుంది. అతని కేదో విచిత్రమైన అనుభూతి కలిగింది. తనలో తాను నవ్వుకున్నాడు.

భోంచేసి గదిలోకి వెళ్ళగానే ముక్కాలిపీటమీద తమలపాకులూ, వక్కా అమర్చబడిన వెండిపళ్ళెం కనపడింది. అగరువత్తులు వెలిగించబడి గోడకున్న చిన్న చిల్లులో గుచ్చబడివున్నాయి. తలవని తలంపుగా లభించిన యీ ఆతిథ్యానికీ ఆదరానికీ అతనికి విస్మయానందాలు రెండూ కలిగాయి. కాసేపట్లో గుమ్మంవద్ద గాజుల చప్పుడు విన్నాడు. తల పైకెత్తి "రండి, జన్మలో మీరు చూపిన ఆదరాన్ని మరచిపోలేను. రైల్లోనో, రైలుస్టేషన్‌లోనో తిండి తిప్పలులేక పడి ఉండవలసిన విధి నుండి తప్పించారు మీరు'' అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూ వచ్చి కుర్చీలో కూర్చుంది. జరీ అంచులేత నీలం చీర ధరించింది. జుట్టుని వదులు వదులుగా జడవేసి చివరలు వదలివేసింది. నొసట సన్నని ఎర్రని తిలకం ఆమె వదనానికి ఆకర్షణతోపాటు ఉదాత్తత నాపాదిస్తోంది. ఆమె కళ్ళు పెద్దవిగా, జాలిగా, మంచులో తడిసిన పద్మాల్లా వున్నాయి.

"మీరు నా మాట మన్నించి ఆగినందుకు నాకు చాలా ఆనందంగా వుంది'' అందామె తల వంచుకుని.

"సరేసరే. ఆనందించవలసింది నేనుకాని మీరు కాదు. శ్రమంతా మీది. చివరకు మీరు పడుకునే మంచంకూడా నాకిచ్చివేసినట్టే కనపడు తోంది. నిజానికి ఓ చాపా దిండూ యిస్తే నడవలో పడుకుని నిద్రపోతాను. అనవసరంగా నన్ను చాలా గౌరవించేస్తున్నారు.'' అని అతను నిర్మలంగా నవ్వాడు.

"కాదు. కాదు. నేనూ అవ్వా యింకో గదిలో పడుకుంటాం. మీరు చాలా దూరంనుంచి వచ్చినట్టున్నారు" అందామె.

"అవును అయిదారు మైళ్ళపైన నడిచాను. ఉదయం అంతానడిచి '___' పల్లెటూరుకి వెళ్లాను. రోడ్డయినా ఏమీ బాగూలేదు. ఈ పెట్టెనీ, గొడుగునీ మోసుకుంటూ యింత వర్షంలో-నిజంగా చాలా అలసిపోయాను. మీకు నిజం చెప్పమన్నారా?'' అని ఆగాడు జగన్నాథం.

"చెప్పండి." అందామె ఓరగా చూస్తూ.

"ఈ రోజంతా నాకు భోజనం లేదు. నేను పల్లెకి వెళ్లిన పనీ జరగలేదు." అన్నాడతను విచారంగా.

"ఏం జరిగింది ?"

"నా మిత్రుడొకడు కష్టాలలో వున్నాడు. 'నా' అన్నవాళ్లెవరూ లే రతనికి. జబ్బుతో తీసుకుంటున్నాననీ, ఒక వెయ్యి రూపాయలు సహాయం చెయ్యమనీ ప్రాధేయపడుతూ ఉత్తరం రాశాడు. ఆ జాబు నాకు చాలా ఆలస్యంగా అందింది. నేను ఒక్కొక్క ఊరే తిరుగుతూంటే ఆ ఉత్తరం నా వెనకాలే వచ్చింది. ఆఖరికి మొన్ననే ఉత్తరం చేరింది. నేను సొమ్ము తీసుకుని యికాయకీని బయలుదేరి ఈరోజునే పల్లెకి వెళ్లాను. కాని...."

"కాని....?"

"నా మిత్రుడు నాలుగైదు రోజులక్రితమే పోయాడు. ఈ పూటకి నన్నాగమన్నారు వాళ్ళోళ్ళవాళ్ళు. కాని నాకు మనస్కరించలేదు. బయలుదేరి వచ్చేశాను."

ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా ఉన్నారు. ఈ విషాద కథనానికి దీపకాంతికూడా కొంచెం తగ్గినట్లనిపించింది వారికి. ఆమె కంగారుగా పైట సర్దుకుని లేవబోయి కూర్చుంది.

"ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పలేం. చూడండి ఆ పెట్టెలో వెయ్యి రూపాయిలూ వున్నాయి. కాని అతను మాత్రం యిక్కడెక్కడా లేడు." అన్నాడతను నిట్టూరుస్తూ.

గది అవతల చప్పుడయింది. "ఎవరూ?" అంటూ యువతి గుమ్మం వద్దకు వెళ్లింది. పక్కగా ముసలిది వుంది. "ఏం?" అంది కోపంగా యువతి.

"పాలు కాచమన్నావా పిల్లా?" అడిగింది ముసలిది.

"ఇందాకనే చెప్పాను కదూ కాచమనీ." అంటూ యువతి వచ్చి కుర్చీలో కూర్చుంది.

అతను దిండుకు చేరగిలబడి కూర్చున్నాడు. ఒకసారి యింటి కప్పునీ, గోడల్నీ చూసి "ఊరికింత దూరంగా ఈ యిల్లు వుండడం తమాషాగా వుంది." అన్నాడు. అతను వచ్చే ఆవులింత నాపుచేసుకుని "మీకు వివాహమయిందా?" అని అడిగాడు.

హఠాత్తుగా వేసిన ఈ ప్రశ్నకి ఆమె ఉలిక్కిపడి "ఏమిటీ?" అంది.

"మీకు వివాహ మయిందా?"

ఆమె జవాబు చెప్పలేదు. తలవంచుకుంది.

"తెలిసింది. తెలిసింది లెండి. వివాహమైతే యింటి యజమాని ఉండే వారుగా! మీకు పెళ్లి కాలేదు. అంతేకదూ?"

ఆమె కాలి బొటనవేలుతో నేలని గీస్తోంది.

"మీరు చాలా సిగ్గుపడిపోతున్నారే" అంటూ అతను ఆవలింత నాపుచేసుకోబోయాడు. కాని ఆవులింత అతని ప్రయత్నాన్ని జయించి శబ్దం చేసుకుంటూ వచ్చింది. అతను చిటికెవేస్తూ "ఇంకా మీరు పెళ్లి చేసుకోలేదేం?" అని అడిగాడు.

యువతి కుర్చీలోంచి సంభ్రమంగా లేచి "మీకు నిద్ర వస్తున్నట్టుంది. చప్పున పాలుకాచి తీసుకువస్తాను" అంటూ తొందరగా గదిలోంచి

వెళ్లిపోయింది. పుష్టయిన భోజనమూ, మెత్తని పరుపూ అలసిన అతని నరాలనీ దేహాన్నీ లాలిస్తూంటే, నిద్ర ముంచుకువచ్చింది. హోరున వర్షమూ, ఒంటరిగాఉన్న యీ యిల్లూ, ఈ రాత్రి, యీ ఆతిధ్యమూ గురించి వింతగా తలచుకుంటూనే నిద్రలోకి జారిపోయాడు. చలిగాలి చూరుని జంయ్యిమని శబ్దం చేస్తూ కొట్టుకుంటోంది. ఇంటి ముందు మడుగులో కప్పలు బెకబెకమని చప్పుడు చేస్తున్నాయి. వర్షం చూరుమీద వున్న రేకుమీద పడి డబడబ ధ్వనిచేస్తోంది. అయినా వీటన్నింటిని మించిన నిశ్శబ్దం ఆ ప్రదేశాన్ని ఆవరించుకుంది.

సుమారు ఓ గంటకి అతనికి మెలకువ వచ్చింది. గది తలుపులు తెరచిన చప్పుడయి ఒక కన్ను కొంచెం తెరచి చూశాడు. యువతి అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు కాకుండా వచ్చింది. ఆమె చేతిలో పాలగ్లాసు వుంది. మెల్లగా "ఏమండి?" అంది. జగన్నాధం నిద్ర నటించాడు. ఆమె మళ్లీ "ఏమండీ పాలు తీసుకుంటారా?" అంది. అతనికి మెలుకువ రాకపోవటంచూసి పాలగ్లాసు ముక్కాలిపీటమీద పెట్టి అలమారులో వున్న ప్లేటు ఒకటితీసి మూత పెట్టింది. అడుగులో అడుగువేస్తూ గుమ్మంవరకూ వెళ్లింది. ఆమెకేదో ఊహతోచి ఆగిపోయింది. సంకోచంతో మంచంవైపు చూసింది. అతనంతా కనిపెడుతూనే వున్నాడు. ఆమె మూలనున్న దీపంతీసుకుని వత్తి పెద్దదిచేసి మంచం దగ్గరకువచ్చి దీపాన్ని అతని ముఖానికి దాపుగా ఎత్తి పట్టుకుని పరీక్షగా చూస్తూ నిలుచుంది. అతని కుతూహలం ఎక్కువయింది. కాని అనుకోకుండా చటుక్కున కదిలాడు. ఆమె కంగారుగా దీపం కిందపెట్టి వెళ్లిపోబోయింది. అతను కళ్ళు తెరచుకొని ఏమీ ఎరగనట్టు 'ఎవరది?' అన్నాడు. ఆమె ఆగింది. అతను లేచి కూర్చుని కళ్లు నులుముకుని 'హో_ మీరా?' అన్నాడు. తన చేష్టల్ని పరికించాడేమో అన్న శంకతో తడబడుతూ "మీకు పాలుతీసుకు వచ్చాను." అంది ఆమె.

పాలు తాగుతూ "మీరెందుకింత దయచూపిస్తున్నారో అర్థం కావటంలేదు" అన్నాడు.

ఆమె నవ్వి "మీరు గోరంతలు కొండంతలు చేస్తున్నారు. మేం చేసిందేముంది చెప్పండి. ఇంత భోజనం పెట్టి పడుకోడానికింత జాగా చూపించడం కూడా ఘనకార్యమంటారా!" అంది.

అతను నిట్టూర్చి "నిజంగా ఘనకార్యమే. నా జీవితంలో ఎన్నో రాత్రులు భోజనమూ వసతీ లేక గడిపినవి ఉన్నాయి" అన్నాడు.

నిద్రవల్ల చిక్కిన స్వస్థతతో బలంతో అతనిలో ఉత్సాహం ప్రబలింది. ఈ అపరిచిత యువతివైపు తాను నిముషనిముషానికి ఆకర్షింపబడుతున్నట్టు తెలుసుకున్నాడు. ఆమెను పరీక్షగా చూశాడు.

నొసట ముంగురులు చెదరిపడివున్నాయి. ఇందాకా వదులుగా ఉన్న జడని సిగగా చుట్టింది. ఆమె దేహంలో సౌకుమార్యము యౌవనోల్బణము రెండూ గోచరిస్తున్నాయి. లేత నీలం చీరలో ఆమె వొంటివొంపులు వొందికగా అమరి వున్నాయి. అన్నిటికన్నా ఆమె కళ్లు ఎక్కువగా అతన్ని ఆకర్షించాయి. ఆ కళ్లలో అపారమైన జాలీ, కరుణా స్ఫురిస్తున్నాయి. ఏ స్వర్గలోకంలోనో, స్వప్న లోకంలోనో విరిసికొన్న ఆ కన్నులు, భూమి మీద ప్రవాస జీవితం అనుభవిస్తూ ఏదో పోగొట్టుకున్నట్లుగా బెదరుగా వెతుకుతూన్నట్టు అనిపిస్తోంది. జాలిగా మెత్తగా మన గుండెల్ని తాకుతూ పువ్వులాంటి గొంతుతో పిలుస్తోన్నట్టు ఉంటాయి. తనవైపు జగన్నాధం పరీక్షగా చూస్తున్నట్టు గుర్తించిన ఆమె బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. తాంబూల సేవనంలో ఎర్రబడిన పెదవుల మధ్య చిన్న నవ్వు తెల్లని ముత్యంలా పిట్లింది.

"అన్నట్టు మీ పేరు ఇంతవరకు తెలియనే తెలియదు" అన్నాడు జగన్నాధం.

"రమ"

"మీరు చదువుకున్నవారిలా కనిపిస్తున్నారు"

"ఏం చదువులెండి! హైస్కూలులో ఆరవఫారం వరకూ చదివాను. అదికూడా పెద్ద చదువేనంటారా!" అని ఆమె అతన్ని చూసి "సరే, కబుర్లుపెట్టి మీకు నిద్రాభంగం కల్గించాను. వెళ్ళిపోతాను" అని లేవబోయింది.

"నిద్ర తేలిపోయిందిలెండి. అదీగాక కబుర్లు మొదలు పెట్టిన వాణ్ని నేను, నా దోషాన్ని మీరు నెత్తిమీద వేసుకుంటున్నారు" అన్నాడతను.

ఆమె నవ్వి "బలేవారే!" అంది.

"మీ గొంతు హాయిగా వుంది. మీరు పాడగలరా!''

"అనాథాశ్రమంలో సభలో వార్షికోత్సవాలలో నన్నే పాడ మనే వారు. చెట్టులేనిచోట ఆముదం చెట్టుని మరి''

"అనాథాశ్రమమా ?'' ఆశ్చర్యంగా అడిగాడతను.

"అవును."

"తల్లీ తండ్రీ చిన్నతనంనుండీ మీకు లేరా !''

"లేరు'' ఆమె తలవంచుకుంది.

అనుచిత ప్రసక్తి తీసుకువచ్చానేమో అన్న భయంతో మాట మార్చాలని ఏమీ తోచక "చాలా చలిగా వుంది'' అన్నాడు.

''అవును" అందామె.

అతను ఫక్కున నవ్వాడు.

''ఎందుకలా నవ్వుతారు?" అందామె తెల్లబోయి.

''మరేంలేదు. ఏ ప్రశ్న అడిగినా నేనే అడుగుతున్నాను. మీరు అవును, కాదు అని ముక్తసరిగా సమాధానం ఇచ్చి ఊరుకుంటున్నారు. నే నెవరినో ఏమిటో తెలుసుకోవాలనే స్త్రీ సహజమైన కుతూహలం కూడా లేదా మీకు?"

ఆమె అతనికేసి వింతగా చూసి వూరుకుంది.

"నిజం చెప్పండి. ఇందాక నా పేరడిగి తెలుసుకున్నప్పుడు మీలో కలిగిన ఆశాభంగం స్పష్టంగా కనిపించింది ఎంచేత?'' జగన్నాథం అడిగాడు.

''మీరు విజయుడిలాగా వున్నారు'' - అని పైటచెరగు వేలికి చుట్టుతోంది.

"విజయ దెవరు ?" ఆమె సమాధానం చెప్పేలోగానే మళ్ళీ ఇలా అన్నాడు. "మీలో నాకొక విచిత్రమైన అందం కనబడుతోంది. మీరంటే నాకు.... నాకు...." మాటకోసం జగన్నాధం తడబడ్డాడు.

ఆమె జాలిగా అందంగా చిన్నగా నవ్వింది. అతను మళ్లీ అడిగాడు "మీకు పెళ్ళికాలేదు కదూ!"

లేదని ఆమె తల వూపింది.

"మరి ఎందుకు చేసుకోలేదు మీరు రమా?"

ఆమె మౌనంగానే ఉండిపోయింది.

"ఇలాగ వ్యక్తిగతమైన ప్రశ్నలు వేయడం సభ్యత కాదనుకుంటున్నారు కదూ! అవును. చూడండి రమా. ఈ రాత్రీ, యీ వర్షమూ, యీ విచిత్ర వాతావరణమూ -యివన్నీ మామూలు మర్యాదల్ని వెనక్కినెట్టి స్వచ్ఛంగా స్వేచ్ఛగా హృదయాలు విప్పి మాట్లాడు కోవాలనే వాంఛను ప్రేరేపించడంలేదూ?" అన్నాడతను.

"మెతో మాట్లాడుతూ కూర్చుంటే నాకేదో హాయిగా ఉంది" అందామె.

అతను దూరంగా చూస్తూ అంతకన్న దూరంగా ఆలోచిస్తూ" నిజానికి నేను లౌక్యుణ్ణికాను. ఎప్పుడెలా ప్రవర్తించాలో నాకు తెలియదు. అందుకే జీవితంలో ఏమీ కూడబెట్టలేక పోయాననుకుంటాను" అన్నాడు.

"అంటే?" ఆసక్తిగా అడిగిందామె.

"జీవితంతో నేను పరాజయం మీద పరాజయం పొందాను. డబ్బు గాని, వసతిగాని, భార్యాపిల్లల్నిగాని ఏమీ సంపాదించుకోలేదు. అందుకే విసుగెత్తి సైన్యంలో చేరాను."

"సైన్యమా ? విజయుడు కూడా సైన్యంలోనే చేరాడు!" అందామె సంభ్రమంగా కుర్చీనుండి లేచి.

అతను వినలేదు. తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు. "బర్మా, సింగపూర్, ఇంఫాల్ రంగాలలో పనిచేశాను. కాని అక్కడా నాకు సుఖం లేదు. తుపాకిమందు వాసనా, చావులూ, యూనిఫారమూ అంతే. అసహ్యం కలిగింది. ఎలాగో అలాగ బయటపడి ఇదివరకు ఆపుచేసిన చదు

వుని మళ్ళీ మొదలుపెట్టాను. యం. యస్‌సి. చివరకంటా చదివి చదివి పరీక్షలకు కూర్చోలేదు."

"అరె! అలా చేశారెందుకు?"

"ఆ రోజున పరీక్షలనగా నే నద్దెకున్న గది తాలూకా యింటావిడ అటకమీదనుంచి పడింది. తలమీద బలమైన గాయం తగిలి స్పృహ తప్పి పడిపోయింది. ఆమెకు అయిదేళ్ళ పిల్ల ఒకర్తి వుంది. అస్తమానూ నా గదిలోకి వచ్చి కూర్చుని ఆడుకునేది. పాపం ఆ పిల్ల ఒకటే ఏడుపు. ఇంటావిడని ఆస్పత్రిలో చేర్చాను. డాక్టరు బతుకుతుందో బతకదో చెప్ప లేమన్నారు. ఆ పిల్ల సంరక్షణ నా మీద పడింది. రెండు పూటలా ఆస్పత్రి కి వెళ్ళి ఆమె బాగోగులు విచారించడమూ, అమ్మ, అమ్మ అంటూ ఏడ్చే ఈ పిల్లని సముదాయించడముతో నా చదువూ, పరీక్షలూ కొండెక్కాయి."

"ఆవిడ బతికిందా?"

"బతికింది. నేనంటే ఆమెకి చాలా గురికలిగింది. ఆమె విధవ రాలు. పెద్దవయస్సుదికూడా. నన్ను అక్కడే ఉండిపోయి మళ్ళీ చదవ మనీ, తన తమ్ముడిలా చూసుకుంటాననీ ఎన్నో విధాలా చెప్పింది. కాని నేను వినలేదు."

"ఇప్పుడు మీరేం చేస్తున్నారు?"

"నన్ను గురించి మీ రడిగిన మొదటి ప్రశ్న యిది" అంటూ అతను నవ్వాడు. ఆమె కూడా నవ్వి "సరే చెప్పండి" అంది.

"ఒక మందులు తయారుచేసే కంపెనీలో ఉంటున్నాను. కాని ఆ ఉద్యోగమూ చెయ్యాలని లేదు. ఒక చోటుకీ వృత్తికీ అంటిపెట్టుకుని ఉండడం నా స్వభావంలో లేదనుకుంటాను. జిప్సీలని ఉన్నారు చూడండి వాళ్ళు ఊరూరా తిరుగుతూంటారు. అటువంటి ప్రవృత్తి ఏదో నాలో ఉందనుకుంటాను. ఏమిటో చెప్పలేను. ఈ దేశాన్నే విడిచి వెళ్ళిపోవా లని ఉంది—బర్మాకో, సింగపూర్‌కో."

"వద్దు. వెళ్ళకండి" అని ఆవేశంతో అందామె. చటుక్కున సిగ్గు పడిపోయింది. అతను తెల్లబోయి చూశాడు. ఆమె అర్థంలేకుండా గబగబా

వెళ్ళి కిటికీ తలుపులు తెరచింది. చలిగాలి కొరడా ఝళిపించినట్టుగా లోపలికివచ్చి తగిలింది.

"అబ్బ ! చలి ! తలుపులు వేసెయ్యండి" అన్నాడు జగన్నాథం.

"వాన చాలామటుకు తగ్గింది" అంటూ తలుపులువేసి ఆమె వచ్చి కుర్చీలో కూర్చుంది.

అతను నవ్వుతూ యిలా అన్నాడు "ఇందాకట్నుంచీ మీరు నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా దాటుకుపోతున్నారు. చెప్పండి. మీరు పెళ్ళి చేసుకోరా ?''

''నన్నెవరు చేసుకుంటారు ?'' ఆమె నీరసంగా అంది.

''ఏం ? మీకేం తక్కువ ?'' అన్నాడతను.

ఆమె పెదవులు వణుకుతున్నాయి. అతను గమనించలేదు. అతను మళ్ళీ రెట్టిస్తూ "ఇంతకాలం మీరు అవివాహితలుగా ఉండడానికి ఏదేనా ప్రత్యేక కారణం ఉందంటారా ! లేక మీరు అవివాహితగానే ఉండదలచారా ?" అన్నాడు.

ఆమె తన ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుని "మీకు తెలియదు. మీకు తెలియదు. మీకు తెలియకూడదు" అంటూ గబగబా గదిలోంచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపే నిశ్చేష్టుడై చూస్తూ వుండిపోయాడు జగన్నాథం. వెనకాలే వెళ్ళి క్షమించమని అడిగితే బావుంటుందనుకున్నాడు. కాని ఆమె వెంటపడడంకూడా పొరపాటేమో అని సందేహించాడు. ఏమీ తోచక కిటికీ తలుపులు తెరిచాడు. సన్నగా వాన పడుతోంది. దట్టంగా భయంకరంగా ఉంది అవతల చీకటి. ఆకాశాన ఒక నక్షత్రం కూడా లేదు. కప్పల అరుపులు మాత్రం ఘోరంగా అసహ్యంగా వినిపిస్తున్నాయి.

తలుపులు వేసి మంచంమీద మేను వాల్చాడు. ఊరికి దూరంగా ఉన్న ఈ కొంప దెయ్యాలకొంప కాదుకదా అన్న ఆలోచన అతన్ని ఒక నిమేషమాత్రం భయాపహూణ్ని చేసింది. అతనికి చనిపోయిన

మిత్రుడు జ్ఞాపకం వచ్చాడు. ఎందుకింత తొందరపడి, ఈ స్నేహాల్నీ అనుభవాన్నీ వదలుకొని చచ్చిపోయాడు! అతని ఆత్మలాంటిది ఇంకా ఏదైనా భూమిమీద వుండి అతృప్తంగా తిరుగుతూంటుందా? ఇంత మిథ్యగా మోసంగా ఉన్న బ్రతుకులో నిజానికి ఎవరి కెవరు? ఈ బాంధవ్యాల అనుబంధాల అర్థం ఏమిటి? ఎందుకు రమ అలాగ భయకంపితురాలై పరుగులెత్తుకుపోయింది! ఎందుకు తాను కష్టపడి ఆర్జించిన వెయ్యి రూపాయలూ చనిపోయే ఒక మిత్రునికి దానం చేయాలని వర్షంలో గాలిలో బయలుదేరి వచ్చాడు! విజయు డెవరు? అతని పోలికలు తనలో ఎందు కుండాలి? ప్రతీ బ్రతుకునీ ఏదో రహస్యంలో చుట్టబెట్టి అగోచరమూ బలీయమూ అయిన విధి నిరంకుశంగా ఏక్కడికో తెలియని చోటికి నడిపిస్తో న్నట్టు అనిపించింది అతనికి.

అతనికి గుండెలో ఏదో వెలితిగా తోచింది. తనలోని యీ అస్థిరత్వానికి అశాంతికి కారణం ఏమిటి? ఇలా పూర్వా దేశాలూ తిరుగుతూ జీవితాంతంవరకూ గడపవలసిందేనా? తన కొక యిల్లు, తన కోసమై ఎదురుచూచే, జీవించే ప్రాణి-అతడు తనలో తాను నువ్వుకున్నాడు. ఎప్పటికీ తానొకచోట స్థిరంగా ఉండలేడు. ఎప్పుడో ఎక్కడో గాలివాటానికి తాడు తెగిపోయింది. ఇలాగ శూన్యంలో ఏ బాధ్యతాలేకుండా గాలికి కొట్టుకు పోతూంచేనే బాపుంటుందేమో?

ఆలోచిస్తూన్న అతనికి కునుకుపట్టింది. అప్పుడుకూడా అతని మనస్సు అవ్యక్తంగా ఆమెకోసమే నిరీక్షిస్తోంది, ఒక గంటలో అతనికి మెలకువ వచ్చింది. గుమ్మం తలుపులు బార్లా తీసివున్నాయి. నలువైపులా చూశాడు ఆమె మళ్ళీ వచ్చిన జాడలేదు. గోడమీద గడియారంలో పన్నెండు దాటింది. అతని కేమీ తోచలేదు. ఆ గదిలో ఒక్కడూ అలాగ వుండడం దుస్సహ మనిపించింది. మంచందిగి మెల్లగా అడుగులు వేసుకుంటూ మండువాలోకి వచ్చాడు. ఒక మూలగా కోడిగుడ్డుదీపంమిణుకు మిణుకుమంటూ వుంది. ఆ తక్కువ కాంతిలో మండువాలోని వస్తుజాలం అస్పష్టంగా అసంబద్ధ రూపాలలో కనబడుతోంది. కిటికీకి ఎదురుగా నల్లగా ఒకఆకారం కనబడింది. ఏమిటా అని దగ్గరకు వెళ్ళేనకొలదీ స్త్రీ రూపం

ప్రస్ఫుటమైంది. రమ కిటికీకి ఎదురుగా కూర్చునివుంది. విడిపోయిన పొడుగాటి ఆమె కేశపాశం బుజాల్నీ వీపునీ ఒత్తుగా కప్పింది. అతను దగ్గరగా వెళ్ళి 'రమా' అని పిలిచాడు. ఆమె పక్కకి తిరిగి అతనివైపు చూసింది. దీపకాంతిలో ఆమె కన్నులు జలమయం అయివుండడం చూశాడు. ఆమె కపోలాలమీద అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి.

"ఇదేవిటి రమా ఏడుస్తున్నావా ?" అన్నాడు జగన్నాధం వ్యధతో సానుభూతితో. ఆమె చీర చెరగుతో కన్నీరు తుడుచుకుని లేచి నుంచుంది. అతి ప్రయత్నంమీద ఆమె ఏడుపు నాపుకుంటూన్నట్టు అతను గ్రహించాడు. ఆమె చెయ్యి పట్టుకుని "లోపలికి రండి. ఈ చలిగాలిలో కూర్చుంటే ఉదయానికి ఏ న్యూమోనియావో కూడా రావచ్చును" అంటూ గదిలోకి తీసుకవెళ్ళాడు, "ఇలాగ మంచంమీద కూర్చోండి. ఈ క్షణంలో మిమ్మల్నిచూస్తే ప్రపంచంలోని బాధ అంతా మీలోనే ముద్దకట్టుకుందా అనిపిస్తుంది" అంటూ ఆమె వద్దువద్దంటున్నా ఆమెను మంచంమీద కూర్చోబెట్టి ఆమెకి కొంచెం దూరంగా కూర్చున్నాడు.

"ఇప్పుడెవరైనా వచ్చి మన యిరువుర్నీ చూస్తే నేను మిమ్మల్ని హింసిస్తున్నట్లుగా వూహించుకొని నన్ను జైల్లో పడేయించాలని చూస్తారు. అవునా" అన్నాడతను నవ్వుతూ.

ఆమె కన్నీళ్ళలోంచి నవ్వింది.

"అయితే యిప్పుడు చెప్పండి విజయు డెవరు?" అని అడిగాడతను. ఆమెను మాటలలోపెట్టి హృదయబాధని వెళ్ళబోయించినట్లయితే కొంత ఉపశమనం కలుగుతుందని అతను ఉద్దేశించాడు.

"నా బాల్యస్నేహితుడు" అందామె.

"ఊఁ !"

"నేను చదువుకునేరోజుల్లో అతని పరిచయం కలిగింది. ఎప్పుడు చూసినా ఎంతో ధైర్యంగా, ఉత్సాహంగా వుండేవాడు. తల్లీ తండ్రీ లేని నన్నుచూసి జాలిపడేవాడు. ఇంట్లోనుంచి డబ్బు దొంగిలించి తీసుకొచ్చి నాకెన్నో కొనిపెట్టేవాడు."

ఆమె కళ్ళు స్మృతిపూర్వకమైన గర్వంతో మెరిశాయి.

"తర్వాత !" అన్నాడతను.

"కాని ఆ దొంగతనాలకి అతను విపరీతంగా కఠినమైన శిక్షల్ని అనుభవించేవాడు. పాపం అతనికి సవతితల్లి వుంది. ఆమె చాలా క్రూరురాలు. తండ్రి ఆమెకి దాసుడు. నా కోసమే అతను దెబ్బలు తినడమూ, తిండిలేక మాడడమూ సహించలేకపోయేదాన్ని. అతన్ని బతిమలాడుకునేదాన్ని యిటువంటి పనులు చెయ్యొద్దని. అతను వినేవాడు కాదు. 'నీకోసం ఏమైనా చేస్తాను. నీ కొక్క నిముషం ఆనందం కలిగించడానికి వెయ్యేళ్ళ నరకాన్నైనా అవలీలగా అనుభవించగలను" అనేవాడు.

"స్కూలు వదలగానే ఒక నిర్ణీత స్థలంలో కలుసుకొనేవాళ్ళం. ఇద్దరమూ అలా తోటలోకి పొలాలలోకి వెళ్ళేవాళ్ళం. ఆటలాడే వాళ్ళం. పాటలు పాడేవాళ్ళం, జామిపళ్ళూ రేగిపళ్ళూ తింటూ గంటలు నిమిషాల్లాగా గడిపేవాళ్ళం. స్వచ్ఛమైన అనంతమైన నీలాకాశంకింద వెచ్చని పచ్చని మెత్తని భూమ్మీద ఎన్నో స్వప్నాలు కనేవాళ్ళం. నన్నే పెళ్ళి చేసుకుంటాననేవాడు. నన్నే ప్రేమించాననేవాడు.

"చీకటిపడ్డాక అనాథశరణాలయానికి బిక్కుబిక్కుమంటూ వెళ్ళేదాన్ని. అక్కడ వార్డెన్ పెద్దపులిలాగా నా కోసం కనిపెట్టుకుండేది. భోజనం లేకుండా చీకటి గదిలో నన్ను తోయించితాళం వేసేది. రాత్రంతా ఏడుస్తూ బాధతో భయంతో గడిపేదాన్ని, కాని తెల్లవారిందా, ఎప్పుడు సాయంత్రమవుతుంది, ఎప్పుడు విజయుణ్ణి కలుసుకుంటాను అని నిరీక్షిస్తూ ఉండేదాన్ని, అతనొకడే నా ఆశ. నేను బతకడానికి గల అర్థం.

"కాని మనం వూహించినట్టుగా, కోరుకున్నట్టుగా ఎక్కడేనా జరుగుతుందా చెప్పండి. రోడ్డంతా సవ్యంగా చదునుగా వున్నట్టే వుంటుంది. కాని మలుపు తిరిగేటప్పటికి బ్రహ్మాండమైన అగాధం నోరు తెరచుకుని అప్రమత్తుడైన పాంథుణ్ని అమాంతం మింగివేస్తుంది. అక్కడ ఎర్రని అక్షరాలతో 'అపాయం' అని బోర్డుకూడా వుండదు. ఇంటా బయటాకూడా విజయుడికి పరిస్థితులు దుస్సహమయ్యాయి. బి. ఏ. చదువుతూండగా అతనికి

వివాహం చెయ్యడానికి సవతితల్లి దీక్ష వహించింది. అన్నీ స్థిరపరిచింది. విజయు డెదురు తిరిగాడు బెదరించాడు. ఒకరాత్రి సంభవించిన పెద్ద దెబ్బ లాటలో యినపకమ్మీతో సవతితల్లి తలమీద బలంగా కొట్టాడు. ఆమె పరిస్థితి ప్రమాదకరంగావుంది. రాత్రికి రాత్రి విజయుడు పరారీ అయిపోయాడు. తండ్రి పోలీసులకు రిపోర్టు యిచ్చాడు. అతని ఆచూకీ దొరకలేదు. మూడునెలల అనంతరం నాకో ఉత్తరం వచ్చింది. అందులో రెండే రెండు వాక్యాలున్నాయి. తాను సైన్యంలో చేరినట్టూ బతికిదాగుంటే ఎప్పుడో ఒకప్పుడు కలుసుకుంటాననీ మాత్రం రాశాడు. అంతే యుద్ధం ముగిసింది, ఎన్నో ఏళ్ళు గడచిపోయాయి కాని ఈనాటి వరకూ అతని జాడలేదు."

ఆమె గొంతు క్రమక్రమంగా క్షీణమూ, గాద్గదికమూ అయిపోయింది. ఆమె కాసేపాగి మళ్ళీ యిలా చెప్పింది. "ఓసారి చెట్టుమీదనుంచి పడినప్పుడు విజయుడికి నెమరుకణతపక్కగా గాయం తగిలింది. క్రమేణా అది మచ్చగా మారింది" ఆమె జగన్నాధంకేసి తీవ్రంగా చూసింది. "అదిగో అక్కడ మీకు ఏదో మచ్చ వుంది. మీరు విజయుడు కాదా? చెప్పండి నిజం చెప్పండి. నన్ను మోసగించకండి. నన్ను బాధ పెట్టకండి" ఆమె ఉద్రేకంతో దీనంగా ప్రాధేయపడుతూ అడిగింది.

జగన్నాధం ఆమెని, పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. శాంతంగా "నేను నీ విజయుణ్ణికాదు రమా: అలా చిన్నపిల్లలాగ ఉద్రేకపడి పోవండ మంచిది కాదు" అన్నాడు.

గది గుమ్మందగ్గర ఎవరో నడిచినట్టు చప్పుడయింది. ఇద్దరూ అటువైపు చూశారు. ఎవరూలేరు. అతను తిరిగి ఆమెని ప్రశ్నించాడు. "అనాథాశ్రమంలో మిమ్మల్ని ఎవరు చేర్పించారు?"

"నాన్న"అందామె.

"మీ తండ్రి నెరుగుదురా?"

"ఎరుగుదును"

"ఆయన వుండగా-ఆయనే స్వయంగా మిమ్మల్ని శరణాలయంలో చేర్పించవలసిన అవసరం ఏముంది?"

"అదంతా ఒక గాథ" ఆమె బరువుగా నిట్టూర్చింది.

"అంటే...."

"నాన్న చాలా దుఃఖజీవి. సంస్కారవాదీ, విప్లవవాదీకూడా. తక్కువ కులస్థురాలిని పెళ్ళాడడం వలన బంధువర్గమూ, సమాజం, పెద్దలూ అతన్ని వెలివేశారు. నాన్న ఆ రోజుల్లో ఒక రహస్య విప్లవ సంఘంలో సభ్యుడుగా ఉండేవాడు. ఎన్నోసార్లు జైలుకివెళ్ళి తప్పించుకు వచ్చేవాడు. ఒకసారి పోలీసులకి, ఈ సంఘానికి పెద్ద కొట్లాట జరిగింది. అందులో నాన్న తుపాకి దెబ్బవల్ల గాయపడ్డాడు. దాని ఫలితంగా ఒకకాలు శస్త్రచికిత్స చేసి తీసివేశారు. కుంటివాడూ అనారోగ్యవంతుడూ అయిన తండ్రి అమ్మనూ, నన్నూ పోషించలేకపోయేవాడు. అమ్మ టెంగతో వ్యాధిలో మరణించింది. నాన్న చేసిన త్యాగాన్నీ, దేశసేవని ఎవరూ గుర్తుంచుకొని కాస్త సహాయమైనా చెయ్యలేదు. కర్ర నాధారంగా చేసుకొని పొరుగూళ్ళు వెళ్ళి యాచన చేసి నన్ను పోషించేవాడు. క్రమేణా నాన్నకి జీవితంమీద విరక్తి కలిగింది. బతకడమే పెద్ద బరువై పోయింది.

"ఒక రోజున అర్ధరాత్రి నిద్రపోతూన్న నన్ను లేపి తనతో రమ్మన్నాడు. నాకు అప్పుడు ఏడెనిమిదేళ్ళ వయస్సు. తనతో కూడా చీకట్లో నడిపించుక వెళ్ళాడు. ఎత్తయిన ప్రహరీ గోడలు చుట్టూవున్న ఒక పెద్ద యింటికి తీసుకువెళ్ళాడు. అదే అనాధశరణాలయం. శరణాలయ నిర్వాహకురాల్ని మానాన్న బాగా ఎరుగునట. ఆవిడకి నన్నప్పగించాడు. ఆమె చేతికాక ఉత్తరంఇచ్చి పెద్దదాన్నయాక నాకిమ్మన్నాడు. ఒకచేత్తో కర్రనానుకుని ఒకచేత్తో నా చుబుకం పట్టుకుని కన్నీళ్ళతో "అమ్మడూ ఇకనుంచీ ఈవిడే నీకు అమ్మ జాగ్రత్తగా ఉండమ్మా." అని శిరస్సుమీద ముద్దుపెట్టుకుని కర్రని టకటకమని చప్పుడుచేస్తూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. నేను భయంతో "నాన్నా! నాన్నా!" అని గట్టిగా అరిచాను. ఆ ఆక్రోశం చీకట్లో మార్మోగింది. ఉదయానికి నాన్న ఆత్మహత్య చేసుకున్నట్టు ఊరంతా చెప్పుకున్నారు." ఆమె బాధతో కంపించి పోతూంది. మంచంపట్టెని గట్టిగా నొక్కిపట్టుకుంది. ఇంకా ఇలా చెప్పుకుపోయింది.

"ఇప్పటికీ ఆ పిలుపు చీకటివేళలహృదయ విదారకంగా ప్రతిధ్వనిస్తూన్నట్టే ఉంటుంది నాకు. ఆశ్రమ నిర్వాహకురాలు చాలా దయాహృదయం

కల మహిళ. ఆవిడే వుంటే నా బ్రతుకిలాగ అయిపోయి వుండేదికాదు. కాని రెండు సంవత్సరాల అనంతరం ఆమె కూడా చనిపోయింది."

"ఆ ఉత్తరంలో ఏమని రాశాడు మీ నాన్న?" అని అడిగాడు జగన్నాథం.

"నేను జీవిత సమరంలో చిత్తుగా ఓడిపోయినానమ్మా. అందుకే నిన్ను దిక్కులేనిదానిగా ఒంటరిదానిగా చేసిపోతున్నాను. కాని ఒక్కటి మాత్రం మరచిపోకు. నీ తండ్రి ఏంచేసినా ఒక ఆదర్శం కోసమూ, ఒక విశ్వాసంకోసమూ చేశాడు. అంతేకానినీ చమైన మోసమైన ఏపనీ చెయ్యలేదు. ఏలోకంలోవున్నా, నీ సుఖాన్నీ; అభివృద్ధిని కాంక్షిస్తూంటాను. అని రాసి వుంది" అందామె.

దుఃఖపూరితమైన యీ గాథతో గాలి అంతా బరువెక్కినట్లనిపించింది అతనికి. ఇద్దరూ కొన్ని నిముషాలు మౌనంగా వున్నారు. అతనే మళ్ళీ ప్రశ్నించాడు. "మరి ఈ వూరు ఎలా వొచ్చావు రమా! ఈ అవ్వ ఎవరూ!"

ఆమె సంకోచంతో సాశ్రునయనాలనెత్తి చూసింది. "చెప్పు రమా, నా దగ్గర ఏం చెప్పడానికీ నీకు సంకోచం అనవసరం. ఈ విషాదయాత్రలో నేనూ ఒక సహచరుడినే" అన్నాడు జగన్నాథం.

"విజయరాముడు-అది విజయుడి అసలుపేరు-వెళ్ళిపోయాక నాకు బతుకంతా శూన్యమైపోయింది. చాలాకాలం అతనికోసం వేచివున్నాను. కొందరు అతను యుద్ధంలో చనిపోయాడన్నారు. అతన్ని తలచుకుని రోజూ ఏడుస్తూ బెంగగా వుండేదాన్ని, ఆశ్రమం అప్పుడు స్వార్థపరుల చేతుల్లో వుండేది. నానాకష్టాలూ పడేవాళ్ళం. బ్రతుకు దుర్భరమైపోయింది. అప్పుడు".... ఆగిందామె.

"అప్పుడు?"

"ఒక పెద్దమనిషి తీయనిమాటలు చెప్పి నమ్మించి నన్ని వూరుకు తీసుకువచ్చేశాడు. ఇక్కడహోటల్లో మకాం పెట్టాడు. ఒకరోజున ఉదయం లేచి చూచేటప్పటికి అతగాడు పెట్టెతో బెడ్డింగుతో మాయమయ్యాడు. కట్టుబట్టలతో ఉన్న నన్ను వీధిలోకి గెంటేశారు. అవమానంతో ఆకలితో

చచ్చిపోదామనుకుంటూన్న నన్ను అవ్వచూసింది. అప్పట్నుంచీ ఇక్కడ అవ్వతో ఉంటున్నాను."

"అవ్వ నీకేమీ కాదన్నమాట!"

"కాదు"

"అయితే నువ్విక్కడ...."అని అతను ఏదో అనబోతూంటే ఆమె చేతులతో తన ముఖాన్ని కప్పుకుని "ఇంక నన్నేమీ అడగకండి. నన్ను చంపకండి" అని పెర్రిగా కేకలు వేసింది.

జగన్నాథం తెల్లబోయాడు. ఆమె మంచంమీద బోర్లపడి వెక్కి వెక్కి యేడుస్తూంది. ఆమెకి ఉపశమనం బదులు తీవ్రమైన దుఃఖాన్ని కలిగించానే అని బాధపడ్డాడు జగన్నాథం. తెల్లని పక్కమీద ఆమె జుట్టు విప్పిన నెమలిపురిలా వుంది. వేటగాడి బాణంచేత దెబ్బతిన్న కపోతం లాగా విలవిలలాడుతోంది ఆమె. అతనికేం చెయ్యాలో తోచలేదు. ఇబ్బందిగా దిక్కులు చూశాడు. అతని మనస్సు సానుభూతితో, జాలితో నిండి పోయింది. అనుకోకుండా అతని కళ్ళు రెండూ తడి అయినై.

ఎన్నేళ్ళనుంచో దాచుకున్న ఈ అపరిమిత దుఃఖాన్ని విజయుడిలాగ కనపడే తనముందు ఒక ఆత్మీయత ననుభవించి బహిర్గతం చేసిందనుకున్నాడు. సుకుమారంగా పువ్వులాగా ఉన్న ఈమెకి యింత బరువుని ఇన్నాళ్ళు మోయగల శక్తి ఎక్కడనుంచి వచ్చిందా అని ఆశ్చర్య పడ్డాడు. ఎన్ని సుఖాలూ, సదుపాయాలూ ఉన్నప్పటికీ మనస్సులోని ఒంటరితనం ఎంత భయంకరంగా ఉంటుందో అతనికి తెలియవచ్చింది. అది పెద్ద సహారాయెడారిలా వ్యాపించి ఉంటుంది. అక్కడ నీళ్ళు దొరకవు. అడుగుజాడలు కనపడవు. ప్రకృతి వాసన ఉండదు. అక్కడ మండే కాలే యిసుకమాత్రం అనంతంగా పరచుకొని వుంటుంది. ఎవరూ ఆ ఎడారిలో ఉండలేరు, బ్రతకలేరు. తనలో, రమలో ఆఖరుకి అవ్వలోకూడా ఎడారి. ఆ యిసుకలో కాళ్ళుమాడుతూ బ్రతుకునీడ్చుకుంటూ, నాలికపిడచ కట్టుకుపోతూంటే ఒయాసిస్సులకోసం కొన వూపిరితోకూడా వెతుక్కుంటూ ఉంటారు.

ఈ ఆలోచనతో క్షణమాత్రం అతని సర్వాంగాలూ కంపించాయి. అతను నిలదొక్కుకుని, ఏడుస్తూన్న రమకేసి చూశాడు. ఆమె వీపు మీద చెయ్యివేసి "రమా" అని మృదువుగా పిలిచాడు. ఆమె మాట్లాడలేదు.

"రమా ఒక్కమాట చెప్పనా" - అన్నాడు మళ్ళీ.

"ఏమిటి చెప్పండి" అంది అలాగే బోర్లా పడుకుని.

"ఇక్కడకువచ్చి నిన్ను చూసినప్పటినుండీ నాలో ఒక అశాంతి రేగింది. ఇంతవరకూ ఏ సందేహమూ లేకుండా కులాసాగా మొండిగా జీవితాన్ని గడిపేస్తున్నాను. బుద్ధిపూర్వకంగా మనస్సునీ, చర్మాన్నీ మొద్దువారిపోయేటట్లు చేసుకుంటున్నాను. నిన్ను చూశాక ఎన్నాళ్ళనుంచో నీకోసమే వెదుకుతూన్నట్లనిపించింది. ఇప్పుడు నేను తెలుసుకున్నాను రమా, నాకు నువ్వు కావాలి" అన్నాడు జగన్నాథం.

రమ ఏడుపు నాపింది. లేచి కళ్ళు తుడుచుకుంటూ ఆశ్చర్యంగా అతనికేసి చూసింది.

"చీకట్లో వెళ్ళే పాంథుడికి దీపంఉన్న మరో పాంథుడు ఎక్కువ ధైర్యాన్నీ, విశ్వాసాన్నీ యివ్వగలడు రమా. మన యిరువురి జీవితాల్ని ఏకం చేసుకున్నట్లయితే, మనకొక ప్రశాంతీ, ధ్యేయమూ కలుగుతాయని ఆశగా ఉంది. నేను నిన్ను - ప్రేమిస్తున్నాను రమా."

"నిజంగానా?" నమ్మలేని కళ్ళతో అడిగింది రమ.

"నిజం. తెగిపోయిన దారాల్నీ, తంత్రుల్నీ చేర్చి ముడెట్టుకుంటేగాని జీవితాలు శ్రుతి తప్పి యిలాగే శిథిలమై నామమాత్రం లేకుండా నశించిపోతాయి. నన్ను నమ్ము రమా. నిన్ను పెళ్ళిచేసుకుంటాను నీకిష్టమేనా?"

"మరి బర్మా, సింగపూర్ ఎక్కడికీ వెళ్ళరా?"

"వెళ్ళను, నువ్వు నా భార్యవైతే."

ఆమె అతని కళ్ళలోని నిజాయితీనీ, నిశ్చయాన్నీ చూసింది. ఆనందం ఎక్కడనుంచో పందుచేసుకుని వచ్చి ఆమె ముఖాన్నీ, దేహాన్నీ మెత్తని వెలుతురుతో నింపింది. ఆమె కళ్ళు పెద్దవై ప్రకాశించాయి. ఒక్కసారి పెలవివారగా నవ్వింది. వెర్రి ఆవేశం ఆమెని ఆవరించింది. మైకం కమ్మినట్టయింది. అతన్ని తన వొడిలోనికి లాక్కొని, అతని శిరస్సుమీదా, బుగ్గలమీదా, రొమ్ముమీదా గబగబా ముద్దు పెట్టుకుంది. అతనికూపిరాడక

"అబ్బ వదులు, వదులు రమా!" అన్నాడు. ఆమె కిలకిల నవ్వి మంచం మీదనుండి దిగి యిప్పుడే వస్తానంటూ గది నుండి రివ్వున వెళ్ళిపోయింది.

గది దాటగానే ముసలిది కంగారుగా అక్కడనుండి వెళ్ళిపోవడం చూసింది దగ్గరగా వెళ్ళి కోపంతో "అవ్వా నువ్వు చాటుగా నిల్చుని మా మాటలు వింటున్నావా?" అని అడిగింది.

"లేదు పిల్లా లేదు, లేదు" తడబడుతూ అంది ముసలిది.

"గుమ్మం దగ్గర ఏం చేస్తున్నావ్ ఇంత రాత్రివేళ?"

"నీతోడు పిల్లా. నే నొక్కమాట వినలేదు. తాళం చెవులకోసం వెతుక్కుంటూ వచ్చానలాగ" అంది ముసలిది.

"నీ బుద్ధి మారదు ముసలిపీనుగా" అంటూ విసురుగా యింకో గది లోకి వెళ్ళిపోయింది రమ.

జగన్నాథం ఒక్కడూ గదిలో మంచంమీద దిండ్లునానుకుని కూర్చుని ఆమెకోసం నిరీక్షిస్తున్నాడు. అతని మనస్సెంతో తేలికైంది. వర్షం ఎక్కువయింది. రేకుమీద చినుకులుపడిన శబ్దంకూడా ఎక్కువయింది. కొంతసేపటికి రమ గదిలోకి వచ్చింది. రమకన్న ముందుగా సుతారపు అత్తరపు వాసన గదిలోకి వ్యాపించింది. ఆమె ముఖానికి స్నో, పౌడరూ ఉపయోగించింది. ఇందాకటి కన్నీటి చారలూ, బాధయొక్క నీడలూ లేవు. తెల్లని పల్చని చీర కట్టుకుంది. జుట్టు దువ్వుకుని సిగగా చుట్టుకుంది. నవ్వుతూ, సిగ్గుతో, హాయిగా రాజహంసలా వచ్చే ఆమెని చూడగానే అతని హృదయం ఆనందంతో నిండింది.

అతను లేచి ఆమెనుమంచంమీదపరుండబెట్టిపక్కనే కూర్చున్నాడు. ఆమె కళ్ళలోకి చూస్తూ "నువ్వు అమాయకురాలివి రమా. ఇంక నిన్నెప్పుడూ ఏడవనివ్వను. ఏడుపు నీ బ్రతుకులోకి రానివ్వను" అన్నాడు.

ఆమె తన చేతి వేళ్ళ నతని చేతి వేళ్ళలోంచి పోనిచ్చి "మీరు నన్నుతప్పక పెళ్ళిచేసుకుంటారుకదూ ఇక్కడనుంచి వెళ్ళిపోతాం కదూ" అంది.

"తప్పకుండా, ఈవర్షం తగ్గగానే బయలుదేరివెళ్ళి అన్ని ఏర్పాట్లూ చేసి ఒక వారం రోజుల్లో నిన్ను తీసుకు వెళ్ళడానికి వస్తాను."

"మీరు రాకపోతే" భయంగా అడిగింది రమ. ఆమె కళ్ళల్లో భయం సుళ్ళు తిరగడం చూశాడు జగన్నాథం.

"ఎందుకు రాను రమా. నీ కిటువంటి అనుమానం ఎందుకు కల గాలి?" అన్నాడు.

"అయితే వొట్టెయ్యండి" అంది రమ.

అతడు నవ్వుతూ ఒట్టు వేశాడు. ఆమె నిట్టూర్చి కన్నులు మూసు కుంది. మనస్సుయొక్క అగాధపు చీకటి లోయలో కాంతిమార్గం తెరచు కుంటూన్నట్లనిపించింది. ఎర్రని ఆమె పెదవులు దేనికోసమో వెతుకుతూ న్నట్లు కదిలాయి. ఆమె ముఖంలో తృప్తి వెయ్యిరేకుల పద్మంలా విరిసింది.

"నువ్వు చాలా అలసిపోయావు; కాస్సేపు నిద్రపో రమా" అన్నాడు జగన్నాథం.

"మీరు....?" అడిగింది రమ.

"నేనిలాగే కూర్చుని ఆలోచిస్తుంటాను."

"నాకు కాపలా కాస్తుంటారా?" అని నవ్వింది రమ కన్నులు మూసుకునే.

"అవును. ఎవరి సొమ్ముని వాళ్ళు భద్రంగా చూచుకోవాలి కదా!" అన్నాడు జగన్నాథం.

పెంకితనంలో వికసించడానికి ఒప్పుకోని ఎర్రని మొగ్గలాగ వున్నాయి ఆమె పెదవులు. జగన్నాథం వంగి పెదవుల్ని మెల్లగా మృదు వుగా ముద్దు పెట్టుకున్నాడు. రమ అతని చేతిని తీసికుని తన గుండెల మీద పెట్టుకుంది. అతని చేతిమీద తన చేయి వేసింది.

"ఈ చేయి యిలాగే ఉంచండి. ఇంక నాకు భయంలేదు. హాయిగా నిద్రపోతాను" అంది రమ. అతనేవో కబుర్లు చెబుతూంటే వింటూ నిద్రలో లీనమయిపోయింది.

ఈ విచిత్ర సంఘటన గూర్చి, తన హఠాన్నిర్ణయాన్ని గూర్చి యింకా విస్మయంగా ఆలోచిస్తున్నాడు జగన్నాథం. అతని చెయ్యి ఆమె గుండెలమీదనే వుంది. ఆ చేతిమీద ఆమె చెయ్యి వుంది. అలాగ ఎంత సేపు కూర్చుని ఆలోచించాడో అతనికే తెలియదు. గది గుమ్మం దగ్గర

ఎవరో తచ్చాడుతూన్నట్టుగా అనిపించి నిదానించి చూశాడు. ముసలిది! సైగ చేస్తూంది. రమ్మని చెయివూపుతోంది. రమకి నిద్రాభంగం కాకుండా మెల్లగా తన చేయి విడిపించుకుని చప్పుడుకాకుండా గది దాటి వెళ్ళాడు.

"ఎందు కవ్వా పిలిచావు!" అన్నాడు. ముసలిది అతన్ని మండువాలో మూలకు తీసుకు వెళ్ళింది.

"అమ్మాయి బాగా నచ్చిందా బాబూ!" అంది.

"నచ్చింది" అన్నాడు జగన్నాథం నవ్వుతూ.

ముసలిదానికళ్ళు కుత్సితపు వూహతో సన్నగా ముడుచుకున్నాయి. వెకిలిగా నవ్వి "మారాజులు మీరు. గొప్ప గొప్ప ప్రభువులు." అంది.

జగన్నాథం రమ లేస్తుందేమోనని "త్వరగా చెప్పు అవ్వా!" అన్నాడు. ఆమె నమ్ముకున్న హస్తాన్ని ఆమె గుండెలనుండి తీయటం కూడా ఏదో దోషంలాగా అనిపిస్తూంది అతనికి.

"నువ్వే కాదు బాబూ, ఏ అయ్య చూసినా నచ్చిందన్నవాడే కాని వేరు మాట పలికేసవాడు లేడు. ఒక రాత్రికి రెండొందలు, మూడొందలు యిచ్చిన మారాజులే అందరూ. అందరిలాంటిది కాదు బాబూ నా పిల్ల వజ్రం, వైడూర్యం. దాని వొళ్ళూ దాని రుచీ మీలాంటి ప్రభువులకి తెలుస్తుంది. అందుకే అయినవాణ్ణీ, కానివాణ్ణీ గుమ్మం ఎక్కనివ్వను. ఎంచుకోడంలో దానికున్న తెలివి గొప్పది బాబూ. మనసు కాకపోతే ఎంత గొప్పవాడినైనా తోసిమ్మంటుంది." అంది ముసలిది.

"ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి ?" అన్నాడు జగన్నాథం విసుగ్గా.

"మరేం లేదు బాబూ, నీ కెన్నాళ్ళు మనసైతే అన్నాళ్ళూ అనుభవించు. నువ్వు లోటు చేస్తావా బాబూ మారాజు బిడ్డవి. ఒక రాత్రికి రెండొందలు తక్కువకాకుండా యిస్తావు. నాకు తెలుసు. నీ ఠీవి నీ మాటే చాలు బాబూ, నీ లోతు తెలుసుకోవడానికి. ఏదో లేనివాళ్ళం. మీలాంటి వాళ్ళు దయదలిస్తే నాలుగురోజులు మీ పేరు చెప్పుకు తింటాం."

జగన్నాథాని కీ మాటా యీ తీరు అసహ్యం అనిపించింది. "ఇదుగో అవ్వా, రమని నేను పెళ్ళిచేసుకోబోతున్నాను" అన్నాడు.

ముసలిది ఫక్కున నవ్వింది. ఆ నవ్వు కొన్నివందల కప్పల్ని బుట్టలో చుట్టబెట్టి ఊపిరాడకుండా నొక్కుతూంటే వచ్చిన ధ్వనిలాగ వుంది.

"మాకు పెళ్ళేంటి బాబూ!" అంది.

"చూడవ్వా, రమ చాలా కష్టాలు పడింది. రమ బెంగతో కృశించి పోతోంది. రమని నేను ప్రేమించాను. పెళ్ళిచేసుకుంటానని వాగ్దాన మిచ్చాను" అన్నాడు జగన్నాథం.

"వెర్రోడా!" అంటూ మళ్ళీ విరగబడి నవ్వింది ముసలిది.

"ఏం?" అర్థంకాలే దామె నవ్వు జగన్నాథానికి.

"నువ్వుకూడా నమ్మేశావా బాబూ, అదంతా నటన బాబూ నటన. ఎప్పుడూ ప్రతివాళ్ళదగ్గరా యిలాగే కల్పించి చెప్పుతుంది. వాళ్ళు జాలేసి యింకో వంద ఎక్కువిచ్చేవారు. నీ కనుభవం తక్కువ. లేత మనిషివి. ఇట్టే నమ్మేశావ్" అంది ముసలిది అతన్ని కనిపెడుతూ.

జగన్నాథానికి కోపం వచ్చింది; సంశయమూ కలిగింది.

"రమ మోసం చెయ్యదు" అన్నాడు సందేహంగా.

"తాను దిక్కులేనిదానినని చెప్పింది కదూ. నువ్వు తను చిన్నప్పుడు ప్రేమించిన బుల్లోడివిలా ఉన్నావంది కదూ. తండ్రి ఉరిపోసుకు చచ్చిపోయాడంది కదూ. వెక్కి వెక్కి ఏడ్చింది కదూ" గబగబా అడిగింది ముసలిది. జగన్నాథం స్తంభించిపోయాడు.

"అంతా నటన బాబూ నటన. ఇలాంటి తప్పుడు వేషాలెయ్యొద్దని ఎన్నోసార్లు చెప్పాను. వినదు కదా బాబూ నా కిలాంటి అబద్ధాలూ వేషాలూ నచ్చవు బాబూ. మన మామూలు మనకి చాలు. అటువంటి మోసాలు చెయ్యకు, ఎప్పటికేనా ప్రమాదం అని చెప్పాను. ఇదిగో ధర్మ ప్రభువువు కాబట్టి నీతో చెప్పాను. ఎక్కడా అనకు బాబూ. మా కూడు పడిపోతుంది" అంది ముసలిది, ఉత్సాహంగా.

జగన్నాథానికి నోట్లో ఏదో అరుచి పుట్టినట్లయింది. వెగటుగా అసహ్యంగా అనిపించింది. కోపంతో అతని కళ్ళు జ్వలించాయి. "అయితే ఈ రోజు రాత్రి మీరు పిలిచి ఉండమన్నందుకు డబ్బివ్వాలి. అంతేనా" అన్నాడు.

"అంతే బాబూ, ఒళ్ళమ్ముకుని బతికేవాళ్ళం. మా కింకేం కావాలి బాబూ, ఇందాక నాదగ్గరకొచ్చి 'డబ్బుమాట నువ్వడుగు నాకు సిగ్గేసుంది' అని మరీ మరీ చెప్పింది. 'ఆఖరికి బజానా అయినా కొంత తీసుకో అవ్వా'

అని ఫీస్కతింది. 'మారాజు అన్యాయం చెయ్యడు పిల్లా వుత్తి కంగారూ నువ్వూ' అని కేకలేశాను బాబూ" అంది ముసలిది వినయంగా.

"సరే అయితే" అన్నాడు జగన్నాథం. గబగబా గదిలోకి వెళ్లాడు. బద్దలవబోతూన్న అగ్నిపర్వతంలాగ వుంది అతని మనస్సు. మంచంమీద నిశ్చింతగా పడుకున్న రమ విషపూరితమైన సర్పంలాగా కనపడింది. ఆమె పీక పిసికి చంపెయ్యాలన్నంత కోపంతో మంచం దగ్గరకు వెళ్ళాడు. అప్రయత్నంగా అతని చేతులలోని కండరాలు పురిపెట్టిన తాడులాగ బిగుసుకుపోయాయి. పళ్ళు బిగించాడు. ఇంతలో మళ్ళీ ఏమనుకున్నాడో తన పెట్టెనుండి పర్సుతీసి మంచంమీదకు విసిరాడు: సూట్‌కేసు చేత్తో పట్టుకుని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మండువాలోకి వచ్చాడు. చీకటి. వర్షం కురుస్తూనే వుంది. "వెళ్ళిపోతున్నావా బాబూ?" అంది ముసలిది. సమాధానం చెప్పకుండా మెట్లు దిగి మడుగుదాటి వడివడిగా చీకట్లోకి వెళ్ళిపోయాడు. ముసలిది విజయసూచకంగా, వికృతంగా ధ్వనిచేసింది.

రమకి మెలకువ వచ్చేటప్పటికి అయిదుగంటలు దాటింది. చీకటి పలచబడుతోంది. నల్లని చీకటి బూడిదరంగుగా మారుతోంది. చావులోంచి, భయంలోంచి ఏదో కొత్తలోకంలోకి కాంతిలోకంలోకి వచ్చినట్లనిపించింది రమకి. ఆమెకళ్ళు తెరుస్తూనే చిరునవ్వు నవ్వింది. బయట వాన కురుస్తున్నా. ఆకాశం మేఘాచ్ఛాదితమై ఉన్నా, చలిగాలి సూదుల్లాగ గుచ్చుకుంటున్నా ఆమెలో ఒకానొక వసంత ప్రభాత సూర్యుడు వెచ్చని తెల్లని కిరణాల్ని ప్రసరించాడు.

బద్ధకంగా ఆవులించి పక్కకు చూసింది రమ. అక్కడ జగన్నాథం లేడు. లేచి కూర్చుని గది అంతా చూసింది.

జగన్నాథం పెట్టెకూడా కనబడలేదు. కంగారుగా మంచందిగి మండువాలోకి వచ్చింది. అవ్వ చీపురుతో తుడుస్తోంది. ఆత్రుతతో "అయనేరీ అవ్వా?" అని అడిగింది.

"వెళ్ళిపోయాడు."

రమకి గుండె ఆగినంత పని అయింది. "ఊహుఁ వెళ్ళడు. నాతో చెప్పకుండా వెళ్ళడు" అని ఉద్రేకంతో అంది. ముసలిది మాట్లాడలేదు.

"ఎక్కడికి వెళ్ళాడు?" అంది రమ.

"ఏమో నాకేం తెలుసు, పెట్టె పట్టుకుపోయాడు" అంది ముసలిది.

"ఎందుకు వెళ్ళనిచ్చావ్ అవ్వా ? నేను లేచేవరకైనా ఉంచలేక పోయావా?" అంది ఏడుపు నాపుకుంటూ రమ.

"ఏవిటే ఆ కంగారు పిల్లా ! నే నంత తెలివితక్కువ దాన్ననుకున్నావా? అదిగో చూసుకో నీ మంచంమీద పర్సు వదిలేసి మరీవెళ్ళాడు."

"డబ్బా !"

"అవును."

రమకి అనుమానం కలిగింది. తీవ్రంగా "నువ్వేమ్మని చెప్పావా?" అంది.

"ఢంకా బజాయించి చెప్పాను. నాకేం భయమా సిగ్గా? నాలుగు రాళ్ళు రాలేచోట నోరుమూసుకుండడం నా చేతకాదు పిల్లా" అంది గర్వంగా ముసలిది.

పెదవులు నొక్కిపట్టి "ఏం చెప్పావు ఆయనతో?" అంది రమ.

"వెర్రిదాగులవాడు. నువ్వు ప్రేమించావనీ నిన్ను పెళ్ళిచేసుకుంటాననీ అన్నాడు. మరి నా గతేం కాను పిల్లా. నాకు మాత్రం ఎవరున్నారు పిల్లా నువ్వు తప్ప. వాణ్ణి తగులుకుని చల్లగా పోదామని చూస్తున్నావా ? నీ ఆటలు నేను సాగనిస్తానటే పిల్లా. ముసలిదాన్ని దిక్కులేక చస్తే నీకేం? ఇన్నాళ్ళు చేసిందీ మరచిపోయి మాయచేస్తావా?" అంది ముసల్ది చేతులు వూపుతూ.

"ఏం చెప్పావ్?" అంది రమ.

"నీదంతా నటన అని చెప్పాను. వచ్చిన ప్రతీవాడిదగ్గరా యిలాగే వేషం వేస్తుందన్నాను. ఆముదం తాగినట్టయింది అబ్బాయి మొహం" అంది ముసల్ది కళ్ళు చికిలిస్తూ నవ్వుతూ.

రమకి కాళ్ళకింద భూమి బద్దలయిపోతూన్నట్టు అనిపించింది. ఆమెకి దేవుడిమీదా మనిషిమీదా విశ్వాసం ఒక్కపెట్టున తుడిచిపెట్టుకు పోయినట్లయింది. కళ్ళు తిరిగి పడిపోతున్నట్టు ఆమె గోడనానుకుని నిలబడింది.

ముసలిది అనునయంగా, "మగవాళ్ళమాటలు నమ్మి చెడిపోకు పిల్లా. అప్పుడు నేను నిన్నాపుకోకపోతే నీ గతి కుక్కలకీ నక్కలకీ కూడా పట్టేదికాదు. ఈ వయసులో నాలుగురాళ్ళు కూడబెట్టకపోతే యింకెప్పుడే

పిల్లా. పోయి చూసుకో. నీ మంచంమీదకి పర్సు గిరవాటేసి పోయాడు. ఎంత సొమ్ముందో చూడు" అంది.

"ముసలిపీనుగా, దొంగముండా, పిశాచంముండా" అంటూ రమ వెర్రికోపంతో ముసలిదానిమీదపడి దబాదబా తలమీదా వొంటిమీదా మొత్తేసింది. ముసలిది తప్పించుకుని పారిపోబోయింది. "నా కొడుకుని నువ్వే చంపావ్. నా బతుకుని నాశనం చేశావ్." అని వెర్రిగా అరుస్తూ అక్కడున్న ముక్కాలిపీటని ముసలిదానిమీదకి విసిరింది. "అబ్బా" అని ముసలిది నిలువునా కిందకి కూలి పడిపోయింది. ఆమె తలమీదనుండి నెత్తురు ప్రవాహంలా కారుతోంది. బలమైన దెబ్బతో ముసలిది స్పృహతప్పి పడిపోయింది. రమ తిన్నగా గదిలోకి వెళ్ళింది. మంచంమీద పర్సుని తీసి చూసింది. ఒక అరనిండా నోట్లుకుక్కి వున్నాయి. ఒక అరలో జగన్నాథం ఫొటోవుంది. ఆ పర్సు పట్టుకుని వెర్రిదానిలాగ అలాగే నిల్చునిపోయింది. ఆమె చేతులు వణుకుతున్నాయి, కనులమ్మట అశ్రువులు ఏక ధారగా ప్రవహిస్తున్నాయి. మూర్తీభవించిన దైన్యంలాగ నిలబడిన ఆమెప పరిజ్ఞానం నశించింది. ఒక్కసారిగా పరుగెత్తుకు వీధిలోకి వచ్చింది. చేత్తో పర్సుని గట్టిగా పట్టుకుంది. మడుగుగోదిగి వేగంగా రోడ్డుమీదకి వచ్చింది. వర్షం సన్నగా పడుతూంది. ఆమె పరుగు సాగించింది. బురదనీళ్లు వొళ్లంతా చిందుతున్నాయి. ఆమె గోతుల్నీ గతుకుల్నీ చూడలేదు. గోతులలో కాలు పడి కింద పడుతోంది. మళ్లీలేచి, పరుగెత్తుతుంది. బట్టలన్నీ బురదతో చట్టంగా అసహ్యంగా తయారయాయి. ఆమె ముఖానకూడా బురదచిమ్మింది. జుట్టుముడి వీడిపోయింది. వానకి వొళ్లంతా తడిసిపోయింది. బట్టల చిపరల నుండి నీళ్లు కారుతున్నాయి.

తూర్పున వెలుతురు వచ్చేస్తూంది. తూర్పున మబ్బులు కొంచెం కొంచెం తెల్లబడుతున్నాయి. ఆమె పరుగు వేగం హెచ్చించింది. ఆమె రొప్పుతోంది. ఆయాసపడుతోంది కనుచూపు మేరలో స్టేషన్ కనపడుతోంది. స్టేషన్‌కి రైలువచ్చేసింది. పళ్లు బిగబట్టి శక్తినంతా ఉపయోగించి ఒక్క పరుగులో స్టేషన్ చేరింది, జనం గుంపులు గుంపులుగా దిగుతున్నారు. గేటుదగ్గర జనం క్రిక్కిరిసి వున్నారు. వాళ్లని తోసుకుని లోపలికి పోయింది. చెయ్యి అడ్డంగా పెట్టి "ఆగు" అంటూన్న టికెట్ కలెక్టర్ని

కూడా బురదచేతులతో తోసివేసింది. ప్లాట్‌ఫారంమీదకు వచ్చింది. విడిపోయిన జుట్టుతో వొళ్లంతా మొహమంతా బురదతో దుర్భరంగా వుంది. వింతగా చూస్తున్నారు జనం. ఆమె ఒక్కొక్క రైలుపెట్టెనే ఆత్రంగా వెతుకుతోంది. "బాబుగారూ" అని అరుస్తుంది. పెట్టెలలోని ప్రయాణీకులు అర్థంకాక "ఏమిటి ఏమిటి" అంటున్నారు. ఆఖరు పెట్టెలో కిటికీకి కొంచెం దూరంలోవున్న జగన్నాధాన్ని చూసింది రమ. రైలు కూత వేసింది. గార్డు విజిలు వేశాడు.

"బాబుగారూ యిదిగో పర్సు" అంటూ పెట్టెలోకి పర్సుని విసిరింది రమ. జగన్నాధం రమని పోల్చుకోలేక పోయాడు మొదట. ఇంతలో రైలు కదలింది. రైలుతోపాటు ఆమెకూడా పరుగెత్తుతూ "నేను రమని నేను రమని....మళ్లీ మీరు....మీరు...." ఆయాసంతో యింక మాట్లాడలేక పోయింది రమ. చీర మడతలో కాలు చిక్కుకుంది. ఒక్కసారిగా ముందుకు బోర్లాపడింది. జగన్నాధం తొందరగా వెళ్లిపోయే రైలు కిటికీలోంచి ప్లాట్‌ఫారంమీదికి చూశాడు. నేలను కరచుకుని, బురదతో నిండిన బట్టలతో; విడిపోయిన శిరోజాలతో; బోర్లపడివున్న దీనమైన స్త్రీమూర్తి వైపు ప్లాటుఫారం మీద మిగిలిన జనం కంగారుగా రావడం చూశాడు. అతని మొహం బాధతో, నల్లబడింది. రైలు అప్పుడే చాలాదూరం వెళ్లిపోయింది. జగన్నాధం కిందకి వంగి పర్సును పైకి తీసి చూశాడు. పర్సులో డబ్బంతా ఎలా పెట్టినది అలాగే వుంది, కాని ఫొటో మాత్రం లేదు.

(1961)

# సుందరీ - సుబ్బారావు

సెకండరీ గ్రేడు మేష్టారు సుబ్బారావుకి పాపం ఏరుబడి లేదు.

అతనికి కాలం చాలా యిరుకుగా వుంది. ఇరుకుగా ఇటూ అటూ ఊచలతో కట్టిన బోనులాగ 'కారిడర్'లాగా వుంది.

అతని వెడల్పాటి ఆశయాలు సరదాగా ఇటూ అటూ పచార్లు చేయ డానికి వీలులేకుండా వుంది.

ఇరవై నాలుగేళ్ళ సుబ్బారావు ముంగురుల మీద నుంచి కలలు జారుతుంటాయి. కృష్ణశాస్త్రి చెప్పినట్లు. కృష్ణశాస్త్రిగారు అతన్ని గురించి చెప్పలేదనుకోండి. అయితే సుబ్బారావుకి ఎందుకు ఏరుబడి లేదు ?

అతను లేచిన కాస్సేపట్లో స్నానానికి వెళతాడా ! ఇక్కడ నూతి గట్టుమీద తువ్వాలుకట్టుకొని చేదమీద చేద తీసుకుని నీళ్ళు పోసుకుం టూంటే నీటి బిందువులు ముత్యాల్లా ఎర్రని వొంటిమీదనుండి జారతాయి. ఉదయసూర్యుడి చిరువెచ్చని కాంతిలో మెరుస్తాయి. రోజూ పాలుపోసే గొల్లపిల్ల మాత్రం రెప్ప వాల్చకుండా ఆశగా తన వొంటికేసి చూస్తుం దని సుబ్బారావుకి తెలియకపోలేదు. కాని పుత్తి గొల్లపిల్లలు మాసిన బట్టలతో, ఆశలతో అందంగా లేని గొల్లపిల్లలు తన కథలో నాయికలుగా వుండడానికి అంగీకరించలేడు సుబ్బారావు.

సబ్బు తీసి వొళ్ళు తోముకుంటూంటే సుబ్బారావుకి ఆ స్పర్శ— తన ఛాతీమీద : జబ్బలలోని, పిక్కలలోని కండలయొక్క స్పర్శ— ఏదో గర్వాన్నీ హాయినీ కల్గిస్తుంది. ఇంత భౌతికంగా వాస్తవంగా

ప్రత్యక్షమవుతున్న ఆ బలాన్నీ యౌవనాన్నీ చూసుకుని మురిసిపోకుండా ఉండలేకపోతున్నాడు సుబ్బారావు.

అలాగ గర్వపడనివాడు వట్టి ఆధ్యాత్మికవాది. సుబ్బారావుకి ఆధ్యాత్మికవాదులంటే అంత నమ్మకం లేదు.

చక్కగా కమ్మెచ్చున తీసినట్లు – సంస్కృత కవులు వర్ణించిన దేహపుష్టిలాగ, హాలీవుడ్ రోనాల్డ్ కోల్మన్‌లాగ, సింహకిశోరంలాగ బలిష్ఠంగా పసందుగా వున్న దేహాలు కలవాళ్ళని—ఒకళ్ళనిచూపెడుదూ!

ఉహుఁ — పదిమైళ్ళ రేడియస్‌లో ఎక్కడా కనపడడు.

అన్నాడు, అనుకున్నాడు సుబ్బారావు. అయితే ఇటువంటి గాత్రం కలిగివున్నవాడికి ఉండవల్సిన ప్రోస్పెక్ట్స్ ఏమిటి!

ఇలాగ ఒక గంట అయినా ఆలోచిస్తూ నూతిలో సగం నీళ్ళు పోసేసుకుంటూన్న సుబ్బారావుకి వాళ్ళ అమ్మ పిలుపుగాని, చెల్లెలు కేక గాని వినిపించే టప్పటికి తెలివివొచ్చి వొళ్ళు తుడుచుకుని తను అద్దెకున్న తన వాటాలోకి వెళతాడు. వాటాలో మొదట వంటగదిలోంచి రెండవ గదీ, ఆఖరు గదీ అయిన పడక గదిలోకి వెళ్ళాలి.

పడక గదినే చదువులగది అనవచ్చును. దాన్నే డ్రాయింగురూమ్ అన్నా సుబ్బారావుకి ఏమీ అభ్యంతరం లేదు.

మొదటిదైన వంటగది దాటుతూంటే వాళ్ళమ్మ "ఒరే సుబ్బా! మెంతులూ, ఆవాలూ అయిపోయాయిరా. స్కూల్‌నుంచి వొచ్చేటప్పుడు పట్టుకురా నాయనా" అంటుంది.

'ఓ అలాగే' అంటూ రెండవ గదిలోకి వెళతాడు. అక్కడ చెల్లెలు ఓమూలకూర్చుని బుద్ధిమంతురాలిగా సాంఘిక శాస్త్రం చదువు తూంటుంది.

సుబ్బారావు నవ్వుతాడు. ఎందుకంటే ఆ పుస్తకం పేజీలమధ్య సినిమా పాటలపుస్తకం కూడ ఉంటుందిగా. అయితే సుబ్బారావు తెలీనట్లుగా ఉంటాడు. డిప్లమసీ అంటారే, అదికూడా సుబ్బారావుకి తెలియక పోలేదు.

ఆ గదిలో ఓ బల్లవుంది. బల్లముందు ఓ కుర్చీవుంది. ఆ కుర్చీలో కూర్చుంటాడు సుబ్బారావు. బల్లమీద ఒక అద్దం గోడకి దాపెట్టి ఉంటుంది. అద్దంఅంటే అంతాకాదు; అసలు అద్దంలో మూడూ బై అయిదవ వంతు

ఆ మధ్య అద్దం కిందపడినప్పుడు తక్కిన రెండూ పై అయిదవ వంతు అసలునుంచి బలవద్వియోగం పొంది విడిపోయింది.

ఈ అద్దంలో చూచుకుంటూ సుబ్బారావు మళ్ళీ ఒక గంట ఆలోచించుకుంటాడు. అద్దంలో అతని మొహం, మూడూ పై అయిదవవంతు మొహం కనపడుతుంది. ఆ పరిమాణంలో తన క్రాఫూ, జుట్టూ, ముక్కూ, పెదాలూ, పెదాలమీద అందమైన సన్నని చిన్నని మీసకట్టూ చూచుకుంటాడు. అలాగ చూచుకుంటూ ఆలోచించుకుంటాడు.

ఏమనీ — ?

అదిగో, అక్కడే అతని ఆలోచన తారాజువ్వలా దూసుకు పోతుంది. విచిత్రమైన గగనాల్ని తాకుతుంది. నక్షత్రాల్ని 'హలో' అని పలకరిస్తుంది. ఇంకా పైపైని ఏయే విచిత్ర స్వప్నగోళాలు ఉన్నాయో అని గవేషిస్తూ, పర్యవేక్షిస్తూ, వెళ్ళిపోతుంది పైపైకి.

తనకున్న పెర్సనాలిటీకి ఒక యూరోపియన్ కంపెనీ యజమాని కనీసం వెయ్యిరూపాయల జీతంమీద మంచి ఉద్యోగం ఒకటి ఎందు కివ్వకూడదూ ? ఏం, ఎందుకు యివ్వకూడదూ. అసలు మొదట రాక్ ఫెల్లర్ ఎవడు ? ఫోర్డు ఎవడు ?

బొంబాయిలోనూ, మద్రాసులోనూ, యిళ్ళకన్న స్టుడియోలు ఎక్కువై పోయాయిట. అందులోనూ కొత్త మొహాలకోసం ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ ఒకటే గోల పెడుతున్నారట. మరి తనకున్న కట్టూ గెయిటూ తో (Cut and gait) చటుక్కున ఓ ఛాన్సు లగిలి హీరో అయిపోతే—?

అసలు అంతదూరం వరకూ ఎందుకూ, మిల్లు ఓనర్ ప్రకాశరావు కూతురు – తను స్కూలునుంచి వస్తుంటే కారు వయ్యారంగా డ్రైవ్ చేసుకుంటూ ఎదురు వస్తుందికదా. చలాకీగా అందంగా ఫ్యాషన్‌గా ఉంటుంది. ఎర్రని పెదవుల మీదకి రాబోయే నవ్వు దారితప్పి అలా బుగ్గల మీదికి వెళ్ళబోయి సరాసరి కళ్ళల్లోకివెళ్ళి కూర్చుంటుంది. బలే అందంగా ఉంటుంది. సుమిత్ర ! ఒకరోజున కార్లో వెళుతూ వెళుతూ తన్నిచూసి, నిదానంగా యింకోమారు చూసి, స్టన్అయి, ఉక్కిరి బిక్కిరై 'ఓహో ఎవరీ కుర్రవాడు. ఇతనికి నా హృదయం యిచ్చేశాను. ఇతనే నా మొగుడు'

ఈ నిశ్చయమూ, నిర్ణయమూ మారదు' అని గట్టిగా అనేసుకుంటే - ఏమో ఎవరికి తెలుసూ!

ఇలాంటివన్నీ ఆలోచించుకుంటాడు. అందుకే అతనికి బొత్తిగా తీరిక ఉండదు.

ఒకటి : పరికిణీలు చిరిగిపోయాయి, కుట్టించరా అన్నయ్యా.

రెండు : రెండు వోణీలుకూడా కొనేం - మరచిపోకు.

మూడు : అన్నట్టు పాలవాడు సొమ్ముకోసం నిలతీస్తున్నాడురా అబ్బాయి. వాడికి చాలా అవసరమంట!

నాలుగు : ఏమండోయ్ సుబ్బారావుగారూ. మీరు అలాగ సంగీతం పాడేస్తూంటే మా పిల్లలు చదువుకోవాలా అక్కర్లేదా - స్వంత యిల్లు అనుకున్నారేంవిటి.

అయిదు : ఒరేయ్ సుబ్బారావు. అడక్కడక్క అడిగావ్ పాపం. అయిదు రూపాయలు కాదుకదా. అర్ధరూపాయి కూడా లేదురా. నీతోడు.

ఆరు : సైకిల్‌కి లైటు లేదేం. నీ పేరు ? పని ? ఊరు ? రేపు పదింటికి కోర్టుకి రా.

ఏడు : ఏయ్ హారన్ వాయిస్తూంటే తప్పుకోవాలని తెలియదూ. నడుస్తూనే నిద్రపోతున్నావా.

ఎనిమిది : చిరంజీవి సుబ్బారావుకి ; ఈ నెల జీతాలు మాకు అంద లేదు. మీ అత్తయ్యకి వారం రోజుల్నుంచి జ్వరం ఒక్క యిరవై రూపా యలుంటే అర్జంటుగా పంపించవల్సింది, జరూరు.

తొమ్మిది : ఈ షర్టింగు గజం అయిదు రూపాయలు. ఏం అలా చూస్తావేం. బట్టలన్నీ తీయించి కుప్ప వేయించావ్. కొనే మొహమో కాదో తెలుస్తూనే ఉంది.

పది : ఏమోయ్ సుబ్బారావ్. స్కూలు వదలగానే ఒకసారి యింటికి రా. రేపు మా యింట్లో సత్యనారాయణవ్రతం చేసుకుంటున్నాం. కొంచెం మార్కెటింగ్ చేసి పెడుదువుగాని నీకు సరుకునాణెం తెలిసినట్టు యింకెవ రికీ తెలియదంటుంది మా ఆవిడ-ఇది కుర్చీలో కూర్చున్న హెడ్మాష్టర్ అభిధగల ఒక స్థూలకాయం తాలూకు ఆస్యవివరంనుంచి వచ్చిన ఆజ్ఞ!

ఇలాంటివి గొప్పలు, ముళ్ళు, డొంకలు, రాళ్ళు, గాజు పెంకులు, గోతులు, తేలుకాట్లు, మండ్రగబ్బలు అడుగడుగునా మలుపు మలుపునా తగులుతున్నా సుబ్బారావు నిస్పృహ చెందలేదు.

ఎప్పుడైనా ఖిన్నుడౌతాడు. గుండె బరువెక్కి ఓ నిముషం చీకట్లనీ శ్మశానాల్నీ తలచుకుంటాడు. కాని అంతా ఓ నిముషం మాత్రమే. మరు నిముషంలో ఆప్టిమిస్టు సుబ్బారావు- ఉత్సాహవంతుడు సుబ్బారావు హుషారుగా ఆలోచించుకుంటాడు.

దెబ్బమీద దెబ్బ తగిలిన కొద్దీ ఆలోచన మరీ మధురంగా రమ్యంగా అలంకరించుకుని వస్తుంది.

ఆశ గుబుక్కున చావదు.

అందులో యౌవనంలో కగ్గను కూడా కిగ్గదు.

ప్రాణశక్తి ఎలాగో అలాగా బతకడానికి ప్రయత్నిస్తుంది. బతకడానికి అవసరమైన ఆనందంకోసం వెదుకుతుంది. ఆశ అనే చేయిని ఊతగా తీసుకుంటుంది.

ఆశ ఆలోచనల్ని రేపుతుంది. కలల్ని జల్లుతుంది.

అందుకే సుబ్బారావుకి ఆలోచించడానికి యీ కాలం సరిపోవడం లేదు. ఆలోచించిన కొలదీ అతనికి రెట్టింపు బలం వస్తుంది. ఆనందం కలుగుతుంది.

ఈ ఆనందం మిథ్యా, నిజమా?

వేదాంతం అంటే యిష్టంలేదు సుబ్బారావుకి.

అనుభవించినంతసేపూ యిది నిజమే.

తాగి మైకంలో ఉన్నంతసేపూ అదీ ఒక ఆనందమే!

అందుకే ఆలోచనల మద్యాన్ని, మైరేయాన్ని, కల్లుని, బ్రాందీని, వైన్‌ని, విస్కీని అన్ని రకాలనీ అవిచ్ఛిన్నంగా తాగేస్తున్న సుబ్బారావుకి-

ఆ రోజు సాయంత్రం కల నిజమయేటంత అపాయం జరిగి ది.

పిల్లలకి సైన్సుపాఠం చెప్పి లాంగ్‌బెల్ కొట్టగానే స్కూల్ దుమ్ముని దులిపేసుకుంటూ గబగబా వస్తూన్న సుబ్బారావుని

కారు ఢీకొట్టింది. కొంచెం జాగ్రత్తగానే.

ఆ కారు కింక వేరేమార్గంలేదు. ఎందుకంటే సుబ్బారావుని ఇం మాత్రం ఢీకొట్టక పోతే-ఎదురుగా వచ్చే పొగరుమోతు లారీ కారుని పచ్చడిచేసి ఉండును.

కనురెప్పపాటులో సుబ్బారావు నేలమీద సాష్టాంగపడి ఓ అరగజం దూరం జర్రుమని జారాడు.

దుమ్ములోంచి నొసటిమీద ఎర్రని నేత్రాన్నీ కాళ్ళకీ చేతులకీ అరుణకంకణాల్నీ, దేహానికి బూడిదనీ ధరించిన అపర శివుణ్ణి రోడ్డుమీద పోయే యిద్దరు ప్రమధులు లేవనెత్తారు.

"ఎక్స్యూజ్ మి"- సన్నని వీణాస్వరం.

కళ్ళమీద ఉన్న కంకరదుమ్ము పల్చని పొరలోంచి సుమిత్ర అస్పష్టరూపం.

"వెరీ వెరీ సారీ." అదే. ఆ వీణాస్వరమే.

"..............."

"కారులో ఎక్కండీ ప్లీజ్"

కారు ఓ అందమైన భవనం ముందు ఆగింది. సుమిత్ర అతన్ని చెయ్యిపట్టుకుని మెల్లగా లోపలికి నడిపించింది.

అసలే షాక్ తగిలిన సుబ్బారావుకి సుమిత్ర సన్నిహిత రూపమూ, స్పర్శా మరో షాక్‌లా తగిలాయి. ఇది నిజమా! లేకపోతే తను చచ్చిపోయి స్వర్గానికి వెళ్ళగా; తనకి సుమిత్ర అంటే యిష్టమని తెలిసిన ఊర్వశో, తిలోత్తమో కామరూపులు కాబట్టి సుమిత్ర రూపంతో వచ్చారా?

అయొడిన్ చురుక్కుమనేటప్పటికి అతనికి తెలివి వచ్చింది. కళ్ళు తెరచి కలయచూశాడు. సుమిత్ర, సుమిత్ర తల్లీ తండ్రీ, గుమాస్తాలూ నౌకర్లూ వగైరా వగైరాలు.

"ఎలా వుంది మీకు" అంది సుమిత్ర.

జుట్టునీ వొంటినీ అంటున్న దుమ్ము దులిపేసుకొన్నాడు గబాగబా సుబ్బారావు. సిగ్గుపడిపోయాడు సుబ్బారావు. తనేదో తప్పుచేసినట్టు "క్షమించండి" అన్నాడు సుబ్బారావు.

"ఏం పని చేస్తున్నావబ్బాయీ" అన్నాడు దశలక్షాధికారీ, మిల్ ఓనరూ అయిన తండ్రి.

"ఫలానా స్కూల్లో టీచరునండి"

"బాగుంది నాయనా, ఏ క్లాస్ హోల్డు చేస్తున్నావు."

"ఫస్టుఫారం."

సుమిత్ర జాలిగా చూసింది. "నాన్నా, వీరికి వీలుబడి వుంటే మన గోపీకి ట్యూషన్ చెపుతారేమో" అంది.

వాళ్ళిస్తామన్న జీతానికి, వాళ్ళు రమ్మన్న టైమ్కి, వాళ్ళవాళ్ళ చెలిమికి అన్నిటికీ వొప్పేసుకున్నాడు సుబ్బారావు సుమిత్రకేసి చూస్తూ. ఒక్క గంటలో అతనికి ఆకాశం అంత ఎత్తు ఎగిరినట్టయింది.

ఒక్క అంగలో వీధిలోకి వచ్చి, అక్కడున్న కారుకి కృతజ్ఞతతో మనస్సులోనే నమస్కరించి ఒక్కడూ ఆలోచించుకుంటూ వెళ్ళిపోయాడు.

జీవితంలో ఒక అందమైన అమ్మాయినీ, ఆమె లక్షల్నీ ఒకేసారి పొందకలిగే అదృష్టం తాను కలిగివున్నాడా? ఇటువంటి దైవ నిర్ణయం ఏదో లేకపోతే తాను సుమిత్ర కారువల్లనే ఎందుకు దెబ్బతినాలి? ఓహో దేవుడెంత మంచివాడు. ఎంతదూరం ఆలోచిస్తాడు పాపం? బల్లమీద అద్దంలోని తన మూడూ పై అయిదవ వంతు ప్రతిబింబం అవును అంది. ఆ ప్రతిబింబాన్ని తానెప్పుడూ నమ్మాడు. ఆ నమ్మకం వృథాపోదు

"సుమిత్ర! చూడడంలో మాట్లాడడంలో ఒక ఆర్ద్రభావం లేదా? ఆమె హృదయం ధ్వనించలేదా?" అని అడిగింది ఆ ప్రతిబింబం.

తర్వాత రోజున ట్యూషన్ చెప్పడానికి వెళ్ళాడు సుబ్బారావు, అతని కున్న బట్టలలో మంచివీ అందమైనవీ వేసుకుని. సుమిత్ర నవ్వుతూ ఎదురు వచ్చింది.

"నమస్కారం. నయంగా ఉందా మేష్టారూ" అంది.

"నయమేలెండి. అంత పెద్ద దెబ్బలేంకాదుగా" అన్నాడు తల వంచుకుని సుబ్బారావు.

"మొదట ఎంతో భయపడిపోయాను ఏదో పెద్ద ప్రమాదం జరిగి ఉంటుందని. థాంక్‌గాడ్, ఏదో నవ్యంగా తేలిపోయింది."

"కారు; పక్కనుంచి డాష్ యిచ్చింది. అదీకాక కారు అంత వేగంగా రావడం లేదులెండి."

"పోనీలెండి. ఈ ఏక్సిడెంట్‌వల్ల గోపీకి మంచి మేష్టారు వచ్చారు. అన్నట్టు మా గోపీ చెప్పాడు మీరు బాగా పాడతారనీ."

"ఏదోలెండి_గాలిపాట" సిగ్గుపడ్డాడు సుబ్బారావు.

"ఎప్పుడో మీ పాట వినాలి. వస్తానండీ నమస్తే" అంటూ హేండ్ బాగ్ వూపుకుంటూ వయ్యారంగా నడచి వెళ్ళిపోయింది సుమిత్ర.

ఆమె మాట్లాడుతూన్నంతసేపు సరిగ్గా తల ఎత్తలేని తన లజ్జా స్వభావానికి చాలా చిరాకుపడిపోయాడు సుబ్బారావు. కాని ఆమె ఎంత సరదాగా హాయిగా మాట్లాడింది, రోజూ యిలాగే తనతో మాట్లాడితే బావుండును.

"లెక్కలు చెప్తారా మేష్టారూ?" అని గోపీ అనేటంతవరకూ అతను అన్యమనస్కుడయే ఉన్నాడు. "లాభము_నౌతము" అన్న గణితబోధిని లోని అధ్యాయాన్ని చూసి యీ మనస్థితిలో ఆ పాఠం చెప్పడంకన్న రసాభాసము వేరే ఉండదనుకున్నాడు.

ట్యూషన్ ప్రారంభించి ఒకవారం రోజులయింది.

ఈ వారం రోజులూ సుమిత్ర రూపంకాని, వాక్కుకాని, అడుగు సవ్వడికాని కనపడలేదు, వినపడలేదు సుబ్బారావుకి.

నిరాశ మెల్లమెల్లగా నల్లనల్లగా ఆవరిస్తోంది సుబ్బారావుని. నీరసం వస్తోంది.

అతనిమీద అతనికిగల విశ్వాసం సన్నగిల్లి వేసవికాలపు ఏటిపాయలాగ భయపడి సిగ్గుపడి ఏడుపులాంటి యిసుక నేలమీద యింకిపోతోంది.

అద్దంలో అతని 3/5 వ ప్రతిబింబం హెచ్చరించడం మానివేసింది.

ఇటువంటి విపత్ సమయంలో - ట్యూషన్ చెప్పి వీధిగేటుదాకా అడుగులు వేసిన సుబ్బారావుని___

"మేష్టారూ అక్కయ్య మిమ్మల్ని పిలుస్తోంది" అన్నాడు గోపీ. గోపీ ఆ సమయంలో మురళి వాయిస్తూన్న బాలకృష్ణుడిలాగా కనిపించాడు సుబ్బారావుకి. బెదురుగా ఆశగా గోపీ వెనకాలనే హాలుదాటి ఏవేవో గదులు దాటి ఓ గదిలోకి వెళ్ళాడు.

ఒక పెద్ద గదిలో విరుగుడుచేవ కర్రతో చేసిన సొగసైన మంచం మీద మెత్తని వెల్వెట్ దిండ్ల నానుకుని వడిలీవడలని పువ్వులా పడుకుంది సుమిత్ర.

కిటికీలకి తెరలువాల్చి ఉన్నాయి. గోడలలోనే అమర్చబడిన విద్యుద్దీపాలు నీరెండలాంటి కాంతిని గది అంతా ప్రసరిస్తున్నాయి.

"రాండి మేష్టారూ" అంది సుమిత్ర.

అలవాటులేని ఆ పరిసరాలకీ, స్నేహశీలమైన ఆమె ఆహ్వానానికీ తొట్రుపడుతూ ఆమె చూపించిన కుర్చీలో ఆమె మంచానికి అనతి దూరంలోనే కూర్చున్నాడు.

"నిన్నటినుంచి జ్వరంగా ఉంది. ఒక రైకీ ఏమీ తోచడంలేదు. పోనీ మీతో కబుర్లాడుతూంటే" - నవ్వింది సుమిత్ర.

"తప్పకుండానండి"

"మీకేమీ పనిలేదుకదా ?"

"ఏం లేదండి. ఈ ఒక్క ట్యూషనే నాకు వున్నది."

"అయితే యింక చిక్కేలేదు."

ఈ రోజున చెల్లెల్నీ తల్లినీ సినిమాకి తీసుకువెళతాను, రెడీగా వుండమన్నాడు సుబ్బారావు. వాళ్ళు కనిపెట్టుకుంటారన్న బాధని గట్టిగా నొక్కిపట్టి నోరెత్తకుండా చేశాడు.

వాళ్ళ కబుర్లు సుబ్బారావు స్కూలునీ, లేటెస్టు పిక్చరుని, సుమిత్ర కాలేజీని, స్పోర్ట్సునీ, రాజకీయాల్ని ఒక్కొక్కటే దాటి చివరకు సంగీతం దగ్గరకు వచ్చాయి. సంగీతదర్శకులనీ పాడేవాళ్ళనీ అందరినీ తిరగేసి చాలామటుకు ఇద్దరూ చాలా విషయాలలో ఏకాభిప్రాయం కలిగివున్నట్లు తెలిసికొన్నారు.

"మీరేమైనా పాడండి మేస్టారూ."

సిగ్గుపడ్డాడు సుబ్బారావు. పాడాలి తప్పదంది సుమిత్ర. సుబ్బారావు పాడాడు. నిజంగా బాగా పాడాడు. సుమిత్ర నిట్టూర్చింది....

"అదేం ?" అన్నాడు సుబ్బారావు.

"మీ పాట నన్ను కదిలించేసింది."

భారతరత్న బిరుదు ఈ మెప్పుముందు ఏపాటిది! ఎనిమిది గంటలకు వెళతానని లేచాడు సుబ్బారావు. సుమిత్ర కృతజ్ఞతతో "థాంక్స్! మీ స్నేహం కలగడం నా అదృష్టం" అంది.

తాగి మైకంతో ఉన్నవాడిలా ఇంటికి వెళ్ళాడు. తల్లికి, చెల్లెలికీ ఏదో సాకు చెప్పాడు. టేబిలుమీద అద్దంలో తన ప్రతిబింబాన్ని అదే పనిగా చూసుకున్నాడు. ఎప్పుడూ లేని కాంతి ఆ కళ్ళల్లో! ఎప్పుడూ లేని అందం ఆ మొహంలో!

భోంచేశాక చెల్లెలు "అబ్బ, గోంగూరపచ్చడిలో కారం ఎక్కువయింది బాబో" అంది.

"గోంగూరపచ్చడేమిటి?" అని విసుగ్గా అడిగాడు సుబ్బారావు.

"నువ్వు తినలేదూ?" అని అడిగింది చెల్లెలు.

"ఎప్పుడు?"

"ఇప్పుడే"

"ఎక్కడ?"

"ఇక్కడే. అదేమిటన్నయ్యా అలా మాట్లాడుతావ్? ఇప్పుడన్నంలో కలుపుకుని తినికూడా...?"

సుబ్బారావు కాబోలనుకున్నాడు. అతని ఉదాత్త మనస్థితిలో చచ్చు గోంగూరపచ్చడివంటి విషయాలకి తావులేదు.

అతనికి కలతనిద్ర పట్టింది. నిద్రలో సుమిత్ర కనబడింది. మెత్తని తెల్లని వొంపులు తీరిన ఆమె వొళ్ళూ, వొంటిమీద కొంచెం నలిగిన తెల్లని వాయిల్ చీరా. సంస్కరింపబడని ఆమె జుట్టు చిందరవందరగా ఆమె నున్నని మెడమీదా — బుగ్గలమీదా, జ్వరంవేడికి మరి కాస్త ఎరుపెక్కిన చిన్ని పెదవుల కదలికా — ఈ అప్రయత్న అలంకృతమైన ఆమె రూపంలోని సహజ సౌందర్యం అతని మనస్సుని వెయ్యి అత్తరు సీసాలు పగలగొట్టినంత సౌరభంతో ముంచెత్తి ఉక్కిరిబిక్కిరిచేసింది.

తర్వాతరోజున ట్యూషను ఇంకా చెబుతూండగానే లోపలినుండి సుమిత్ర "నమస్తే మేస్టారూ" అంటూ వచ్చింది.

"నమస్తే నమస్తే" అంటూ లేచి నిలబడ్డాడు సుబ్బారావు "మీ వంట్లో ఎలా వుంది?"

"ఈ రోజున నయమే. చారూ అన్నం తిన్నాను. అలా షికారు పోదాం రండి. మీ కంపెనీ వుంటే—"

"ఇంకా ట్యూషన్...." నసిగాడు సుబ్బారావు.

"ఫర్వాలేదులెండి....ఒరేయి గోపి, పోయి ఆడుకో."

కారు తిన్నగా నదివొడ్డుకి వెళ్ళి ఆగింది. ఇద్దరూ దిగారు. అంతా నిర్జనంగా వుంది. ఇసుక ఉన్న స్థలం చూసి ఇద్దరూ కూర్చున్నారు. ఇటూ అటూ తోటలు, తోటగట్లనే వరుసల్లో వందలకొద్దీ తాటిచెట్లు: తాటితోపు వెనుక ఆకాశంమీద ఎర్రని కుంకుమ, నదిమీది నుంచి అలలు అలలుగా చల్లని గాలి, గాలికి కదలుతున్న ఆమె ముంగురులు, ఆమె షిఫాన్ చీర పైట, పైట అంచు అలా అలా కదలి అతని కాళ్ళనీ, మొహాన్నీ తగలడం –

వాళ్ళ మాటలు ఎక్కడి నుంచి ఎక్కడికి వెడుతున్నాయో తెలియదుగాని, చటుక్కున ఆమె ఇలా అడిగింది. "మీరింకా పెళ్ళిచేసుకోలేదేం?"

"నన్నెవరు చేసుకుంటారు?"– గొప్ప డిప్లమసీ ఉపయోగించి అన్నాడు సుబ్బారావు యీ మాట. ఇలాగ అన్నందుకు తన తెలివికి తానే ఆశ్చర్యపోయాడు. ఇప్పుడు సుమిత్ర ఏం జవాబు చెప్తుంది? ఆ జవాబులో తన భవిష్యత్తు గర్భితమై వుంటుంది.

"ఎవరయినా చేసుకుంటారు. మీకేం. దొరలా ఉన్నారు" అంది సుమిత్ర నవ్వుతూనే సీరియస్‌గా.

సుబ్బారావుగుండె గబగబకొట్టుకుంది – ఆనందం వలన; ఆ జవాబులో సూచించబడిన అర్థం వలన; చటుక్కున ఆమె మృదుహస్తాన్ని చేతిలోకి తీసుకుని ముద్దెట్టుకోవాలనుకున్నాడు. కాని అప్పుడే కాదు. ఇప్పటికి రెండవమెట్టు ఎక్కాడు. మొదటిమెట్టు వాళ్ళింట్లో ట్యూషన్ కుదరడం!

రోజులు గడుస్తున్నాయి. రోజూ కాకపోయినా రెండు మూడు రోజుల కొకసారైనా ఇద్దరూ షికారు వెళ్ళుతున్నారు. సినీమాలకి వెళ్ళుతున్నారు. పరిచయం గాఢతరమౌతోంది. డ్రైవ్ చేస్తోన్న సుమిత్ర, కబుర్లు చెప్పే సుమిత్ర, పచ్చికమీద చేతులు తలగడగా పెట్టుకుని ఆకాశంలోకి చూస్తూ పరున్న సుమిత్ర, చిరుకోపం నటించే సుమిత్ర – ఇన్ని రకాల రూపాలు, వ్యక్తిత్వాలు, అందాలు సవరించుకుని సుమిత్ర అతని మనస్సునీ, కళ్ళనీ, గుండెనీ ఆక్రమించివేసింది.

సుబ్బారావు ఇంటి పనులు చూడడమే మానివేశాడు. తల్లికి దగ్గు వస్తే మందు తీసుకురాడు. చెల్లెలికి రిబ్బనుముక్క కూడ కొనడు. వంట చెరుకు అయిపోయిందని వరుసగా మూడురోజులు చెప్పి నాలుగవ రోజున తల్లి ఏడుస్తే అప్పుడు తీసుకువచ్చాడు. ఎందుకంటే అతనికి తీరుబడిలేదు. ఈ కాలం సరిపోవడమూ లేదు. సుమిత్రని గురించి ఆలోచించుకోవాలి కదా. కలలు కనాలి కదా. తర్వాత ఆమె యింటికి వెళ్ళేందుకు డ్రెస్సు వేసుకోవాలికద. నెలజీతం పెట్టి మాంచి పాంట్లూ, లాజులూ, స్నో, పౌడరు, బ్రిల్ క్రీమ్, సెంట్లూ కొనేశాడు కదా. ఇవన్నీ వొంటికి రాసుకోవాలి, తయారవాలి. అప్పుడు సుమిత్ర దగ్గరకు వెళ్ళాలి. మరి యింటి పనులు చూసేందుకు తీరిక ఏది! తీరిక ఉన్నా డబ్బేదీ? తాను మాత్రం ఏం చెయ్యగలడు పాపం!

"ఏరా సుబ్బా, జీతం అంతా అలా తగలేస్తే నెల ఎలా గడుస్తుందిరా?" అంది తల్లి. మాట్లాడలేదు సుబ్బారావ్.

"మమ్మల్ని బ్రతికుండమన్నావా, పస్తులుండి చావమన్నావా?" నాలుగు రోజులు పోయాక అడిగింది తల్లి. వినిపించుకోలేదు సుబ్బారావు.

"నా ప్రారబ్ధం నాయనా, ఇంకా ఎన్నాళ్ళు చుట్టుపక్కలవాళ్ళ దగ్గర అప్పులు చెయ్యను, ఇంక నేను సుయ్యో గొయ్యో చూసుకుంటాను. నా కర్మ, నా కర్మ" తలబాదుకుని ఏడుస్తోంది. పది రోజులు పోయాక తల్లి.

"నీ ఫాషన్లూ, నీ సుఖమే ఎప్పుడూనూ. నేనూ ఎక్కడేనా దాసి పిల్ల కింద చేరి అంట్లుతోముకుని బతుకుతానులే అన్నయ్యా" కన్నీళ్ళు వరదలై పారాయి చిన్నారి చెల్లెలు లేత బుగ్గలమీద....

"ఏమయ్యా యిన్నేళ్ళొచ్చాయి బుద్ధి ఉండొద్దూ, తల్లినిలా ఉసురు పెడుతున్నావ్" అంది మజ్జిగపోసే మనిషి.

ఏడుపొచ్చింది సుబ్బారావుకి. తల్లి కాళ్ళు పట్టుకున్నాడు బతిమాలాడు. తనకీ సుమిత్రకీ గల పరిచయాన్ని గురించి చెప్పుకున్నాడు. "సుమిత్ర నన్ను తప్పక పెళ్ళి చేసుకుంటుందమ్మా. ఇంక మనకి కష్టాలు ఉండవ్" అని చెప్పాడు సుబ్బారావు.

"అయ్యో వెర్రినాయనా ఆమె కోటీశ్వరురాలి బిడ్డరా నాయనా. నక్క ఎక్కడ? నాగలోకం ఎక్కడరా సుబ్బా" అని కొడుకు అమాయకత్వానికి జాలిపడింది. ఈసారి సుబ్బారావు మళ్ళీ చెప్పాడు ఈకాలంలో ప్రేమకి ఇచ్చే విలువ, ప్రేమించిన వాళ్ళని తప్ప పెళ్ళిచేసుకోని భారతీయ తరుణీమణుల మనోవికాసమూ, సుమిత్రతో తన కారు షికార్లూ, నదీ సైకత విహారాలూ...."అమ్మా ఆమె పడక గదిలోకి కూడా నేను నిరాఘాటంగా వెళ్ళిపోతానమ్మా. ఇంకేం చెప్పమన్నావు? నమ్మి నా మాట నమ్మా" అన్నాడు.

తల్లికి నమ్మక తప్పలేదు. కళ్ళు పెద్దవిచేసుకుని వింది. ఆధునిక యువతుల స్వేచ్ఛని గురించి విన్నదేకాని తన కుమారుని ప్రేమించేటంత పరిణామానికి వచ్చిందన్న సంగతి గుర్తించలేకపోయింది. మొన్నటి వరకూ ఈ కాలపు పిల్లలు పాడైపోతున్నారన్న నిర్ణయాన్ని ఆమె సడన్‌గా మార్చివేసుకుంది. తృప్తిగా నవ్వుతూ ఆనందం కళకళలాడే మొహంతో తల్లి కొడుకును అస్పష్టంగా ఆశీర్వదించింది. పక్కనే వింటోన్న చెల్లెలు కళ్ళల్లో ఆశ, మెరుపు, హాయి – ఝుళంఝుళించాయి.

తల్లిలేచి లోపలికివెళ్ళి తిరిగివచ్చి కొడుకు చేతిలో ఒక బంగారు కాసుపెట్టి యిలాగ అంది: "నాయనా, ఇంటికంతటికీ ఇదే బంగారం. చెల్లెలికి శ్రావణానికి లోలకులు చేయించాలని ఉంచాను. ఇది ఎక్కడేనా తాకట్టుపెట్టి కావల్సిన సరుకులు తీసుకురా. మళ్ళీ విడిపించుకుందాం— దేవుడి దయవుంటే."

"దేవుడిదయ అంటే అన్నయ్య పెళ్ళేనా?" అంది తెలివైన చెల్లెలు. తాకట్టు అంటే గుండెలో కలుక్కుమన్నా కాసుని జాగ్రత్తగా జేబులో పెట్టుకుని వెళ్ళిపోయాడు సుబ్బారావు.

ఆ రోజున ఉదయమే సుమిత్ర ఆదేశానుసారంగా సుమిత్ర యింటికి వెళ్ళాడు. ఆమె నవ్వుతూ గేటుదగ్గరే ఎదురొచ్చింది. ఆమె విదేశీయమైన స్లాక్ తొడిగి పైన అందమైన బనీను వేసింది జుట్టుని వెనకాల ముడివేసి కొసలు బుజాలమీద కుచ్చులా పడేటట్లు చేసింది. ఆ దుస్తులలో ఆమె అవయవాల పొంకం స్ఫుటంగా, మరీ ఆకర్షణీయంగా వుంది. ఆమె చేతిలో బాడ్మింటన్ బాట్ వుంది.

సుబ్బారావు రెప్పలల్లార్చకుండా ఆమెని చూశాడు.

"ఏం ఈ డ్రెస్ బావులేదా?" నవ్వుతూ అడిగింది సుమిత్ర.

"చాలా బావుంది. మీరు అప్సరసలా ఉన్నారు."

"ఊర్వశినా తిలోత్తమనా?" కిలకిల నవ్వింది. "రండి ఒక గేమ్ వేసుకుందాం."

బాడ్మింటన్‌లో మంచి ఆటగాడయిన సుబ్బారావు మూడు గేములూ ఓడిపోయాడు. ఆమె అందాన్నీ అవయవాల్నీ తనివిదీరక చూసే అతనికి ఊబబంతి కనపడనేలేదు.

"మీరు పరాగ్గాఆడారు. మీరు మంచి ప్లేయరని విన్నాను. ఆడదాన్ని కదా అని పాపం దయతలచారు కదూ" చిరుకోపంతో అంది సుమిత్ర.

"నోనో-మీరీవేళ నిజంగా బాగా ఉన్నారు-అఁ ఆడారు" అన్నాడు. విరగబడి నవ్వింది. సుమిత్ర. ఆ నవ్వుకి- ఇదేమిటి ఈ తెల్లని పారిజాత పూలదండలు ఎవరోవిసురుతున్నారని యిటూ అటూ చూశాడు సుబ్బారావు.

వారంరోజులు పోయాక అక్కడే ఆ బాదంచెట్టుకింద కూర్చుని వాళ్ళిద్దరూ మాట్లాడుకోవడం కనుక పాఠకుడు వినివుంటే తెల్లబోతాడు. వాళ్లు 'మీరు' అనుకోవడం మానివేశారు. 'నువ్వు నువ్వు' అని చాలా సన్నిహితంగా చనువుగా మాట్లాడుకుంటున్నారు.

"నువ్వెవర్నీ ప్రేమించలేదా సుమిత్రా?"

"ఊహుఁ."

"అయితే నువ్వు పెళ్ళాడవా?"

"ఉహు - సన్యాసిగా ఉంటా."

"అబ్బ నిజం చెప్పదూ."

"నా మాటకేంగాని మరి నువ్వు?"

"నేనా - నేను నేను...."

తడబడ్డాడు సుబ్బారావు.

"ఉఁ-చెప్పవోయి."

"ఒక దివ్యసుందరీమణిని ప్రేమించాను."

"ఎవరూ....?"

"పేరు చెప్పకూడదు."

"పోనీ, ఏ ఊరూ ?"

"ఈ ఊరే-"

"ఎక్కడుంది ఈ ఊళ్లో ?"

"ఎక్కడ-ఇక్కడే."

"ఇక్కడా-" తెల్లబోయి యిటూ అటూ చూసింది సుమిత్ర.

"ఇక్కడ" అంటూ గుండెలు చూపించాడు సుబ్బారావు.

"ఓస్, అంతేనా" అంటూ పకపక నవ్వింది సుమిత్ర.

సుబ్బారావు ఒక్కసారి తన హృదయం విప్పి ఆమె ముందు పెడదామనుకున్నాడు.

"నువ్వు లేనిదే నేను బ్రతకలేను. నా ప్రతి అణువులో, ప్రతి ఊహలో నువ్వే, నువ్వే" అనేసి ఆమె పాదాలమీద పడిపోదామనుకున్నాడు. కాని సుమిత్ర చటుక్కునలేచి "ఇక పోదాం సుబ్బారావ్. ఆలస్యమైపోయింది" అంటూ విష్‌చేసి లోపలికి వెళ్ళిపోయింది.

ఆలస్యంగా స్కూలుకి వెళ్ళిన సుబ్బారావుని హెడ్మాష్టరు పిలిచాడు. ఆయన కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి.

"మీ ప్రవర్తన ఏం బాగులేదు."

"..........."

"మీరు క్లాసులకి సరీగ్గా రావడంలేదు. పాఠాలు సరీగా చెప్పడంలేదు. మీమీద అన్నీ కంప్లెయింట్స్-"

"...........వంట్లో బాగుండలేదండి."

"నే నలాగ నమ్మను? ఎప్పుడూ ఆ కోటేశ్వరరావుగారింటివగ్గరే ఉంటావట—పోనీ ఇక్కడ రిజైనిచ్చి అక్కడ ఉద్యోగం చెయ్యరాదూ."

"..........."

"చూడు ఈ నోట్సు నువ్వు చెప్పినదేనా?" అంటూ ఒక పుస్తకం పైకి తీశాడు హెడ్మాస్టరు.

"అవునండి."

"గుండెకాయలో ధమనులూ సిరలూ ప్రేమలూ ఉండును-ఇదేం సైన్సు!"

"........"

"నువ్వు చెప్పినదేనా - ఏమిటి ! ప్రేమలుకూడా సైన్సేనా!"

".... .... ...."

"మనస్థిమితం లేదా ? మాట్లాడవేం?"

"చూడు సుబ్బారావు. నిన్ను చూస్తే జాలివేస్తోంది. నువ్వేదో బాధ పడుతూన్నట్టుంది. మనిషినిచూస్తే ఆరోగ్యంగానే వున్నావు. కానీ నీ మూలాన పిల్లల చదువు దెబ్బతింటోంది. పోనీ కొన్నాళ్ళు సెలవు పెట్ట రాదూ?"

"నేనూ అదే అనుకుంటున్నానండి."

"జీతం నష్టంమీద నీకు సెలవిస్తాను. కావాలా?"

"కావాలండి."

"ఎన్నాళ్ళు?"

సుబ్బారావు ఆలోచించాడు "ఒక నెల అండి."

"సరే. అప్లయ్ చేసుకో. ఈ నెల్లాళ్ళూ విశ్రాంతి తీసుకొని మందు పుచ్చుకో మనస్థిమితానికి."

"చిత్తం" అన్నాడు సుబ్బారావు మనసులో మాత్రం 'పోవయ్యా ఇక పుండు మన జాతకం నీకేం తెలుసును?' అనుకున్నాడు. పరిశుద్ధ మైన ప్రాణవాయువును ఒకసారి గుండెలనిండా పీల్చి ఉత్సాహంగా స్కూలు ఆవరణ దాటి ప్రపంచంమీద పడ్డాడు.

సెలవు పెట్టిన సుబ్బారావుకి వారం రోజులవరకూ సుమిత్ర కను పించనేలేదు. ఆమె స్నేహితురాండ్రతో ఏవో ప్రోగ్రాములూ, పిక్నిక్‌లూ మొదలైనవి జరుపుకోవటంవలన ఆమె యింటిదగ్గర లేకుండాపోయింది. తర్వాత రోజున నాలుగు దాటాక వెళ్ళాడు సుబ్బారావు.

"మీ అక్కయ్య ఉందా ?" అని అడిగాడు గోపిని.

"ఓ" అంటూ గోపి సుబ్బారావుని ఆమె గదిలోకి తీసుకెళ్ళాడు. ఆమె అక్కడలేదు. "కూర్చోండి. ఎక్కడుందో చూస్తాను" అంటూ గోపి పరుగుతీశాడు. సుబ్బారావుకి చాలా కోపంగా ఉంది. వారంరోజులు తనని ఇంత విరహవ్యధలో ముంచి చంపడానికి ఆమెకి అధికారం ఎవరి చ్చారు ? అడగాలి అనుకున్నాడు.

గది నానుకుని ఉన్న బాత్‌రూమ్ తలుపుతీసుకుని సుమిత్ర వచ్చింది, తువ్వాలు చుట్టబెట్టుకుని. 'ఓ-సుబ్బారావ్' అంటూ ఆమె గదిలోంచి బాత్‌రూమ్‌లోకి ఒక్కసారిగా పరుగెత్తి తలుపులు వేసుకుంది. నీటిబిందువులు ముత్యాల్లా వొంటిమీద, ముంగురుల చివరలా మెరుస్తూంటే, తెల్లని వొంటి వొంపుల్ని దాచలేని తువ్వాలుతో గుండ్రని అందమైన పిక్కలతో అందానికి మోడరన్ ఎడిషన్‌లా జలసుందరిలా ఒక్క నిముషం మెరుపులా మెరసిన ఆమె రూపం అతన్ని మూఢుణ్ణి చేసింది అలాగే నోరావరించి ఉండిపోయాడు.

బాత్‌రూమ్ తలుపు సన్నగా తీసి 'ఆ మంచంమీద చీర యిలా యిస్తావా సుబ్బారావ్' అంటూ నవ్వుతూ సిగ్గుతో అడిగింది సుమిత్ర. గబుక్కున తెలివి తెచ్చుకున్న సుబ్బారావు 'సారీ - సారీ నేను హాల్లో వెయిట్ చేస్తా'నంటూ గదిలోంచి వెళ్ళిపోయాడు కంగారుగా.

తర్వాత కార్లో యిరువురూ బజారుకి వెళ్ళారు సుమిత్ర షాపింగ్ చేసింది. ఖరీదైన చీరలు, పౌడర్లు, ఒక అందమైన నెక్లేసూ కొంది. వాటి కన్నింటికీ ఖరీదు తానివ్వగలిగితే - అనుకున్నాడు సుబ్బారావు. ఒక్క గంటలో అయిదారువందల రూపాయలు సులువుగా ఖర్చుపెట్టిన సుమిత్ర ధనాన్ని చూసి కొంచెం ఈర్ష్యపడ్డాడు సుబ్బారావు. అక్కణ్నుంచి నది వొడ్డుకు వెళ్ళారు. తాటిచెట్ల వెనుక సూర్యుడు తాగినవాడిలా ఎర్రగా ఉన్నాడు. తాటిచెట్ల పొడుగాటి నీడలు నదీజలాలమీద పడికదలుతున్నాయి. సుమిత్ర ఈ వేళ ఏదో గంభీరంగా ఉంది.

"ఎల్లుండి నా పుట్టినరోజు సుబ్బారావ్.పంథొమ్మిది వెళ్ళిపోతాయి" ఆమె అలా అంటూంటే ఆమె గొంతులో ఏదో బాధ ఉన్నట్లు తోచింది సుబ్బారావుకి. ఆమె పుట్టిన రోజుకన్న పవిత్రమైన దినం పంచాంగంలో ఎక్కడా ఉండదని సుబ్బారావుకి తెలుసును. పవిత్రమైన ఆ రోజున ఆమె నడిగి తన ప్రేమ విషయం తేల్చుకోవాలనుకున్నాడు.

"తర్వాత రోజున నేనూ నాన్నా అమ్మా అందరం బెంగుళూరు వెళ్ళుతున్నాం"

"బెంగుళూరా!" తలమీద మోదినట్టయింది సుబ్బారావుకి.

"అవును"

"ఎందుకూ"

"మా మేనత్త అక్కడుంటోంది"

"అయితే యిప్పు డెందుకూ, బెంగుళూరు వేసవిలో వెళితే చల్లగా ఉంటుందిట"

"మా బావ వొచ్చాడుగా."

"ఎక్కడినుంచి"

"అమెరికానుంచి. టెక్నాలజీలో ఏదో పెద్ద పరీక్ష పాసయ్యాడు"

"అయితే మీరెందుకూ వెళ్ళడం"

"ఊరికినే- మా మేనత్త మరిమరీ రమ్మని వ్రాసింది"

"మీ మావయ్యా ఏం చేస్తుంటాడు"

"అక్కడ టెక్స్టయిల్ ఫ్యాక్టరీ యజమాని. చాలా పెద్ద వ్యాపారస్తుడు." ఎలా ఉంటాడు మీ బావ అని అడగాలని "ఎన్నాళ్ళుంటారక్కడ" అన్నాడు సుబ్బారావు.

"అబ్బే పది పదిహేను రోజులు."

"అయితే నన్ను మర్చిపోతా వన్నమాట."

"ఛా ! అదేవిటి సుబ్బారావ్. నిన్ను కలలో అయినా మర్చిపోతానా. నా ప్రాణ స్నేహితుడివి."

చాలు అనుకున్నాడు సుబ్బారావు. జన్మ ధన్యమయింది. ఇంత కన్న ఏ ఆడది నోరు విడిచి చెప్పగలదు అనుకున్నాడు.

తర్వాత రోజున సుబ్బారావు ఎక్కే గుమ్మమూ, దిగేగుమ్మమూ. సుమిత్రకి పుట్టిన రోజుకి ప్రెజెంటు యివ్వాలంటే డబ్బేదీ. అందుకే ఎరుగున్న వాళ్ళు, ఎరిగీ ఎరగనివాళ్ళ యిళ్ళన్నీ తిరిగాడు. సాయంత్రానికి అయిదుంబావలా వచ్చింది. చొక్కా మాత్రం చెమటతో తడిసి ముద్ద అయింది.

తిన్నగా ఒక షాప్‌లోకి వెళ్లాడు. చేతినున్న వాచితీసి యిచ్చి పాతిక రూపాయలు తెచ్చుకున్నాడు. తీసి యివ్వడమంటే అమ్మేశాడన్న మాట. తాకట్టు అయితే పదిహేనుకిమించి యివ్వనన్నాడు మరి షాహుకారు. ఎప్పుడో ఎనభై రూపాయలెట్టి కొన్న వాచీకి అంతకన్న ఇచ్చేవాడు ఈ

పృథివిలో అంటే యీ పూళ్కోలేదన్న షాహుకారు మాటల్ని పరమ సత్యంగా తీసుకుని అమ్మేశాడు.

ఆ రాత్రి అంతా నిద్రలో దుస్స్వప్నాలూ సుస్వప్నాలూ రెండూ కలిసివచ్చి, విశ్రాంతి లేనివాణ్ణిగా చేశాయి. తను అమ్మిన వాచీ గాలిలో ఎగిరి శూన్యంలోకి స్పుత్నిక్‌లా దూసుకు పోయినట్టూ, సుమిత్ర దెయ్యం అయి 'నువ్వే కావాలి నువ్వే కావాలి' అని పీక్కు తింటున్నట్టూ, తాను రైలుకింద తల పెట్టినట్టూ, సుమిత్ర జడలో తాను పువ్వులు ముడుస్తూన్నట్లూ, సుమిత్ర తనని నదిఒడ్డున తాటిచెట్టు మాటున మసక మసక చీకట్లో ముద్దు పెట్టుకుంటున్నట్టూ....

ఆ రోజు బాగా ఆలస్యంగా లేచాడు. వొళ్ళంతా బరువుగా ఉంది. మొహమైనా కడుక్కోకుండా అద్దంముందు కూర్చుని తన మూడూ బై అయిదవవంతు మొహాన్ని చూసుకున్నాడు. జుట్టు మొహం మీద పడుతోంది. కళ్ళల్లో నిద్ర తాలూకు చీకటి రొదయింకా ఉంది. కండలు తిరిగిన ఖాళీ చేతులూ బలంగానే ఉన్నా జడంగా ఆ బల్లనానుకుని అంటుకుని పోయాయి. సుబ్బారావు ఆలోచించుకోవడం మొదలెట్టాడు.

తనలో ఎందుకీ అలసట!

అస్పష్టమైన భవిష్యత్తువలన.

ఆమె అంతకన్న తన యిష్టాన్నీ ప్రేమనీ ఎలా వ్యక్తం చేస్తుంది? ఎంత మిలియనీర్ కూతురైనా ఆడదికదా!

తాను చాలాకాలం వెయిట్ చేశాడు. తమ ప్రేమ తీగలుసాగి, అదు తొడిగి పుష్పించడానికి సిద్ధంగా ఉంది.

కనుక యింక అడిగెయ్యాలి. ఈ పుట్టిన రోజున తేల్చేసుకోవాలి.

తర్వాత బెంగుళూరు కాదు బొంబాయికూడ వెళ్ళమను! తాను అనుమతి యిచ్చేస్తాడు.

పెళ్ళయాక ఎలా ఉంటుంది. హనీమూన్ ఎక్కడ ఎక్కడ! తను కార్లో తిరుగుతూంటే స్థూల శరీరూప రాక్షసుడు అనగా హెడ్మాష్టరు పాపం ఏమయిపోతాడు....అలా అలా ఆలోచించుకుంటూ ఉండిపోయాడు సుబ్బారావు.

మేడ అంతా అందంగా అరేంజి చేయబడిఉంది. ఆహూతులలో మొదట వచ్చిన సుబ్బారావుని చూసి 'మేష్టారు ముందొచ్చేశారే' అని నవ్వి ఫ్లవర్ వేజులలో పువ్వులు సర్దడంలాంటి చిన్న పనులు పురమాయించింది. నౌకర్లు పనిలేకపోయినా—లేకపోవడంవలననే—మరింత హడావుడిగా యిటూ అటూ తిరుగుతున్నారు. అతిథులొక్కొక్కరే రావడం, నమస్తేలూ, కరచాలనాలూ, తెచ్చికోలునవ్వులూ, గొప్పలూ, డంబాలూ, అత్తరు వాసనలూ-అంతాశ్రీమంతులు యిళ్ళల్లోలాగే ఉంది.

హఠాత్తుగా కోటేశ్వరరావుగారు సుమిత్రని పిలిచి "అమ్మాయి! కిళ్ళీలు రాలేదు" అన్నాడు. సుమిత్ర కళ్ళల్లో ఎంతో భయం గోచరించింది. చప్పున సుబ్బారావు దగ్గరకు వచ్చి సైకిలుమీదవెళ్ళి పోలయ్య కొట్లో కిళ్ళీలు తీసుకురమ్మని బతిమాలింది. సుబ్బారావు హాల్లోంచి సైకిలు సీటు మీదికి ఒకేగంతులో దూకడంకూడ సర్కస్‌ఫీట్ లాంటిదని కొందరి గట్టి నమ్మకం.

కిళ్ళీలు తీసుకువచ్చిన సుబ్బారావుకి ఏ బల్లముందూ సీటు ఖాళీలేక పోయింది. సుమిత్ర హడావుడిగా ఆడ మగ స్నేహితులతో ఏవేవో కబుర్లు చెపుతూ అయిస్ క్రీమ్‌ని అందంగా తింటోంది. సుబ్బారావు కొంచెంసేపు నిలబడి సిగ్గుతో అవమానంతో హాల్లోకివచ్చి నిలబడ్డాడు. కోపంతో అతని పెదవులు వణకుతున్నాయి. వెళ్ళిపోదాం అనుకున్నాడు. కాని "సుబ్బారావ్" అంటూ పరుగెత్తుకువచ్చింది సుమిత్ర." "క్షమించు-తొందరలో నీ మాట మరచిపోయాను. ప్లీజ్, ఎక్స్‌క్యూజ్‌మి" అంటూ అతని చెయ్యి పట్టుకుని తీసుకువచ్చి తన కుర్చీపక్క మరోకుర్చీ వేయించి "నా క్లోజ్ ఫ్రెండ్ (ఆప్తమిత్రులు) సుబ్బారావ్" అని అందరికీ పరిచయం చేసింది. సగర్వంగా సహాసంగా నెపోలియన్ సైనిక వందనాన్ని పొందుతూన్నట్టుగా సుబ్బారావు నలుదిక్కులా చూశాడు.

ఛీ—ఎంత అపార్థం చేసుకున్నాడు సుమిత్ర అమృత హృదయాన్ని. ఎంత అల్పుడు తాను. ఎంత సంకుచిత మనస్సు గలవాడు! సుబ్బారావు సుబ్బారావునే క్షమించనని నిక్కచ్చిగా చెప్పేశాడు. అందరూ బహుమతులుఇచ్చి వెళ్ళిపోయాక సుమిత్ర ఒంటరిగా ఉండగా చూసి తను తీసుకువచ్చిన ఉంగరం—ఆమెకిచ్చాడు.

"ఎంత మంచివాడవు సుబ్బారావు" అంది కృతజ్ఞతతో సుమిత్ర. "రా అలా బాదంచెట్టుక్రింద కూర్చుందాం కాస్సేపు."

ఆ వచ్చినవాళ్ళెవరో, ఎవరికెన్ని మేడలు లేక కార్లు లేక నగలు ఉన్నాయో. ఎవరి కొడుక్కెంత కట్నం వచ్చిందో, ఏ యే అమ్మాయిలకి పెళ్లి అయిందో, కొందరి కెందుకవలేదో-ఇటువంటివన్నీ గబగబా ఉత్సాహంగా సుమిత్ర చెప్పేస్తోంది. సుబ్బారావుకి తను అడగాలన్న విషయం ఎలా ప్రారంభించాలా అని అనుమానం, అంతకన్న ఏదో భయం-"నువ్వు సామాన్య మేస్టారువి" అంటుందేమోనన్న దిగులు....

"ఒక పాట పాడు సుబ్బారావ్, ఇందాకటి పార్టీకి తలనొప్పి వచ్చేసింది." అంది వెల్లకితలా పడుకుని అందాల యౌవనాంగి సుమిత్ర.

సందేహభారంతో బరువెక్కిన గుండెగల సుబ్బారావు "ఈవేళ పాడలేను సుమిత్రా" అన్నాడు.

"పోనీలే—నేను రేపు వెళ్లిపోతున్నాగా" అంది బుంగమొహం పెట్టి.

"నువ్వు వెళ్ళిపోతే నాకేం తోచదు" అన్నాడు సుబ్బారావు ధైర్యం చేసి.

"నిజంగా!"

"నా కంతా శూన్యంగా వుంటుంది." సుబ్బారావు గొంతు గాద్గదికమైంది.

"నీ మనస్సు నాకు తెలియదా! నాకు మాత్రం! నువ్వు స్తమానం జ్ఞాపకం వస్తూంటావు."

ఈ సమాధానం మళ్లీ అతని గుండెని తేలికపరచింది.

"పాడు. సుబ్బారావు-ఒక్క-పాట పాడుదూ"

ఏదో దీనంగా జాలిగా అడిగినట్లనిపించింది సుబ్బారావుకి. అతనిలో రాబోయే వియోగవేదన అంతా యిప్పుడే పెల్లుబికినట్లయింది. సహజంగా విషాద మధురమైన గొంతు వచ్చేసింది. ఆ చీకటిలో అతని కంఠస్వరం రాలిపడుతూన్న తారల దుమ్ములాగా, బాదంచెట్టు ఆకులమీద నుంచి జారి పడుతున్న చిరుగాలి ఏడుపులాగా హృదయాన్ని బాధగా సోకుతోంది. 'ఓ వసంతమా, నువ్వు దూరంగా వెళ్లిపోతున్నావు. నా మనస్సు వర్షాకాలపు

దుఃఖపునీటితో నిండిపోయింది. ఇంక భయంకరమైన హేమంతం వస్తోంది. నేను ఆశలనే ఆకులని రాల్చుకుని మోడునై పోతున్నాను. నశించిపోతున్నాను' అని ఆ పాట అర్థం. ఆ పాట ఒక చెట్టు పాడిన పాట అని వేరే చెప్పనక్కర్లేదు.

ఆ చెట్టును తానే అనుకున్నాడు సుబ్బారావు. అనుకుంటూనే విలవిలలాడిపోయేడు.

పాట ఆపి మొహం పక్కకి తిప్పడంలో పోర్టికోలోని విద్యుద్దీపప్రకాంతి అతనిమీద పడింది. అతని కళ్ళమ్మట అశ్రువులు జారడం సుమిత్ర చూసింది.

"అదేవిటి సుబ్బారావు. ఏడుస్తున్నావా, ఛ!" అంది సుమిత్ర.

సుబ్బారావుకి ఏదో అభిమానం ముంచుకొచ్చింది. ఏడవడంవలన తాను సుమిత్రకి లోకువై పోతాననుకున్నాడు. ఎప్పుడూ గంభీరుడూ ధీరుడూ అయిన నాయకుణ్ణి వరిస్తారు కదా అందమైన సుందరీమణులు. అందుకోసం పెద్ద అబద్ధం ఆడేశాడు.

"ఇది నాలో ఒక విషాదస్మృతిని రేపింది సుమిత్రా."

"ఏమిటదీ–"

"నా మిత్రుడీపాట పాడేవాడు. అతని దగ్గరే నేనిది నేర్చుకున్నాను. అతను తర్వాత పాపం–చచ్చిపోయాడు."

"అరెరె!" అంది సుమిత్ర "నీది ఎంత సున్నితమైన మనస్సు సుబ్బారావ్."

కాని సుబ్బారావు చాలా బాధపడ్డాడు. ఆమె సానుభూతిని తనమీద నుంచితన స్నేహితుడిమీదికి ఫోకస్ చేశాడు, తెలివితక్కువవల్ల. ఈ పాట బెంగుళూరు వెళ్లిపోయే ఆమెని గురించే అనీ, ఆ ముక్కలై పోతూన్న హృదయం అచ్చంగా తనదేనని చెప్పివుంటే–ఈ 'అయితే' అన్న ప్రశ్న సుబ్బారావు చరిత్రలో సమాధానంలేని క్లిష్టసమస్య అయిపోయింది

"నువ్వు బుల్‌బుల్ వాయిస్తూ పాడితే ఎంతో బావుంటుంది'' అంది సుమిత్ర.

"నీకు బుల్‌బుల్ యిష్టమా?"

"చాలా యిష్టం."

"అయితే ఒకటి కొంటాను."

"కాదు కాదు. ఇక్కడ మంచివి ఉండవు. బెంగుళూరు వెళ్ళగానే కొని నీ పేర పార్సెల్ చేసి పంపిస్తాను. నేను వచ్చేటప్పటికి బుల్ బుల్ మీద నువ్వు పాడాలి సుమా!"

"ఓ-తప్పకుండా'' అన్నాడు సుబ్బారావు.

తర్వాత రోజున మఫ్లర్ మొహానికి చుట్టుకుని, ముంగురులు చలి పిగా నొసట నాట్యం చేస్తూంటే, తెల్లని పలువరుస కన్పించేలా నవ్వుతూ గుడ్‌బై చెబుతూ, చేరుమాలు ఊపుతూ రైలులో కనుచూపు మేరదాకా వెళ్ళిపోయే సుమిత్రని చూసి చూసి బరువుగా నిట్టూర్చి అంతకన్నా బరు వుగా అడుగులు వేసుకుంటూ వచ్చేశాడు సుబ్బారావు.

ప్రకృతీ ప్రజలూ అందరూ నిరానందంగా కనిపించారు సుబ్బారావుకి. అదే కాదు, అతని మనస్సు ఓ అఘాయిత్యంతో నిండిపోయింది.

"చూశావా సుబ్బారావు. ఈ 'లాంబ్రేటా' మోటార్ సైకిల్ మొన్ననే కొన్నాను. ఎలా వుంది?" అన్నాడొక క్లాసమేటూ ధనికుడూ అయిన మిత్రుడు.

'తప్పకుండా ఏక్సిడెంట్ అయి చచ్చిపోతావు' అందామనుకున్నాడు కాని పేలవంగా నవ్వి "బాగుంది" అన్నాడు.

"సుబ్బా, నీ కోసం కష్టపడి పెట్టానురా వడియాలు" అంది తల్లి.

"తీసుకెళ్ళి గోదావరిలో పడెయ్యి" అన్నాడు విసురుగా సుబ్బారావు. తల్లి విస్తుపోయింది.

"అన్నయ్యా పువ్వులజడ అల్లుకున్నాను చూడు" అని జడని ముందుకు వేసుకుని గర్వంగా చూపించింది చెల్లెలు.

"చదువు సంధ్యా లేదు కాని పువ్వుల జడలు! ఊరికే యింతింత జుట్టు పెంచుకోవడమూ. వాటికి అత్తర్లూ, పువ్వులూ-నీకు క్రాపింగ్ చేయించి పారేస్తానుండు" అని విసురుగా వెళ్ళిపోయాడు.

సుమిత్ర ఊళ్ళో లేనిదే యింత విప్లవం కలుగుతుందని ఎవరు లనుకుంటారు? ఆహారం రుచించక, ఏకాంతం పడక, నలుగురిలో తోచక, రాత్రిళ్ళు నిద్రపట్టక, పగలు ఎప్పటికీ రాత్రి అవక - చిక్కిపోతున్నాడు సుబ్బారావు. అయిదవరోజున సుబ్బారావుకి పార్సెల్ వచ్చింది. అతని

మొహం కళకళలాడింది. రోజూ నదివొడ్డుకి పోయి అదేచోటులో కూర్చొని బుల్‌బుల్ సారించేవాడు. పాటపాడేవాడు. తాటితోపు తల ఊపేది. నదిలో నీళ్ళు ఆనందంతో జలజలమని చప్పుడు చేసేవి.

సుబ్బారావు ప్రేమికుడు. ఇది ప్రేమ తపస్సు.

"ఏరా, అడిగావా ఆ అమ్మాయిని పెళ్ళిమాట?" అన్నది తల్లి ఒక రోజున. ఏమిటో మధ్యమధ్య ఆమెకి అనుమానం ఎక్కువౌతూంటుంది. ఒక నెల్లాళ్ళు సెలవుపెట్టాడు కొడుకు. తాకట్టుమీద తెచ్చిన డబ్బు అయిపో వచ్చింది. ఎండమావుల్ని నమ్ముకుని ఎన్నాళ్ళు బతకడం - ఇదే ఆమె సందేహం.

కాని ఆమె 'బుల్ బుల్' పంపడమూ, ఆమె ఉత్తరంలో 'మా మేనత్తతోనూ, బావతోనూ నీ మాటే చెబుతూంటాను' అని వ్రాయడమూ ఇది తిరిగి ఆమెకి ఆశనీ ధైర్యాన్నీ కలిగించాయి. ఆ ఏడుకొండలవాడే తలుచుకుంటే ఓడలు బళ్ళూ బళ్ళు ఓడలూ అయిపోవా.

అలాగ పాడుకుంటూ, ఆలోచించుకుంటూ రోజులు గడుపుతున్నాడు సుబ్బారావు.

కాని కాలం సరిపోయేది కాదు సుబ్బారావు ఆలోచించుకోడానికి. కాలం యిరుకుగా పాత కలకత్తా గల్లీలాగ వుంది. పాపం ఎన్ని ఆలోచించుకోవాలి తాను. సుమిత్రతో తానింతవరకు గడిపిన ప్రతి క్షణమూ జ్ఞప్తికి తెచ్చుకునేవాడు. ప్రతీ మాటా తనలో తను అనుకునేవాడు. ఆమె ప్రతి కదలికనూ ఆలోచించుకొని తన్మయత్వం పొందేవాడు.

ఇంక ఎన్నాళ్ళకి వస్తుందో సెకనులతో సహా లెక్కపెట్టేవాడు. వచ్చిన తర్వాత బెంగుళూరు చల్లని గాలికి ఆమె వొళ్ళూ మొహమూ యింకెంత అందంగా అవుతాయో, తన వివాహప్రతిపాదనకి ఎలాగ సిగ్గుపడి ఓరగాచూస్తూ 'అలాగే' అని అంగీకారం సూచిస్తూ నవ్వుతుందో, తమ దాంపత్యజీవితం .... ఓ రోజున సుమిత్రకి వేవిళ్ళని అమ్మ వచ్చి తన చెవిలో ఊదటం కబుర్లు, ముద్దులూ, కౌగిలింతలు, సర్దాలు, పొలఅలకలు, షికార్లు....

ఫక్కున నవ్వుకున్నాడు సుబ్బారావు. బల్లమీద అద్దంలో మూడూ బై అయిదవవంతు అతని ప్రతిబింబం కూడా ఫక్కున నవ్వింది.

సెకండరీ గ్రేడు స్కూలు టీచరు సుబ్బారావు మిల్ ఓనర్ కోటీశ్వరరావుగారి అల్లుడు.

మూడూ బై అయిదవవంతు అద్దంలోకి అరమోడ్పు కన్నులతో చూశాడు సుబ్బారావు.

భవిష్యత్తుని గురించిన ధీమా ప్రాణవాయువులా వెళ్ళి అతని ఛాతీని రెండంగుళాలు పెద్దది చేసింది.

అతని యౌవనం అందమైన స్వప్నాన్ని దండగా అల్లి అతని మెడలో వేసింది.

స్వప్నాలు నిజాలు కాబోయే ఆ క్షణంకోసం అతను జీవితపు మెయిన్ రోడ్డుమీద నిలబడి చూస్తున్నాడు.

అలా చూస్తూ నిలబడి వుండగా పోస్టుమన్ ఉత్తరం తీసుకువచ్చి ఇచ్చాడు. ఆతృతతో విప్పి చదివాడు :

"రేపు మధ్యాహ్నం బండికి వస్తున్నాము. సాయంత్రం కలుసుకో —సుమిత్ర."

అతను చేసిన అస్పష్ట ఆనందరవానికి – కంగారుగా వెనకాల తల్లీ చెల్లెలూ వచ్చి నిలుచున్నారు.

"అమ్మా – సుమిత్ర రేపు వస్తోందమ్మా."

"సాయంత్రం నన్ను కలుసుకోమందమ్మా."

"అడిగి తేల్చేసుకుంటానమ్మా" గబగబా అనేశాడు సుబ్బారావు.

"ముహూర్తం త్వరగా పెట్టించెయ్యి ఏకంగా సెలవు పొడిగించవచ్చును. ఆ తరువాత నుంచీ స్కూలుకి మానకుండా వెళ్ళొచ్చును." అంది తల్లి.

అమాయకురాలైన తల్లికేసి ఎంతో సానుభూతితో చూచాడు. "ఇంకా నాకు ఆ వెధవ స్కూలు మేష్టరీయేనా అమ్మా."

"అదేమిట్రా. నెలకి కరకుల్లాగా ఎనభై రూపాయలు వస్తూంటే కాదంటావా.....నీకు మాత్రం యేదోపనిలేకపోతే యేం తోస్తుందీ." అంది తల్లి.

"ఎనభై రూపాయలంటే నీకూ, నాకూ, పక్కింటి బ్యాంకి గుమాస్తాగారికీ, అవతల ఇంటి టైపిస్టు స్వరాజ్యమ్మగారికీ గొప్పగాని.సుమిత్ర

కేమిటమ్మా. కోటీశ్వరరావుగారింట్లో నౌకర్లకి మూడువందల రూపాయల జీతాలమ్మా. సుమిత్ర సాదరు నెలకి అయిదు వందలయితే యింతతక్కువ ఖర్చు పెట్టుకుంటున్నావేం. ఒంట్లో బాగులేదా అని కూకలేస్తాడమ్మా వాళ్ళ ఫాదరూ!" అన్నాడు సుబ్బారావు.

"నిజంగా ?" అంది ముక్కుమీద వేలుపెట్టుకుని తల్లి.

సుబ్బారావుకి తిరిగి ప్రకృతీ, పరిసరాలూ అన్నీ రమణీయంగా కనుపించాయి. రాత్రి అంతా ఒక్కడూ బుల్‌బుల్ మీద హాయిగా ఏ సంకోచమూ లేకుండా ఎన్నో పాటలు పాడుకున్నాడు. తర్వాత రోజున చాలా ఆలస్యంగా పక్కమీదనుంచి లేచాడు. సూర్యకాంతి తెల్లగా వెచ్చగా రోడ్డుమీదా, రోడ్డు అవతలి తురాయి చెట్లమీదా, ఆఖరి తురాయి చెట్టుకొమ్మచివర వ్రాలిన పాలపిట్ట రెక్కలమీదా పడుతోంది బెదరూ బెంగాలేని ఏదో కొత్త లోకంలోకి వచ్చాననుకున్నాడు సుబ్బారావు.

అందంగా రెండుగంటలు ముస్తాబై సాయంత్రంవేళ బయలు దేరిన సుబ్బారావు హృదయం కొంచెం సంకోచంతో రెపరెపలాడినా, ఎక్కువగా ధీమాతోనే కొట్టుకుంటోంది. పేరూ, ప్రతిష్ఠా, హోదా. సావకాశమూలేని అతని జీవితం ఈ రోజున ప్రేమతో పునీతమై ఉన్నతమై నిలబడింది. ప్రేమించి - ప్రేమకోసం బికారులైనవాళ్ల చరిత్రని తాను చదివాడు. కాని ప్రేమతోపాటు సిరిసంపదకూడా పొందబోయే తన యీ అదృష్టం ఎక్కడ రాసిపెట్టివుంది? భగవల్లీల అంటే ఇది కదా. మనస్సులోనే భగవంతుడికి వినమ్రుడై ప్రణామ మాచరించాడు.

"హలో - సుబ్బారావు" సరదాగా నవ్వుతూ చెయ్యి ఊపింది సుమిత్ర. ఈ రెండుమూడు వారాలకే కొత్తగా మరింత అందంగా కనపడింది. తలంటుకొన్న ఆమె శిరోజాలను గుబురుగా చేర్చి కట్టిన గులాబి రంగు రిబ్బను అదేరంగు మెడమీదపడి ముద్దువస్తోంది.

"సుమిత్రా" అన్నాడు సుబ్బారావు.

గబగబా ముందుకువచ్చి సుమిత్ర ఎంతో ఆప్యాయంగా కరచాలనం చేసింది.

"అరె! బుల్‌బుల్ కూడా తీసుకువచ్చావే." నవ్వింది.

"నీకు పాడి వినిపించాలిగా"

"అవును- అప్పుడే మరి సాధిక చేశావా ?"

"నా కిదివరకు వాయించడం వచ్చును."

హాల్లో, సోఫాలో, కూర్చున్నారు.

"ఏమిటి మన ఊరు విశేషాలు?" అంది సుమిత్ర.

"ఏముంది. నాకేం తోచలేదు. స్కూలుకి కూడా శెలవు పెట్టానుగా."

"బెంగుళూరులో నేనూ మా బావ కారులో డః—— తిరగడమే నేన స్తమానూ నీ కబుర్లు చెపుతూంటే 'ఎవరాయన' అనేవాడు. నా బెస్టు ఫ్రెండు అనేదాన్ని."

"మీ బావనుకూడా తీసుకురాకపోయ్యావా?" అన్నాడు నోప్సిర్పిగా సుబ్బారావు.

అదేమిటో సుమిత్ర చటుక్కున సిగ్గుపడింది. ఒక సెకనులో నవ్వుతూ అంది. "మా బావా, అత్తా అందరూ మాతో వచ్చారుగా. రా, నిన్ను పరిచయం చేస్తాను" అంటూ సుమిత్ర, మొదట సుబ్బారావుకి పరిచయం కలిగించిన పడకగదిలోకి తీసుకువెళ్ళింది. ఇదివరకు సుమిత్ర పడుకున్న మంచంమీద వెల్వెట్ దిండ్ల నానుకుని ఒక యిరవై ఎనిమిది సంవత్సరాల యువకుడు సిగరెట్ పొగ సాఫీగా వదలుతూ పడుకున్నాడు.

చామనఛాయగా, బలంగా ఉన్నాడు, కళ్ళు చిన్నవి. జుట్టు పల్చగా నొసలుదగ్గర-కళ్ళకి జోడు. మాంచి ఠీవిగా మాత్రం ఉన్నాడు.

"బావా, ఇతనే నేను చెప్పిన సుబ్బారావు!"

కరచాలనం, కుశల ప్రశ్నలూ అయాక తీరికగా కూర్చున్నారు.

సుబ్బారావు నిట్టూర్చాడు——హమ్మయ్య అని.

ఎందుకు ?

అతను తనంత అందగాడు కానందుకు. ఇంక ఫీల్డుమీద శత్రువులు లేరు తనకి! లోపల ఎక్కడో భయంభయంగా దాక్కున్న ఆ సంకోచం కాస్తా తొలగిపోయింది.

అత నేవేవో కబుర్లు అమెరికాని గురించి. ఫ్రాన్సుని గురించి చెప్పాడు.

'చాలా మంచివాడు. నిగర్వి' అనుకున్నాడు సుబ్బారావు.

"పేరు బుల్‌బుల్ మీద పాడతానని మాటిచ్చారుటగా సుమిత్రకి. మరి పాడండి. ఆ ఆనందంలో నేనూ కొంత పాలు పంచుకుంటాను."

"ఇప్పుడెందుకులెండి" సిగ్గుపడ్డాడు సుబ్బారావు.

"ఊహు. పాడాలి సుబ్బారావు" అడిగింది సుమిత్ర ఆప్యాయంగా. ఆ గొంతు, ఆ చూపు, ఆ తియ్యదనం-వాటికోసమే బతికాను అనుకున్నాడు సుబ్బారావు. బుల్‌బుల్ మీటుతూ పాడాడు.

చిరుచీకటి గదినిండా వ్యాపిస్తూండడం ఎవరూ గమనించలేదు. అతని పాటలోని భావమూ, మధురిమా ఆ మునిమాపులో శ్రోతలిద్దర్నీ అవ్యక్తానుభూతులతో నింపివేశాయి.

కాస్సేపటికి రాఘవరావు-సుమిత్ర బావ-నవ్వుతూ అన్నాడు.

"లైటు వేయడంకూడా మరచిపోయావు సుమిత్రా."

"అరె! సుబ్బారావు పాడితే నే నేదోలా అయిపోతాను." అంటూ సుమిత్రలేచి లైట్లు ఆన్ చేసింది.

"మీ స్నేహాన్నే ఎప్పుడూ కోరుతాను, మీ పరిచయం కలగడం నా అదృష్టం" అన్నాడు రాఘవరావు సుబ్బారావుతో.

"ఎంత మాట"

"ఇంకా యీ పూళ్ళో నెల్లాళ్ళవరకు ఉండాలి కదా. మీరు రోజూ వస్తూ పోతూండాలి. ఏమంటావు సుమిత్రా" అంటూ సుమిత్రవైపు చూశాడు రాఘవరావు.

"అవును తప్పకుండా" అంది సుమిత్ర.

రాఘవరావు మంచందిగి సుబ్బారావుతో కరచాలనంచేసి, "మామగారితో మాట్లాడవలిసిన పనివుంది ఎక్స్క్యూజ్‌మి. సుమిత్రా, నీ చేత్తో నువ్వే సుబ్బారావుగారికి శుభలేఖ ఇయ్యి. ఇంకా కొన్ని శుభలేఖలు ఆయన చేత టీచర్లకి, వాళ్ళకి పంపిస్తానన్నావుగా" అంటూ అద్దం ముందు నిల్చుని తల దువ్వుకుంటున్నాడు.

సుమిత్ర కొంచెం సిగ్గుతో కొంచెం నవ్వుతూ "అవును తీసుకువస్తా. అంటూ లోపలికి వెళ్ళి ఓ నిముషంలో ఒక కట్టనితీసుకు వచ్చి సుబ్బారావు చేతిలో పెట్టింది.

శుభలేఖని చూసిన సుబ్బారావుకి కళ్ళు చీకట్లు కమ్మాయి. ఎవరో నెత్తిమీదనుంచి ఒక పెద్ద మేకుని గుండెలదాకా కొట్టినట్టయింది. అతని కడుపుని చీల్చి పేగుల్ని యివతలికి లాగితెంపేస్తోన్నట్టు అనిపించింది. చావుకన్న భయంకరమైన అనుభవం అతనికి హఠాత్తుగా కలిగింది. పిడుగుపడిన వాడిలాగా నిశ్చేష్టుడై నోట మాటలేక అలా ఉండిపోయాడు.

"అదేం సుబ్బారావ్. ఈ మాత్రం సహాయం చెయ్యలేవా. చూడు నీ మేరేజ్‌కి నేను ఎంత ఏక్టివ్‌గా ఉంటానో" అంది నవ్వుతూ సుమిత్ర.

"వస్తానండి గుడ్‌నైట్" అంటూ తల దువ్వుకోవడం పూర్తి అయిన రాఘవరావు గదిలోంచి వెళ్ళిపోయాడు.

"అదే, అలా తెల్లబోయి నుంచుంటావేం! ఇంకా కంగ్రాచ్యులేషన్సు చెప్తావనుకుంటున్నాను" అంది ఆశ్చర్యంతో సుమిత్ర.

నీటిలోని ప్రతిబింబంలాగా సుమిత్ర రూపం కళ్ళఎదుట చెదిరి పోతోంది. చుట్టూవున్న గోడలు కరిగి కూలిపోతున్నాయి. చర్మరంధ్రాల్లోంచి రక్తం బయటకి చిమ్మేస్తుంది. కాస్సేపటికి కుర్చీలో కూలబడి "ఎంతపని చేశావ్ సుమిత్రా" అన్నాడు బొంగురుగా ఏడుపుగా.

"ఏం ముందుగా నీకు చెప్పలేదనా కోపం సుబ్బారావూ? నన్ను క్షమించు" జాలిగా తీయగా అడిగింది సుమిత్ర.

"కాదు, నిన్ను నేను ప్రేమించాను. నన్ను పెళ్ళి చేసుకుంటావను కున్నాను"-అన్నాడు సుబ్బారావు. ఎలా అన్నాడో తనకే తెలియదు.

"నిన్నా!" ఈసారి సుమిత్ర ఆశ్చర్యంతో స్తంభించి పోయింది. ఆమె కొక్కసారి పరిస్థితి అంతా అవగాహన అయింది. కంగారు పడింది. కాని ఆడవాళ్ళకుండే ఒక గొప్ప సౌలభ్యంతో మామూలు మనిషై. సాదాగా నవ్వుతూ యిలా అంది "సెకండరీగ్రేడు మేష్టరువి సుబ్బారావు. నీ కిచ్చి నాన్న ఎలా పెళ్ళి చేస్తాడనుకున్నావు."

"నిన్ను నేనెలా పెళ్ళిచేసుకుంటాను" అని అంటే ఆమె స్త్రీలకి ప్రతినిధి కాకపోను. అక్కడే ఆమె చాతుర్యం ఉంది. ప్రయత్న పూర్వకంగా అలాగ ఆమె అనలేదు. అలాగ తండ్రిని అడ్డంపెట్టి మాట్లాడాలనే ఔచిత్యం ఆమెకి సహజంగానే అలవడింది.

"సుబ్బారావు."

.... .... ....

"నువ్వంటే నాకు ఎంత స్నేహభావం! ఆ స్నేహమూ ఈ అనురాగమూ ఏమీ కాదా! కోపమా సుబ్బారావు. నా మేలునీ, అభివృద్ధిని కోరేవాడివి కదా. ఏదీ ఒట్టువెయ్యి మన మైత్రికి ఏ అంతరాయమూ కలగదనీ."—

కళ్ళల్లోకి చూస్తూ అనునయంగా అడిగింది సుమిత్ర.

ఒట్టువేశాడు సుబ్బారావు, తనకి తెలీకుండానే.

"ఈ శుభలేఖలు మనవాళ్ళకి యిచ్చి వేస్తావుకదూ. రేపు సాయంత్రం స్కూలు వదలగానే వచ్చెయ్యాలి సుమీ. నేనూ బావా నీకోసం కనిపెట్టుకుంటాం. అదుగో నాన్న పిలుస్తున్నాడు. వస్తా—ఏం, వెళ్ళనా సుబ్బారావు."

తల ఊపాడు సుబ్బారావు.

"అమాయకుడివి సుబ్బారావు" అని అతని భుజంమీద చెయ్యివేసి వెళ్ళిపోయింది సుమిత్ర.

ఒక చేత్తో శుభలేఖల కట్టతో; ఒక చేత్తో గుండెల్ని పట్టుకుని మతిలేనివాడిలాగ గదిలోంచి హాల్లోకి, హాలులోంచి వీధిలోకి వచ్చాడు సుబ్బారావు గోపి "మాష్టారూ" అని వేసిన కేక అతనికి వినపడలేదు. అప్పుడే బాగా చీకటిపడింది. నల్లని తారురోడ్డు మీద విద్యుద్దీపాలకాంతిలో మగతగా నడుస్తున్నాడు సుబ్బారావు. ఎక్కడికి వెళుతున్నాడో అతనికి తెలియదు. ఏవో మలుపులు తిరుగుతున్నాడు. ఎక్కడికో వెళుతున్నాడు. కొంతసేపటికి ఊరిచివరకి వచ్చాడు. అక్కడనుంచి తానూ సుమిత్రా షికారుకువచ్చే నదివొడ్డుకి వచ్చాడు. అక్కడ అంతా చీకటి. ఏవో కీచురాళ్ళ కూతలు. ఎవరో పరుగెత్తుతూన్నట్టు అస్పష్టమైన ధ్వనులు. ఆకులు—రాలిన ఆకుల లోంచి తొండలు కదలిన చప్పుళ్ళు. నీరసంగా శూన్యంగా ఉన్న చీకటి. అలాగే వెర్రివాడిలా నుంచునిపోయాడు. అతని క్షుభితమనస్సుతో ఏ సంబంధమూ లేకుండా నది చిన్న చిన్న అలలతో ప్రశాంతంగా ప్రవహిస్తోంది. తాటితోపులో చీకటి మరింత చిక్కపడుతోంది.

సుబ్బారావు ఒక్కసారిగా చేతిలోంచి శుభలేఖల్ని జారవిడిచి బాపురు మన్నాడు. అతను మొహం రెండు చేతులతోనూ కప్పుకుని ఏడ్చాడు. నేల మీద కూలబడి ఏడ్చాడు. అతనికి ఏడుపు ఆగలేదు. వెక్కి వెక్కి ఏడ్చాడు.

ఆ ఏడుపు అక్కడి చప్పుళ్ళతో కలసి మళ్ళీ విడిగా తడిగా వినబడు తోంది.

ఎదురుగా నదిలో నక్షత్రాలు మినుకు మినుకుమంటూ ప్రతిబింబిస్తు న్నాయి. అతని వెనుకాలనే తాటిచెట్లు విధి నియోగించిన రక్షక భటులలాగ నిశ్శబ్దంగా కఠినంగా నిలబడి ఉన్నాయి.

జాలిగా తల్లిలాగా సుబ్బారావుని చీకటి చుట్టుకుంది.

*(1961)*

# సముద్రపు అంచులు

మసక మసక చీకట్లో పల్లెవాళ్ళ గుడిసెలన్నీ చిన్ని చిన్ని పడవల్లా వున్నాయి. ఇక్కడా అక్కడా యిసుక నేలమీద కూర్చుని పొడుగాటి చుట్టలు కాల్చుకుంటూ పల్లెవాళ్ళందరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. దూరంగా సముద్రపుహోరు వినబడుతోంది. సముద్రం మీదనుంచి వచ్చే చల్లని ఉప్పని గాలికి గుడిసెలమీద ఆకులు కదలి చప్పుడు చేస్తున్నాయి. చూరులోంచి నల్లనల్లని పొగా చేపల కూరవాసనా రుచిరుచిగా వెగటువెగటుగా వస్తున్నాయి.

ఈ మధ్య వీరయ్య వాళ్ళందరితోనూ కలవడంలేదు. తన గుడిసె ముందు ఒక పెద్ద బండరాయిమీద కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. తమ్ముడు సూకయ్య ఆరేసిన చేప లన్నిటినీ యీతాకు బుట్టలలోకి ఎత్తుతున్నాడు. అక్కడికి కొంచెం దూరంలో మీసాల వెంకన్ననవ్వు బొంగురుగా గోదురుకప్ప అరచినట్లు వినవస్తోంది.

"ఓ మాఁవా, నా వొల్లు నీ వొల్లుకి తగిత్తే నీ జబ్బు ఒదల్తది" అన్న నరసమ్మ ఆడగొంతు సన్నగా విభిన్నంగా వినబడుతోంది. ఆ గుంపు కాని, వాళ్ళ కులాసాగాని వీరయ్యని ఆకర్షించలేదు.

"అన్ని చేపలూ లోపలెట్టాను. మరేంటి సేసేది?" అన్నాడు సూకయ్య చేతులు దులుపుకుంటూ.

"ఏంటీ లేదు." వీరా తమ్ముడి కేసిచూసి అన్నాడు. "ఎల్లిగంజార్చు. నా కాకలేత్తంది."

నూకయ్య గుడిసెలోకి వెళ్ళిపోయాడు. వీరయ్య తన ఆలోచనలో ఆగినచోటు కనుక్కొని ముందుకు సాగాడు.

వీరయ్య అదృష్టం యీవాళ పండింది. తన జీవితంలో అన్ని చేపలు ఎన్నడూ తను చూడలేదు. పెద్దవీ, చిన్నవీ రంగురంగులవీ బలిష్టమైనవీ, తన గుడిసె పట్టనన్ని చేపలు దొరికాయి. రోజూ ఏమప్పుగా వెళ్ళిపోయే తన బ్రతుకులో ఏదో ఆశ కదలి మిలమిల లాడింది. పెద్ద చేపకు రెండు రూపాయలు తక్కువరావు. తనకున్న చిల్లర అప్పులూ, బాకీలు అన్నీ తీర్చుకోవచ్చును. పైగా పొరుగూళ్ళో దగ్గుతో బాధపడే ముసలి తండ్రికి ఓ దుప్పటీ, తమ్ముడికి రెండు లుజార్లూ కొంటాడు. చంద్రికి-తక్కువలో వస్తే ఎర్రంచుల ఆకుపచ్చచీర ఒకటి కొంటాడు.

ఈవేళ బాబు దగ్గరుంటే ఎంత సంతోషించును! పుట్టినప్పట్నుంచీ యిక్కడే వుండి ఈ చేపల నమ్ముకుంటూ తింటానికి తిండిలేక—పాపం, చివరికి కీళ్ళజబ్బు వచ్చి ఊరుకాని ఊళ్ళో ఒక్కడూ వుంటున్నాడు. సత్తెమ్మ మాత్రం ఏదో యింత కాచిపోస్తోంది.

ఊరు విడిచి వెళ్ళిపోతూ యిలా అన్నాడు బాబు, "అబ్బీ! ఈ సముద్రం నా పానాలు మింగేసింది. ఈ మామ్మారిని వదలి కూలి పని చేసుకో కుర్రాడా."

నిజంగా యీ సముద్రం అంటే తనకీ ఎంతో భయం. చిన్నప్పట్నుంచీ ఈ సముద్రాన్ని తానెరుగును—ఆ యిసుకవొడ్డునీ బలంగా కోపంగా వస్తూ తక్కున విరిగిపోయే కెరటాల్నీ, లోతులకి చొచ్చుకుపోయే నీలాల్నీ, లోతు లోతుల్నీ మెరకల్నీ అతనెరుగును. యింకా సూరీడు దూరంగా సముద్రంలోంచి ఎర్రగా పైకి లేవకముందే పడవ చెక్క లమర్చుకుని, నూకయ్యను కూర్చోపెట్టుకుని నీళ్ళల్లోకి వెళ్ళిపోతాడు. కొండ అంచులు తడిసిపోయే చివరికంటా వెళతాడు. వలవేస్తూ తీస్తూ, సంజెవేళకి ఒళ్ళంతా నొప్పులతో కొత్తగా భయంగా భూమ్మీద అడుగు పెడతాడు. శ్రమ తప్ప ఏమీ లాభం కనపడలేదు. ఏమైనా ఉన్నట్టయితే పన్నులు వసూలు చేసే చౌదరి ఆ కాస్తా కాజేస్తాడు.

అటువైపంతా భూమి! అంతులేని భూమి. పచ్చగా నల్లగా గట్టిగా ఎక్కడికో ఎక్కడికో పరచుకొని కోట్లకొలది జనానికి తల్లిలాగ ఆధారంగా

వుంది. ఆ భూమ్మీద వుండే వాళ్ళకి ఎందుకో బలమూ, నవ్వూ, కులాసా ఉంటాయి. తనూ. చంద్రీ యిటికలతో కట్టుకున్న ఓ చిన్న యింట్లో వుంటే—

మరి తను ఎందుకు భూమి అంతమయిందని తెలిపే ఇక్కడ.... ఈ జాలిలేని సుఖం లేని సముద్రపు ఉప్పని నీళ్ళల్లో తన తిండిని వెతుక్కుంటున్నాడు. ఆ సముద్రంలో వుండే చేపలలాగా తానుకూడా భూమ్మీదకి వెళ్ళి బ్రతకలేడా? ఇలాగ శ్రమపడి తనూ బాబులాగ అయిపోతాడా? మొన్న మొన్న రంగణ్ణి చూశాడు! తనలాగే మాంచి వయస్సులో ఉన్నవాడైనా, పెదవుల దగ్గర ఏడుపులాంటి నవ్వూ, కళ్ళ చుట్టూ నల్లని ముసలితనం వేలాడుతూండడం చూస్తే తనకి బెంగా, దిగులూ కలిగాయి. చాదరి మొన్న పెళ్ళాంతో పిల్లలతో షికారు వచ్చాడు. నిండుగా పచ్చగా గుమ్మడి తీగలాగా ఉన్నారు. దేబరితనం విసుగూ రోతా వాళ్ళ మొహాల్లో లేవు. తనకీ అలా వుండాలనిపించింది. మీసాల వెంకన్నలాగ పెళ్ళి చేసుకోక ఒళ్ళు పాడైపోయిన నీతిలేని నరసమ్మ చుట్టూ తిరుగుతూ అసహ్యంగా మోటుగా అయిపోతే! ఛీ ఆ నరసమ్మలో ఏముంది? పెద్ద పెద్ద రొమ్ములేసుకు తిరిగితే తను లోబడతా ననుకుంది కాబోలు, చంద్రి తనకి వుండగా యిలాంటి ముండల్ని తన దగ్గరకు రానిస్తాడా? సత్తెమ్మని చూస్తే తెలియడంలేదూ. బాబు పెద్ద పెద్ద కండల్నీ గుండెల్నీ తినేసింది.

వీరయ్య గుండెలో రూపాయలు చప్పుడయాయి. గట్టిగానవ్వాడు. నవ్వు గాలిహోరులో ముడతలు పడిపోయింది. గుడిసెలోంచి చేపలకూర వాసన వస్తోంది. ఇంతలో వెంకన్న వీరా యింటివైపు వస్తున్నాడు. వెనకాల ముగ్గురు నలుగురు బెస్తవాళ్ళున్నారు. నరసమ్మ ముందుగా నడుస్తూ ఏదో పాడుతోంది-చేతులు తిప్పుతూ.

"ఇయ్యాలే రేతిరికొత్తాను యీరయ్యమాఁవా" అంది నరసమ్మ. అందరూ నవ్వారు. వీరయ్య యేవగింపుతో "పోయేముండా" అన్నాడు. వెంకన్న ముందుకొచ్చి "ఏం. నీ సెందిరికన్న బాగూనేదూ?" అన్నాడు.

"దానితో సాటేంటి థూ!" అన్నాడు దూరంగా జరిగి వీరయ్య.

"ఈపు సెక్కెగుర్తది జాగ్రత్త" అన్నాడు వెంకన్న.

"ముందు నీ తలపు సూసుకో" నిర్లక్ష్యంగా అన్నాడు వీరయ్య. నరసమ్మ కొప్పు సవరించుకుంది. గాజులు గలగలలాడేటట్టు చెయ్యి వూపుతూ "సూర్తాంగా నీ సెంద్రమ్మ గుణం. నీకుతెలీకుండా అది...." అంటూ ముందుకు సాగిపోయింది.

వెంకన్న భళ్ళున నవ్వుతూ ఆమె వెనకాలే వెళ్ళాడు. "అబ్బో! మాలావు పెద్దమడిసే యీడు" అన్నాడు. అందరూ మరింత పెద్దగా నవ్వి అక్కణ్ణుంచి కదలి పోయారు.

కొంచెం కొంచెం వెన్నెల వస్తోంది. వెళ్ళిపోయే నరసమ్మనీ, వెంకన్ననీ చూస్తూ ఉండిపోయాడు వీరయ్య. తమ్ముడు గుడిసెలోంచి పిలాచాడు. వొళ్ళు విరుచుకొని నిర్లక్ష్యంగా నవ్వుకుంటూ లోపలికి వెళ్ళాడు.

వీరయ్యకి వడ్డించి సూకయ్య కుండపెంకులో తనకి అన్నం పెట్టు కున్నాడు. బుడ్డి దీపపు వెలుగులో యిద్దరూ విశృతంగా ఉన్నారు.

"ఎన్ని రూపాయ లొత్తయ్ నిజం సొప్పు" అన్నాడు సూకయ్య.

"యాభై."

"అమ్మో అమ్మో" సూకయ్య నోట్లో ముద్ద ముద్దలాగే వుండి పోయింది.

"ఆపు–ఆ యెంకన్న కళ్ళొండొసుకుంటున్నాడు" అన్నాడు వీరయ్య.

"ఏం సేస్తవ్ అంత డబ్బు?" అన్నాడు సూకయ్య. వాడి దృష్టి డబ్బుమీదే వుంది.

"నీకో లాగూ సొక్కా కుట్టిత్తాలే."

సూకయ్య గబుక్కున చప్పట్లు కొట్టాడు. ఎడం చెయ్యికూడా పులు సుతో తడి అయింది. తొందరగా కాళ్ళకి రాసేశాడు. ఇంక తన్ని పంచ భూతాలూ చులాగ్గా స్వంతంలాగ స్పృశించలేవు. తను వాటిని తొడుక్కుని తిరణాల కెళ్ళితే....!

"సెందిరికో సీర కొంటాను" అన్నాడు వీరయ్య.

"అమ్మో అమ్మో!"

"బాబుకో దుప్పటీ కొంటాను."

"అమ్మో అమ్మో!"

"పాపం బాబు ఏం సేత్తుండాడో ముసిలోడు."

సూకయ్య దిగులు పడ్డాడు. బాబుని చూడాలనే కోరిక వాడిలో చాలా కాలం నుంచి గూడుకట్టుకుని వుంది.

"మరి డబ్బంతా అయిపోయినాక ఏంటి సేసేది?" అన్నాడు నూకయ్య కాస్సేపు ఆలోచించి.

వీరా మొహం నల్లపడింది. డబ్బుతో యిదీ అదీ కొంటే ఇంక మిగిలేది ఏమీ వుండదనే జ్ఞానం చురుక్కున గుండెకి తగిలింది. తిరిగి డబ్బు లేక ఆ సముద్రపు నీళ్ళల్లో గెడవేసుకుంటూ పోవాలి. అలాగే బతికి నన్నాళ్ళూ పోతూవుండాలి. వీరయ్యకు కోపం వచ్చింది. కంచం ఓ పక్కకు విసురుగా తోసి యిలా అన్నాడు!

"ఏంట్రా నూకా, నీకూ కూడెట్టాలి. ముసిలోడికి డబ్బివ్వాలి. ఎపడు సేత్తాడిదంతా. తెచ్చిన కూంతా మీకే అయిపోతది. పో, నువ్వు వేరేపోయి నీ బతుక నువ్వుచూసుకో, నాకెందుకు మీ అందరి పూసూ."

అన్న హఠాత్ కోపం నూకయ్యకి అర్థంకాలేదు. ఏడుపు వచ్చింది. వీరయ్య యివతలకి వచ్చి బండమీద కూర్చుని చుట్ట ముట్టించాడు. తిన్న అన్నమంతా కడుపులో విరిగిపోయినట్టయింది. ఆ చౌదరి లాగ ఖర్చు పెట్టినా తరగని డబ్బు ఎలాగ సంపాదించడం? తన సెందిరిని మనవు సేసుకుని ఒక చిన్న యిల్లు కట్టుకోవడం ఎలాగ? ఈ సమస్యకి తుదీ మొదలూ తేల్చుకోలేక వీరయ్య నిస్సహాయంగా ఆకాశంలోకి చూస్తూ కూర్చున్నాడు.

గుడ్డివెన్నెల అంతటా ఆవరించుకుంది. పల్లెవాళ్ళ గుడిసెల నీడలు పొడుగ్గా సాచుకుని వున్నాయి. ఇసుకనేల తరంగాలులేని సముద్రుడిలాగ వుంది. ఓ ముసలివాడు కర్రని చప్పుడుచేస్తూ అడుగులో అడుగు వేసు కుంటూ వీరయ్య దగ్గరకే వచ్చాడు.

"ఓస్. గవరయ్య మావా, రా, రా" అంటూ లేచి ముసలాణ్ణి జాగ్రత్తగా బండమీద కూర్చోబెట్టాడు. గవరయ్య కళ్ళు కనపడవు. బాగా వంగిపోయాడు ముసలివాడై పోయాడు. "ఏరా యీరా, బాగా సేపలు పడ్డా యిటగా" అన్నాడు.

"ఏదోలే మావా."

"సరిసర్లే అందరూ యిదే మాట. జాగత్తరో అబ్బీ. పదిలంగా వుండు అందరికీ శానా కష్టంగా వుంది."

"ఆళ్ళదేం తిన్నానా?"

"ఈ మాట సొప్పటానికే వొచ్చాన్రా. పోతా పోతా" అంటూ ముసలాడు లేచాడు.

"మళ్ళీ అంతదూరం యెల్లలేవు. ఇక్కడే తొంగో మావా" అన్నాడు వీరయ్య.

"రోజూ మీ అత్త కల్లోకి వత్తందిరా. నన్నుకూడా రమ్మంటం దిరా" అని ఆగి గవరయ్య "బాబూ యిలారా" అన్నాడు. వీరయ్య దగ్గర కెళ్ళాడు. వీరయ్య వొళ్ళునిమురుతూ "ఇంక ఎప్పుడో జీవుడు లేచి పోతాడ్రా అబ్బీ, సత్తే నా గుమ్మందగ్గరే సత్తాను. అక్కడే మీ అత్తా పానం వదిలింది. ఓమారు నిన్ను సూద్దామని బుద్ధయింది. మనోళ్ళల్లో మీరే గదరా మిగిలిందీ ఏడీ నూకడు ? నిదరోనియ్యి, లేపమాకు" అంటూ వణకుతూ కర్రతో దారి చూసుకుంటూ గవరయ్య వెళ్ళిపోయాడు. వీరయ్య గుండెల్లో తెలీని బాధ కలిగింది. గవరయ్య చెల్లెలే తన తల్లి. మామ చెప్పి నట్టు మూడు నాలుగు కుటుంబాలు బందరు వదలి ఎప్పుడో ఈ పూరు ఎచ్చేశారు. ఇక్కడ ఒక్కొక్కళ్ళే సముద్రానికీ ఆకలికీ రోగాలకీ ఆహుతి అయిపోయారు. తనే మిగిలాడు. గవరయ్య మావకూడా చచ్చిపోతాడు. బాబుకూడా చచ్చిపోతాడు. గవరయ్య మావకి అత్తంటే ప్రాణంలో ప్రాణం. ఆమె పోవడంతో మతిలేనివాడై పోయాడు అత్త తనకి చేగో డీలు చేసిపెట్టేది అత్త చచ్చిపోయింది. అందరూ చచ్చిపోయారు. తన కెవరున్నారు? బారుమని ఏడవాలనిపించింది, కాని చంద్రి జ్ఞాపకం వచ్చింది. తమ్ముడు నూకడు జ్ఞాపకం వచ్చాడు. గబగబా గుడిసెలోకి వెళ్ళాడు. నూకడు నేలమీద పడుకుని నిద్రపోతున్నాడు. వాడి కళ్ళమ్మటకారిన నీటి చార బుడ్డిదీపపు వెలుగులో నల్లగా కనబడుతోంది; వీరయ్య పరీక్షగా చూశాడు. వాడి వళ్ళంతా ప్రేమగా తడిమాడు. అక్కడున్న నులకమంచం వాల్చి, తమ్ముణ్ణి రెండుచేతులతో ఎత్తి దానిమీద పడుకోబెట్టాడు. తానొక చదర తీసుకొని బయటికివచ్చి, యిసుకమీద పరిచాడు.

"చెంద్రి రాలేదేం యియ్యేల" అనుకున్నాడు గట్టిగా. ఇంకా ఆశతో ఆమెకోసమే అన్నట్టు చూస్తూ చదరమీద కూర్చున్నాడు.

# 2

వెన్నెల మరికాస్త వచ్చింది. నీడలు చిన్నవయాయి. పల్లెఅంతా నిశ్శబ్దంగా ఉంది. కొందరు మాత్రం యిళ్ళ కివతల యిసుకలో పడు కున్నారు. అర్థంలేకుండా అంతటా వ్యాపించిన ఆకాశాన్నీ చుక్కల్నీ చూస్తూ పడుకున్న వీరయ్యకి క్రమంగా నిద్రపట్టింది.

నిద్రామాయ మసక మసక మడతల్లో జడమైన వీరా మనస్సుని ఏదో తగిలినట్టయింది. కళ్ళు తెరిచాడు.

"అన్నె-ఏంటదీ" అన్నాడు బద్ధకంగా: కిలకిల నవ్వింది నరసమ్మ. "అపుడే నిదరేంటీ" అంది.

వీరా దూరంగా ఒ తిగిల్లాడు. చెవులు దాటి జుట్టు పడుతూంటే, వెనకాల ముడిచుట్టుకుని రవిక లేకుండా పైటకప్పుకున్న నరసమ్మని చూశాడు. తన కోసమని ఒక్కతే యిలా రావడం కొంచెం గర్వం కనిగించింది వీరయ్యకి.

"ఏం యిలాగొచ్చినావ్?"

"రాకూడదేంటీ!"

"పైట సరిగ్గా యేసుకో సిగ్గులేదూ."

"నీ దగ్గరేనా యీరయ్య మాఁవా."

నరసమ్మ దగ్గరగా జరిగింది. ఆమె చనువు వీరాని కంగారు పెట్టింది. కానీ అతనికి మీసాలవెంకన్న జ్ఞాపకం వచ్చాడు. ఏదో చీదరగా అనిపించింది.

"ఇయ్యాల మాంచిలాబం వత్తదేంటీ" అంది నరసమ్మ గోముగా.

"ఎంతలే - ఓ యాభై రూపాయలు" గర్వంగా అన్నాడు వీరయ్య.

"యెన్నెల బాగుం దీరయ్యమాఁవా."

వీరా మాట్లాడలేదు.

"ఇక్కడ నీ పక్కనే కూంత సేపు నడుం వాలుత్తా-ఏం?"

వీరా తటపటాయించాడు. నరసమ్మ నవ్వింది. దగ్గరగా వెల్లకిత్తలా పడుకుంది.

వీరా తన చిక్కని నల్లని మీసం సవరించుకున్నాడు. బిగువైన ఆమె రొమ్ముల గుండ్రని పిక్కలూ వీరా మనస్సుని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. వెన్నెలరాత్రీ, స్త్రీ సామీప్యమూ దృఢమైన అతని ఆరోగ్యమూ మనిషి హేతువును మించిన హేతువుకి ఉద్దీపకాలుగా వున్నాయి. ఇటూ అటూ చూశాడు, నిద్రలో నిశ్శబ్దంలో మునిగివుంది పల్లె అంతా. దూరాన గుడిసెలోంచి ఏదో సన్నని ఏడుపు వినవస్తోంది.

"కిందనే తొంగున్నావు నరసమ్మా. నా నదర తీసుకో" అన్నాడు వీరయ్య.

"ఒద్దులే."

వీరయ్య అతి ప్రయత్నంమీద మరొక పక్కకు తిరిగి "సాల్లే నీ యేసాలు. నాను లొంగేవాణ్ణి కాను" అన్నాడు. నరసమ్మ ఫక్కున నవ్వింది. ఆ నవ్వులో గొప్ప నేర్పూ ధీమా వున్నాయి. అతనిమీద వొరిగి కావలించుకుంది. "ఎంత కమ్మగున్న వీరయ్యమాఁవా" అంది.

"లేకపోతే యెదవ యెంకన్న నేంటే" అన్నాడు వీరయ్య. ఆమెను పొదవి పట్టుకొని గుండెలకు హత్తుకున్నాడు.

"ఈ పొద్దె మహసిక్కయింది" అంది నరసమ్మ.

"ఏంటే ..."

"నానున్న గుడిసె అద్దెకి నిక్కచ్చి సేత్తన్నాడు సిల్లిగవ్వనేమ."

"ఎంకన్న వున్నాడుగా."

"రోజూ కల్లోయిత్తాడుగా. ఇంకేం మిగులుద్ది ఆడిచగ్గర?"

నరసమ్మ కౌగిలి విడిపించుకుని పక్కకి జరిగింది. వీరయ్య రమ్మంటూ చేతులు చాచాడు.

"అద్దెమాట ఏం సెప్పావు మాఁవా?" అంది నరసమ్మ.

"రారా" అన్నాడు వీరయ్య.

"అయిదు రూపాయ లిప్పిత్తావా?"

"నా దగ్గర నేదు."
"అదేంటి మాఁవా, నీదాన్నికాదా?"
"నా దగ్గర నేదు."
"పోనీ మూడు రోపాయిలియ్యి కట్టం గడుపు."
"నా దగ్గర నేదు."

నరసమ్మ చివాలున లేచింది. "అయితే నేరాను" అంది విసురుగా. వీరాకి కోపం వచ్చింది, సిగ్గువేసింది, అసహ్యం వేసింది. వెన్నెల లాంటి చంద్రి నవ్వూ స్నేహమూ కళ్ళముందు నిలిచాయి. "పో పో ముండా. డబ్బుకోసం వొచ్చినావ్ పింజారిముండా. ఛీ! ఛీ!" అని అరిచాడు.

"ఉత్తనే అన్నాను మాఁవా" అంది నరసమ్మ పరిస్థితి చెయ్యిదాటు తోందని గ్రహించి.

వీరా లేచి చదరు తీసుకుని "ఛీ! నా గుమ్మంకాడనుండి పో. నిన్ను సూత్తేనే పాపం" అంటూ గబ గబా గుడిసెలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

బిత్తరపోయిన నరసమ్మ దగ్గరకి యెంకన్న చాటునుంచి వొచ్చాడు.
"ఏంటన్నాడూ!" అని అడిగాడు.
"ఇయ్యనేదు దొంగనాకొడుకు. కాని ఆడివొళ్ళు బలేగా వుంది."

# 3

తెల్లవారగానే పట్నంనుంచి వర్తకులు వచ్చారు. వీళ్ళ చేపలన్నీ బేరం చేసి కొనుక్కుపోయి లాభాని కమ్ముకుంటారు. పెద్దసంత నరసింహులు వీరయ్య గుడిసె దగ్గరకి వచ్చాడు. అతనితోపాటు వెంకన్నా యింకా కొందరూ కూడా వున్నారు. వర్తకులకి దగ్గరుండి బేరంలో సహాయంచేసి పెద్దరికం వెలిగించి పావలా అర్ధా సంపాదించుకుంటాడు వెంకన్న — అసలు వెంకన్న ఏ గొడవొచ్చినా అక్కడుండి పూసుకుంటాడు. పూసు కుంటాడు. పన్నుల చౌదరితో మంతనాలు సాగిస్తాడు. అందుకే వెంకన్న అంటే అందరికీ కొంచెం భయంకూడా వుంది.

నూకయ్య గుడిసె యివతలే కూర్చొని పల్దోము కుంటున్నాడు. తెల్లని సూర్యకాంతి యిసుకమీద వెండిరేకులా మెరుస్తూవుంది. పల్లెవాళ్ళ నల్లని శరీరాలు మరికాస్త నల్లగా నిగనిగలాడుతున్నాయి.

నరసింహులు వెంకన్నవైపు రెండు పొగాకు కాడలు విసిరాడు.

"తీసుకోరా యెంకా. ఈ వీరన్న ఏదైనా సబబుగా యిస్తాడా?" అన్నాడు.

"మా లోటం మడిసండి బాబూ. ఆడికి డబ్బుపోగుసేసి పోగుసేసి మీలాగ అయిపోవాలని వుందండి" అన్నాడు వెంకన్న పొగాకు పాయ తుంపుతూ.

"నీకుమాత్రం లేదట్రా?"

వెంకన్న గర్వంగా అందరికేసి చూసి యిలాగ అన్నాడు: "మన కెందుకురా పోగుసేసుకోవడం. ఏరోజు కారోజుదే. యెదవడబ్బు, మన దగ్గరుండదు - అలాటి పెబువులకి కాని."

నరసింహం వెంకన్నని దగ్గరగా పిల్చి చెవిలో ఏదో చెప్పాడు.

వెంకన్న వికటంగా నవ్వి గుడిసెలోకి వెళ్ళాడు. కాస్సేపట్లో వీరాతో యివతలకి వచ్చాడు.

"దండం బాబూ" అన్నాడు వీరయ్య. నూకయ్య చేపల బుట్టలు ఒకొ్కక్కటే యివతల పెట్టాడు. పాలిక రూపాయల్నుంచి బేరం సాగింది. వీరయ్య ఆఖరుకి యాభై కావాలన్నాడు. దమ్మిడీ తగ్గితే యివ్వనన్నాడు. యాభై అంటే నూర్లో సగం. ఇంకో యాభై సంపాదిస్తే నూరవుతుంది. అదీ వీరయ్య లెక్క. మొదట దెబ్బై చెప్పినా వీరయ్య కెందుకో యాభై అన్న అంకెమీదనే మోజువుంది. ఆ అంకె నుంచి ఎంత చెప్పినా దిగలేదు. ఇక లాభంలేదని నరసింహం. సొమ్మిచ్చి బుట్టలు పట్టించుకు వెళ్ళాడు. వీరా మెరిసే కళ్ళతో అయిదు పదినోట్లనీ మొలకి కట్టాడు. రెండు మూడు రోజుల శ్రమకి ఏ పల్లెవాడూ ఈ మధ్య యింత సంపాదించలేదు. వీరయ్య లాగ పట్టుదలగా వాళ్ళు సముద్రాన్ని గాలించనూలేదు. ఆ పూట గడిస్తే చాలనుకుంటారు. మిగిలితే తాగుతారు. వాళ్ళల్లో కష్టపడే బలమూ ఓపికా ఇచ్ఛా ఏనాడో లుప్తమైపోయాయి.

"ఓ రెండు రూపాయలు నాకియ్యి. మళ్ళీ ఇచ్చేత్తా" అన్నాడు వెంకన్న చెయ్యిజాపుతూ.

"నీ కెందు కివ్వాలి?"

"నాను బేరంచేసి పెట్టాను" అన్నాడు వెంకన్న.

"ఆడితో వొచ్చినావు. ఆడిదగ్గరే పోయి పుచ్చుకో."

వెంకన్న కోపంగా చూశాడు. వీరా లక్ష్యం చెయ్యక నూకయ్యని పడవచెక్క అమర్చమని పంపించాడు. వెంకన్న వీరాదగ్గరగా వెళ్ళాడు.

"మద్దెవర్తికి మామూలుంది తెల్సా?" అని కోపంగా అడిగాడు.

"అవసరమైనోడు నా దగ్గరికి ఒత్తాడు మద్దె నీ ఊసేంటి?"

"సూసుకో నీ పని సెప్తా" మీసం దువ్వాడు వెంకన్న.

"పోరా తాగుమోతు కొడకా."

వెంకన్న కళ్ళు ఎర్రపడ్డాయి. హుంకరించాడు. "మామూలిత్తావా. సెంపదరగొట్టనా" అంటూ మీదకు వెళ్ళాడు వీరయ్య కలియబడ్డాడు కుస్తీ ప్రారంభమయింది. తక్కినజనం అందరూ వింతగా సరదాగా చూస్తున్నారు. చప్పట్లు కొడుతున్నారు. చుట్టుపక్కల గుడిసెల్లోంచి ఆడవాళ్ళుకూడా - కొందరు పిల్లల్ని చంకన వేసుకుని మరీ వచ్చారు. ఈ కలహానికి కారణ మేమిటో ఆతురతతో వాకబు చేస్తున్నారు.

వీరా బలంగా వెంకన్నని తన్నాడు. వెంకన్న గిర్రున తిరిగి యిసుకలో పడ్డాడు. మళ్ళీ లేవలేకపోయాడు. నోట్లోంచి నురగ వస్తోంటే తుడుచుకుంటూ బూతులు తిడుతున్నాడు. జుట్టునెరిసిన ఒక ముసిలాడు యింకా మీదకు లంఘించే వీరయ్యని ఆపి "ఇంక సాల్లే. నువ్వెళ్ళు యీరయ్యా" అన్నాడు వీరయ్య వొళ్ళు దులుపుకొని సముద్రంవైపు వెళ్ళిపోయాడు. వెంకన్న లేచి గాలిలో పిడికిలికొట్టుతూ బూతులు తిడుతూ తూలుతూ వెళ్ళాడు. నల్లగా మాసినగుడ్డలతో చింపిరి తలలతో కళలేని కళ్ళతో నీరసంగా వెకిలిగా నవ్వుకుంటూ తక్కినవాళ్ళు విడిపోయారు.

వీరయ్య సముద్రం దగ్గరికి వెళ్ళాడు. నూకయ్య పడవని సిద్ధం చేస్తున్నాడు. పక్కనే ఆకుపచ్చ చీరకొంగు గాలికి ఎగురుతూంటే నవ్వుతూన్న చంద్రి కనపడింది. వీరా "ఓహోయ్" అని పిలిచాడు. ఆమె కువకువలాడే గొంతుతో "ఓహోయ్" అని పలికింది.

చంద్రి నలుపైనా అందంగా వుంది. పెద్ద కళ్ళు. కోటేరేసిన ముక్కూ, బలంగా వంపులు తీరిన దేహమూ - అన్నిటికన్నా ఆమె స్వచ్ఛమైన నవ్వు, సముద్రపు కెరటాల నురుగు సూర్యకాంతిలో మెరిసినట్టుగా అకల్మషంగా హాయిగా నిండుగా ఉంటుంది. చంద్రి పరుగున వెళ్ళి వీరా వొళ్ళో వాలింది. వీరయ్య రెండు చేతులతోనూ చంద్రిని పైకెత్తి గిర్రున తిప్పి మెల్లగా యిసుకమీద పడుకోబెట్టాడు. ఎండలో ఆమె చెక్కిన రాతిశిల్పంలా నిగనిగలాడింది. ఈమె తనదేనన్నగర్వమూ తృప్తీ అవ్యక్తంగా వీరయ్యలో కలిగాయి. నవ్వుతూ అడిగాడు "నిన్న రాలేదేం పిల్లా?"

"నిన్న సేతినిండా పనివుంది బావా."

"మరి యియ్యాల ఎలా గొచ్చినావ్ సిలకా?"

"నాకు కడుపునొప్పి అని యేడ్చాను."

వీరయ్య గుండెనిండా నవ్వాడు. తన చేపల్నిగురించీ వచ్చిన సొమ్మును గురించీ చెప్పాడు. చంద్రికళ్ళు పెద్దవిచేసుకుని వింది. వాళ్ళల్లో సుప్తమైన కలలూ ఆశలూ రేగాయి. ఇద్దరూ దూరంగా భూమిమీద యిల్లు కట్టుకుని కులాసాగా ఆ చౌదరిలాగా....

వీరయ్య పట్టుదలతో అన్నాడు, "సెంద్రీ సూడు. నెల తిరిగేటప్పటికి మూడొందలు సంపాదిత్తాను. ఇంకా ఇంకా సంపాదిత్తాను. ఈ యెదవ పల్లి వొదిలి పోదాం."

"నాకు సొక్కాలూ" సాగదీశాడు నూకయ్య.

"సర్లే యెదవా. కుట్టిత్తాలే." వీరయ్య చంద్రి చెయ్యిపట్టి లేపదీశాడు. "నీకు ఓ సీర కొంటాను."

"నా కెందుకు బావా యిపుడూ."

"మనువు సేసుకోవద్దూ పిల్లా."

చంద్రి ఆనందంగా అతనికేసి చూసింది. గబుక్కున సిగ్గుతో తల దించి "సాలాఖరుకు నా జీతం వత్తది కదా. అదికూడా నువ్వే తీసుకో" అంది.

"నీ దబ్బెందుకు నాకు పిల్లా యీరయ్యంటే ఏంటనుకున్నావ్."

"మరి యిల్లు కట్టుకోవద్దా ఏంటి పిల్లోడా. ఇల్లు కడితే శానా డబ్బు వుద్ది."

వీరయ్య మౌనంగా అంచనా వేస్తున్నాడు. ఆకలీ – రేపటినిగూర్చిన భయమూ లేకండా గౌరవంగా బతకాలని కోరని వారుండరు. కాని ఆ పేదరికం పొలిమేర దాటడం కష్టం అని వీరయ్యకి తెలియదు. ఆ పొలిమేర దగ్గర నీచత్వమూ నిరాశా రోగమూ లాంటి పెద్దపెద్ద అగడ్త లుంటాయి. పై అంతస్తులోనికి ఎగరడానికి చేసే ప్రయత్నం అతి కష్టమైనదీ అపాయకరమైనదీకూడా. కాని వీరయ్య ధనం దేనికైనా మూలం అని గుర్తించాడు. కేవలం తన కష్టంవల్లనే తప్ప మరోమార్గం సంపాదనకి లేదనీ తెలుసుకున్నాడు. ఆ వచ్చిన ధనం తన్ని అంటిపెట్టుకుని ఉండాలి. కాని యీ చంచల పదార్థం ఉన్న చోటికే వెళ్ళే దుర్గుణం కలిగి ఉందని అతనికి తెలియదు. ఏమైనా దారిపొడుగునా జయించుకుపోవాలనే పట్టుదల అతనిలో వుంది. అందుకోసమే తక్కిన తన వాళ్ళల్లో ఉన్న అలసటనీ అవినీతినీ తనలోంచి తుడిచిపెట్టి నియమబద్ధంగా బతకాలనుకున్నాడు. అందుకోసమే నరసమ్మ నెత్తురులేని వలపుకి దూరంగా తొలగాడు.

పడవ సముద్రంలో పూగింది. రెండు కుండలలో గంజీ కూడూ పెట్టి పడవలో ఉంచారు. తెరచాప గాలికి వయ్యారంగా ఆడింది. ఎండ ముదిరిన వేడికిరణాలు చల్లని సముద్రాన్ని తాకుతున్నాయి. "నాను కూడు వొండి ఎదురు సూపులు సూత్తాంటాను." అంది చంద్రి.

"ఇయ్యాల నా సామిరంగా యింకా ఎక్కువ సేపలు పట్టుతాసు" అన్నాడు వీరయ్య.

"తొరగా రాయేం!" అంది చంద్రి.

పడవ పడుచుపిల్లలాగా కెరటాలమీద సాగింది. చంద్రి చూసి చూసి వెనక్కి తిరిగింది.

# 4

చంద్రి కేమీ తోచలేదు. ఒకత్తె వీరయ్య గుడిసెలో కూర్చుంది. తన కామందుల యింట్లో అయితే యిటువంటప్పుడు విధవకూతురు సుబ్బమ్మ

గచ్చకాయ లాడడానికి పిల్చేది. పాపం ఆవిడ చాలా మంచిది. ఏం చేసుకున్నా తీసుకొచ్చి తనకి పెడుతుంది. తనతో ఎన్నో చెపుతుంది. సుబ్బమ్మ మొగుడితో కొన్నాళ్ళు కాపరం చేసింది. ఎప్పుడూ ఆ కాపరం గొడవలే చెప్పేది. ఇప్పటికి తాను అయిదేళ్ళనుంచీ అక్కడే పనిచేస్తోంది. ఏడాదికి యిన్ని బస్తాలని ఒకేసారి కొలుస్తారు. ఇదివరకు తన తల్లి బతికివున్నప్పుడు ఆమె జీతం తెచ్చుకునేది. అన్నగారినికూడా యింట్లో పెట్టుకుని పోషిస్తూవుండేది. కాని తల్లి ఏడాది క్రితమే మారకంవచ్చి చచ్చిపోయింది. తల్లి పోవడంతో చంద్రికి సర్వం శూన్యమనిపించింది. మేనమామ వేళకి తిని తత్వాలు పాడుతూ కూర్చుంటాడు. ఇంటిగొడవ పట్టించుకోడు. తనకీ చచ్చిపోవాలనిపించింది. కాని వీరయ్య తనకోసం పల్లెనుంచి మూడు మైళ్ళు నడిచి వచ్చేవాడు. ధైర్యం చెప్పేవాడు. నవ్వించేవాడు. అల్లరి చేసేవాడు. చీకటి పడగానే వెళ్ళిపోయేవాడు. వీరయ్యనీ, వీరయ్య కబుర్లనీ తలచుకుంటూనే నిద్రపోయేది. చంద్రి మామూలు మనిషైంది. ఉత్సాహంతో ఆశతో భవిష్యత్తులోకి చూసింది.

చంద్రి గుడిసె తలుపు గొళ్ళెంపెట్టి అప్పలమ్మ గుడిసె దగ్గరకు వెళ్ళింది. అక్కడ చౌదరి అప్పలమ్మతో ఏదో గుస గుస లాడుతున్నాడు. చంద్రిని చూసి "ఈ పిల్ల వీరయ్యకోసం వస్తూంటుంది కదూ!" అని పరీక్షగా చూశాడు. చంద్రికి ఏదో సిగ్గువేసి కుంచించుకుపోయింది. పన్నులు వసూలుచేసే చౌదరి యిక్కడెందుకున్నాడా అనుకుంది. అప్పలమ్మ ఆప్యాయంగా చంద్రిని పిలిచి కూర్చోమంది. చౌదరి వెళ్ళిపోయాడు.

"లచ్చిమిలాంటి పిల్లవు నీ రేక మంచిదిలే" అంది అప్పలమ్మ పన్నని వంకర చేతులతో చంద్రి చుబుకాన్ని పుణుకుతూ. "మరి నూయీరయ్యని పెళ్ళెప్పుడు చేసుకుంటావో కోడలా?" అంది.

చంద్రి సిగ్గుగా అంది "నాకేం తెలుస్తదీ."

"యీరయ్య సెప్పుకోదగ్గ మడిసి. అందరిలాంటోడుకాడు" అంది అప్పలమ్మ.

"ఇక్కణ్ణుంచి యెల్లిపోదాం. ఊళ్ళో యిల్లు కట్టుకుందామంటాడు. నా జీతంకూడా ఆడికే యిచ్చేస్తాను" అంది చంద్రి.

"ఏమాత్రం నిల్వవేశాడు నీవోడు" అడిగింది అప్పలమ్మ.

"నాకు తెల్దు."

"మునిల్దాన్ని, నాతో ఆమాత్రం సెప్పకూడదేంటే?"

"నాకు తెల్దు. నిజంగా నీమీద వొట్టు."

"అది సర్లేగాని నువ్వుకూడా ఈడకే వచ్చి ఉండరాదూ పిల్ల దానా. ఒక రైవీ నువ్వు దూరంగా ఎందుకూ?"

"కామందుల దగ్గర పనికి కుదిరానుగా."

"ఆఁ పని! పని! ఇక్కడుంటే ఆ మాత్రం సొమ్ము సెయ్యమా ఏంటీ—"

"నా కెవరి త్తారిక్కడ ?"

"నా దగ్గరుందువుగాని, నా యాపారం చూసిపెడుతూందువుగాని."

"నా కిటువంటివి సేతగాదప్పలమ్మత్తా" అంది అమాయకంగా చంద్రి.

అప్పలమ్మ చాలా చిత్రమైన మనిషి. దగ్గరగా ఏభై యేళ్ళుంటాయి. చాటుగుండా కల్లుని మందల్ని సప్లయ్ చేసే పెద్ద వర్తకురాలు. కాని ఆమె బహిరంగంగా మాత్రం పుణుకులు, మామిడి తాండ్ర, బెల్లపు సెనగపప్పులూ అమ్ముతూంటుంది. పొరుగూళ్ళనుంచి చాటుగా ఎవరికీ తెలియకుండా ఒక్కొక్క రసికుడు ఒక్కొక్క పిల్లని ఎగరేసుకొస్తుంటాడు. వాళ్ళకి గదులద్దెకిస్తుంది అప్పలమ్మ. ఈ వ్యవహారంలో చౌదరికి కూడా వాటా వుంది. పోలీసుల చెడు దృష్టి ఇటుపడకుండా చౌదరి చూసుకుంటూ వుంటాడు కాని చంద్రికి పాపం యివేమి తెలియవు. అప్పలమ్మ పెద్ద కాలుప్రదనీ సత్తెకాలప్రదనీ ఆమె నమ్మకం.

"పోనీ మా సౌదరిగారు దగ్గర పనికి కుదరరాదు పిల్లా. నీకో బస్తా ఎక్కువ మట్టజెప్తాడు. యీరయ్యకి దగ్గరగా వుంటావు, రోజూ కోశెడు దూరం నడిచి వస్తుండావాయె" అంది అప్పలమ్మ.

"మూడు నాలుగు నెలల్లో ఈ యేడయిపోతాదిగా అప్పుడు సూద్దాంలే" అంది చంద్రి, అప్పలమ్మ సలహాకూడా బాగానే వుందనుకుంటూ.

"ఇంతలో ఒక గదిలోంచి పెద్ద అరుపులు కేకలూ వినపడ్డాయి. ఒక ఆడగొంతు 'అమ్మో అమ్మో' అంటోంది. దబదబా గుద్దులు విని పించాయి. చంద్రి భయంతో "ఏంటదీ" అంది.

గది తలుపులు తెరచుకున్నాయి. ఒక ఆడదాన్ని జుట్టుపట్టుకుని ఊడిన గోచీతో తూలుతూ లాక్కువస్తున్నాడు. మధ్యమధ్య కోపంగా విలాసంగా డొక్కలో తన్నుతున్నాడు. ఆమె తిడుతోంది. "సచ్చినోడా. నీ జిమ్మడిపోను. నీ శార్థం పెట్ట....?"

అప్పలమ్మ ఏమీ ఎరగనట్టు చేపల్ని తరుగుతోంది. చంద్రి సహించ లేకపోయింది. "ఏంట్రా సచ్చినోడా. ఆడమనిషి నట్టా కొడతావ్ ?" అంది.

"నాయిష్టం" అన్నాడు వాడు.

"అయ్యో అదేం తప్పుచేసిందీ?" అంది చంద్రి.

"నాకు కొట్టాలని సరదా. నీ కెందుకే నాపూసు." ఇంతలోకే ఆడ మనిషి జుట్టువిడిపించుకునీ అతని చెయ్యి కరవబోయింది. అతడు తప్పించు కుని ఆమెని ఎడాపెడా తన్నాడు. చంద్రి అప్రయత్నంగా అంది. "అలా కొడతావేంటి పొగరుబోతుకొడకా."

"నీ కెందుకే ముండా, నీక్కూడా రెండు తగలాలా." అన్నాడు, ఆ వీరుడు. ఆడమనిషి విదిలించుకుని పారిపోయింది. అతడూ తూలుతూ ఆమెని వెంబడించాడు. చంద్రికి వికారపెట్టినట్టయింది. కంగారుగా "ఇదంతా యేంటి అప్పలమ్మా!" అంది. అప్పలమ్మ నవ్వింది. ఆ నవ్వు తాపీగా చిత్రంగావుంది. అమాయకంగా పరచుకున్న ఎండుటాకుల్ని కాల్చివేసే మంటలోని నిర్దయ, నీచత్వమూ ఆ నవ్వులో ఉన్నాయి. నైతికపు విలు వలూ, అంతరాత్మ, జాలీ మొదలైనవన్నీ ఎప్పుడో వదిలేసి అవసరం యొక్క ప్రాముఖ్యానికి లొంగిన మనుష్యులలోని ఒక స్వార్థం, గారపట్టి నల్లపడిన ఆమె పళ్ళ సందులలోంచి పొడుచుకువచ్చిన నవ్వులో అసహ్యంగా పేరుకునివుంది. చంద్రికి ఆ నవ్వు భయంకరంగా తోచింది. ఎందుకో అక్కడ ఉంటే ప్రమాదం అనుకుంది. "నే వెళ్ళొత్తాను. యీరయ్యబావకి కూడువండాలి" అంటూ అప్పలమ్మ పిలుస్తున్నా వినక చరచరా వెళ్ళి పోయింది.

చంద్రి కూడువండి చీకటిపడే వేళకి బండిమీద కూర్చుని పాటలు పాడుతూ వీరాకోసం నిరీక్షిస్తోంది. అటూ ఇటూ వెళ్ళేవాళ్ళు పలకరించి పోతున్నారు. కొందరు పరాచికాలాడుతున్నారు. మీసాలవెంకన్న వస్తున్న

గీటాడు. "పోరా యెదవకొడక. కళ్ళల్లో యిసుకోత్తాను" అంది. మరి కొందరు కవ్వించి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

వీరయ్య నూకయ్యతో తిరిగి వచ్చాడు. ఈవేళ కూడా చేపలు బాగానే పడ్డాయి. చంద్రి వేన్నీళ్ళు కాచిపెట్టింది. ఇద్దరూ స్నానం చేశారు. చంద్రి నవ్వులూ కబుర్లు చెబుతూ వేడివేడి కూడు పెడుతూంటే వీరయ్యకి మగతలాంటి ఆనందం ఏదో కలిగింది. తను రోజంతా పడిన శ్రమని ఎవరో మంత్రంవేసి తీసేసినట్టయింది. చంద్రి యింక యింటికి వెళ్ళనంది. ఇక్కడ ఈ పల్లెలో సంబరం జరుగుతుంది. చూస్తానంది. సరేనన్నాడు వీరయ్య.

మూతితుడుచుకుంటూ వీరయ్య యివతలికి రాగానే ఎవరోవచ్చి "మీ మాంవకి పానంమీదకొచ్చింది." అని చెప్పాడు. వీరయ్యకి వొళ్లు జలదరించినట్టయింది. సరాసరి మేనమామ యింటికి వెళ్ళాడు. గుడిసె గుమ్మంమీద సీతాలు ఏడుస్తూ కూర్చుంది. మేనమామ గవరయ్య పిల్లలు లేరని దీన్ని చేరదీసి పెంచాడు. పన్నెండు పదమూడేళ్ళుంటాయి. "ఏంవే సీతీ! ఏడుత్తావేం ఎట్టాగున్నాడు మావం?" అన్నాడు వీరయ్య.

"ఆకలేత్తంది" అంటూ బావురుమంది సీత.

గవరయ్యకి జబ్బు చెయ్యడంతో సీతాలికీ రోజంతా ఉపవాసమైంది. ఇంట్లో బియ్యంగింజ కూడా లేకుండాచూసి యిదే సమయం అన్నట్లు మంచం పట్టాడు ముసలాడు. వీరయ్య లోపలికి వెళ్ళాడు. గురవయ్య ఒక కుక్కి మంచంలో స్పృహలేకుండా పడివున్నాడు. ఆయాసంతో గుండె లెగిరి ఎగిరి పడుతున్నాయి. బలవంతంగా తీసి విడిచే శ్వాస. గురక బరుకు బరుకు మంటోంది. నెరిసిన కనుబొమ్మలకింద రెప్పలు సగం మూసుకుని ఉన్నాయి. వీరయ్యకి బాధ కలిగింది. జాలివేసింది. ఓపికఉన్నన్నాళ్లు సము ద్రంలో గెడవేసి బతికాడు. చివరిరోజుల్లో ఇక్కడా అక్కడా అడుక్కు తినుకువస్తున్నాడు. ఇప్పుడింక ఈ ప్రాణావశిష్టుణ్ణి ఎవరు చూస్తారు? కొన్ని రోజులక్రితం అత్త పిలుస్తోందని చెప్పాడు. ఇప్పుడు వెళ్ళిపోతు న్నాడా? అక్కడ ఆ లోకంలో అత్త యితనికోసం కని పెట్టుకుని వుంటుందా? అక్కడ తిండి ఉంటుందా? అక్కడ సముద్రం వుండదా? ఇలాగ అయో మయంగా ఆలోచిస్తూ పరుగెత్తుకువెళ్ళి మంగలిస్వామిని తీసుకొచ్చాడు.

స్వామి మంచి వైద్యుడని ప్రతీతి. గవరయ్యని పరీక్షించి నోట్లో ఏదో రసంపిండాడు. ఉదయానికల్లా తెలివొస్తుందనీ నయమౌతుందనీ ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

"నీకు నేను కూడు పంపెత్తాను. ఏడవమాకు సరే, మావని జాగ్రత్తగా సూతూవుండు." అని చెప్పి వీరయ్య యింటికి వచ్చేశాడు. చంద్రి అన్నం ముంతలో పెట్టుకుని సీతాలు దగ్గరికి వెళ్ళింది.

వీరయ్య గుండెలో బాధ ఎక్కువయింది.

ఈ పల్లె వదిలితేగాని తన బాధ తగ్గదనుకున్నాడు. ఎన్నాళ్ళయినా తాను కష్టపడి డబ్బు కూడ పెడతాడు. అవసరమైతే చంద్రి జీతంకూడా తనే తీసుకుంటాడు. దూరంగా అక్కడ ఒక యిల్లు కట్టుకుని చిన్న వర్తకమో మరొకటో చేసుకుంటాడు, తను చొక్కాలుకూడా తొడుగుతాడు, కాళ్ళకి జోడులేకుండా నడవడు, చంద్రి నూకయ్య తనతో వుంటారు. చంద్రికీ తనకీ పిల్లలు పుడతారు. వాళ్ళకి చంద్రిలాగ పెద్ద కళ్ళూ, తన లాగ బలమైన దేహమూ ఉంటాయి, వాళ్ళు పలకా పుస్తకాలుచ్చుకుని బడికివెళ్ళి చదువుకుంటారు. తను పెద్దమనిషి అవుతాడు. గౌరవంగా హాయిగా బతుకుతాడు. కొందరేనా తన్ని వీరయ్యగారంటారు.

ఈ దరిద్రపు నీచపు మోసపు సముద్రంతో తనకింక పనిలేదు. మీసాలు వెంకన్న తిండిలేక దిక్కులేక పడిఉంటాడు. నరసమ్మ కల్లుతో జబ్బులతో ముసలిదై వంగిపోతుంది. ఈ పల్లెవాళ్ళందరూ ఆకలితో, రేపటిని గూర్చిన భయముతో క్రమంగా కృశించి నశించిపోతారు. అప్పలమ్మని ఖైదులో పెడతారు. తనుమాత్రం దూరంగా సుఖంగా....

అంత కసిలోనూ ఏడుపు వచ్చింది వీరయ్యకి. ఆ పల్లెనీ అందులో ప్రతీ మనిషినీ తానెరుగును. తరతరాలుగా వీళ్ళందరూ యిక్కడ పుట్టారు, పెరిగారు. తనవంటి వీళ్ళందరూ నశించిపోతారు. ఈ వందల కొలదీ జనానికి ఏ ఆశా సౌఖ్యమూ యింక జీవితంలో కలగవా? బాబుకూడా యిలాగే చెప్పాడు. 'నాను యీ సముద్రం దేవుడను కున్నానురా అబ్బీ! మన తాత ముత్తాతలు యిక్కడే పుట్టారు. పెద్దోళ్ళయారు. కాని గుడిసె ఏనాడూ కాస్త పెదది అవలేదురా బుల్లోడా! ఈ

సముద్రం మనకి కూంత తిండిపెట్టి మన సత్తువ నంతా-మన పానాల్నే బలి కోరుద్ది"

అక్కడే యిసుకమీద పడుకున్నాడు వీరయ్య. మాగన్నుగా నిద్ర పట్టే వేళకి చంద్రి తిరిగి వచ్చింది.

# 5

దూరంగా డప్పులు మోగాయి. కాగడాల కాంతి ఎర్రగా కనిపిస్తోంది. జనం కలకలం వినవస్తూంది. చంద్రి వీరాని తట్టి లేపింది. "నువ్వెళ్ళు నేను ఎనకాన వొత్తాను" అన్నాడు వీరయ్య బద్ధకంతో. చంద్రి సూరయ్యని తీసుకుని వెళ్ళింది. ఇదివరకెప్పుడో చౌదరి కొనియిచ్చిన చమ్కీచీర కట్టుకుని వచ్చింది నరసమ్మ. వెంకన్న ఒక చేతిలో కల్లుముంతతోను మరో చేతితో కొరడాతోనూ తిరుగుతూ జనాన్ని అదలిస్తున్నాడు. గంగడు తుప్పు పట్టిన కత్తినొకదాన్ని తిప్పుతూ ఖడ్గ విద్యని ప్రదర్శిస్తున్నాడు. ఒక ఆడది మొహం అంతా పసుపురాసుకుని చేత్తో ఆకులు పట్టుకుని జుట్టు విరబోసుకుని గుడ్లుతేలేసి యిటూ అటూ వూగుతోంది. ఇద్దరు వొంటికి రంగులు పూసుకుని పెద్దపులి ఆట ఆడుతున్నారు. కాగడాల కదిలే వెలుతురులో అందరూ తెర మీద బొమ్మల్లా మిథ్యగా వింతగా వికృతంగా ఉన్నారు. చంద్రి ఉత్సాహంతో గుంపులో చేరి ఒకటైపోయింది.

క్రమంగా సంబరం మజా ఎక్కువయింది. ముంతలతో కల్లును కాళీ చేస్తున్నారు. పైటజారిన నరసమ్మ కేకలు వేస్తోంది. పసుపు రాసుకున్న ఆడమనిషి వీరాంగం తొక్కుతోంది. ముత్యాలు ముగ్గులు వేస్తున్నాడు. వెంకన్న కొరడా ఝుళిపిస్తూ హెచ్చరిస్తూ గుడివైపు దారితీశాడు.

చంద్రి ఒక పదం అందుకుంది. చంద్రి గొంతు కీచుగా రేగి డప్పుల మోతని దాటి ఎర్రని వెల్తురులో కలసిపోతోంది. పదిమంది ఆమె చుట్టూ మూగి వంతపాడుతున్నారు. వెంకన్న వచ్చి చంద్రికి ఎదురుగా నిలబడి "వహవ్వా సక్కని సుక్కా మరో పదం పాడు" అన్నాడు. ఒక

కొక చచ్చిన పాముని తీసుకువచ్చి విసిరాడు. జనం 'బాబోయ్' అంటూ చెల్లాచెదురై పోయారు. వెంకన్న వాణ్ని పట్టుకొని చావగొట్టాడు. చంద్రి పక్కనే చేరి మువ్వాలుకూడా పాడుతున్నాడు. ఇద్దరూ చేతులు కలిపి ఊపుతూ పాడుతున్నారు. వెంకన్న దగ్గిరికెళ్ళి 'సెంద్రీ మరోటిపాడు' అంటున్నాడు. ఎవడో వెనకనుంచి చంద్రి పైటలాగాడు. గంగడు కత్తి తిప్పుతూ నాట్యంచేస్తూ ఆమెమీద తూలిపడ్డాడు. ఇద్దరూ నేలమీద ఒకరి మీద ఒకరు పడ్డారు. జనం యీలలతో చప్పట్లతో తమ ఆనందాన్ని తెలిపారు.

అంతసేపుముందే వచ్చిన వీరయ్యా యిదంతా చూశాడు. అసలు చంద్రి సంబరానికి వెళ్ళడమే వీరయ్యకి యిష్టంలేదు. అందుకే నిద్రలో ఉలిక్కిపడిలేచి యిలాగ వచ్చాడు. ఈ దృశ్యం అతనికి బాధనీ అసహ్యాన్నీ కలిగించింది. తనకీ తన వాళ్ళకీ ఏదో ప్రత్యేకత కల్పించుకోవాలని అతని ఆశ. తనదైన చంద్రి వీళ్ళల్లో గంతులు వేయడం సహించలేక పోయాడు. చౌదరి భార్య యిలా ప్రవర్తించదని అతనికి దృఢంగా తెలుసును.

'సెంద్రీ ఇలాగరాయే' అని గట్టిగా కంఠమెత్తి పిలిచాడు.

"నాను రాను" అంది చంద్రి ఉత్సవపు ఉత్సాహంలో.

"నంపేత్తా రాకపోతే" అంటూ ఆమె చెయ్యి పట్టుకు.లాగాడు.

"ఒదులొదులు యీరయ్యబావా నొప్పి పెడుద్ది" అంది చంద్రి. అందరూ చప్పట్లు కొట్టారు. చంద్రికి అభిమానం వేసింది. కదలనంది. మొరాయించింది. వీరయ్య ఆమెను జుట్టుపట్టుకుని బరబర లాక్కు పోయాడు. "గ్యానంనేదు నీకు ? జుత్తువొదులు" అంది కోపంతో చంద్రి. వీరా కళ్ళు కోపంతో మండుతున్నాయి. "నా మాటినకపోతే జాగర్త! ఎదవ్వేసాలెయ్యాక" అన్నాడు.

"నే యినను" అంది చంద్రి.

"పో— ఆ వెంకన్నతో పో" అన్నాడు వీరయ్య కోపంగా.

"ఆడికేం, ఎంకన్న మంచివాడు" అంది చంద్రి కొంటెగా.

వీరయ్య ఆమె మీదికి దుమికాడు. చంద్రి పరుగెత్తింది. వీరయ్య వెంబడించాడు, సముద్రం వొడ్డుకి వచ్చారు. చంద్రి ఫక్కున నవ్వింది.

"ఏంటి నవ్వుతావ్" అన్నాడు వీరయ్య.

చంద్రి యిసుకమీద కూర్చుని పాదాల్ని కెరటాలలో పెట్టింది. ఓరగా వీరయ్యకేసి చూసి "వెంకన్న పెద్దమడిసి. అందమైనోడు'' అంది. ఆమె పిక్కలు నురుగుతో నవ్వుతూన్నట్టున్నాయి. వీరయ్య ఆమెని నీళ్ళల్లోకి తోశాడు. చంద్రి గల్లున నవ్వుతూ నీళ్ళల్లో పడింది.

"రా పైకి రాయే పిల్లా'' అన్నాడు వీరా.

తడిసిన చీరతో పైకి వచ్చింది చంద్రి. స్ఫుటంగా ఉన్న అవయవాల పొంకంచూసి ఆమెను కౌగలించుకోబోయాడు వీరయ్య. ఆమె తప్పించుకుని మళ్ళీ నీళ్ళల్లోకి దుమికింది. నీరు గలగలమంది. వీరా గొంతు నిండా నవ్వాడు. చంద్రి తిరిగి ఒడ్డుమీదకు వచ్చింది.

"ఒళ్ళు గడ్డయిపోతుంది. ఉహూ చలి చలి'' అంది వణుకుతూ. వీరయ్య తలగుడ్డతీసి ఆమె మీదకు విసిరాడు. "కట్టుకో'' అన్నాడు.

''మరుగేది యీరయ్య బావా ? నాను సిగ్గులేని నర్సమ్మనేంటి" అంది చంద్రి. వీరా పక్కకి తిరిగి కళ్ళు మూసుకున్నాడు. చంద్రి ల గుడ్డని చుట్టబెట్టుకుని సరీసరిపడని పైట వేసుకుంది. తడిసిన జుట్టు చివరల్ని సాచి ఆరబెట్టుకుందోంది.

వెన్నెలలో అర్ధనగ్నంగా ఉన్న ఆమె దేహమూ రూపమూ మోహనంగా ఉన్నాయి. వీరయ్య రెప్పవెయ్యకుండా ఆమెకేసి చూశాడు. ఆమెను పట్టుకోబోయాడు. ఆమె పరుగెత్తింది. అలసిపోయి యిసుకలో వాలింది. వీరయ్య ఆమెని రెండు చేతుల్లోకి తీసుకుంటూ ''నువ్వు నా దేవతవు సెందిరీ'' అన్నాడు.

సముద్రపు కెరటాల హోరు చిత్రంగా మిస్టిక్‌గా ఉంది. దూరంగా సంబరం డప్పులమోత వినబడుతోంది.

## 6

పల్లె పల్లె అంతా వీరాకి వ్యతిరేకంగా ఉంది. వీరా దగ్గర సొమ్ము తిరే నిలవవున్నట్టు అందరికీ తెలిసింది. చౌదరి జనాన్ని వెంటబెట్టుకుని నూకా

లమ్మగుడి కట్టించడానికి యిరవై రూపాయలు చందా యిమ్మన్నారు. ఇవ్వనన్నాడు వీరయ్య. ఎన్నో విధాల చెప్పి చూశారు చౌదరీ, తక్కిన వాళ్ళూ. చచ్చినా యివ్వనన్నాడు వీరయ్య. "నువ్వు దేవతని కాదంటు న్నావు, నాశనమైపోతావ్" అన్నాడొక భక్తుడు. వీరయ్య చలించలేదు. చౌదరి ఎర్రగా ముఖాన గంటుపెట్టుకొని వెళ్ళిపోయాడు. ఊరంతా అనేక విధాల చెప్పుకున్నారు. వీరయ్యని తిట్టుకున్నారు. దరిద్రం తన పక్కన తనలో ధనచిహ్నాల్ని ఉండనివ్వదు. బానిసలైన అమాయకులైన అవిద్యా పరులైన ప్రజలు తమ దరిద్రాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ ఉంటారు.

చీకటిరాత్రులు కాబట్టి చంద్రి రోజూ రావడంలేదు. ఎప్పుడేనా వచ్చినా చీకటిపడకుండా వెళ్ళిపోతుంది. అప్పలమ్మ వీరయ్య యింటికి రోజూ వస్తూ పోతూ ఉంది. వీరయ్యను మంచి చేసుకుంటోంది. సెన గప్పులు తెచ్చి పెడుతోంది. డబ్బిచ్చినా తీసుకోలేదు.

తనంటే విరోధంగా ఉన్న పల్లెవాళ్ళంటే అసహ్యంతో మరీ దూరంగా వుంటున్నాడు వీరయ్య. గవరయ్యమామ చచ్చిపోయాడు. అందరికీ ఆశ్చర్యం కలిగేటట్టు దహనానికి, తంతుకీ అయే ఖర్చంతా వీరయ్యే భరించాడు. సీతాలుని తన యింటికి వచ్చి ఉండమన్నాడు. కాని సీతాలు ఎవరితో చెప్పకుండా పల్లె విడిచి వెళ్ళిపోయింది. వీరయ్య కొన్నాళ్ళు వరుసగా వెళ్ళి మామ గుడిసెలో దీపం పెట్టి వచ్చేవాడు. ఇప్పుడు కొన్ని పందులూ, పందికొక్కులూ ఆ గుడిసెని విశ్రాంతి భవ నంగా వాడుకుంటున్నాయి.

వీరయ్య పట్టుదల ఆనాటి కానాడు ఎక్కువయింది. దేహశ్రమని లెక్కపెట్టకుండా సముద్రాన్ని గాలించేస్తున్నాడు. ఎన్నో రోజులు ఫలితం లేకుండా పోయేవి. బాధతో వొంటి నొప్పులతో తిరిగి వచ్చేవాడు. ఒక్కొక్క రోజున చేపలు కొల్లలుగా పడుతున్నాయి. ప్రతీ చేపకీ లెక్కకట్టి నిలవ చేస్తున్నాడు. ప్రతీరోజూ తన దగ్గరున్నసొమ్ము లెక్కపెట్టుకుంటున్నాడు. డబ్బుని తన మొలలోనే పెట్టి చుట్టూ గుడ్డని చుట్టబెట్టుతున్నాడు. అడవిలో తన ఆహారాన్ని జాగ్రత్త పెట్టుకునే ఖడ్గమృగం లేక ఎలుగుబంటి వంటి ప్రవృత్తి అతనిలో బలంగా వ్యాపించింది. నూకయ్యకి యిజార్లు కుట్టించ లేదు. బాబుకి దుప్పటీ కొనలేదు. చంద్రికి చీరని కొనిపెట్టలేదు. "అన్నంతా

చేసి తీర్చాను. అప్పుడుగాని దమ్మిడీ ఖర్చుపెట్టను" అని చెప్పాడు చంద్రితో.

ఆ సముద్రం వంటిదే దరిద్రంకూడా అవతలవొడ్డు కనపడదు. కాని వీరయ్య మొండిగా ముందుకు సాగిపోతున్నాడు.

# 7

కన్ను కనపడని చీకట్లో పల్లె భయంకరంగా వుంది. సముద్రపు హోరు క్షయ రోగంతో బాధపడుతూన్న రాక్షసుడి శ్వాసలాగా వుంది. చిరిగిన పాత కంబళి చిరువెచ్చని మడతల్లో వీరా, నూకయ్యా గాఢంగా నిద్ర పోతున్నారు. చలిగాలి చూరుని కొట్టుకొని వెనక్కి మళ్ళుతోంది.

ఎవరో గుడిసె తలుపును దబదబ బాదుతూన్నట్టు చప్పుడయింది. 'యారదీ' అంటూ వీరయ్య లేచి తలుపు తీశాడు. చౌదరి పెద్ద చుట్ట కాలుస్తూ బండమీద కూర్చున్నాడు. పక్కనే గుమాస్తా, నౌకరూ చేతులు కట్టుకుని వున్నారు. నౌకరు చేతిలో లాంతరు వుంది. వెంకన్న చేతిలో మరో లాంతరు వుంది.

"రేతిరేల వచ్చారు బాబుగారు" అన్నాడు వీరయ్య కంగారుగా నిద్రని దులుపుకుని.

వెంకన్న దీపం మొహంమీద పెట్టి "నీకోసమే" అన్నాడు.

"సర్కారువారికి నీ మీద చాలా కోపంగా వుంది" అన్నాడు చౌదరి తాపీగా.

"ఏం బాబూ?"

"క్రితం ఏడాది పన్నంతా బకాయీ వుంది. వృత్తి పన్నూ, గుడిసె పన్నూకూడా, జుల్మానాతో యిచ్చుకోవాలి" అన్నాడు చౌదరి.

"మా బాబు పన్ను కట్టేసినాడండి. నాను యీ యేడాది సొంతంగా చూసుకుంటున్నాను" అన్నాడు వీరయ్య.

"మె బాబు ఎప్పుడూ రాగిపైసా కట్టలేదు. నాకు తెలుసు" అన్నాడు వెంకన్న.

"జుల్మానాతో యిరవై ఆరు రూపాయలయింది" అన్నాడు చౌదరి.

"అన్నాయం బాబూ. మా బాబు పన్ను కట్టేశానని నాతో చెప్పాడండి."

"అయితే నే నబద్ధ మాడానంటావా ?" గద్దించాడు చౌదరి.

"మా బాబు కూడా నిజాయితీ మనిసేనండి" తొణక్కుండా అన్నాడు వీరయ్య.

చౌదరి గుమాస్తా పేరిశాస్త్రికేసి చూశాడు. పేరిశాస్త్రి "అయితే రసీదులేవీ ?" అని అడిగాడు.

వీరయ్య తెల్లబోయాడు. రసీదులు తీసుకునే అలవాటు ఎప్పుడూ లేదు. చౌదరి లేచి యిలా అన్నాడు. "నువ్వు ఉదయమే వచ్చి పన్ను జుల్మానాతో కట్టెయ్యాలి. లేకపోతే వీలులేదు. తరువాత ఏం జరిగినా విచారిస్తావు."

గుమాస్తా దాన్ని వ్యాఖ్యానించాడు. "సర్కారువారు నీ గుడిసెనీ, నీ కున్న యావదాస్తినీ స్వాధీనం చేసుకుంటారు."

చౌదరి వెళ్ళిపోయాడు. వెంకన్న కొంతదూరంవెళ్ళి తిరిగి వచ్చాడు.

"ఇదిగో యీరయ్యా, నా మాటిను. ఓ పదిరూపాయలు నాకియ్యి సౌదరిబాబుతో చెప్పి రైటు సేస్తాను" అన్నాడు మీసం తిప్పుతూ.

"నిన్నూ ఆ సౌదరినీ సేపలకూరలా తరిగేత్తాను" అన్నాడు వీరయ్య మండిపడుతూ. అతని గొంతులోని కాఠిన్యానికి జంకి వెనక్కి తిరిగాడు వెంకన్న.

తర్వాత రోజున ఉదయమే బయలుదేరి వీరా బాబు ఉంటూన్న ఊరికి వెళ్లాడు. అక్కడకు చేరేప్పటికి నడినెత్తిమీదకు సూర్యుడొచ్చాడు. కీళ్ళ నొప్పులతో బాధలతో శల్యావశిష్టుడైన బాబు యిలాగ అన్నాడు. "పన్ను కట్టేశానురా అబ్బీ. కాని ఆ సౌదరి మా పెమాదం మనిషి. సాటుగా పోయి ఓ పదిరూపాయలు యిచ్చుకుని రచ్చించమని అడుగు. లేకపోతే పాం పగ పట్టి నిన్ను బతకనివ్వడు."

తనకి అవ్యక్తంగా ఆదర్శంగా ఉంటూన్న చౌదరి యిలాంటివాడని తెలియగానే తనమీద తనకే రోతపుట్టింది వీరయ్యకి. ఏమైనా బాబు చెప్పి నట్టే చేసి యీ గండం దాటాలని సంకల్పించుకున్నాడు. బాబుకి అలాగే చేస్తానని వాగ్దానం యిచ్చాడు. బాబు భోంచేసి వెళ్ళమన్నా ఆగలేదు. సత్తెమ్మ వండిన కూడు తినకూడ దనుకున్నాడు. ఎండలోనే బయలుదేరి సాయంత్రానికల్లా తన పల్లె చేరుకున్నాడు వీరయ్య.

చీకటి పడుతూ పడుతూ వుంది. గుడిసెముందు సూకయ్య కూర్చుని ఏడుస్తున్నాడు. అలసటతో వున్న వీరన్న కోపంతో అడిగాడు. "ఎందు కురా యేడుత్తావ్? ఎవరు సచ్చినార్రా?''

"సౌదరీ ఆళ్ళు ఒచ్చి సేపలు లీసుకుపోనారు'' అన్నాడు సూకయ్య ఏడుస్తూనే.

వీరాకి గుండె ఆగినట్టయింది. మూడురోజుల నుంచి పట్టిన చేపలు జాగ్రత్తచేసి వుంచాడు. రేపే వర్తకులు వస్తారు. మూడురోజులు తిండైనా తినకుండా ఎండలో సముద్రంలో వెతికి వెతికి పట్టాడు. చాలా ఖరీదుచేసే చేపలు. వీరారక్తం వేడెక్కింది. కళ్ళచివర ఎర్ర జీర నాట్యమాడింది. "ఇదేంటో తేల్చుకుని వత్తానుండు'' అంటూ గుడిసెలోకి అడుగు పెట్టకుం డానే వెనక్కి తిరిగాడు.

"ఒ అప్పి కల్లోత్తావా?" అన్నాడు వీరయ్య.

అప్పలమ్మ తెల్లబోయింది. కాని నవ్వుతూ ముంత తీసుకువచ్చి యిచ్చింది. సగంతాగి వికారపెట్టి ముంత నేలకేసి కొట్టాడు వీరయ్య... "పో యెదవముండా—యెదవ కల్లూ నువ్వూ" అంటూ చరచరా వెళ్ళి పోయాడు. బలిష్ఠమైన అతని వొళ్లు వణకడం చూసి ఏదో ఉపద్రవం రాబో తోందని గ్రహించి నవ్వింది అప్పలమ్మ.

తుమ్మచేలు దాటగానే చౌదరీ వెనకాల గుమాస్తా కనపడ్డారు. వీరయ్య ఒక తుమ్మకర్ర విరిచాడు. వెనకాలే వెళ్ళి "నా సేపలు తీసుకు పోయావురా దొంగనాకొడకా" అంటూ చౌదరి తలమీద కొట్టాడు. 'అమ్మో' అంటూ చౌదరి నేలమీద కొరిగాడు. 'చచ్చిపోయాడు మునసబు' అంటూ పేరిశాస్త్రి పెద్దపెద్ద కేకలు వేస్తున్నాడు.

వీరయ్య పరుగెత్తుకొని అప్పలమ్మ ఇంటికి వచ్చాడు. "అప్పి-సౌద రిని తల పగలకొట్టా"నంటూ చతికిలబడ్డాడు. భయ విహ్వలతతో "ఇప్పు డేంటి సెయ్యడం" అన్నాడు ఆయాసపడుతూ.

"నీకేం భయంలేదు నేనున్నానుగా. ఇటురా" అంటూ అప్పలమ్మ ఏమాత్రం కంగారు పడకుండా ఒక మూల గదిలోకి తీసుకువెళ్ళింది వీర య్యని. వీరయ్య వణికిపోతున్నాడు. "పోలీసులొత్తారేమో అప్పి" అని వెర్రిగా చూస్తున్నాడు.

"నేను సూత్తానంటినిగా. భయపడమాకు. ఈ సుక్క తాగి పడుకో. బలం వస్తుంది."

అప్పి తలుపు గొళ్ళెంపెట్టి ఇవతలికి వచ్చింది. ముంత ఖాళీచేసి వీరయ్య క్రమంగా మైకంలోనికి, నిద్రలోనికి జారిపోయాడు. అప్పలమ్మ ఓ గంట పోయాక గదిలోకి వచ్చింది. వీరా మొల తడిమి కట్టువిప్పి నోట్ల కట్టని సంగ్రహించి మళ్ళీ తలుపు గొళ్ళెంపెట్టి తిన్నగా చౌదరి ఇంటికి బయల్దేరి వెళ్ళింది.

చౌదరి పడుకుని ఉన్నాడు. తలమీద కట్టువుంది. "ఏంటి జరిగింది చౌదరీ" అంది. నిజంగా ప్రమాదం ఏమీలేదు. కర్ర దూసుకుపోయి భుజా నికి తగిలింది. తలమీద పక్కగా చర్మంలేచింది. భుజం మాత్రం నొప్పిగా వుంది.

"పోలీసుల్ని పిలిపించి వాణ్ణి చితకతన్నిస్తాను. పదేళ్ళు శిక్ష పడే టట్టు చూడకపోతే నా పేరు చౌదరి కాదు" అన్నాడు చౌదరి.

ఉద్రేకాలవలనకన్న తెలివివల్ల లాభం ఎక్కువ వుందని అప్పలమ్మ చౌదరికి బోధించింది. ఏ సమస్యలోనుంచైనా డబ్బుని ఉత్పన్నం చేయడం ప్రయోజకుల లక్షణం. పోలీసు కేసువల్ల మరికొంత డబ్బు ఖర్చవు తుంది అంతకన్న ఓవందరూపాయలు నష్టపరిహారం తీసుకుంటే? వీరయ్యా లొంగిపడి వుంటాడు, ధనలాభమూ వుంటుంది. "పాతికో పరకో నీకు తోచింది నాకు ముట్టచెప్పు నాకేం ఆశలేదు" అంది అప్పలమ్మ-తన నిస్వార్థాన్ని రుజువుచేస్తూ.

చౌదరి నవ్వాడు. తనలాంటి ఉత్తమ ఆలోచనలూ, తెలివితేటలూ ఉన్నవాళ్ళని గుర్తుపట్టి మెచ్చుకోగల సహృదయుడు తను. "సరే, నీ

యిష్టం" అన్నాడు. అప్పలమ్మ తిరిగి తనింటికివచ్చి గది గొళ్ళెం తీసింది. చచ్చిన దూడలా కాళ్ళూ చేతులూ పడేసుకుని నిద్రపోతున్నాడు వీరయ్య.

తెల్లవారగానే వీరయ్యకు మెలకువ వచ్చింది. భయంతో లేచాడు. చౌదరి శవం కళ్ళఎదుట కనపడింది. 'బాబోయి' అని కేక పెట్టాడు. గబుక్కున వీరయ్యకి మొలనుకట్టిన డబ్బు జ్ఞాపకం వచ్చింది. చూసుకున్నాడు. లేదు. అతని ప్రాణం పోయినట్లయింది. 'ఓ అప్పలమ్మా' అంటూ కేకలు వేస్తూ తలుపులు దబదబ బాదాడు. గుంజాడు. అప్పలమ్మ వచ్చి తలుపు తీసింది

"అప్పి. నా డబ్బు నా డబ్బు...." వెర్రిగా అరుస్తున్నాడు వీరయ్య.

"పోతే పోయిందిలే బుద్దిలేనోడా. ముందు నీ బతుకు చూసుకో. సౌదరి సావుబతుకులమద్దె ఉన్నాడు."

అలాగే చూస్తూ నిలబడ్డాడు వీరయ్య.

"పోలీసు లొత్తారు. నిన్ను ఉరిదీస్తారు."

అప్పలమ్మ రెండు కాళ్ళమీదా పడ్డాడు వీరయ్య. "నన్ను రచ్చించు అప్పలమ్మా నాకు సావొద్దు. సావొద్దు." దీనంగా ఏడ్చాడు వీరయ్య.

"భయపడకు యెర్రోడా. నేనంతా మాట్లాడి వుంచినానులే. ఓ వంద రూపాయలు తీసుకురా. నీమీద కేసు తీయించేత్తాను" అంది అప్పలమ్మ.

"వందరూపాయలే."

"కాపోతే ఉరి!

"ఎలాగ అప్పి. నా దగ్గర డబ్బుకూడా పోయింది. దొంగెదవ లెవరో కాజేశారు."

"ఆఁ—పొలంకాడ ఎక్కడో పడిపోయివుంటది. ఏ చచ్చినాడో తీసేసి ఉంటాడు."

"మరి ఏం సేసేది అప్పి. నీ కాళ్ళట్టుకుంటాను. దారిసూపించు." వీరయ్య కళ్ళమ్మట నీరు ఏకధారగా ప్రవహిస్తోంది.

"సెంద్రి దగ్గర నిలవ వుంటుంది. పోయి తెచ్చెపరా."

"సెంద్రినా ?"

"నువ్వు మనువు సేసుగోవా యేంటీ. నీకోసమంటే అది పడి చస్తది."

# 8

చంద్రి ఆడుతూ పాడుతూ యింటికి వచ్చింది. గుడిసెముందు మేనమామ రత్తయ్య చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాడు. చంద్రి గుమ్మంలో అడుగు పెడుతూనే తన్నెవరో పిలుస్తూన్నట్టు విని నలు దిక్కులా చూసింది. రేగినజుట్టుతో మాసినబట్టలతో పీక్కుపోయిన మొహంతో పొలంగట్టమ్మటే వస్తూన్న వీరయ్యని చూసింది. పరుగెత్తుక వెళ్ళింది. చంద్రిని చూడగానే వీరయ్య ఓపిక లేనట్టయింది. గట్టుమీద చతికిలబడి మొహం కప్పుకున్నాడు.

"ఇదేంటి యీరయ్యబావా" అంది చంద్రి. వీరయ్య మాట్లాడ లేదు. చంద్రి కంగారుపడింది. తల నిమురుతూ అడిగింది.

"ఏంటి జరిగింది బావా ?"

వీరయ్య తలపైకెత్తాడు. గద్గదికంగా అన్నాడు. "నన్ను రచ్చిం చాలి సెందిరీ."

ఇలా బేలగా, జాలిగా తనదగ్గరికి ఎప్పుడూ రాలేదు వీరయ్య. అత నిలోవున్న పౌరుషమూ మగతనమూ ఏమయ్యాయో తెలియదు. ఏదో కీడు శంకించింది. అయినా చిక్కబట్టి "సెప్పు నాతో. అసలేంజరిగింది ?" అంది.

"నన్ను ఖైదులో పడేత్తారు. ఉరితీత్తారు. ఉరితీత్తే సచ్చిపోతాను." వీరయ్య విహ్వలంగా ఉరిని తలచుకుంటూ చెప్పాడు. చంద్రి ఆశ్చ ర్యంగా చూసింది. "అణ్ని — ఆ సౌదరిని నెత్తి పగలకొట్టాను. పన్ను లియ్యలేదని మూడురోజుల సేపల్ని తీసుకుపోయినాడు దొంగనాయాల...."

"పోవల్సిందే ఆ సచ్చినోడు...."

"నా మొలనికట్టి బద్రంసేసుకున్న సొమ్ముకూడ పోయింది. ఎంత కట్టపడ్డాను." వీరాదుఃఖం ఆపుకోలేక పోయాడు, ఏడ్చాడు, చంద్రి వొళ్ళోకి తలపెట్టుకొని.

"ఎదవమోకు బగమంతుడే ఉన్నాడు." చంద్రికికూడా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. "ఎలా అయిపోయినావ్ బావా. రెండు రోజులకే సిక్కి పోయినావు. కూడు తిన్నావా."

"నాను పడిన కట్టమంతా బూడిదై పోయింది. ఎప్పుడో సముద్రంలో పడి సచ్చిపోతాను."

చంద్రికి భయంవేసింది. "ఆడదానిలా యిదై పోతవేంటి ఎళవ డబ్బుపోతే మళ్ళీ వత్తది. మనరెక్కలున్నాయిగా."

"ఇప్పు డొందరూపాయలు కావాలి. లేందే పోలీసులొచ్చి లాక్కు పోతారు."

"ఒంద రూపాయలే!" .... చంద్రి దిగులు పడింది. శూన్యంలోకి చూస్తూ కూర్చుంది.

పచ్చని చేలు గాలికి ఊగుతున్నాయి. సందె చీకటిలో పచ్చరంగు కలిసిపోతోంది. కాస్తదూరంలో వున్న చింతచెట్టు మీద కోతులు కిచకిచ మంటున్నాయి. చీకటి పడబోతూంటే వాటి గుండెల్లోని భయం బరువై పోయింది. పొలాల్లో కట్టివేసిన దూడల మెడలలో మువ్వలు మాత్రం మధ్య మధ్య ఘల్లుమంటున్నాయి.

వీరా లేచాడు చంద్రి సహాయం చెయ్యలేదని వీరయ్యకి తెలుసును. అతనిలో ఏదో తెగువా ధైర్యమూ వచ్చాయి. "నే నెల్తాను" అన్నాడు. రెండడుగులు వేశాడు. చంద్రి చటుక్కునలేచి వీరయ్యని పట్టుకుంది. "ఆగు బావ రా, కూడు తిందుగానీ!"

"ఒద్దు సెంద్రీ. నే పోతాను"

"నన్ను సంపుకు తిన్నట్టే. రా బావా. ఏదో ఉపాయం ఆలోచిత్తానుగా."—చంద్రి గట్టిగా వీరయ్యను కౌగలించుకుంది. ఆమె తడి కళ్ళు వీరయ్య గుండెలకి చల్లగా తగిలాయి. వీరయ్య మారు చెప్పలేదు. ఆమె వెనకాలే వెళ్ళాడు.

చంద్రి మేనమామ తత్వాలుపాడే ఒక చిన్నసైజు ఆధ్యాత్మికవాది. పెళ్ళాంపోయాక ముండలతోనూ, ఒళ్ళు పాడైపోయాక మందులతోనూ, ఓపికపోయాక వైరాగులతోనూ మైత్రి సంపాదించిన విఖ్యాతజీవి. ఎన్ని తత్వాలుపాడినా ఎక్కడెక్కడ తిరిగినా వేళకిమాత్రం వచ్చి కూడుతినాలనే ప్రాథమిక వివేకం కోల్పోని జ్ఞాని. వీరా దిగుల్నీ బాధల్నీ చూసి ఇలా అన్నాడు.

"ఆ సౌవర్ని తిట్టకు బాబూ. ఈ దేహ మశాశ్వతం. మన ఖర్మ ఎట్టాగుందో అట్టాగే జరుగుద్ది. ఈశ్వరేచ్ఛ."

"ఈ దెవడూ ఎర్రినాకొడుకు యేవాంతం సొపుతాడు" అన్నాడు అసలే మండిపడుతూన్న వీరయ్య.

"నీ తిట్లు నన్ను తగలవురా కుర్రోడా. ఈ దేహానికే తిట్లయినా కొట్లయినా. లోపలి ఆతమ కేవీ తగలవ్."

చంద్రి గబగబా కూడువండి పెట్టింది. నిశ్శబ్దంగాతిన్నాడు వీరయ్య. చుట్టూరా గాలీ గోడలూ బరువెక్కి గుండెమీద నొక్కుతోన్నట్టుంది వీరయ్యకి.

"పడుకో వావా ఏదోఒకటి సూత్తాను" అంది, పక్కపరిచి.

"నాకు నిదరరాదు."

"ఊరికేనే పడుకో."

కాని వీరయ్య పడుకున్న కాస్సేపట్లోనే నిద్రపోయాడు. రెండు రోజుల్నుండి తిండిలేక అలసిపోయాడు. మనస్సు తనకి తెలీకుండానే నిద్రనాశ్రయించి బాధనుంచి విముక్తి చెందింది. చంద్రి దొడ్డి తలుపులు వేసి మేనమామ వినకుండా మెల్లగా అడుగులువేస్తూ రోడ్డుమీదకివెళ్ళి క్రమంగా వ్యాపిస్తోన్న చిరుచీకట్లోకి మాయమయింది.

తెల్లవారగానే వీరయ్యకి ఎవరో తట్టి లేపుతున్నట్లయింది. చంద్రి వీరాచేతిలో బంగారపు గొలుసు ఒకటి పెట్టింది. "మరిలొరగా యెల్లిపోయీరయ్య దావా."

"ఎక్కడి దిదీ!"-ఆశ్చర్యంగా అడిగాడు వీరయ్య.

"సిన్నప్పట్నుంచీ నా కుంది ఈ గొలుసు. అమ్మితే ఎసపై రూపాయలొత్తయ్. ఎల్లు ఎల్లి పో."

ఆమె తొందరనీ ఆందోళననీ గ్రహించాడు వీరయ్య.

"నిజంగా సెందిరీ?"

చంద్రి ముఖం పక్కకి తిప్పింది. పళ్ళు బిగబట్టి "లేందే యాడి త్తాడు నాకు బంగారపు గొలుసు?" అంది.

సందేహంతో, సందేహాన్ని మించిన అవసరం యొక్క బలంతో, గుప్పిటితో గట్టిగా పట్టుకొని వెళ్ళిపోయాడు వీరయ్య. చంద్రి గుడిసెలో కూర్చుని చాలాసేపు ఏడ్చింది.

"ఎందు కేడు తవు పిల్లా?" అన్నాడు మేనమామ.

"కడుపునొప్పి" అంది చంద్రి.

తెల్లని కిరణాలు తూర్పున తోచి గుడిసె గుమ్మాన్ని తాకాయి. చంద్రి కళ్ళు మూసుకుని రెండు చేతులూ జోడించి, "ఓ నూకాలమ్మ తల్లీ! నా ఈరయ్యను రచ్చించు. నీకు కోడిపెట్టని బలిత్తాను" అని మొక్కు కుంది.

# 9

రెండేళ్ళు గడచిపోయాయి. అయినా సూర్యుడు తూర్పునే ఉదయిస్తు న్నాడు. ఋతువులు వరుస క్రమంలోనే జరుగుతున్నాయి. రాత్రివేళ చీకటీ, పగటివేళ వెల్తురూ ఉంటున్నాయి. ఏం ఒక్కసారి మారకూడదూ అనుకుంది చంద్రి. కాని ప్రకృతియొక్క చర్యలో మార్పులేదు. నిద్ర లేచే ముందు అదే-ఆ బూట్ల చప్పుడే వినపడుతుంది. కాకీ దుస్తులతో టోపీలతో బాధగా పోలీసులు ఇటూ అటూ తిరుగుతూంటారు. ముసలికాకి ఎప్పుడూ ఆ గోడమీదనే నుంచుని 'కావు కావు' మని అసహ్యంగా అరుస్తూంటుంది. పక్క కొట్లోంచి కొత్తగా శిక్షపడిన కుర్రాడు అస్తమాను 'ఇది నా ఇల్లాలని' అంటూ పాడుతూంటాడు. ఎర్రని రాళ్ళతో పెద్దపెద్ద గోడలు తనచుట్టూ నిలబడి ఉంటాయి. ఆ గోడలు కదలవు, కరగవు, కబుర్లు చెప్పవు.

జైలులో ఉన్నప్పుడు మొదట ఏడ్చేది. గుండెపోటు వచ్చేటట్టు ఏడ్చేది. నిద్రపట్టేది కాదు. అన్నం సయించేది కాదు. తనవాళ్ళందరూ

తన్ని హేళన చేస్తారు. గ్రామస్థులందరూ అసహ్యించుకుంటారు. ఈ రోజున ఇంత కష్టంలో తనకి బాబులేడు. అమ్మలేదు. వీరా ఏమైపోతాడో! మనోవ్యధ ఎక్కువై పోయి, ఓ రోజున జైలు గోడలకి తలపెట్టి కొట్టుకుంది. గాయమైంది. రక్తం కారింది. పోలీసు సుబ్బారావు తిట్టాడు.

"సచ్చిపోతావ్"

"సావదానికే"

జైలులో ఉన్నన్నాళ్ళూ చాలా విషయాలు తెలుసుకుంది. పోలీసు లంటే మనుషులనీ. వాళ్ళల్లోనూ మంచివాళ్ళున్నారనీ తెలుసుకుంది. వార్డెన్ సుబ్బారావు ఎప్పుడేనా ఇంటిదగ్గర చేసుకున్న మినపరొట్టె, జంతికలు లాంటివి తీసుకొచ్చి తనకి పెట్టేవాడు. తను ఏడుస్తూ వుంటే కబుర్లు చెప్పి ధైర్యం చెప్పేవాడు. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడని తెలుసుకుంది. తెల్లవారగానే లేచి పరీక్షగా చూసేది. చాలాసార్లు పడమట ఉదయించ కూడదా అని కసురుకుంది. తన అసంతృప్తిని వార్డెన్ సుబ్బారావుకు తెలియ జేసింది. 'సూర్యుడికి బుద్ధిలే'దన్నాడు సుబ్బారావు.

రోజూ మూడు పూటలా కటకటాల్ని లెక్కపెట్టేది పాత సంగతు లన్నీ తలచుకునేది. కామంచుల విధవకూతురు సుబ్బమ్మకూడా జైల్లో పడితే బాగుండును. గచ్చనకాయ లాడుకోవచ్చునుగదా అనుకుంది. చివ రికి తన్ని వీరా ఎప్పటిలాగే గౌరవిస్తాడనీ, పనువు చేసుకుంటాడనీ, భూమ్మీద యిటుకలతో ఇల్లు కడతాడనీ- ఆశ. ఆ ఆశనే ఆహారం కింద, బలంకింద, ప్రాణంకింద మార్చుకుని బ్రతికింది.

కాని ఆమె మారిపోయింది. రెండేళ్ళలో క్రమంగా ఆమె నవ్వడం మరచిపోయింది. ఆమె బుగ్గల్లో కళ్ళల్లో వుండే నిండైన ఆరోగ్యపు నిగనిగ పోయింది. చాతకాని నలిగిపోయిన వడలిపోయిన ఉదయపు కల్వపువ్వులాగ నీరసంగా అయిపోయింది.

జైలునుంచి యివతలకి రాగానే ముందుకు నడవలేక పోయింది. అక్కడే కూర్చుని ఏడ్చింది. చిన్న మూట చేత్తో పట్టుకుని సముద్రం వొడ్డున ఉన్న వీరయ్యపల్లెకి బయల్దేరింది. వార్డెన్ సుబ్బారావు చేతికొక పావలా యిచ్చి ఏదైనా కొనుక్కుతినమన్నాడు.

ఎర్రని కంకరరోడ్డుమీద దుమ్ము లేచి ముక్కులోకీ కళ్ళల్లోకి పడు తోంది. రోడ్డు ఎండకి కాలి కాలికి చుర్రుమని తగులుతోంది. కాళ్ళు నొప్పి పెడుతున్నాయి.

తన పక్క నుంచి కార్లూ, జట్కాబళ్ళూ దూసుకుపోతున్నాయి. రకరకాల జనం యిటూ అటూ పోతున్నారు. వాళ్ళందరూ తన్నిచూసి 'దొంగ దొంగ' అని అరుస్తారేమో అని భయపడింది. ఓ చెట్టుకింద కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకుంది. రోడ్డువారనే ఉన్న చిన్న కొట్లో ఏవో కొనుక్కుతిని యిన్ని మంచినీళ్ళు తాగింది.

సాయంత్రానికి పల్లె చేరుకుంది. పల్లె బహిఃప్రకృతిలో మార్పు లేదు. గుడిసెలు నల్లని చిక్కని పల్లె జనమూ, అప్పలమ్మ యిల్లూ రావి చెట్టూ అన్నీ అలాగే వున్నాయి.

"ఓస్- యారదీ సెంద్రమ్మ ఏంటీ?"

చంద్రి పక్కకి చూసింది. మీసాల వెంకన్న ఒంటికాలితో నుంచు న్నాడు. చంకలకింద ఆసరాగా రెండు గుడ్డలు చుట్టిన కర్రలున్నాయి.

"యీరయ్య ఉన్నాడా?" భయంగా అడిగింది చంద్రి.

బొంగురుగా నవ్వాడు వెంకన్న. కన్నుగీటి "రాయే పిల్లా?" అన్నాడు. కాలు విరిగినా కామం విరగలేదు వెంకన్నకి.

తొందరగా వీరయ్య గుడిసె దగ్గరికి వెళ్ళింది. ఈలోపుగా ఎందరు పిలిచినా పలకలేదు. 'నీ యీరా లేడు' అన్న గంగడి మాటని లక్ష్యం చెయ్యలేదు. గుడిసె అంతా శిథిలమై ఉంది. లోపల నారయ్యా, చౌదరి కొడుకు సూరయ్యా చుట్టలు కాలుస్తున్నారు. చంద్రిని చూసి నారయ్య "ఇదిగో -ఇదే యీరయ్య ముండ. ఉత్తి దొంగముండ" అన్నాడు సూరయ్య. పన్నెండేళ్ళ కుర్రాడు లేచి ముందుకువచ్చి "ఎవరు నువ్వు" అన్నాడు.

"నాను సెంద్రిని. ఇక్కడ యీరయ్య ఉండటంలేటూ?"

"నీ యీరయ్య సచ్చిపోయాడు" అన్నాడు సూరయ్య. "పోపో" అని కసిరాడు.

"అన్నాయం. ఉత్తిదే. సావనేదు" అన్నాడు నారయ్య.

చంద్రి నిట్టూర్చి వెనక్కి తిరిగింది. కాని సూరయ్య ఆమెనిపిలాచాడు.

"నీకు కూడుందా?" అన్నాడు.

"లేదు" అంది చంద్రి.

"నేను సుట్టలు కాలుత్తున్నానని బాబుతో సెప్పకేం-"

"సెప్పనులే-"

"నువ్వు నిజంగా యీరయ్య ముండవేనా?"

చంద్రికి అంత బాధలోనూ నవ్వొచ్చింది.

"రెండురూపాయలిత్తాను కావాలా-" అన్నాడు చౌదరి కొడుకు. చంద్రి ఆశ్చర్యంగా చూస్తోంది. రెండురూపాయలు తీసి మోగించి, "ఇవిగో, మరి నాతో వత్తావా?" అన్నాడు చౌదరి కొడుకు. ఈ పసి కుర్ర వాడి మాటలకి జాలీ అసహ్యమూ రెండూ కలిగాయి చంద్రికి. వాడి మాట లక్ష్యం చెయ్యక "మీ బాబు ఏం చేతున్నాడు?" అని అడిగింది.

"యెదవబాబు. పచ్చవాతమొచ్చి పడుకున్నాడు. సస్తే కాసి యియ్యడు. నేను దొంగతనంగా ఎత్తుకొస్తా."

"ఇప్పుడు కొంచెం నయమేలే. నడుత్తున్నాడు" అన్నాడు నారయ్య.

"అప్పలమ్మ వుందా?"

"ఆఁ! ఇంచక్కాగా వుంది" అన్నాడు సూరయ్య.

"యీరయ్య ఏమయ్యాడో నిజం సెప్పు."

సూరయ్య సముద్రంవైపు చూపించి "అందులోపడి సచ్చాడు" అన్నాడు.

"ఉత్తిదుత్తిది, ఆ మద్దె నిక్కడికొచ్చాడు. నాను చూసాను" అన్నాడు నారయ్య.

చంద్రి సముద్రం వైపు చూసి భయంతో కళ్ళు మూసుకుంది. వడివడిగా అప్పలమ్మ యింటికి వెళ్ళింది. అప్పలమ్మ యిల్లు చాలా మారి పోయింది. గోడలకి సున్నమూ, పైన కొత్త పెంకూ, టేకుతో చేసిన గుమ్మాలు, కిటికీలూ కలకలలాడుతూంది. ఇంకో రెండుమూడు గదులు కూడా కట్టించింది. అప్పలమ్మకి కొంచెం వొళ్ళు వచ్చింది. గ్లాసోకాచీర కట్టింది. చంద్రిని చూసి ఏడ్చినంత పని చేసింది.

"యీరా ఎక్కడున్నావే దపే?"

"అబ్బో శానాదూరం, రెండుకోసులు నడవాలి" -ఏదో వూరు పేరు చెప్పింది. గుడి వెనక సందులో ఉన్నాడని చెప్పింది. అప్పలమ్మ ఆగమన్నా ఆగకుండా చంద్రి వీరా వున్న గ్రామానికి బయలుదేరింది. "తిరిగొత్తే తిన్నగా యిక్కడికి రా సెంద్రీ. నా యాపారం సూసిపెడుదువు గాని" అంది అప్పలమ్మ ప్రేమతో.

రాత్రి పదిగంటలయింది. ఊరి పొలిమేర సమీపించింది. పక్కల మొరుగులూ, నక్కల కూతలూ చీకట్లో భయంకరంగా ఉన్నాయి. గుండెలు దడదడలాడుతున్నాయి. గొంతు ఎండిపోతోంది. రోజంతా తిండిలేదు. పైగా నడక- విరామం లేని నడక. కాని యింత శ్రమా వీరా ఒక్కసారి తియ్యగా పిలిస్తే కౌగలించుకుంటే పోతాయనుకుంది. పొలాల్లో పడుకున్న రైతుల్ని గుడికి దారి అడిగింది. వీరయ్య యిల్లు సందు చివర వుందని చెప్పారు.

ఆతురతతో ఆశతో అలసటతో చివరి గుడిసెని సమీపించింది. అక్కడ దుర్వాసన భరించరానిదిగా వుంది. తరిగి పారేసిన మాంసం ముక్కలు కాలికి జిడ్డుగా తగిలాయి. కొలది దూరంలోచెట్టుకింద యానాది వాళ్ళు తప్పతాగి తందనా లాడుతున్నారు.

క్షీణస్వరంతో "యీరయ్యబావా" అనిపిల్చింది. లోపల్నుంచి కేకలు వినపస్తున్నాయి. "నాకు లేదేం కూడియ్యాల ; నువ్వు తినేసి పడుకున్నావా దొంగముండా" ఆడది ఏదో తిట్టింది. కొట్టిన చప్పుడు. "అమ్మో!" అని ఆడదాని కేక. "రక్తంకూడా కారుతుందిరోయ్ సచ్చినాడా" మళ్ళీ ఘోర మైన నిశ్శబ్దం.

ఈ సారి చంద్రి గట్టిగా పిలిచింది. "యీరయ్య బావా" అని తలుపు కొట్టింది. తలుపు తెరుచుకొని వీరయ్య యివతలికి వచ్చాడు. గడ్డం అస హ్యంగా పెరిగింది. చిరుగుల ఎర్రపంచె ఒకటి కట్టుకున్నాడు. వెన్నెల పడిన మొహంమీద నల్లని మచ్చలు ఉన్నాయి గుడ్లు లోతుకు పోయాయి.

"యారదీ?" అన్నాడు బొంగురుగా. కంఠధ్వని మారిపోయింది. రంపంతో బండరాయిమీద గీరుతూన్నట్టుంది.

"నాను సెంద్రిని. నన్ను మరిసావా నా యీరయ్య బావా ?"

వీరా మాటాడకుండా లోపలికి వెళ్ళి గుడ్డిదీపం ఒకటి తీసుకువచ్చి పరీక్షగా చూశాడు. పిచ్చిగా చూశాడు. "ఖైదులోంచి ఇడిశారా?" అన్నాడు కాస్సేపాగి.

"ఎలా అయిపోనావ్ నా యీరా. ఎలా అయిపోయినావ్" చంద్రి ఏడ్చింది.

వీరయ్య పెద్దగా దగ్గి యింకో వైపు చూస్తూ నిలబడ్డాడు.

"లోపల అదెవత్తె?" అంది చంద్రి.

"నరసమ్మ. గంజికాచి పోత్తంది."

చంద్రి ఒక్కసారి కూలబడింది. కొంతసేపటికి మాట కూడదీసుకుని "నే నెల్లిపోతాను" అంది.

వీరా మాట్లాడలేదు.

చంద్రికి దుఃఖం వచ్చింది. "నా కాకలేత్తంది. నిన్నటినుంచీ కూడు నేదు."

వీరా గొణిగాడు. "నాకే కూడులేదియ్యాల."

లోపల్నుంచి నరసమ్మ వచ్చి చూసింది. తలకి కట్టు వుంది. "సెంద్రమ్మ వచ్చిందీ, ఇంకేం ఇద్దరూ కొంపమీద పడండి. దాన్ని తగిలెయ్యి, లేందే గుమ్మంలో అడుగెట్టనివ్వను" అంటూ ఛళ్ళున తలుపులు వేసేసింది.

వీరా లేచి చంద్రిని రమ్మన్నాడు. చంద్రి వెనకాలే వెళ్ళింది. ఊరపతల పాకదగ్గర కెళ్ళారు. అక్కడున్న లావుపాటివాడితో "ఇద్దరికీ సుక్కపొయ్యి. తరవాత యిత్తాను డబ్బులు" అన్నాడు. లావుపాటివాడు సందేహించాడు. ఏమనుకున్నాడో ఏమో రెండు ముంతలతో కల్లునీ మాంసాన్నీ ఇచ్చాడు.

చంద్రి తాగనంది "ఛీ! ఛీ!" అంది.

"తాగు సెంద్రీ, లేందే సచ్చిపోతావు" అన్నాడు వీరయ్య. చంద్రి నోట్లో బలవంతంగా పోశాడు.

ఇద్దరూ తూలుతూ పొలం గట్టుమీదికి వచ్చి కూర్చున్నారు. సప్తమినాటి వెన్నెల బూడిదెలాగా వుంది.

"నీ కోసం పల్లెకి యెల్లాను" అంది చంద్రి.

వీరా దగ్గాడు.

"ఏమై పొయ్యావో అని అడలిపోయాను.''

"సముద్రంలోపడి సచ్చిపోదా మనుకున్నాను. కాని....సావనేదు'' తూలుతూ మళ్ళీ అన్నాడు "సచ్చిపోనేదు."

"మరి మన యిల్లుమాట ఏంటీ యీరయ్య బావా?" అంది చంద్రి గొంతులో వికారాన్ని అణచుకుంటూ.

"ఉత్తది. అంతా ఉత్తది. మనం యింతే. యిలాగే వుంటాం. యెదవ ఆశ....అంతే."

"అంతేనా...." వెర్రిగా నవ్వింది చంద్రి. "మరి నేనేంటి సేసేది. ఎక్కడికి పోయేదీ."

"ఈడనే వుండు. కల్లోయిత్తాను రోజూ.''

చంద్రికి మత్తు వచ్చింది. యెక్కిళ్ళమధ్య ఇలాగే అంది. "పోలీసు సుబ్బారావు బలేగున్నాడు."

గట్టుమీద చంద్రి పడుకుంది. పమిట జారిపోయింది. నురుగుకారే నోటితో అస్పష్టంగా ఘిలా పాడింది.

"పోలీసు సుబ్బారావు నా జబ్బ పట్టుకుని మాలీసు సేసాడు. మరేంటో సేసాడు.''

"హహహ....'' వీరా బొంగురుగా నవ్వాడు దగ్గాడు.

చంద్రికి పూర్తిగా మైకం కమ్మింది. నిద్ర పట్టింది. అంతా నిశ్శబ్దంగా వుంది. వెన్నెట్లో చంద్రి దేహం అర్ధనగ్నంగా మెరుస్తోంది. వీరా కొంచెం వంగి ఆమెని చూశాడు. నిదానించి చూశాడు. తన వణికే చేతులతో ఆమె చిక్కని బుగ్గలు మెల్లగా రాశాడు. కళ్ళు మూసుకుని బాధగా బొంగురుగా అన్నాడు. "నా సెందిరీ ! నా సెందిరీ!''

అక్కడికి సముద్రపు కెరటాల హోరు వినపడటంలేదు.. అది అంతటా పరచుకున్న నల్లని పచ్చని భూమి. కోట్లకొలది జనానికి తల్లిలాగా ఆధారంగా వున్న భూమి. చంద్రి నిద్రలో కలవరిస్తోంది . "నాను గొలుసు తియ్యనేదు....''

*(1964)*

# జీవితం

చేత్తో లెదర్ సూట్‌కేస్ పట్టుకొని ప్లాట్‌ఫారంమీద ఇటూ అటూ తిరుగుతున్నాడు వెంకట్రావు. అతనికి వెనుకనుంచి యెవరో పిలిచినట్లయింది. తిరిగి చూశాడు—కుటుంబయ్యగారు.

"ఏమండోయ్ కుటుంబయ్యగారూ ఇలా...." వాక్యం పూర్తి చేయకుండా ఆపేశాడు, కుటుంబయ్య ప్రక్కన మెరుస్తో నిండానివున్న పద్దెనిమిదేళ్ళ అమ్మాయిని చూసి, "తిరిగి కుటుంబయ్య పెళ్ళి చేసుకోలేదుకదా!"

రావు ఆశ్చర్యం గమనించి కుటుంబయ్య ఇలా అన్నాడు: "దీన్ని మరచిపోయావుటోయ్! అవునులే, మనం ఆరేళ్ళయింది కల్సుకుని. చిన్నతనంలో ఇద్దరూ ఆడుకునేవారు కూడాను" ఇంతకీ ఎవరో చెప్పలేదు రావుకి. ఆ అమ్మాయి నవ్వుతో "మీరు గుర్తించనంతగా మారిపోయానా రావుగారూ" అంది. ఏమనాలో తెలియక డెలికేట్‌గా ఫీలయ్యాడు వెంకట్రావు.

"అమ్మాయి చదువుకుంటోంది. ఈ ఏడాది బి.ఏ. జూనియరు అయింది. సంగీతంలోనూ, పెయింటింగులోనూ అభిరుచి వుంది. అయితే, యింజనీరు పరీక్ష ప్యాసై అప్పుడే ఉద్యోగంలో కూడా ప్రవేశించావుట కదూ? ఇలా యెక్కడికి వెళుతున్నావు. కాకినాడేనా? సగంవరకూ మేమూ వస్తాంలే! చాలా ఆనందంగావుంది నాయనా! నిన్ను చూడటం. తెలివితేటలైనవాడవూ, ఇంతకీ.... అన్నట్టు, అమ్మాయీ, వాళ్ళమ్మా మనింట్లోనే వుంటున్నారు. ఓహో, నీకు తెలియదు కాబోలు, అమ్మాయి ఫాదరు పోయాడని, నాకూ జవసత్వాలు తగ్గినై, ప్రాక్టీసూ లేదూ మరోహటీ

లేను...." పొడిదగ్గు వచ్చి కుటుంబయ్యగారి వాక్ప్రవాహానికి అడ్డువేసింది. ప్రక్కనే, ఆ అమ్మాయి నవ్వుతో నించొంది.

ఇంతకీ ఆమె ఎవరో తెలియక తికమక పడుతున్నాడు రావు. తప్పనిసరిగా చిరునవ్వు తెప్పించుకొని "అలాగాండి" అన్నాడు. దూరంగా పొగలు చిమ్ముకుంటూ వస్తూన్న రైలుని చూస్తోన్న ఆమె విలాససంపదని చూసి విభ్రమం చెందాడు.

రైలు వేగంగా వెళ్ళుతోంది. గాలికి ఎగిరే ముంగురుల్ని పైకి తోసుకుంటూ, ఆకర్షించే అందమైన నవ్వుతో, ఆమె రావుతో మాట్లాడు తోంది: "నాకు సంగీతమన్నా, పెయింటింగుఅన్నా చాలా యిష్టమండీ. నేను చిత్రించిన సంధ్యాసుందరి క్రితం నెల '....' పత్రికలో పడింది చూశారా! జీవితాన్ని ఏదో కొంత ఉపయోగకరం చేద్దామని నా కోరిక. సంగీతం అన్నారా, అబ్బ, వీణలో అనుకున్నంత ప్రవీణత సంపాదించ లేదండీ. మంచి గాలి వేస్తోంది. హాయిగా వుంది కదండీ."

ఆమె ఉత్సాహమూ, అమాయకత్వమూ వెంకట్రావును బాగా టచ్ చేసినై. ఆమె నవ్వుతూన్నంతసేపూ తెలీకుండా తనూ నవ్వాడు. కుటుంబయ్య కునుకుపాట్లు పడుతో ఉలిక్కిపడి లేచి "అమ్మాయి, స్టేషను వచ్చిందా!" అన్నాడు. "అప్పుడే ఏం స్టేషనూ!" అంది ఆమె. కుటుం బయ్య దగ్గు దగ్గి (ఉపన్యాసానికి సూచన) మొదలెట్టాడు :

"ఎప్పుడేనా వస్తోండవోయ్ మా వూరు. మా వంతెన రిపేరు చేయిస్తామంటున్నారు. మా వూరు నీ జ్యూరిస్‌డిక్షను క్రిందకే వస్తుందా? పెధప వూరు, దోమలెక్కువ....అన్నట్టు మీ వూళ్ళో దోమలున్నాయా.... మునిసిపాలిటీ ఏం శ్రద్ధ తీసుకోదు కదా! నా కిప్పిస్తే చేర్మేను పని... రావూ! యీ నాటికీ నేను కోర్టుకి వెళ్ళితే, ఒక్క లాయరూ ఎదురుగ నిల్చొని వాదించలేడనుకో. మేం యిప్పటి వాళ్ళమా! మేం ఓల్డు బియ్యేలం. అమ్మాయి చదువులా, ప్యాషనులా? .... అమ్మాయి వీణ మహచక్కగా వాయిస్తుంది. భోజనం అవగానే అమ్మాయి పాటవింటేనేగాని నిద్రపట్టదు కదా! అసలు ఆరోగ్యం పోయిందిలే. డాక్టరుని మంచి టానిక్ యిమ్మ నాలి...."

ఒక విషయంలోంచి మరొక దాంట్లోకి దూకుతున్న ఈ ములిస ప్లీడరు ఉపన్యాసాన్ని "ఓహో, అలాగా" అంటూ కడదాకా విన్నాడు వెంకట్రావు. చివరికి స్టేషను వచ్చింది. కుటుంబయ్యా, ఆమే లేచారు. "నేను వెళ్ళివస్తానండీ మీరింకా నన్ను గుర్తుపట్టలేదు" అంటూ ఫక్కున నవ్వింది. ఆక్వర్డుగా ఫీలయాడు వెంకట్రావు. "గుడ్ యీవినింగ్, నేను నిర్మలని" అంటూ ఆమె కుటుంబయ్యతో రైలుదిగి మాయమైపోయింది.

స్టన్ (stun) అయిపోయాడు రావు. నిర్మల — కుటుంబయ్య మేనకోడలు నిర్మల! ఎంత మనిషి అయిందీ, ఎంత అందమైనదీ, ఆరేళ్ళలో ఎంతగా ఎదిగిందీ, గుబురుగా పెరిగిన మొగలివనంలాగ. ఆ నవ్వు, కళ్ళల్లో ఆ తెలివితేటలు .... తను మరచిపోగలడా? ఇలా ఆలోచిస్తుంటూ తలెత్తాడు. ఎదురుగా ఒక కోమటీ, విధవా కూర్చున్నారు....

## 2

"హలో, బ్రహ్మచారి" అని పలకరించాడు శంకరం, వెంకట్రావుని. 'బ్రహ్మచారి' అనే పదం గాలిలో మెలికలు తిరిగి ములుకులా గుచ్చుకొంది రావు హృదయంలో. పార్కునుంచి వస్తోంటే పైపెచ్చు శంకరం యిలా అన్నాడు: "ప్రేమ-ప్రేమలేంది బ్రతుకేమిటిరా! ఆఫీసునుండి ఇంటికి వెళ్ళగానే, నవ్వుతో ఎదురై, ఆదరించే ఆడది లేకపోతే ఆ జీవితం నరకం, ప్రేమలో ఎంతహాయి, ఆనందం, చైతన్యం వుందిరా...."

"నిజమే! తను ఎవరినేనా ప్రేమించాడా? తనకి వివాహమాడే వయస్సు దాటిపోయిందేమో కూడా! ఆ ప్రేమానుభవం యెలా వుంటుంది? హాల్‌కెయిన్, మొపాసా, సింక్లార్ మొదలైన వాళ్ళ నవలలు చదివాడు. అంతే! ఒక స్త్రీకీ పురుషుడికీ మధ్య యింత ఆకర్షణ, యింత రొమాన్స్ దేవుడెందుకు పెట్టాడు. హత్య, త్యాగం, ఆనందం .... చివరికి జీవితం ప్రేమకోసమా! అంత ముఖ్యమా ప్రేమ....

"తన జీవితం చాలా చిత్రమైనది. కాలేజీలో చేరిన రెండేళ్ళల్లో తల్లీ తండ్రీ చనిపోయారు. అప్పు మాత్రం మిగిల్చి. చదువు మానేసి, ఏ నౌకరీనో చేద్దామంటే, మేనత్త — ఆ మేనత్త యింటికి తనెప్పుడూ వెళ్ళలేదు. ఆవిడే ఒకటి రెండుసార్లు తన ఇంటికి వచ్చింది-చచ్చిపోతూ పాతిక ఎకరాలు తనకి రాసి యిచ్చింది. అదృష్టం, అదృష్టం కాకపోతే, పరీక్ష ప్యాసవగానే వందరూపాయల ఉద్యోగం రావడమేమిటి, పై అధికారులచే మెప్పుపొందటమేమిటి. అన్నిటికన్నా రైలులో ఆమెని-నిర్మలని కల్సుగోవట మేమిటి. నెల్లాళ్లయింది ఆ అమ్మాయిని చూసి. అప్పట్నుంచీ మనస్సు అదో విధంగా అయిపోయింది."

ఇలా ఆలోచించుకుంటూ, తన బంగళాలోకి వెళ్ళి కూర్చున్నాడు. నౌకరు వచ్చి అతని బూట్సు విప్పి, రోజూ అనే మాట ఈవాళా అన్నాడు: "బాబుగారు అలసిపోయారు" రాత్రి పడుకోబోయేముందు కన్నయ్యనిలా అడిగాడు : "ఒరేయ్ ప్రేమంటే ఏమిటో తెల్సునురా ?" చాలా అనుభవం వున్నవాడిలా, చిరునవ్వు నల్లని పెదవులమీదకు రప్పించి "ఆడదానిమీద మనుసు అవటం" అన్నాడు వాడు. మరి శబ్ద రత్నాకరంలో ఏమి రాశారో !

ఉదయం లేచి డ్రస్సు చేసుకొని కూర్చున్నాడు వెంకట్రావు. కారు ఆగిన చప్పుడయింది. వెంకట్రావు వీధిలోకి ఒక్క గెంతేశాడు. కారులోంచి డిస్ట్రిక్టు యింజనీరు రాఘవరావు దిగాడు. వినయంగా ఆయన్ని ఆహ్వానించాడు రావు.

"నీ శ్రద్ధా, తెలివితేటలూ మెచ్చుకోదగిన వోయ్. నేను నీ విషయంలో ప్రత్యేకంగా ఆదరం చూపిస్తాను" అని కాంప్లిమెంటు యిచ్చాడు రాఘవరావు, మీసాల చాటున చిరునవ్వు దాచుకొని. "నర్సాపురం వంతెన రిపెయిర్ చేయించాలి. నీకే ఆ పని యిద్దామనుకుంటున్నాను. నువ్వు అనుభవం సంపాదించాలి. కంట్రాక్టర్లకి లొంగిపోగూడదు సుమీ. అన్నట్టు మీ పేటలో సీతమ్మ మాంచి నెయ్యి పోయిస్తుందిట కదూ, రెండు వీసెలు మనకి పంపించు" అని పర్సు తీయబోయాడు. వెంకట్రావు అతన్ని వారించి,

"ఎంతమాట, తర్వాత ఇద్దరుగాని లెండి, సాయంత్రానికి పంపిస్తాను నెయ్యి" అన్నాడు.

ఆయన్ని సాగనంపి, మహానందంతో కుర్చీలో ఒక్క గెంతేసి కూర్చున్నాడు. 'ఎక బంగళ బనే న్యారా' అనే పాటని వెయ్యి వరసల్లో పాడుతూ, గది చుట్టూ తిరిగాడు. చాలా శాంతంగా, నెమ్మదిగా వుండే యజమానికీ వెర్రి ఆవేశం ఎందుకో తెలియక "బాబుగారు చాలా అలసి పోయారు" అన్నాడు కన్నయ్య.

వారం రోజుల్లో ఆర్డరు వచ్చింది. హోల్డాల్, పెట్టె, కన్నయ్యా తోడురా నర్సాపురం బయల్దేరాడు రావు.

# 3

నర్సాపురం వచ్చి రెండురోజులైనా కుటుంబయ్యగారి యింటికి వెళ్ళేందుకు తీరిక లేకపోయింది రావుకి. అందుకని కుటుంబయ్యగారేవచ్చి రావుని ఆహ్వానించితీసుకువెళ్ళాడు. కుటుంబయ్యచెల్లెలు చాలా ఆదరించింది రావుని. కన్నయ్య నిర్మలకేసి, రావుకేసి ఎగాదిగా చూసి, "చిలకా గోరిం కల్లా వున్నారు" అనుకొన్నాడు. నిర్మల తనవైపు తిరిగి మాట్లాడినప్పుడల్లా చొక్కా నలిగిపోయిందేమోననీ,జుట్టు చెదిరిపోయిందేమోననీ అనుమానంతో బాధపడి ఒంటరిగా అద్దంలో చూసుకొని సంతృప్తిపడేవాడు రావు.

భోజనాలయాక కుటుంబయ్య నిర్మలని పాడమన్నాడు. "ఇంజనీరు గారు వింటారు పాడవే" అంది లక్ష్మమ్మ. లక్ష్మమ్మ కుటుంబయ్య చెల్లెలు. అందమైనదీ, చదువుకొన్నదీ. భర్త పోయినప్పట్నుంచీ అన్నగారి వద్దనే ఉంటోంది. "అచ్చంగా తల్లి పోలిక నిర్మల" అనుకున్నాడురావు.

నిర్మల వీణను సున్నితంగా సుకుమారంగా మీటుతూ, కోకిల గొంతుతో పాడుతూంటే మనోప్రపంచంలోకి వెళ్ళిపోయాడురావు. ఆమె కళ్ళ కదలికా, పెదవుల వంపూ, నాజూకైన దేహమూ అతనికి ఒక సౌందర్య రేఖగా, ఆలేఖ్యంగా కనబడింది.

"అమ్మాయిని రేడియోకు రమ్మన్నారు బహుశా ముందు నెలలో ప్రోగ్రాం వుంటుంది" అంది లక్ష్మమ్మ.

"ఎలా వుంది పాట" అంది వీణ క్రింద పెట్టుతూ నిర్మల అంత. వరకూ ఆమెపైపే చూస్తోన్న కళ్ళని మరల్చి, ఉలిక్కిపడినట్లుగా,"బావుంది. బావుంది" అన్నాడు. లక్ష్మమ్మ అతని రహస్యాన్ని గ్రహించింది.

ఎలా బయలుదేరిందో తెలియదుగాని, శరచ్చంద్రుని నవలలగురించి వాదనలోకి దిగారు రావూ, నిర్మలా. "ఆ ట్రాజెడీలు నాకు నచ్చవు-ఊహు; అంత నిర్దయగా చంపేస్తాడు" అంది నిర్మల. "లేకపోతే పర్పస్ ఎలా నెరవేరుతుందీ, నిర్మలమైన ప్రేమవున్నపుడు" అన్నాడు రావు. "ప్రేమ వుంటే మాత్రం—దేవదాసులాంటి ఆవేశపరులూ, ఉన్మాదులూ దేశాని కెందుకండీ. ఆడదే జీవితంటండి. కళ వుంది, సంఘం వుంది. ఏదో ఒక పనిలో నిమగ్నులవాలి. లేకపోతే తిని కూర్చోవాలి" అంది ఆవిడ. "మరి అది ప్రేమట. ప్రేమించి విఫలులైన వాళ్ళు అలా అవుతారేమో మరి; నాకేం తెల్సును" అన్నాడు రావు ఆలోచిస్తూ. "మీరెవర్నీ ప్రేమించలేదూ? అదేమిటండీ" అంటూ కిలకిల నవ్వుతూ వీణతో లోపలికి పారిపోయింది నిర్మల.

తను ప్రేమించాడా; పాతికేళ్ళు వచ్చినా ఆ ప్రేమ తనకొక స్వప్న భావమే కాని వాస్తవికంగా అనుభవించాడా-అందరూ ప్రేమిస్తారు- తనొక్కడే యిలా అయిపోయాడు. ఈ సందేహాలు రావులో ఆలోచన రేపినై. కుటుంబయ్య యీజీచైరులోనే కునికిపాట్లు పడుతున్నాడు. లక్ష్మమ్మ తన పూర్వ యాత్ర అనుభవాలు చెప్తూ యిలా అంది: "ఇంగ్లీషు రాకపోయినా, తెలుగు పత్రికలూ, పుస్తకాలూ నేనూ చదువుతోంటాను నాయనా. స్త్రీకి స్వతంత్రమూ. విద్యా వుండాలని నా ఉద్దేశ్యం. మా నిర్మలని చూశావా. అన్నీ చదువుతుంది, వాదిస్తుంది, తెల్సుకొంటుంది. కాలేజీలో కూడా మాట్లాడిందట.... ఏదో దానిమీద ఆశ పెట్టుకొని వున్నాను. ఈ సెలవు లయాక మద్రాసు వెళ్ళుతుంది. ఈ ఏడాదితో బి. ఏ. పూర్తి అవుతుంది. అంతవరకూ దాని పెళ్ళిమాట తలపెట్టదలచుకోలేదు. కట్నాలూ,గిట్నాలూ ఏం ఇవ్వలేంసుమీ. దాన్నిచూసి చేసుకోవలసిందే....ఇంతకీ ఆ యీశ్వరు డున్నాడు."

ఆవిడ దగ్గర్నుంచి సెలవు తీసుకొని, అర్థమవనిభావాలు మనస్సులో కలవరపరుస్తూండగా, తిన్నగా లాడ్జికి వెళ్ళాడు రావు. ఇంతలోకే కాంట్రాక్టరు చౌదరి వచ్చి వంతెన దగ్గరకు తీసుకువెళ్లాడు. ఆలోచించేందుకు తీరిక యివ్వకుండా. చీకటి పడ్డాక తిరిగి వస్తూంటే, చౌదరి ఆ వూరిని గురించి విసుగెత్తేట్టు పొగిడాడు. ఒక పాడుకొంపను చూపించి దాని చరిత్ర. పరమార్థమూ చెప్పి యిలా అన్నాడు: "రాత్రిళ్ళు దెయ్యాలు కొరకంచులు చేతులతో పట్టుకొని యీ కొంపలో తిరుగుతుంటాయి. ఆ మధ్య ఒక పిల్లాడు పొరుగూరినుంచి వస్తోంటే, దెయ్యాలు దారి తప్పించి చంపేశాయి. ఉదయానికి ఎముకలు మాత్రం మిగిల్చాయి."

వెంకట్రావుకి దెయ్యాలున్నవనే నమ్మకం లేకపోయినా, భయం ఎక్కువ. ఆ ప్రసంగాన్ని పరలోకదాంట్లోకి మార్చేశాడు. విద్యాధికులకి అంతే—దెయ్యాలని నమ్మరు కాని, పిరికితనం!

బంగళాకి వెళ్ళగానే "బాబుగారలసిపోయారు" అంటూ కన్నయ్య ఎదురయ్యాడు. రావు అతన్ని పలకరించకుండా, గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకొన్నాడు. తలదిమ్మగావుంది. ఆనందమో, ఏడుపో—ఏదో గుండెలో గుసగుసలాడుతోంది. తను అలవాటుపడి ఆనందించిన ఆ గది ఒంటరితనమూ, నిశ్శబ్దతా చాలా అసహ్యంగా చికాకు కలిగిస్తున్నాయి. ఒక లేత పాదం యీ చివరి నుంచి ఆ చివరికి నడిచి వెళ్ళినట్లనిపించింది. తనలో తెలియరాని ఒక గొప్ప మార్పు వస్తోందనుకున్నాడు రావు. లేచి ఒక పుస్తకం తీసి పేజీలు తిరగవేస్తూ, అలాగే నిద్రపోయాడు.

ఉదయం లేచేటప్పటికి మాంచి ఉత్సాహంగా ఫీలయ్యాడు. డ్రెస్సు వేసుకొని తిన్నగా వంతెన దగ్గరకు వెళ్ళి మధ్యాహ్నం వచ్చాడు. ఒక పనుపు తీసి లేవగానే, నిర్మల నవ్వు మొహం జ్ఞప్తికి వచ్చింది. తక్షణం టాయిలెట్ చేసుకొని, గుమ్మం దాటగానే కారులో కుటుంబయ్య, లక్ష్మమ్మ, నిర్మల!

"రావోయి, అలా తోటలోకి వెళ్లివద్దాం" అన్నాడు కుటుంబయ్య. రావు బెట్టుసరికి "హద్దిగా పనుంది, కంట్రాక్టర్ని...." అంటూ నసిగాడు. "ఆఫీష్యల్సు పనులు పనులంటారేమిటండి యెప్పుడూ. ఆనందించలేర

టండీ యిటువంటి యీవినింగ్స్? మీరు తప్పక రావాలి" అంది నిర్మల చిరుకోపంతో దరస్మితాలని మిళితం చేసి.

ఆ పలుకుల కోసమే వేచి వున్నాడు. ఒక్క మారుగా కారులోకి గంతేసి ఆమెను ముద్దెట్టుకొందామనుకున్నాడు లక్ష్మమ్మకూడా వచ్చింది. ఒక్క నిమిషంలో వాళ్ళందరూ తోటలో వున్నారు. "నారింజ, బత్తాయి, మామిడి....చక్కని తోట. ఎకరం పదిహేనువందలెట్టి మూడు ఎకరాలు కొన్నా"నన్నాడు కుటుంబయ్య సంతృప్తితో, గర్వంతో. తోటచుట్టూతిరిగి లక్ష్మమ్మతో ఒకచోట కూలబడి తన కోర్టు అనుభవాలు చెప్తున్నాడు. రావూ, నిర్మలా ముందుకు సాగిపోయారు.

"నాకు తోటల్లో తిరగాలని సరదా" అంది నిర్మల.

"నాకున్నూ!"

"నా పెయింటింగులలో సహం యిక్కడ కూర్చొని వేసినవే" నంటూ ఆమె తన స్వవిషయాన్ని గురించి ధారాళంగా ముచ్చటించింది. రావు తన క్లబ్బు విషయాలు చెప్తూ యిలా అన్నాడు: "నాకు టెన్నిస్ అంటే ప్రాణం. ఒక కప్పుకూడా సంపాదించాను."

"నాకు టెన్నిస్ ఆడేవాళ్ళంటే యిష్టం. టెన్నిస్ అంటే కోపం" అంది నిర్మల కొంటెగా. రావు ఉబ్బిపోయాడు ఆ పలుకుల అర్థం ఎన లైజు చేసి!

దూరంగా త్రాచుపాము, హంతకుడి ఆలోచనలా, మెలికలు తిరుగుతూ వెళ్ళింది. నిర్మల "అమ్మో" అంటూ రావు వాకోకి ఒక్క గెంతేసింది. రావు భయంలేదని హెచ్చరించాడు. ఆమె అతని చేతుల్లోంచి తప్పించుకుని ఏమి ఎరగనట్టుగా "నాకు పాములంటే భయం" అంది. ఆమె స్పర్శ, వెంకట్రావులో జడంగా పడివున్న శక్తుల్ని చైతన్యవంతంగా చేసింది. ఒక థ్రిల్ తన అణువణువులోనూ పొందాడు.

పచ్చని చేలూ, పైరుగాలీ వారి తెచ్చికోలు మర్యాదలని ఒక మూలకి త్రోసి, ప్రకృతి స్వాతంత్ర్యంలోనికి లాక్కున్నాయి. తాను ఒక

యింజనీరుననీ, ఆమె ఒక స్త్రీ అనీ మరచిపోయారు. నవ్వుకుంటూ శైశవ చేష్టలతో ఆడటం మొదలెట్టారు.

"ఆ పండు యెవరు ముందు అందుకుంటే వాళ్ళది." అంటూ నిర్మల పరుగెత్తింది. రావు ఆమె ననుసరించాడు. పండు రావుకే దొరికింది. "ఓడిపోయావు నిర్మలా!" అన్నాడు రావు. "మీవలె పరిగెత్తగలమా?" అంది వగరుస్తూ నిర్మల.

"మీ రబలలు—అబలలు" అంటూ రావు ఆమెతో కల్సి తిరిగి వచ్చాడు. మధ్యలో సంభాషణని 'పెళ్ళి - దాని చరిత్ర'లోకి మార్చాడు. ఆమె ఉద్దేశ్యం తెలుసుకుందామని. ఆమె ఇలా అంది. "కొన్ని శక్తుల్ని అభివృద్ధి పరచుకుందామన్న వాళ్ళకి పెళ్ళి అనవసరం. కాని, ప్రతి సామాన్యుడూ పెళ్ళి చేసుకోవల్సిందే!"

"నువ్వు?"

"నేనా....నేనా....మీరేం చేస్తారు" అంటూ నవ్వుతూ సంభాషణ మార్చేసింది నిర్మల. పెళ్ళి విషయం ఆడవాళ్ళ నడగకూడదనీ, వాళ్ళు సిగ్గుపడతారనీ తెల్సుకున్నాడు రావు.

కారు ఎక్కినట్లూ, యింటికి వెళ్ళినట్లూ జ్ఞప్తిలేదు రావుకి. గదిలో సామాను యిక్కడి దక్కడా, అక్కడి దిక్కడా వేసి చిందరవందర చేశాడు. పావలాల్సి "ఏదేనా కొనుక్కొని తినరా" అని కన్నయ్యకిచ్చాడు. అతని తల వేడెక్కిపోయింది. అద్దంలో చూసుకొని నవ్వుకున్నాడు. ఆమె ముంగురుల్ని- ఎర్రని పెదవుల్ని, నవ్వే కళ్ళనీ తల్చుకున్నాడు. కిటికీలోంచి ఆకాశంకేసి చూశాడు. మేఘాలుదట్టంగా క్రమ్మిన్నై. హోరున వర్షం వచ్చింది. సముద్రపుగాలి అతని మొహానికి కొట్టుతోంది. ఆ వర్షంలో తనూ, నిర్మలా తడిసి చలితో 'ఉహుహు!' అంటూ ఇంటికివస్తే ఎంత బావుంటుంది అనుకొన్నాడు.

ఎవరూ యిన్నాళ్ళు చేయలేని విషయం తను కనుక్కొన్నాడు. అది ప్రేమ—ప్రేమ! ఇన్నాళ్ళకి ఆ దివ్యాని అనుభవం పొందగలిగాడు. భావిజీవితం నిర్మలతో ఎలా గడపాలో ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.

# 4

ఆ వారం రోజులూ కుటుంబయ్యగారి కుటుంబంతో చాలా సరదాగా గడిపాడు. లక్ష్మమ్మ అతనికి రోజుకన్న రోజు ఎక్కువ ఆదరం చూపింది. ఇంక, చలాకీ నిర్మల! రోజూ పాటలు పాడేది, కబుర్లు అనేకం చెప్పేది. విద్యావతి, ఉత్సాహవంతురాలు, తన కన్ని విధాలా సరిపోయిన యువతి-- ఆమెని తప్పక వివాహం చేసుకోదలిచాడు. కాని, లక్ష్మమ్మ, బి.యే. అయితేకాని నిర్మలకి పెళ్ళి చెయ్యదలచుకోలేదు. కాబట్టి ఆ ఏడాదీ ఏలాగో అలాగ ఓపిక పట్టదలచుకున్నాడు. ఆ ప్రసంగం నిర్మల దగ్గర తీసుకు పద్దామనుకున్నాడు కాని, ఆమె యేమి చెప్తుందోనన్న భయమూ సిగ్గు అతన్ని అడగనివ్వలేదు. అయినా ఒక సంవత్సరంగా, తను వేచివుండేది.

ఉదయం లేచి స్నానాది కృత్యాలు తీర్చుకుని, ఒక్కడూ యీజీ ఛైర్‌లో కూర్చున్నాడు. ఆ సమయానికే నిర్మల చేతిలో అట్టా, పెన్సిలూ పట్టుకొని వచ్చింది.

'నిర్మలః'—— అలా వస్తుందనుకోలేదు రావు.

"ఈవాళ మీరు వెళ్ళిపోతున్నారుగా! ఈ పదిరోజులూ అలవాటు అవటం మూలాన్ని మీరు వెళ్ళుకున్నారంటే యేదో కొత్తగా ఉంది. ఒక్కరూ గదిలో కూర్చొని ఏం చేస్తారు రండీ. అలా తోటలోకి వెళ్ళి లాండ్‌స్కేప్‌ని పెయింటు చేస్తాను, చూద్దురుగాని." రావు మాట్లాడకుండా ఆమెతో బయలుదేరాడు. ఆర్టిస్టుకి కలిగే ఆవేశం కళ్ళలో జ్వలిస్తూ ఉండగా, నిర్మల పెయింటింగు ఆరంభించింది. ప్రక్కనే నిల్చుని ఆనందిస్తున్నాడు రావు—— ఆమె అంగుళులు దిద్దిన రేఖలకి కాదు ఆమె భుజం పంపుకీ, వ్రేళ్ల కదలికకీ, కళ్ళలో వెలుగుకీ. మధ్యలో యేమేమో చెప్పాడు కాని ఆమె వినిపించుకోలేదు. పూర్తిచేసి విజయచిహ్నం చూపుల్లో దాచి "ఎలా ఉంది" అంది.

"చాలా బాపుంది. నీ అంత బాపుంది." అనాలనే అన్నాడు రావు. చిరుకోపంతో చూసి వూరుకొంది. రావు ఆమె చెక్కిళ్ళపై సిగ్గు గులాబీలు పూయటం గమనించాడు.

సాయంత్రం కుటుంబయ్యా, నిర్మలా స్టేషనుకు వచ్చారు, వెంకట్రావుని సాగనంపటానికి. రైలు తప్పిపోయినా బావుండునే, రైలుపట్టాలు కదలిపోతే— యిలా ఉన్నాయి రావు ఆలోచనలు.

"నేను ఇరవై రోజుల్లో మద్రాసు వెళ్ళిపోతున్నాను. మీరు ఉత్తరం రాస్తారా? మీరెక్కడ? యింజనీరుగారు! మీకు మూర్ మార్కెట్లోంచి చక్కని ప్రెజంటు కొని పంపిస్తాను. మీరు ఏం యిస్తారు?" అంది నిర్మల.

చెమ్మగిలే కళ్ళతో, రావు రైలులోంచి చేరుమాలు ఊపాడు. నవ్వుతో నిర్మల, కుటుంబయ్యతో వెనక్కి తిరిగింది.

# 5

"సంవత్సరానికి అరవై రెండు నెలలు కాబోలు, వెధవ సంవత్సరాలూ, మాసాలూ" అని విసుక్కుంటున్నాడు రావు 'కన్నయ్య తన తెలిసినంతా ఉపయోగించి, వేళ్ళు లెక్కపెట్టి 'పన్నెండు' అన్నాడు.

రెండు నెలలయింది తను నర్సాపురంనుంచి వచ్చి. కాని, నిర్మల దగ్గర్నుంచి ఒక్క ఉత్తరమేనా రాలేదు. తన ఫోటో పంపి, ఆమె ఫోటో కూడా పంపమని ఉత్తరం రాశాడు. కాని జవాబు రాలేదు.

రోజూ ఉదయం లేవటం, ఆఫీసుపని చూసుకోవటం, సాయంత్రం క్లబ్బుకెళ్ళటం, శంకరంతో కష్టసుఖాలు మాట్లాడుకోవడం—ఇదే రొటీన్. డిస్ట్రిక్టు ఇంజనీరు రాఘవరావు గుండె ఆగి, హఠాత్తుగా చచ్చిపోయాడుట. శంకరానికి ఆడపిల్ల కలిగింది. క్లబ్బు వర్ధంతిలో నాటకం వేస్తూ 'ఆ' మూర్ఛపోయేడు. థియేటరులో మంచిపిక్చరే ఆడటంలేదు. రోడ్డులు పాడయినవి రిపెయిర్ చేయించాలి, బాగున్నవి పాడుచెయ్యాలి. యుద్ధంలో అనేక మంది ప్రజలు చచ్చిపోతున్నారు. కన్నయ్యకి కాలిమీద కురుపులేచి మానింది. బంగాళాదుంపలు సుబ్బయ్య కొట్టులో అయిపోయాయిట.... ఇవీ విశేషాలు. వెధవ సంవత్సరాలూ, వెధవ వేషాలున్నూ! వెంకట్రావుకి యిరిటేషన్ యెక్కువయింది.

ఒకరోజున సాయంత్రం శంకరానికి రహస్యము చెప్పేశాడు: "వొరేయ్ నేను ప్రేమించానురా!"

"ఏడిశావ్."

"నిజం!"

"ఋజువు!"

"వినయితే కథ!" అని తన ప్రేమగాధని ఆవేశంతో చెప్పాడు.

"నువ్వు ఉత్తరం రాశావు కదా! ఫోటో కూడా పంపావు కదా! అయినా యీ రెండు నెలలకీ నీకు జవాబు రాలేదు. కంక్లూజన్ యేమిటీ— ఆమె నిన్ను ప్రేమించలేదన్నమాట" అన్నాడు శంకరం.

బిక్క మొహంతో యింటికి వెళ్ళిపోయాడు వెంకట్రావు. వీధిలో జట్కాబండి, దీపస్తంభం అన్నీ తన్ని చూసి పరిహసిస్తున్నాయను కొన్నాడు. తను నిర్మలతో గడిపిన రోజులు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. "వెధవ శంకరం, వాడికి ఈర్ష్య. లేకపోతే, నిర్మల నన్ను ప్రేమించక పోవటమేమిటీ" అనుకున్నాడు. "యీ వారంలో ఇంకొక ఉత్తరం రాస్తా. జవాబు రాకపోతే విషంమింగి పగ సాధించుకుంటా" అనుకున్నాడు. తర్వాత రోజున చిన్న ఉత్తరం రాసి పంపాడు. "నీ ఉత్తరానికి అయిదు వేస్టు పేపరు బేస్కెట్స్ సరిపోలేదు. నీ ఫోటోలకి గోడలు సరిపోలేదు." అని రాశాడు. తనతెలివికి తనే సంతోషించాడు. లైబ్రరీలోంచి ప్రేమనుగురించిన నవలలుతెచ్చుకొని చదవటం మొదలెట్టాడు.

వారం అయింది జవాబు రాలేదు. 'రేపు' అంటే 'రేపు' అనుకొన్నాడు. పదిహేను రోజులయింది: జవాబులేదు. "విషం మింగి ఎప్పుడూ చావను. ఛ! ఇంతకంటె అందమైనదానినీ, విద్యావతినీ పెళ్ళాడి ఏడిపిస్తా" అనుకున్నాడు.

ఒకవేళ ఆమె సిగ్గుపడిందేమో. సిగ్గయితే, తనతో నర్సాపురంలో అలా అంత సరదాగా తిరుగుతుందా? ఆడవాళ్ళని నమ్మకూడదు.

ఆ రోజున మధ్యాహ్నం యింటికి వెళ్ళలేదు. స్నేహితుని ఇంటో భోంచేసి, సాయంత్రం క్లబ్బుకి వెళ్ళాడు. అతనికి చీకాకు, తలనొప్పి ఎక్కువయినై. ఒకానొక వాదనలో "ఆడవాళ్లకి స్వతంత్రం యివ్వకూడద

దనీ, స్వార్థత్వమూ, మోసమూ వాళ్లలో హెచ్చు" అనీ వాదించాడు. తర్వాత దీపస్తంభాలు లెక్క పెడుతూ ఇంటికి చేరాడు.

గుమ్మం ముందు కన్నయ్య నుంచొని ఉన్నాడు. రోజూ అనే మాట ఇవాళ అనలేదు. "బాబుగారికేదో పెద్ద పళ్లబుట్ట వచ్చింది. కమ్మని వాసన కొడుతోంది" అన్నాడు. ఒకవేళ కంట్రాక్టరేమైనా పంపాడేమో అనుకొని తిన్నగా వెళ్ళి వెంకట్రావు 'ఉస్సు' అంటూ కుర్చీలో కూలబడ్డాడు. కన్నయ్య ఒక పెద్ద బుట్ట ఎదురుగా పెట్టి, చేతిలో ఒక కవరూ, పార్శెలూ పెట్టాడు. ఆతృతతో వెంకట్రావు కవరు తెరిచాడు. నిర్మల దగ్గర్నుంచి. ఆనందంతో, స్పందించే హృదయంతో చదివాడు. అందులో ఉన్న సారాంశం ఇదీ—తను లాడ్జి మారటం వల్ల ఉత్తరాలు ఆలస్యంగా చేరినట్లూ అదీగాక, అతని ఆతృతని వృద్ధిపొందించటం తనకొక సరదా అనీ వ్రాసింది. "రాజకీయాలంటే ఈ మధ్య నాకు సరదా కలిగింది. చాలా ఇంటరెస్టుతో చదువుతున్నాను.... క్రితం నెల రేడియోలో నా పాట విన్నారా?.... మీకు చాలా కోపం వచ్చి ఉంటుంది కదూ ఉత్తరం రాయలేదని.... జీవితంలో నేను చేయవల్సిన పనులు చాలా ఉన్నాయనిపిస్తోంది? ఈ మధ్య ఆడవాళ్లం (విద్యార్థినులం) కలిసి ఒక కల్చరల్ క్లబ్బు స్థాపించాము. కళలూ, విజ్ఞానమూ, అభివృద్ధి పొందించటానికి.... యింజనీరు గారూ! ఎన్ని రోడ్లు రిపెయిర్ చేయించారు...." ఇలాగే ఏమేమో రాసింది. పార్శెలు విప్పాడు. ఒక చిన్న సెల్యులాయిడ్ బొమ్మ, బుడగలున్నూ-ఫోటో! అచ్చంగా నిర్మల- ఆ నవ్వుతోన్న మొహమూ, ఆ ముంగురులూ, ఆమృదువైన చేతులూ....

ఆగలేని ఉద్రేకంతో ఆ ఫోటోని ముద్దెట్టుకొన్నాడు, గది తలుపులు వేసుకొని. ఉత్తరంలోని గుండ్రని అక్షరాల్లోని రహస్య హస్తవిన్యాసాన్ని తలుచుకొన్నాడు. ఈ శుభవార్త చెప్పినందుకు కన్నయ్యకి అయిదు రూపాయలు బహుమానం యివ్వదల్చుకున్నాడు. ఆ గదీ, టేబిలూ, గోడకి సాలీడూ, పుస్తకాల షెల్ఫూ-అన్నీ ఆనందంతో నవ్వుతున్నాయి.

తర్వాత రోజున ఆమెకి చాలా ఉత్సాహంతో వుత్తరం రాశాడు. ఆమె 'కల్చరల్ క్లబ్బు'ని పొగిడాడు. "నువ్వు నాకు దేవతవు" అన్నాడు ఒకచోట....

అప్పట్నించీ ప్రతీ పదిహేను రోజులకీ ఆమె దగ్గర్నుంచి ఉత్తరం వస్తోంది. ఎప్పుడూ సంగీతం గొడవా, కల్చరల్ క్లబ్బు విశేషాలూ. "స్త్రీ తల్చుకుంటే భారతదేశాన్నేకాదు. ప్రపంచాన్నే మార్చివెయ్యగలము. ప్రపంచ కల్యాణం మా చేతుల్లో వుంది" అని రాసింది ఒకచోట. ఆ వుత్తరాలు, మంత్రాలు చదివి చదివి విసుగెత్తిన పురోహితుడి మొహంలాగ వున్నా. వాటిల్లోనే కొత్తసొంపులూ, కొత్త అర్థాలూ కనిపెట్టుతున్నాడు వెంకట్రావు.

అయిదు నెలలు యిలా గడిచినై. నిర్మల ఫోటో చక్కని ఫ్రేములో అమర్చబడి బల్లమీద నవ్వుతోంది. హేమంతాలూ, శ్రావణాలూ అన్నీ వొక వసంతంలాగున్నాయి రావుకి. రోజులు లెక్కపెడ్తున్నాడు. క్యాలెండర్లు తయారుచేసిన వాళ్ళ బుద్ధిహీనతని దూషిస్తున్నాడు. ఆ వూళ్ళో ఒక చిన్న మేడని అద్దెకి మాట్లాడి వుంచాడు. భావిజీవితం నిర్మలతో గడిపేందుకు. సంసారానికి కావల్సిన సామానులేమిటో రాత్రింబవళ్ళు ఆలోచించి ఒక పట్టీ తయారుచేశాడు. ఆ పట్టీలో, ముందుపుట్టబోయే వంశోద్ధారకుడికి పాలపీపలూ, తొక్కుడుబండీ, నిర్మలకు పియానో, కుంచెలూ, కాన్వాసూ కూడా వున్నాయి. ప్రావిన్షియల్ ఇంజనీర్సు సభలో ఉత్సాహంగా పాల్గొన్నాడు. కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడైనట్టు ఆంధ్రపత్రికలో పడింది. పేపరు కటింగు వొకటి నిర్మలకు పంపించాడు.

పెళ్ళి అయి, సంసారం సాగిస్తూ వున్న మిత్రుల యింటికి తరచు వెళ్ళి, వాళ్ళ సౌఖ్యమూ, వాళ్ళ సొంపూ, సొగసూ చూసి నేర్చుకునేవాడు. "రష్యా అంటే చక్కని దేశమే కాని, ఫేమిలీ-కుటుంబ - సౌఖ్యం ఉండదోయ్" అనేవాడు సోషలిస్టు కామ్రేడ్సుతో. తను నర్సాపురం వెళుతూన్నట్టు నిర్మల దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది. కాని ఆమె తేదీ సరిగా వ్రాయక "మూడు నాలుగు రోజుల్లో" అని వ్రాసింది. రెండు రోజులు కాళ్ళు పడిపోయేట్టు స్టేషను చుట్టూ తిరిగి ఆశాభంగం పొందాడు. "రాత్రి బండికెళ్ళిందేమో" అని సమాధానపరచుకొన్నాడు.

నర్సాపురం వెళ్ళి లక్ష్మమ్మని కల్సుకుని, పెళ్ళి విషయం మాట్లాడుదామని నిశ్చయించాడు. కాని ఇంతలోకే అతనికి ప్రభుత్వం పని తగిలింది.

వారం రోజులోపకపట్టి ఆశతో, ఆనందంతో, ఉత్సాహంతో, రసన్నయ్యని ఇంటిదగ్గర వుంచేసి, 'సిరికింజెప్పడు' అన్నంత వేగంతో బయలుదేరాడు. మానవుడికి రెక్కలు వుండటం చాలా అవసరమని యింజనీర్ల సభలో తీర్మానించటానికి నిశ్చయించుకొన్నాడు.

# 6

ఏడాది క్రిందట నిర్మలకన్న ఈ నిర్మలలో సౌందర్యం యినుమడించింది. ఆమె కళ్ళల్లో వసంతాలు నవ్వుతున్నై. ఆమె శరీరపు కదలికలో, పెదవి వంపుల్లో జవ్వనపు జిగిబిగి గోచరిస్తుంది. గులాబీరంగు రిబ్బను కొసను కట్టిన వాల్జడ సౌఖ్యానికి సోపానసరళిలా వుంది.

కుటుంబయ్యకి దగ్గు ఎక్కువయింది. లక్ష్మమ్మ చాలా సంతోషంతో ఆదరించింది. మొదటిరోజున నిర్మల అంతగా మాట్లాడలేదు రావుతో. ఏదో పుస్తకం తీసుకొని మేడమెట్లమీద కూర్చొని సాయంత్రం వరకూ చదువుతోంది. కొత్తగా నేర్చుకొన్న పాటలు పాడింది. తన యాక్టివిటీస్ను గురించి చెప్పింది. ఆమె చలాకీతనానికి గాంభీర్యము తోడై కొత్త అందాన్ని కూర్చింది.

మరునటి రోజున లక్ష్మమ్మ దగ్గర బిడియపడుతూ వివాహ ప్రసంగం తెచ్చాడు. లక్ష్మమ్మ యిలా అంది: "నాయనా, నిన్నే అడుగుదామనుకొంటున్నాను. కావాల్సినవాడవూ, ఉద్యోగస్థుడవూ యింతకన్నా నాకు కావాల్సిందేమిటి? అమ్మాయి కూడా యిష్టపడుతుందనే నా ఉద్దేశ్యం; ఎప్పుడా ప్రసంగం తెచ్చినా, 'నీ కెందుకు నీ గొడవ కా'దంటుంది. అయినా ఈవేళ అడిగిచూస్తాను. చదువుకొన్నవాడవు. దొరలలా మీరే ఆలోచించుకోండి."

లక్ష్మమ్మ అడిగి చెప్పేవరకూ రావు ఓర్పు పట్టలేకపోయాడు. మధ్యాహ్నం నాలుగు గంటలకి నిర్మల గదిలోకి వెళ్ళాడు. నిర్మల వీణ వాయిస్తోంది.

"నిర్మలా!"

"ఊఁ!"

"నీతో ఒక విషయం మాట్లాడాలి."

"చెప్పండి."

"ఇక్కడకాదు-తోటలో!"

ఆమె విశాలమైన కళ్ళనెత్తి రావు కళ్ళల్లోకి చూసింది. ఆమె బుగ్గ లెర్రపడ్డాయి. కాని ఏమీ తెలియనట్టు 'అలాగే' అంది.

తోటలో మామిడిచెట్టు క్రింద నిల్చుని ఆమె నడిగాడు, ఆమె చేతిని తన చేత్తో పట్టుకుని. ప్రకృతి పవిత్రమైన గంభీరత దాల్చింది. పచ్చనిచేలు ఎండలో మెరుస్తున్నాయి. ఆవేశం రావు గొంతులో 'జలజలించింది.'

"నిర్మలా! నేను చెప్పబోయే విషయం నీకు తెలిసే వుంటుంది. నేను తలిదండ్రులు లేనివాణ్ని. స్వశక్తిచేత ఈ స్థితిలోకి వచ్చాను. నాకు నూటపాతిక రూపాయలు జీతము, మేనత్త రాసియిచ్చిన పాతిక ఎకరాల నా ఆస్తి....నాకు జీవితంలో ('జీవితం' అని ఉచ్చరించినపుడు అతని గొంతు వణికింది. అతని బ్రతుకు తన యెదురుగా నిల్చొని నవ్వినట్టనిపించింది.) ఏ కోర్కెలేదు. ఒకటితప్ప నా కష్టసుఖాల్ని పంచుకొనేందుకు నా ప్రేమకు తిరిగి ప్రేమ యివ్వటానికి, నా యింట్లో ఒక దేవత-ఒక చిరునవ్వు-ఒక స్త్రీ-(అతని గొంతు తిరిగి ఒణికింది) నిన్ను ప్రేమిస్తున్నాను నిర్మలా! నీ ప్రేమ అమూల్యం. నిన్ను పెళ్ళి చేసుకొనాలని నా కోరిక. నీ తల్లి యిష్టపడింది. నువ్వు. నువ్వు....ఒప్పుకోవాలి అంతే."

నిర్మల ఒకమారు రావుకేసి చూసి రెప్పలు కిందికి వాల్చింది. రావు ఆమె చేతిని నొక్కుతూ, "చెప్పు నిర్మలా!" అన్నాడు. ఆమె తిరిగి అతనికేసి చూసి రెప్పలు వాల్చింది. ఆ మౌనం చిరుమంటలా రావు గుండెలో సెగల్ని జల్లుతోంది. తిరిగి అడిగాడు రావు. స్ఫుటంగా, మృదువుగా నిర్మల యిలా అంది :

"మీరు వేరొక విధంగా తలిస్తే నేను చెప్పలేను. నాకు మీయెడ విముఖభావం లేదు. ఈ ఏడాదిలో నా ఉద్దేశ్యాలు మారిపోయినై. కళకి

సంఘానికి సేవ చేయడానికి నేను కంకణం కట్టుకొన్నాను. నాకు పెళ్లి చేసుకొనే ఉద్దేశ్యం యేమీలేదు. మీకు కష్టం కలిగిస్తే క్షమించండి. కాని యిది నిశ్చయం."

రావు ఆమె చేతిని వదిలేశాడు. కళ్ళమ్మట పొర్లివచ్చే నీళ్ళు, పగిలి పోయే గుండె కనబడకుండా, వెనక్కి తిరిగి, మొహం చేతుల్లో దాచుకు చరచర వెళ్ళిపోయాడు. "రావు, రావు" అని పిలుస్తున్న నిర్మలకేక అతను వినిపించుకోలేదు. నిర్మల యింటికి వెళ్ళింది. రావు కన్పడలేదు. "అర్జంటు పని అంటూ వెంకట్రావు యీ బండికి వెళ్ళిపోయాడమ్మాయి!" అంది లక్ష్మమ్మ. నిర్మల జాలితో నిట్టూర్చింది.

## 7

వెంకట్రావు కొన్నాళ్ళు వీధిలోకి వెళ్ళలేదు. నిర్మల ఫోటో శంక రానికిచ్చేశాడు. ఒక్కడూ ఆకాశంకేసి చూస్తోండేవాడు—మబ్బులు, నక్ష త్రాలు, చీకటి, పగలు, సంధ్య, అన్నీ ఆ తెరమీద నాటకమాడుతూండేవి ఈ ఏకాంత ప్రేక్షకుడి కోసం.

రోజులూ, వారాలూ, నెలలూ గడిచినై. వెంకట్రావు వీధిలోకి వెళ్ళ టం మొదలెట్టాడు. ఆ వూరి కంట్రాక్టరుతో రోజూ పొక గంట వాతా ఖానీ, రెండు గంటలు పేక ఆడేవాడు. సాయంత్రం క్లబ్బుకి వెళ్ళి నలు గురితోనూ కలిసి కూర్చొనేవాడు; కాని "చాలా మితభాషి అయాడురా రావు" అనేవాడు స్నేహితులు. యుద్ధాన్ని గురించీ, ఆరోగ్యశాఖని గురించీ పెన్నీసును గురించీ అందరూ చెప్పుకొనే కబుర్లు విని, ఆలస్యంగా ఒక్కడూ చీకట్లో ఇంటికి వెళ్ళేవాడు. "బాబుగారు అలసిపోయారు" అంటూ కన్నయ్య యెదురుగా వచ్చేవాడు.

ఏడాది గడచింది. అతనిలో ఒక విధమైన అసంతృప్తి, అశ్రద్ధా పాదుకొనిపోయినై. ఆరోజున తిన్న భోజనపదార్థాలు ఏవో కూడా చెప్ప లేడు. శంకరంతో యిలా అనేవాడు: "ఆ రోజులు వేరోయ్! కాని ఆమె

నా జీవితాన్ని భస్మం చేసింది." ఎవరేనా తన వివాహ ప్రస్తావన తెస్తే చిరునవ్వుతో ఇలా అనేవాడు: "ఇరవై ఆరేళ్లు కదాండి—అదే, ఇరవై ఏడు వచ్చింది. అంటే సగం జీవితం అయింది. ఆ సగమూ సుఖంగా యిలా పోనివ్వండి! అతను ఉద్యోగం విషయంలో యిదివరకటికన్నా పట్టుదల యెక్కువ చూపాడు. జీతంలో ఇంక్రిమెంటు వచ్చింది.

సాయంత్రం పొలాలగట్లనుంచి వస్తో వివిధ వృక్షాల్ని పరికించేవాడు. కన్నయ్య ఆ ఏడాది వర్షాల్ని గురించీ, రైతుల కష్టాల్ని గురించీ చెప్పేవాడు. రోడ్డుమీదకు రాగానే "ఓహో! యింజనీరుగారా! నమస్కారం" అని పలకరిస్తారు వొకరు.

"కనపడటం మానేశారేం" అంటాడు రావు.

"మా చిన్న వెధవకి వంట్లో బాగాలేదు. అదీగాక మా అమ్మాయి పురుడు కొచ్చింది."

"అలాగా?"

"మా రోడ్డు విషయం మీరు కొద్దిగా దయ వుంచాలి."

"ఏం రోడ్లండీ! గవర్నమెంటు కాదాయం తగ్గిపోతోంది. ఈ డిస్ట్రిక్టు బోర్డు వచ్చాక మరీ అధ్వాన్నం అయిపోయింది" అంటూ చిన్నగా దగ్గుతాడు రావు.

"మరేసండీ! ఈ మున్సిపాలిటీలు-'అమ్మి రాజు' చైర్మన్ అయాక దరిద్రమే పట్టుకొంది. 'ఓ' అంటే 'న' రాదు, డబ్బు గుప్పేసి పదవి సంపాదించాడు."

"కలికాలం!"

"చూడండి ఈ మురికి కాల్వలూ.... అబ్బ, వెధవ దోమలూ, వెధవ యిదీన్నీ" అంటాడు ఆ పెద్దమనిషి.

అక్కణ్ణుంచి తిన్నగా ఇంటికి వెళ్తాడు రావు. కొత్త మిత్రుడు యాజులు, ఎం. ఎస్ సి. వస్తాడు. తెలివైనవాడూ, మంచివాడూ కాని, అహంభావపుపాలు ఎక్కువ. నోబుల్ ప్రయిజు తనకి ఎప్పుడో వస్తుందనే నమ్మకం— తనుముందు చేయబోయే రిసెర్చికి. తర్వాత భోజనం, ఆఫీసు కాగితాలు చూసుకోవటమూ, కిటికీలోంచి విశాలమైన బయలు చూడటమూ,

కన్నయ్య "పెళ్ళాంమీద బెంగపుట్టింది, సెలవిప్పించండి" అంటాడు. ఆ నక్షత్రాలు ఒక్కొక్కటే రాలిపోతే, యింజనీర్లు ఆకాశానికి రోడ్డువేస్తే, దెయ్యాలు తన్ని లప్ చేస్తే—ఇలా ఆలోచించుకుంటూ భయంతో నిద్రపోతాడు. ఉదయం తను పక్కమీద నుంచి లేవకుండానే దాసీది రావటం, అంట్లు చప్పుడు చెయ్యటం, కన్నయ్య దానితో సరసాలాడటం వింటాడు. లేచి స్నానంచేసి డ్రెస్సు వేసుకొంటాడు. తిరిగి ఆఫీసు పని, సాల్యూటు చేసేవాళ్ళకి సాల్యూటు చేస్తూ, పెదవిలో చిరునవ్వు మిళితంచేస్తూ మాట్లాడాలి. అందరూ 'ఇంజనీరుగారు' అంటూ గౌరవిస్తారు; అంతేగాని ఒక పద్దెనిమిదేళ్ళ పిల్లచేతిలో ఓడిపోయాడనీ, ఆమె వెనకాల ఉన్మాదుడులా తిరిగాడనీ ఎవరికి తెలుసు? సాయంత్రం క్లబ్బుకి; తిరిగి యుద్ధాన్ని గురించీ, రేడియోని గురించీ కబుర్లు వసంతరావు తన రసికత్వాన్ని గురించి గర్వంగా విశదపరుస్తాడు. ప్లీడరు రామచంద్రరావు పార్కులో మొక్కల్ని గురించీ, శ్రీనివాసరావు రేడియో రిపెయిర్లని గురించీ లెక్చర్లిస్తారు. అమ్మిరాజు తను సన్నంగా వుండేటందుకు మార్గాలు చెప్పమంటాడు. చివరికి అందరూ పేకాడుతారు. తనకి ఎప్పుడూ నష్టం వస్తుంది. రాత్రి ఒక్కడూ యింటికి వెళ్తాడు. కన్నయ్య "బాబుగారు అలసిపోయారు" అంటూ, చీకటి నవ్వుతో ఎదురౌతాడు.

వెధవ కలలు వచ్చిన పెద్దనిద్రలాగ, మూడేళ్ళు గడిచిపోయాయి. వెంకట్రావుకి జీతం రెండువందల దాకా పెరిగింది. అతనికి ప్రపంచంలో ఆనందించవల్సిన వస్తువూ, విచారించవలసిన విషయమూ ఏమీలేవు. నిజానికి అతని దృష్టిలో అన్నీ వొకటే; ఏడుపూ, నవ్వూ లేనివాడు తనొక్కడే అనుకొన్నాడు.

ఆ రోజున ఒక్కడూ సిగరెట్ కాలుస్తూ ఈజీచైర్‌లో పడుకొని ఆలోచిస్తున్నాడు, దేవుడు గూడా లేడా అని. తను చాలా పెద్దవాడైపోయినట్టూ, వృద్ధాప్యాన్ని సమీపిస్తున్నట్టూ తల్చుకొని వులిక్కిపడ్డాడు. కన్నయ్య వొక్కగంతేసి "అమ్మాయిగారు వచ్చేరండి" అన్నాడు.

"ఎవరురా?"

"అమ్మాయిగారు—నర్సాపురం అమ్మాయిగారు."

దీనంగా, ధైర్యంగా చూస్తో, నిర్మల గుమ్మంముందు నుంచుంది. రావు ఆమె అకస్మాత్ ఆగమనానికి తెల్లబోయాడు. ఏమనాలో తెలియక కంగారుపడ్డాడు.

"నేను రావటం మీకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది" అంది నిర్మల, పేలవంగా నవ్వుతో. వెంకట్రావు తేరుకొని లేచి ఆమెని ఆహ్వానించాడు. అతను చాలా నెమ్మదిగా మాట్లాడాడు:

"కుటుంబయ్యగారు క్షేమమా?"

"పోయారు-ఏడాది అయింది."

"పాపం!" అన్నాడు రావు. నిర్మలలో పూర్వపు చలాకీతనమూ, అయస్కాంతంలా ఆకర్షించే పెర్సనాలిటీ అంతలేదు. ఆమెలో వెలిగే సహజమైన నవ్వూలేదు. ఆ నవ్వుయొక్క మాసిపోయిన ఛాయలు మాత్రం కన్పడుతున్నాయి.

"మీ అమ్మగారేం చేస్తున్నారు."

"కాశీ వెళ్ళిపోయింది కోపం వచ్చి."

"ఏం-నిర్మలా!"

"నేను పెళ్ళి చేసుకోనన్నానని."

తర్వాత మౌనం. గత సంగతులు జ్ఞప్తికి వచ్చి ఇద్దర్నీ కలచివేశాయి. వెంకట్రావు కిటికీలోంచి ఆకాశంకేసి చూస్తున్నాడు; పిల్ల మబ్బులు గంతులేస్తున్నాయి, లేగదూడలలాగ. ఇంతకీ ఆమె ఎందుకొచ్చిందీ.

"ఈగది అంతా యింతచిందర వందరగా వుందేం? ఆడదిక్కులేందే మగవాళ్ళు ఇలాగే ఉంటారు" అంది నిర్మల. ఆ పలుకుల్లోఆశా, ఆత్రుతా, పరితాపమూ గుడిగంటల్లా శబ్దించాయి. తొమ్మిది గంటలకు రావు ఆఫీసుకు వెళ్ళిపోయాడు. నిర్మల రావు యింట్లోనే ఆగిపోయింది. సిగరెట్టు పీకలూ, పుస్తకాలూ ఖాళీ అగ్గిపెట్టెలూ, పాతబట్టలూ—గది అంతా అసహ్యంగా వుంది. తిరిగి రావు సాయంత్రం యింటికి వచ్చాడు. గుమ్మానికెదురుగా నిర్మల నవ్వుతో నుంచొంది. ఇదివరకటికన్నా ఆమె పెద్దదయింది. ఆ సమయంలో తిరిగి నిర్మలలో పూర్వపు నవ్వూ కళ్ళల్లో వెలుగూ కలిగినై. రావు యిల్లంతా చూశాడు. అన్నీ చక్కగా అమర్చబడి వున్నాయి.

"నిర్మలా-నువ్వేనా?" అన్నాడు రావు.

"ఏం బావులేదూ" అంది నిర్మల. వెంకట్రావు మాట్లాడలేదు. నిర్మలకి కష్టమనిపించింది.

"కోపమా మీకు, స్వతంత్రం తీసుకున్నాననీ?"

"కాదు నిర్మలా! చాలా సంతోషం. కాని నా మనస్సుకి పూర్వపు గది శాంతీ, సంతోషమూ యిస్తుంది."

నిర్మల ఉలిక్కిపడింది. అతనిలో యెంత భేదం కలిగిందో మానసికంగా! రావు దగ్గరగా కుర్చీలో కూర్చుని తన్ని గురించి యిలా చెప్పింది: "నేను యితర యాక్టివిటీస్ మానేశాను. నాకు విసుగెత్తింది. అవన్నీ భ్రమలు.... అందరూ విమర్శించేవారే! నా కున్న ఉత్సాహం యితరులకి లేదు. నాకోసమూ అనిపించింది. అవన్నీ భ్రమలు....రావు. లేకపోతే స్త్రీలకు పబ్లిక్ జీవితం ఏమిటి?"

"నిజం" అన్నాడు రావు.

"నిజం- ఈ మూడేళ్ళ జీవితమూ-యెంత వృధా చేశానో!"

రావు ఆమెకేసి చూశాడు. ఆమెలో పశ్చాత్తాపమో, బాధో వ్యక్తమవుతోంది.

ఇద్దరూ కలిసి షికారు వెళ్ళారు పొలంగట్లకి. రావు తన ఆఫీసు పనుల్ని గురించి ముక్తసరిగా చెప్పాడు ఒకరి హృదయంలో తళుకొత్తే ఆశా, నిరాశా, పరొకరి హృదయంలో మ్రోడుపోయిన చైతన్యమూ, నీడలులా, దెయ్యాలులా కదుల్తున్నాయి. ఎక్కువసేపు ఇద్దరూ మౌనంగానే వున్నారు.

ఇద్దరూ క్యారేజి భోజనం చేశారు. మధ్య గదిలో రావూ, ప్రక్కగదిలో నిర్మలా పడుకొన్నారు. వరండాలో కన్నయ్య గుర్రుపట్టుతున్నాడు.

పన్రెండు గంటలయింది. రావు పడుకొన్నదీ లేందీ చూద్దామని నిర్మల రావుగదిలోకి వచ్చింది. రావు రెండుచేతులతో తలని పట్టుకొని కుర్చీలో కూర్చొన్నాడు. "మీరు నిద్రపోలేదా?" అంది నిర్మల.

"........."

"జబ్బు చేస్తుంది."

"నాకు అలవాటే!"

"తల అల్లా పట్టుకున్నారేం?" నిర్మల అతన్ని సమీపించి అతని కణతల్ని తాకింది. అవి కొట్టుకుంటున్నాయి.

"తలనొప్పి ఎక్కువగా వుందా?"

"అంత ఎక్కువగా లేదు."

నిర్మల తన గదిలోకి వెళ్ళి అమృతాంజనంతో తిరిగివచ్చింది. "చేతులు తియ్యండి. రాస్తాను. నాకు చెప్పలేదేం? ఎందుకు ఒక్కరూ అలా బాధపడతారు?" అని అతని కణతల్ని తాకబోయింది. వెంకట్రావు ఆమెని వారించి, ఆమె చేతిలోని డబ్బా తీసి బల్లమీద పెట్టాడు. ఆమె అక్కడ కొంతసేపు నుంచొంది. ఆ మౌనం ఆమెకి దుర్భరమైంది. తడబడుతూ పక్కగదిలోకి వెళ్ళి కూలబడింది. ఒక నిముషానికి వెంకట్రావుకు వెక్కి వెక్కి యేడుపు వినపడింది. ఆమె గదిలోకి వెళ్ళి "ఛ! నిర్మలా ఏడుస్తున్నావా!" అన్నాడు.

"నేను రావటం మీకింత కష్టంగా ఉందని నాకు తెలియదు. నేను మీకు అవసర సమయంలో సేవ చేయకూడదూ? మన పూర్వ స్నేహం మరచిపోయారా!" ఆమె యింకా తలగడలో మొహం కప్పుకొని ఏడుస్తో ఉంది.

"లేదు నిర్మలా...." అతని గొంతుక బరువెక్కింది. "నేనేం చేస్తున్నదీ నాకొక్కొక్కసారి తెలియదు. నీ రాక నాకు కష్టం కలిగించలేదు. నీకు కష్టం కలిగిస్తే క్షమించు. నా ఇంటికి వచ్చిన స్నేహితురాలివి, అతిథివి. నీ సౌఖ్యం చూడవలసిన విధి నాకుంది?" నిర్మల తల పైకెత్తింది.

"మీకు నేను అంతేనా? అతిథినేనా? మీ జీవితానికి యింక ఎందుకూ ఉపయోగపడలేనూ?" ఆమె గొంతు గద్గదికమయింది.

"నాకు జీవితమనేది వుంటే అది జరిగిపోయింది; నాకు కోరికలు లేవు. అందుమూలాన్ని ఒకరి సాహాయ్యం అవసరమని అనుకోను. నాకు రొటీన్ అలవాటయింది. జీతమిస్తారు పనిచేస్తాను—అన్నింట్లోనూ అంతే."

"ఇంక ఎందుకూ వుపయోగపడలేనూ మీ జీవితానికి? చెప్పండి, చెప్పండి" ఆమె విహ్వలతతో అడిగింది.

"నిర్మలా, ఒకరికొకరు పనికి వస్తారనుకోవటం పిచ్చి వూహ. పడుకో నిర్మలా! తలితండ్రులు లేరు నీకు. ఈ గృహంలో ఎవరికేనా నీడ నిస్తాను. నాకు సంపాదనా శక్తి వున్నంతవరకు. అలా యిచ్చేందుకు భగవంతుణ్ణి శక్తి యిమ్మని ప్రార్థిస్తాను."

"ఎంత మారిపోయారు మీరు!" అంది నిర్మల, కళ్ళు ఒత్తుకుంటూ. ఆమె తల ఎత్తేటప్పటికి రావు అక్కడ లేడు. చలిగాలి తలుపు సందుల్లోంచి కీచుమంటూ వీచింది.

ఉదయం రావు లేవగానే కన్నయ్య వచ్చి "అమ్మాయిగారు వెళ్ళిపోయారు బాబూ! మీతో చెప్పమన్నారు" అన్నాడు.

"ఎంతసేపయింది?"

"ఇప్పుడే-వీధిలో ఉంటారు."

వెంకట్రావు గుమ్మంలోకి వెళ్ళాడు, ఫర్లాంగు దూరంలో కారు చుమ్మలో నిర్మల నడిచివెళ్ళిపోతోంది-స్టేషనుకి!

# 8

ఎనిమిది నెలలు గడిచాయి. ప్రభుత్వం వెంకట్రావుని ఫారెస్టురేంజికి బదిలీ చేశారు. ఒకరోజున కన్నయ్యతో, సామానుతో బయల్దేరాడు రావు.

ఆ వూళ్ళో మూడువందల గడపకన్న ఎక్కువ జనాభా లేదు. రెండుమైళ్ళ దూరంలో అరణ్యం కనపడుతుంది. ఆ వూళ్ళో ఒక పెంకుటిల్లు అద్దెకు తీసుకొని వుంటున్నాడు రావు. కాని అక్కడ అతనికి భోజన సదుపాయం లేదు. ఒకనెల జరిగాక శంకరానికి ఉత్తరం రాశాడు వంటలక్కని గాని, బ్రాహ్మడినిగాని పంపమని. పదిహేను రోజుల్లో కేశాలున్న విధవ సుందరమ్మ వచ్చి పొయ్యి రాజేసింది.

ఆ వూళ్ళో వాళ్ళకి, ప్రక్కగ్రామాల వారికీ యింజనీరుగారు ప్రత్యక్షదైవం. పులితోళ్ళూ, దుప్పి చర్మాలు, కొమ్ములూ, అల్లోనేరేడి

పళ్ళూ, యింకా వివిధములైన ఫలసముదాయాలూ ప్రతివారం వెంకట్రావుకి భక్తిశ్రద్ధలతో అర్పించేవారు-వాళ్ళ ఆచార వ్యవహారాలు చిత్రంగాఉన్నై. వాళ్ళు మాట్లాడే తెలుగు ఒక్కొక్కసారి అర్థమయ్యేది కాదు. పట్టణాల్లో ఉండే కృత్రిమత్వం, అతితెలివీ అక్కడలేవు. కష్టపడి పనిచేసుకుంటారు, అనుభవిస్తారు. పార్టీ ప్రభుత్వాలూ, యుద్ధాలూ, ప్రజావాదమూ, సామ్యవాదమూ, ఆత్మహత్యలూ, రోడ్డుమమ్మీ, సినిమాలూ, ప్రేమలూ, విరహాలూ వారిని బాధించవు. కడుపునిండా తింటారు, సెలవిస్తార నవ్వుతారు; సలహాలకి వెంకట్రావు దగ్గరకే వస్తారు.

నాలుగు నెలల్లో అతనిలో మార్పు కలిగింది. అతని కళ్ళల్లో జాలి గోచరించేది. అతని జీవితం కరగి కళ్ళల్లోకి వచ్చిందా అనిపిస్తుంది-తిరిగి ఇదివరకటి రొటీను-జడత్వమూ;

ఆ వూరి నీరు పడక అతనికి పెద్ద జబ్బు చేసింది. దగ్గర్లో డాక్టరు ఎవడూ లేడు. ఊళ్ళో వున్న భిషగ్వరుడు చెంచయ్య మందిచ్చేవాడు. రెండు రోజులు స్మృతిలేకుండా పడిపోయాడు. రాత్రింబవళ్ళు సుందరమ్మ ఏమరక అతనికి ఉపచారం చేసింది. ఆమె ఓర్మికి ఆశ్చర్యపడ్డాడు. ఆమెతో "మీ ఋణం ఎలా తీర్చుకోను" అన్నాడు. నెల్లాళ్ళకి జబ్బు తగ్గింది. చెంచయ్యకి యాభై రూపాయ లిచ్చాడు. అంతడబ్బు అతనెప్పుడూ కళ్ళతో చూడలేదు. జీవితాంతం వరకూ, తన వైద్యశక్తిని గురించీ, వెంకట్రావు దాతృత్వాన్ని గురించీ చెప్పుకునేవాడు. రెండు నెలల్లో పూర్వపు జవసత్తువలు సంపాదించాడు వెంకట్రావు.

శంకరానికి ఉత్తరం రాశాడు, కొన్ని చీరలూ, సామానులూ పంపమని. సుందరమ్మ ఆ విలువగల చీరలన్నీ చూసి, "నా కెందుకండీ ఇవన్నీ" అంది. "కట్టుకోండి తప్పేముంది" అన్నాడు రావు. సుందరమ్మ అవి ధరించటానికి భయపడేది.

ఆ రోజున వెంకట్రావు అర్ధరాత్రి ఉలిక్కిపడి లేచాడు. వెన్నెల విరగకాస్తోంది. 'శవంమీద కప్పిన తెల్లబట్ట'లా ఉందనుకొన్నాడు. ఇంతలో ప్రక్కగదిలోంచి సన్నగా యేడుపు వినపడింది. నిర్మల జ్ఞప్తికి వచ్చింది. ఆ గదిలోకి వెళ్ళాడు. కిటికీలో కూర్చొని బయలు చూస్తోంది

సుందరమ్మ ఆమె నల్లని పొడుగాటి జుట్టు ఆమె యొడల్ని కప్పింది. వెన్నెల వెలుగులో ఆమె వదనం మీద నీటిబొట్లు చూశాడు రావు.

"ఏడుస్తున్నారా?" అన్నాడు.

"లేదు" అంటూ ఆమె సిగ్గుతో తడబడుతో లేచింది.

"ఎందుకేడవటం?–గతాన్ని మరచిపోండి" అన్నాడు దయతో.

"నాకు గతమనేది లేదు. నాకు జీవితమే లేదు. నన్ను ఆదరించే వారు లేరు. 'నా' అన్నవారు లేరు. నేను బాల్యంలోనే విధవనయాను" ఆమె ఏడుస్తోంది చిన్నపిల్లలా.

'ఏం' అన్నాడు వెంకట్రావు. చీకట్లో నడిచేవాడికి దీపంకన్న మరొక ప్రాణుడు ఎక్కువ సహాయంగా ఉంటాడు. అందుకే వెంకట్రావుకి క్యూరియాసిటీ ఎక్కువయింది.

"నేను ఒక విధవకి జన్మించాను నా తల్లి నన్ను అమ్మేసింది. హోటలు పెట్టుకున్న వెంకమ్మకి. కాని దాని ప్రియుడు ఒప్పుకోలేదు. ఆ వెంకమ్మ నన్ను పిల్లలులేని తండ్రికి అమ్మింది. అతను ఎనిమిదేళ్ళదాకా విద్యాబుద్ధులు చెప్పించి, ఒకడికి పెళ్ళిచేశాడు. ఆ తర్వాత చచ్చిపోయారు పెంపుడు తండ్రీ, మొగుడూన్నూ—ఒకే ఏడాదిలో. ఆ తర్వాత ఒకరింట్లో పిల్లల నెత్తుకొనేదాన్ని. అక్కడ నాలుగేళ్ళు పనిచేసి మానేశాను. తిండిలేక ఒకరోజున వొకడికి మానాన్ని అమ్మాను. అప్పణ్ణుంచీ ఆ వృత్తివిడిచి నేటిదాకా వంట చేస్తున్నాను. మూడుసార్లు అమ్ముడుపోయాను!"

వెంకట్రావు హృదయం కరిగింది జాలితో ఆమె భుజం మీద చెయ్యివేశాడు. ఆమె ఆశతో, కాంక్షతో చూసింది. వెంకట్రావు తెలియని కాంక్షచేత ప్రోత్సహింపబడి ఆమెని కవుగలించుకొన్నాడు.

నాటినుండీ, సుందరమ్మ అతనికి వంటలక్క, భార్య, ఆదరించే తల్లీన్నూ. ఆమెను 'మీరు' అనే పిలిచేవాడు.

ఒక ఏడాది గడిచాక వెంకట్రావు, ఆమె కోరికమీద ఆమెని కాశీ పంపించాడు. రెండు నెలల్లో ఆమె తిరిగివచ్చి కాశీ విశేషాలు చెప్తూ

యిలా అంది: "పాపం, నర్సాపురం నుంచి లక్ష్మమ్మ అనే ఆవిడ నాలుగేళ్ళ నుంచి అక్కడ వుంటోంది. పోయింది, వారం క్రితం."

"అరెరె!" అన్నాడు వెంకట్రావు.

మూడేళ్ళు గడిచాయి. ఒకనాడు రావుకి ప్రభుత్వపు ఆర్డరు వచ్చింది. విప్పి చూశాడు. తనకు డిస్ట్రిక్టు యింజనీరు పదవి యిచ్చింది ప్రభుత్వం. ఆనందంతో సుందరమ్మతో ఇలా చెప్పాడు: "రెండు నెలల్లో మనం మన జిల్లా వెళ్ళిపోవచ్చు. అక్కడ సుఖంగా ఉంటుంది."

సుందరమ్మ కడుపుతో ఉంది. ఆమె గర్భవిచ్ఛిత్తి చేసుకొంటానంది. కాని రావు ఒప్పుకోలేదు. "నా ప్రతిరూపాన్ని చంపుకోలేను. నాకు మూడువందల రూపాయల జీతం వస్తోంది. నా జీవితం, నా పేరు నాతో అంతమవకుండా ఒక కొడుకు కావాలి నాకు" అన్నాడు. ఈ మూడేళ్ళ నుంచీ, వారిమధ్య జీవితం చాలా గౌరవంగా నడిచింది. ఒకరితో ఒకరు ఆట్టే మాట్లాడుకోరు. సుందరమ్మను 'మీరు' అనే పిలిచేవాడు. కాని ఆ రోజు సుందరమ్మ కొత్తమార్గం తొక్కింది. 'నన్ను మీరు మన్నిస్తే నే నిక్కడ ఉండలేను. మీలో వొక భాగంగా మెలుగుదా మనుకుంటున్నాను. మీరే సర్వం ఐన నాకు" ఆమె కళ్ళమ్మట నీటి బిందువులు పొర్లినై. వెంకట్రావు తెల్లపోయాడు. ఆమె మీద అతనికి జాలీ, దయా, ఉన్నై. 'ప్రేమ' అనేది అతను మరచిపోయాడు, పాతిపెట్టేశాడు. ఒక్కొక్కసారి 'ప్రేమ' కల్ల అనీ, భక్తులకి పూనే ఆవేశంలా యువకులకు పూనుతుందనీ అనుకొనేవాడు. కుటుంబ సౌఖ్యానికి స్త్రీ, పురుషుల మధ్య పరస్పరావగాహనా, అనురాగమూ కావాలనీ, ప్రేమ కవులకీ, రచయితలకీ వదలి వెయ్యాలనీ అతని ఉద్దేశ్యం. అయినా అతను ఏ విషయంలోనూ ఎక్కువ ఉత్సాహం తీసుకోలేదు. అతనిలోని శక్తులు మోడు చెందాయి. తనకి 'సంపతి' వుంది. అయినా, నవ్వుతూ సుందరమ్మతో యిలా అన్నాడు: "నిన్ను మన్నించటంలేదు సుందరమ్మా! అలనాటు చొప్పున అనుకుంటున్నాను. నీ సౌఖ్యం నా సౌఖ్యం" ఆ రోజు నుంచీ 'నువ్వు' అనేవాడు. సుందరమ్మ ఆనందంతో పొంగిపోయింది. "ఆయన

యింటికి వచ్చేటప్పటికి అబ్బాయి ఎదురుగా వెళ్ళి 'నాన్నా' అని పిలుస్తాడు. ఆయన అబ్బాయిని ముద్దెట్టుకుంటా"రని ఆలోచిస్తోందేది.

విధి నల్లని పెదవులు వారి జీవితాన్ని ముద్దెట్టుకున్నాయి. నెల్లాళ్ళకి పురిటిగండం వచ్చి తల్లీ, పిల్లా చనిపోయారు. ఆ రోజున భోరున ఏడ్చాడు వెంకట్రావు. కాని తర్వాతరోజున మామూలు మనిషి అయాడు. నాటినుంచీ నవ్వు అంటే అతనికి రోతపుట్టింది కొన్నాళ్ళకు, కన్నయ్యతో, గోదావరి జిల్లాకు ప్రయాణం కట్టాడు.

# 9

తిరిగి మూడేళ్ళవరకూ వెంకట్రావు జీవితం సాఫీగా సాగిపోయింది. మోటుతనమూ, నిరాశా అతనిలో పాతుకుపోయినై. చూపు సరీగ్గా ఆనటంలేదు. ఆరోగ్యం క్షీణించటం మొదలెట్టింది. జ్ఞాపకశక్తి తగ్గిపోయింది. ఆఫీసులో దవాల్ బంట్రోతుమీదా, యింట్లో కన్నయ్యమీదా విసుక్కోవటం, గొణుగుకోవటం ప్రారంభించాడు. ఆఫీసునుంచి వస్తో, ఏదో చూసి అలాగే నిలబడిపోయేవాడు.

ఒక కంట్రాక్టులో ప్రభుత్వానికి యాభైవేలు నష్టమొచ్చింది. కంట్రాక్టరు రావు కళ్ళల్లో దుమ్ముపోసి, సొమ్ము అంతా గుంజుకొని, తిరిగి రావుమీద కేసుపెట్టాడు. రావు ప్లీడరునేనా పెట్టుకోలేదు. ప్రభుత్వం రావుని డిస్మిస్ చేసింది. పదివేల రూపాయలు రావు కాజేశాడనీ, అందుకని అతనికున్న యిరవై ఎకరాల భూమిలో పది ఎకరాలు ప్రభుత్వం స్వాధీనం పరచుకొంది. వెంకట్రావు ఏమీ బాధపడలేదు. కన్నయ్య మాత్రం మానేశాడు, జీతం తగ్గించారనే నెపంమీద.

వెంకట్రావు పది ఎకరాలూ అమ్మేశాడు, ఎనిమిదివేల రూపాయలకి. రెండువేలు పెట్టి ఒక పెంకుటిల్లు కొన్నాడు ఒక గ్రామంలో. ఒక కొత్త నౌకరుని పెట్టుకున్నాడు. 'ఇంత ఇల్లెందుకు' అనుకునేవాడు. నౌకరుతో 'నా యిల్లు కదరా!' అనేవాడు. ఒక పిక్కపిల్లిని చేరదీసి దాన్ని

పెంచమని నౌకరుకు ఆర్డరిచ్చాడు. కాగితాలు చిరిగిపోయిన భాగవత పుస్తకం తీసి ఆనందభైరవి రాగంలో చదివేవాడు.

వెంకట్రావుకి గుండెజబ్బు చేసింది. డాక్టర్లు మద్రాసు వెళ్ళమన్నారు. పదిహేను వందల రూపాయలు ఖర్చుపెట్టి మద్రాసులో ఒక ఏడాది ఉండి జబ్బు నయం చేసుకొన్నాడు. మద్రాసు నుంచి వస్తోంటే వొక దిక్కులేని పన్నెండేళ్ళ పిల్లను తనతో తీసుకువచ్చాడు. ఆమెకి 'సుందరమ్మ' అని నామకరణం చేశాడు. ఒక గురువుని నియోగించి సంగీతం చెప్పించేవాడు. ఆమె 'తాతయ్యా' అని పిలుస్తోండేది రావుని.

రోజూ సాయంత్రం మాలగూడెం వెళ్ళేవాడు. ఆ పూటకు తిండి లేని వాళ్ళకి పావలా అర్ధా యిచ్చేవాడు. పొరిగింటి లచ్చన్నగారితో తన ఇంజనీరు గొడవలు చెప్తూండేవాడు. ఇలా రెండేళ్ళు గడిచాయి. అతనికి బ్యాంకలో రెండువేలు మాత్రం మిగిలినై.

ఒక పట్టభద్రుణ్ణి వెదకి తీసుకువచ్చి సుందరమ్మకి పెళ్ళిచేశాడు. వెయ్యి రూపాయలు కట్నం, అయిదువందలు ఖర్చు చేశాడు. కన్నీళ్ళతో సుందరమ్మని అత్తవారింటికి పంపించాడు. "మాతో వచ్చి వెయ్యి తాతయ్యా" అని ఏడ్చింది. "ఇప్పుడు కాదు, ముందు వస్తానమ్మా" అన్నాడు. జీవితంలో ఒక అనాథ బాలిక నుద్ధరించాను గదా అని సంతృప్తి పడ్డాడు.

క్రమంగా అతని నిల్వసొమ్ము ఖర్చు అయిపోయింది. "చేతులో శక్తి ఉన్నంతవరకూ సుందరమ్మ ఇంటికి వెళ్ళి వాళ్ళను బాధించను" అనుకొన్నాడు. ఒక బియ్యపుకొట్టులో గుమాస్తాగా కుదిరాడు. ఇరవై రూపాయల జీతానికి.

వెంకట్రావు శక్తిహీనుడై పోయాడు. గడ్డం పెరిగింది. దగ్గు తిరిగి వస్తోంది. మనిషి వంగి పోయాడు. మాలపల్లెలో పిల్లలు హాస్యం చేసేవారు. కాని నవ్వలేకపోయేవాడు రావు.

మిట్టమధ్యాహ్నం. అందులో వేసవికాలం. యజమాని ఆజ్ఞప్రకారం, వెంకట్రావు ఆయాసంతో మూడుమైళ్ళ దూరంలో ఉన్న పొరుగూరు

వెళ్ళుతున్నాడు. అతని పాదాలూ, చేలా మాడిపోతున్నై. తన పూర్వ జీవితాన్ని తల్చుకొన్నాడు. ఎండిపోయిన గుండెలో ఏ మూల వొక నీటి చుక్క ఉందో, అది కళ్ళలోంచి పెగల్చుకు వచ్చింది.

తిన్నగా పొరుగుగ్రామానికి వెళ్ళి, ఒక కాలనిలో నీళ్ళు తాగి వొక ఇంటి అరుగు మీద కూర్చొన్నాడు విశ్రాంతికోసం. నాలుగయిదేళ్ళ పిల్లాడు 'బూచాడు' అంటూ ఇంట్లోకి వెళ్ళి ఏడవటం మొదలెట్టాడు. ఒక ముప్పైఆరేళ్ళ స్త్రీ గుమ్మం నుంచి తొంగి చూసి "ఎవరు తాతా, ఏ వూరు మీది" అంది. వెంకట్రావు యధాతపాట్లు పడుతో పక్కవూరే అన్నాడు.

"ఏమైనా పిల్లలూ, మనుమలూనా తాతగారూ" అంది ఆవిడ, గుమ్మం దగ్గర అరచాటుగా నించొని. ఇంతలోకీ ఆ అయిదేళ్ళ పిల్లాడు వచ్చి 'తాతయ్యా' అంటూ వొళ్ళో కూర్చున్నాడు.

"నీ పేరేమిటి" అన్నాడు వెంకట్రావు.

"వెంకట్రావు" అన్నాడు ఆ పిల్లాడు.

"నా పేరూ వెంకట్రావే!" అన్నాడు రావు.

"అందుకే తాతయ్యావ్" అన్నాడు ఆ పిల్లాడు.

ఆ పిల్లాడు పేర్లు చెపుతున్నాడు : "ఆడిపేరు రాముం, ఆడిపేరు లచ్మినారాయణ,"

"నీ స్నేహితుల పేర్లా?" అన్నాడు వెంకట్రావు.

"ఊఁ! అమ్మపేరు నిర్మల, అమ్మమ్మ పేరు లచ్చిమమ్మ...." అన్నాడు పిల్లవాడు.

వెంకట్రావు గుండెలో శతఘ్ని పేలినట్లయింది. తల పైకెత్తి చూశాడు గుమ్మందగ్గర స్త్రీని. పిక్కపోయిన చెక్కిళ్ళూ, ఊడిపోయిన జుట్టూ, మాసిన బట్టలూ-యీమె నిర్మల, నిర్మలేనా? ఆమె ఏదో చెపుతోంది. "ఆయన పోయారు తాతగారూ, మా అమ్మ రాసిచ్చిన పది ఎకరాలమీద బ్రతుకుతున్నామండి. కష్టాలు వచ్చాక మనమేం చేస్తాం తాతగారూ!"

వెంకట్రావు వినిపించుకోలేదు. ఆతృతతో "కుటుంబయ్యగారు ఏమవుతారమ్మా" అని అడిగాడు.

"మామయ్య అవుతాడు. మీరెలా ఎరుగుదురు? అయితే ఇంజనీరు వెంకట్రావుని ఎరుగుదురా తాతయ్యగారూ!" అంది ఆవిడ. ఒక నాటి ప్రియురాలు తన్ని 'తాతగారు' అని పిల్చింది. భూమి గిర్రున తిరిగినట్ల యింది. జారి పోయే గుండె ఒకచేత్తో పట్టుకొని, ఒక చేత్తో మోహం కప్పుకొని అక్కడనుంచి తిన్నగా ఇంటివైపు వెళ్ళిపోయాడు. ఈ హఠాత్ ప్రవర్తనకి ఆశ్చర్యపడింది నిర్మల. 'పిచ్చాడు తాతయ్య' అన్నాడు ఆ పిల్లవాడు.

వెంకట్రావు ఇంట్లో మంచంమీద కూలబడ్డాడు. ఇల్లు అంతా నిశ్శబ్దంగా వుంది. పిల్లి 'మ్యావ్' అంటోంది. సూర్యుడూ, చంద్రుడూ, చుక్కలూ భూమిమీద వొక్కసారిగా రాలినై. నల్లని సముద్రపు చీకటి కెరటాలు జీవితపు గట్లుల్ని వొరసికొన్నాయి.

అతనిలో ఉత్సాహమూ, ఆనందమూ నాశనమయిపోయాయి. అతని కళ్ళు ఏదో పోగొట్టుకొన్నట్లు బీదగా చూస్తోంటాయి. వర్షాకాలంలో బోదర కప్పల బెకబెకలూ, వసంతంలో కోకిల కూజితాలూ అతనికి ఒకటే. రాత్రిళ్ళు నక్షత్రాలు కనబడితే, ఉదయం దీపాలు అక్కర్లేకుండా వెల్తురు వస్తుంది. ఆకలికి అన్నం తింటారు. తినటం మూలాన్ని పెరుగుతారు. యవ్వనంలో కామిస్తారు, వృద్ధాప్యంలో-చచ్చిపోయే రోజులు సమీపించిన కొలదీ, చాలా కాలం బ్రతుకుతామనే ఆశతో జీవిస్తారు. శ్రావ్యంగా పాడే వాడికీ, పాటరాని వాడికీ వొకటే హృదయం ఉంది. "నీకంటె నేను గొప్పవాడ్ని" అనటానికి ఎవరికీ హక్కులేదు. ఒకరికి కవిత్వం రాయటంలో, ప్రకృతిని ఆనందించటంలో శక్తి ఉంటుంది, మరొకరికి హృదయాన్ని కరడు కట్టించుకొని చీకట్లని వెదజల్లే శక్తి ఉంటుంది. తోచక దెబ్బలాడుతారు. తెలివితేటలు ఎక్కువై, ప్రభుత్వాలూ, యుద్ధాలూ, విప్లవాలూ కోర్టులూ కల్పించుకుంటారు. జీవితంలో నగ్నసత్యం తెలుసుకొని, నవలలూ, సినిమాలూ చూసి ఆనందిస్తారు. చివరికి ప్రతీజీవితం ప్రత్యేక జీవితం. ఒకరికీ ఒకరికీ సంబంధంలేదు. ఆశకు అంతులేదు. అంతానికి ఆశ కారణం. ఇది ప్రపంచం, ఇది జీవితం.

(భారతి 1941 ఆగస్టు)

# ఉంగరం

అమ్మయ్యా! ఈ రోజుతో తన కష్టాలన్నీ ఫలిస్తాయి. దేనికైనా ధైర్యం వుండాలి. ఎటువంటి అద్భుతమైన ఆలోచన తట్టింది తనకి! ఎలాగ మెరుస్తోంది తన అందమైన వేలికి! ....ఇంక దీనితో తాను బతుకుని కొత్తగా తీర్చుకోవాలి. సుఖంగా దర్జాగా జీవితం గడపాలి. ఇంత వరకూ తానెంత నీచంగా బతికింది తలుచుకుంటేనే అసహ్యంవేస్తోంది. అంట్లు తోమడం, గదులూడ్చడం, వాళ్ళిచ్చే పాసిపోయిన అన్నంతోపాటు తిట్లనీ శాపనార్థాల్నీ మూటకట్టుకుని నిస్సహాయతతో ఉడుకుమోతు తనంతో యింటికి వెళ్ళడమూ-అక్కడ తల్లి రోగంతో మంచం మీద బల్లిలాగా, అంటుకుపోయి తాను ఆలస్యంగా వచ్చినందుకు ఇంకా తిట్టడమూ - తన గుడిసెలో దుమ్మూ. పొగా, చీకటి. గుడిసె బయట పందులూ, రొంపి, వాసనా, తన వొళ్ళంతా చాకిరితో నొప్పులూ - ఏడుపొచ్చేది తనకి. చచ్చిపోవాలనిపించేది. అందరిలాగా తాను హాయిగా కులాసాగా ఎందుకు బతకకూడదు? పంతులమ్మ కూతురులా సిల్కు వోణీలు తన కెందుకుండవూ? రవణమ్మ బుగ్గలూ వొళ్ళూ ఎలా నిగనిగలాడుతుంటాయో- రెండుపూటలా మీగడా పెరుగూ వెన్నపూసా వేసుకొని తింటుంది కదూ! తన యీడుదే పరహాలు మరి-రోజూ తల్లో పువ్వులు పెట్టుకుని కాటుక పెట్టుకుని సినిమాకు వెళుతూంటుంది మొగుడితో. మరి తనకి పువ్వులూ సినిమాకి డబ్బులూ ఎప్పుడూ వుండవు. మరి మొగుడూ లేడు!

తనలో ఎన్ని కోరికలు! ఎన్ని కలలు! చిన్నప్పట్నుంచీ తన కెందుకో ఎగిరిపోవాలనీ, పాటలు పాడాలనీ, నాట్యం చెయ్యాలని ఎన్నో

ఎన్నో - పొలంగట్టుకాడ కూర్చుని సినిమాపాటలు పాడుతుంటే తనకేసి అందరూ చూసి నవ్వేవారు. తనని వెర్రిదనేవారు. ఏమిటో తన వెర్రి! మంచిబట్టలు కట్టుకోవాలనీ, షోగ్గా సింగారించుకోవాలనీ హాయిగా బతకాలనీ ఎవరనుకోరు? వాళ్ళకి డబ్బు యిల్లూ ఉన్నా ఎంత అసహ్యంగా బతుకుతారు, ఎంత లేకిగా వుంటారు? వడ్డాణమూ కాసులపేరూ పెట్టుకుని తిరుగుతుంది అమ్మగారు. 'అమ్మా, ఈవాళ తిరణాల ఓ వేడ డబ్బులివ్వండి' అని అడిగితే దండకం చదువుతుంది ఆవిడ. 'నా దగ్గర ఏం ఒలకడంలేదు. ముష్టిముండాపీనుగని ఒక్క అణా డబ్బులుకూడా నా కివ్వరు. తాళి కట్టాడు కాబట్టి యిలా బతుకుతున్నాను కుక్కిన పేనులాగ. ఈయనీ ఈయన డబ్బునీచూచి పీక కోశాడు మా నాన్న' ....అబ్బబ్బ వినలేక వచ్చేస్తాను. యివ్వకపోతే మానె, ఇంత అఘాయిత్యంగా మాట్లాడుతుందేఁవిటి; అయ్యగారు ఊళ్ళో లేనప్పుడు ధాన్యం చాటుగా అమ్మించి డబ్బు దాచేసుకుంటుంది. నాకు తెలీదని ఆవిడ ఉద్దేశం! పోనీ అయ్యగారిని అడిగితే ఆయన ఒకటే తిట్టు 'ఈగది సరీగా ఊడవలేదేం! వెధవ పనితనం నువ్వూ. పైగా డబ్బులు కావాలిట! మీ అమ్మ నిరుడు వైద్యానికి మూడు రూపాయలు తీసుకువెళ్ళింది. ఇంక తీర్చడంమాట ఉత్తిదే. అయినా తిరణాల కెందుకే నీకు? వెధవ ఓరుతిండి తింటానికా? రెండు పూటలా తింటున్నావు చాలదూ."

ఉక్రోషం వచ్చింది తనకి! తనదగ్గరే డబ్బుఉంటే 'ఏడవకయ్యా, ఈ రూపాయి తీసుకుని తిరణాలకెళ్ళి నువ్వే కొనుక్కో' అని యిచ్చేసును. ఇవ్వనంటే పోయేది యింతంత మాట లెందుకో!

తనకి అందంలేదా! తెలివితేటలు లేవా! సుబ్బయ్యగారి గదిలో ఎవరూ లేనప్పుడు అద్దంలో తన మొహాన్ని చూచుకొనేది. ఎంత అందంగా ఉంది తన మొహం - నిగనిగలాడే వొళ్ళూ, మెరిసే కళ్ళూ, బుగ్గమీద సొట్టా - వాళ్ళ అచ్చెమ్మకన్న వెయ్యిరెట్లు నయం. కొంచెం సబ్బుపెట్టి మొహం తోముకుని పువ్వులరైక తొడుక్కుంటే అచ్చెమ్మ డీలా అయిపోదూ! చిన్న కళ్ళూ, లావాటి పెదవులు - దాన్నెవడు మనువు చేసుకుంటాడూ! డబ్బుని చూశా! వెర్రిముండాకొడుకులు. పిల్ల యేపుగా

ఊతంగా ఉంటే సరదాకాని డబ్బుతో ఏం మనసు తీరుతుందీ ? తిని బలిసిన అచ్చెమ్మకి ఎప్పుడూ సొగసులూ, సొలపులూ. లేవలేదు, కూర్చోలేదు ; తనకున్న విలవ వాళ్ళకుందా. తన అందాన్ని ఊరకే తక్కువకి కొనెయ్యవచ్చునని అనుకుంటారు రౌడీ వెధవలు. రోడ్లమ్మట పోతుంటే కోరగా జోరుగా చూస్తారు. సుబ్బయ్యగారి కొడుకు - అదేవిటి అలా చూస్తాడు ? జేబులోంచి వెండి రూపాయితీసి మోగిస్తాడు. చెయ్యి చూపరాడు. మళ్ళీ భయం. వీధి గుమ్మంలో జోడుచప్పుడవగానే గబుక్కున గదిలోకి దూరి తలుపులు వేసుకుంటాడు. వాళ్ళ బాబు వస్తున్నాడని.

తన వాళ్ళందరిలాగా తనకెందుకో తృప్తివుండదు. రంగురంగుల ఊహలుతన గుండెల్లో కలవరపెడుతుంటాయి. తనకెన్నో కథలు వచ్చును. ఊరిపతల గుడికాడ సాధుబాబా ఉండేవాడు. చిన్నప్పుడు తనకి మంచి కథలు చెప్పేవాడు. తెల్లని గడ్డం, ముడతలుపడిన కళ్ళూ, వళ్ళూ, చిరిగిన బనీనూ వేసుకుని తన్నెంతో ఆప్యాయంగా చూసేవాడు. తాను గొప్పదాని నౌతానని రాజకుమారి నవుతానని చెప్పేవాడు. రాజకుమారులు తెల్లని గుర్రాలమీద ఎక్కి, తనలాంటి అందమైన దానిని చూసి ఓహో అని గుర్రంమీద ఎక్కించేసుకుని తీసుకెళ్ళిపోయి పెళ్ళిచేసేకుంటారట. వాళ్ళకి పెద్ద పెద్ద మేడలు, నౌకర్లు, మంచి పిండిపంటలు, జిగేల్మనే నగలు. ..

మరి సీతాలుని ఓ అబ్బాయి అలాగే లేవతీసుకుపోయాడు. ఏడాది పోయాక మళ్ళీ వచ్చింది సీతాలు. ఎంత ఎంచక్కావుంది. సిల్కుచీర కట్టుకుంది. బంగారపు గాజులు వేసుకుంది. ఆ అబ్బాయి పట్నం తీసుకెళ్ళి అక్కడ పెళ్ళిచేసుకున్నాడట, వర్తకం చేస్తాడట. ఎంతో డబ్బు లాభం వస్తుందిట !

"నన్నుకూడా తీసుకుపోయేందుకు ఎవడినేనా చూసిపెట్టు సీతాలూ" అని అడిగింది ఆ రోజున. ఎంతో బతిమాలుకుంది.

సీతాలు విరగబడి నవ్వింది." నేను చూసిపెట్టనా. ఓ యమ్మ యిదేం సోద్దెమే" అంది.

"నాకేం తక్కువ ?" అంది తను ఉక్రోషంగా.

"ఇలాంటి బట్టలు వేసుకుంటే ఎలాగ ? మాంచి పరికిణీ వోణీ కుట్టించుకో. ఆ మొగుడెవరో వాడే వస్తాడులే" అంది సీతాలు.

తనకి మంచి బట్టలు ఎలా వస్తాయి ? పోనీ సుబ్బయ్యగారు. వెర్రి పిల్ల చాలా కాలం నుంచి చాకిరీ చేస్తోందని కొనిపెట్టకూడదూ? ఆయన కూతురు అచ్చెమ్మ ఓచీర యివ్వకూడదూ ? ఇలాగ అనుకునేది తను. కాని యింత సులువైన ఊహ తట్టనేలేదు ఎప్పుడూ తనకి. సుబ్బయ్య చిన్న కొడుకు బళ్ళోంచి వస్తున్నాడు. వాడి వేలిని ఉంగరం మెరిసింది. వెధవ చిడుం వేలికి ఉంగరం కూడా ఎందుకూ ? వాణ్ణి పిలిచింది. ఈ కబురూ ఆ కబురూ చెప్పి మిఠాయి కొనిపెట్టి ఉంగరం తీసేసుకుంది. కుర్రనాగమ్మ యింటిదగ్గర చెప్పగలడా ? సుబ్బయ్యగారూ, పెళ్ళామూ ఉంగరం ఎక్కడో పోయిందనుకుంటారు. ఈ ఉంగరం అమ్మితే ఇరవై రూపాయలేనా వస్తాయి. ఆ డబ్బుతో అందమైన బట్టలు కొనుక్కుని కట్టుకుని వెళుతూంటే మాంచి రాజకుమారుడు లాంటి కుర్రాడు తన్ని చూసి 'ఏయ్ అమ్మాయ్' అని నవ్వుతాడు అదోలా. పెళ్ళికొడుకులు నవ్వినట్టు నవ్వుతాడు. అప్పుడు....

అయినా తను అందర్నీ నమ్మకూడదు. మంచివాణ్ణి, డబ్బున్నవాడినీ ఏరుకోవాలి. దొరలాగా వుండాలి వాడు. 'నిన్నే నమ్ముకుంటాను. నిన్ను పెళ్ళిచేసుకుంటాను. నువ్వులేందే బ్రతకలేను లచ్చీ' అనాలి. అప్పుడెంచక్కా వాడిని పెళ్ళిచేసుకుంటుంది. సీతాలులాగా పట్నం వెళ్ళిపోతుంది. ఎప్పుడేనా సుబ్బయ్యగారు యిటువస్తే తనని చూసి 'అబ్బో' అని ముక్కుమీద వేలేసుకుంటారు ! పెళ్ళిచేసుకోక పోతే నలుగురిలో గౌరవం ఉండదు. అందరూ దొంగముండ అని, గుడిసేటివనీ తిడతారు. ఛీ అంటారు పెళ్ళయితేనేకాని మగవాడికి అలుసివ్వకూడదు. దొంగవెధవలు, సరదా తీరాక పురుగును దులిపినట్టు దులిపి పారేస్తారు. సింగడు మరి యిదివరకూ ఏం చేశాడు ? ఎన్ని కబుర్లు చెప్పాడు ? రంగం వెళ్ళిపోదామన్నాడు. సరసాలాడినన్నాళ్ళూ ఆడి తీరా ఓ రోజున మరెవత్తెనో పెళ్ళిచేసుకున్నాడు. తనింకా అప్పుడు చిన్నపిల్ల. ఎంతో ఏడ్చింది. "ఏంటి యిలా అన్యాయం చేశావ్ సింగా ?" అంటే 'నిన్నెవడు పెళ్ళాడుతాడు నీతిలేనిదానివి' అన్నాడు.

నల్లని ఉంగరాల జుట్టు ఉండాలి. తెల్లగా పొడుగ్గా ఉండాలి. మంచి యిల్లు తోటా ఉండాలి. అప్పుడు అబ్బాయి వచ్చి పెళ్ళిచేసుకోవాలి. పెళ్ళి చేసుకుంటేగాని వొంటిమీద చెయ్యి వెయ్యనివ్వకూడదు. తలలో పువ్వులు పెట్టుకొని పెరట్లో పాటలు పాడుతూంటుంది తను. వెనకాతలే వచ్చి కళ్ళు మూస్తాడు. చేతులు తీయకుండానే బుగ్గమీద ముద్దుపెట్టుకుంటాడు. తను మళ్ళీ ఆయన మొహాన్ని దగ్గరకు లాక్కొని ముద్దుపెట్టుకుంటుంది. తను రోజూ నీళ్ళుపోసుకుంటుంది. ఘుమ ఘుమ లాడే సబ్బుతో వొళ్ళంతా రుద్దుకుంటుంది. బలే వాసన. ఓసారి సుబ్బయ్యగారి అల్లుడు వదిలేసిన సబ్బు ముక్క తెచ్చుకుని నీళ్ళు పోసుకుంది. తన వొంటిని తనకే ముద్దు పెట్టుకోవాలనిపించింది. తన వొళ్ళు కొత్తగా మెత్తగా పట్టుచీరలా మెరిసి పోయింది....

ఒకానొక వేసవిలో ఊరికి దూరంగా ఉన్న ఒక మామిడితోపులో కూర్చుని పగటి కలలు కంటోంది పదిహేడేళ్ళ దాసిపిల్ల లక్ష్మి. చిరిగిన మాసిన బట్టలూ, సంస్కారంలేని చిక్కుబడిన జుట్టూ, ఆమె కళ్ళల్లో ఊహాల నిచ్చెనలమీద ఎగబ్రాకే కోర్కెల్ని ఆపలేకపోతున్నాయి. చల్లని పైరుగాలీ, ప్రశాంతమైన మామిడితోటా, యౌవనం కొత్తగా వింతగా అలముకుంటూన్న ఆమె వయస్సూ ఆమె కలల్ని మరింత రెచ్చగొడు తున్నాయి. తాను దిక్కులేని దాసిపిల్లననీ, తన భవిష్యత్తు ఎప్పుడూ యింతేననీ వాస్తవికంగా ఆమె ఆలోచించగలిగితే అప్పుడీ స్వప్నాలవల్ల కలిగే క్షణికమైన మధురానుభూతి కూడా జీవితంలో లేకుండా చేసుకోవ డమే అవుతుందేమో ! బతుకు అతుక్కుపోయిన కొందరికీ బతకడానికి చేయూత స్వప్నం మాత్రమే కాబోలు. అందరూ అభాగిని అయిన లక్ష్మి లాగ కలలు కంటారు. కాని ఆ కలలు నిజాలౌతాయని నమ్మరు. అక్కడే వాళ్ళు తెలివిగా జాగ్రత్తపడతారు. కాని లక్ష్మిలాంటి అమాయకులూ, ఆవేశహృదయులూ కలల్ని తరుముకుంటూనే పరుగెత్తుతారు. దారిలో గొప్పితగిలేదీ గొయ్యివచ్చేదీ చూసుకోరు. రోగిష్టి ఆరోగ్యాన్ని గురించీ, ఆకలితో ఉన్నవాడు రుచికరమైన పిండివంటల్నిగురించీ, దరిద్రుడు ధనం యిచ్చే సౌఖ్యాన్ని గురించీ ఆలోచించకుండా ఏ చట్టమూ శాసించలేదు.

నిజమే అందుకే భయంకర దరిద్ర పీడితులూ, అంగవికలులూ, దుర్భర వ్యాధిగ్రస్తులూ, ఆత్మహత్య చేసుకుని కడతేరకుండా బతుకుతూనే వుంటారు. రేపటి సుఖంకోసం.

కళ్ళెంలేని భావనా ప్రపంచంలో విహారంచేస్తూన్న లక్ష్మి తనని ఓ గంట నుండి నారాయణ అదేపనిగా పరికిస్తున్నాడని గమనించలేకపోయింది. కొంతసేపయాక నారాయణ మెల్లగా ఆమె దగ్గరకు నడచివచ్చాడు. చామన చాయగా వున్నాడు. పైజామా తొడిగి తెల్లని గ్లాస్కో చొక్కా వేసుకున్నాడు. కాళ్ళకి నల్లని స్లిప్పర్లు, జుట్టు వెనక్కు దువ్వాడు. పెదవులు ఎర్రగా ఉన్నాయి తాంబూలసేవనంవలన. సుబ్బయ్యగారి కొడుకు కన్న. సింగడికన్న ఎంతో బాగున్నాడు. ఇంకా ఎంతో బాగున్నాడు. చదువుకున్న వాడిలా ఉన్నాడు. లక్ష్మికి ఎదురుగావచ్చి నిలుచున్నాడు. లక్ష్మి తల పైకెత్తి చూసింది. ఫక్కున నవ్వింది. ఆమెకి కథలో రాజకుమారుడు నిజంగా వచ్చేసినట్టనిపించింది.

"ఎవరు నువ్వు?" అన్నాడు నారాయణ గంభీరంగా.

"ఏం?" అంది ఓరగా చూస్తూ లక్ష్మి. ఇంకా ఆమెకు పూర్తిగా మెలకువ రాలేదు. వేలినున్న ఉంగరాన్ని ఆప్యాయంగా చూసుకుంటోంది.

"నీ పేరేవిటి?" అడిగాడు నారాయణ.

సన్నగా నవ్వి తియ్యగా చూసింది లక్ష్మి జవాబుగా.

"ఈ తోట ఎవరిదో తెలుసునా?" ఈసారి కోపంగా అధికారంగా అన్నాడు నారాయణ.

ఉలిక్కిపడింది లక్ష్మి. "మీదేంటి బాబూ. ఊరికినే కూర్చున్నాను...." భయపడుతూ లేచి నుంచుంది లక్ష్మి.

వీడు తనని పెళ్ళిచేసుకోడానికి రాలేదా?

నారాయణ గీరగా చూశాడు. అదోవిధంగా దగ్గాడు. లక్ష్మికూడా గమ్మత్‌గా చూసింది. నవ్వింది.

"నీ పేరేవిటీ?" ప్రశ్నించాడు మృదువుగా నారాయణ.

"లచిమి."

"ఈ వూరేనా?"

"ఉహూఁ పక్క వూరు...."

"ఏం చేస్తూంటావ్ ?"

సందేహంగా కనురెప్ప పైకెత్తి నారాయణను చూసింది. దా దాన్నని చెప్పాలా చెప్పకూడదా అని తటపటాయిస్తోంది.

నారాయణ మీద చెయ్యివేశాడు. జాలిగా అన్నాడు. "పాపం దాసి పిల్లవా ?"

లక్ష్మి తలూపింది ఔనని.

నారాయణ ఈసారి ఆమె బుగ్గలమీదచేత్తో రాసాడు "మంచి దానివి."

ఆశగా చూసింది లక్ష్మి !

"అలాగరా—ఆ పక్కకి" అని అర్థవంతంగా నవ్వాడు నారాయణ.

"ఎందుకూ?"

"ఇక్కడ అందరూ చూస్తారు."

తెల్లబోయి చూస్తోంది లక్ష్మి.

"డబ్బిలిస్తాను. సరేనా, రా."

ఛీ, తన నింత లోకువగా చూస్తున్నాడేమిటి? తనని ప్రేమించానని, పెళ్ళిచేసుకుంటాననీ అనడేం అనుకుంది లక్ష్మి.

"నాను సెడిపోయినదాన్ని కాను. నా నల్లారాసు" అంది లక్ష్మి.

"ఇక్కడ కెందుకొచ్చావు మరి?" కోపంగా అడిగాడు నారాయణ.

"పెళ్ళి చేసుకుందుకు—" అమాయికంగా అంది లక్ష్మి.

"ఎవర్ని?" అన్నాడు నారాయణ, ఈసారి నారాయణ తెల్లబోయాడు. పెళ్ళిచేసుకునేందుకు మామిడితోపులలోకి రావడమెందుకో రకరకాల అనుభవంగల నారాయణకే అర్థమవలేదు.

"నాకు నచ్చినవాణ్ణి. డబ్బున్నవాణ్ణి" అంది లక్ష్మి.

నారాయణకి లక్ష్మి ఒక్కసారిగా అర్థమైపోయింది. మెల్లగా కబుర్లలోకి దింపాడు. ఆమె ఊహాలు పయనించే త్రోవలేమిటో తెలుసుకున్నాడు. తర్వాత జాలిగా ప్రేమగా అన్నాడు "నన్ను పెళ్ళిచేసుకుంటావా లక్ష్మి?"

"మిమ్మల్నా?"

"అవును"

"నిజంగానే?"

"ఆఁ "

"ఒట్టు?"

"ఒట్టు"

"మరి సింగడిలాగ...."

"సింగడెవడూ?"

"దొంగనా...." లేఖ రెండు మాటలలో సింగడెవడో చెప్పింది లక్ష్మి.

"ఛఛ. నే నలాంటివాణ్ణి కాను. నీలాంటి పిల్లకోసమే చూస్తున్నాను. నిన్ను ప్రేమించాను. పెళ్ళిచేసుకుంటాను. పువ్వుల్లో పెట్టి పూజిస్తాను" అన్నాడు నారాయణ.

"నిజం?'' పెద్ద కళ్ళలో వెలుగు నిండగా అడిగింది లక్ష్మి.

"ఇంకా నీకు చదువు చెప్పిస్తాను."

"ఓహ్ !''

"డ్యాన్సు నేర్పిస్తాను."

"అబ్బో."

"మరి ఎప్పుడు పెళ్ళిచేసుకుందాం?'' అన్నాడు నారాయణ.

"పట్నంలోకాదా పెళ్ళి?'' – సీతాలుని జ్ఞాపకం చేసుకుంటూ అడిగింది లక్ష్మి.

నారాయణ ఓ సెకను ఆలోచించి "అవును పట్నంలోనే–నే నక్కడేగా వుండేది'' అన్నాడు.

"మీరు పట్నంలో ఏం చేస్తుంటారు?"

నారాయణ చిక్కులో పడ్డాడు. ఈ పల్లెటూరిపిల్ల, అమాయకురాలూ, రొమాంటిక్ ఊహలు ఉన్న లక్ష్మికి ఏం చెపితే పని జరుగుతుందో గబుక్కున ఊహించడం నారాయణవంటి చురుకైనవాడికైనా కష్టమే. హోటలులో సర్వర్‌గా, కారు క్లీనరుగా, పిక్ పోకెటర్‌గా, రైలులో మందులమ్మేవాడిగా బహుపాత్రాభినయంచేసిన నటకావతంసుడు.

ఆలోచించి అన్నాడు "మోటార్ డ్రైవర్ని"

"అంటే?"

"పెద్ద పెద్ద మోటారులూ, లారీలు నడుపుతాను. నే నెలాగ నడుపితే అలాగ వెడతాయి."

"నిజమే?"

"తెగేసి."

చక్రందగ్గర కూర్చుని మోటార్లు నడిపేవాళ్ళని చూడకపోలేదు లక్ష్మి. కాని నారాయణ చెప్పడంలో, ఈ డ్రైవరు పని అసాధారణమైనదిగా తోచింది ఆమెకు.

"బాగా డబ్బొస్తుందా?"

"ఓ, కావల్సినంత. మనం హాయిగా బతకొచ్చును."

లక్ష్మి హాయిగా బతకటాన్ని ఆలోచిస్తోంది.

"నిన్నెప్పుడూ కారుమీద తిప్పుతాను. పట్నంలో కార్లమీద పెద్ద పెద్ద వీధుల్లో ఝామ్మని పోతుంటే-" అన్నాడు నారాయణ.

కిలకిల నవ్వింది లక్ష్మి. నారాయణ మాటల్లో, సమర్థతలో నమ్మకం చిక్కింది.

సంజ యెరుపులు కళ్ళల్లో కలలకి మరింత విభ్రమాన్ని చేకూర్చాయి.

"మరి ఎప్పుడు పట్నం వెళ్ళడం?" అంది.

"ఆ ఉంగరం ఎక్కడిది నీకు?" అన్నాడు నారాయణ లక్ష్మిపై గల శ్రద్ధను విశదపరుస్తూ.

"నాదే....ఏ ?" బెదురుగా అంది లక్ష్మి.

"అబద్ధం. నా దగ్గర దబాయించకు."

"నాదే నాదే ...మరి...."

"నిజం చెప్పు. లేకపోతే పోలీసులొచ్చి జైల్లో పడేస్తారు నిన్ను. నీ కోసమే చెపుతున్నాను. నమ్మవా నన్ను?"

లక్ష్మి సంగతంతా చెప్పింది.

"ఈ ఉంగరం నీ దగ్గరుంటే అపాయం వెర్రిదానా. రేపీపాటికి ఖైదులో వుంటావు. ఈ ఉంగరం నా చేతికిచ్చెయ్యి. రాత్రికి రాత్రి కరిగించేసి రూపాయలు తీసుకొస్తాను" అన్నాడు నారాయణ ఆత్రంగా.

"నేను మంచి వోణీ పరికిణీ కొనుక్కుందామనుకున్నాను." దీనంగా అంది లక్ష్మి.

"పిచ్చిదానా, నేను కొని తీసుకొస్తాను. ఈ చిగిరిన బట్టలతో పట్నం వెళ్ళితే నవ్వుతారు."

లక్ష్మి సందేహంగా బెదురుగా బాధగా ఉంగరాన్ని వేలినుంచి మెల్లగా తీసి యిచ్చింది. "మరి పెళ్ళిచేసుకుంటావా!" అంది.

"ఒట్టు వెయ్యలేదూ?"

ఒట్టుయొక్క మహత్యాన్ని కిమ్మనకుండా అంగీకరిస్తుంది లక్ష్మి.

"మళ్ళీ మీరు ఎప్పుడొస్తారు!"

"ఈ రాత్రికి ఎక్కడో ఒకచోట పడుకో. తెల్లారగానే గుడిదగ్గర వచ్చి వుండు. అక్కడికి నేను వస్తాను. రాత్రి కరిగించేసి అమ్మేసి డబ్బులు తీసుకొస్తాను. ఇద్దరం కలిసి రైలెక్కి బొంబాయి వెళ్ళిపోదాం. ఏం?"

"అదేం వూరు? ఛ, నేను రాను."

"బొంబాయి చాలా పే....ద్ద పట్నం లక్ష్మి."

"సెతాలు మరి చెన్నపట్నం వెళ్ళిందేం?"

"వెధవ చెన్నాపట్నం! బొంబాయి యింకా గొ....ప్ప వూరు. అక్కడ డబ్బు బోలెడు దొరుకుతుంది."

లక్ష్మి ఆలోచించింది. "గుడికాడనే వుంటాను. వస్తారా?"

"తప్పకుండా. వెళ్ళొస్తాను-ఏం?"

లక్ష్మి తలూపింది బెదురుగా. బుగ్గమీద చిటికివేసి గబగబా పొలాల లోంచి నడచి వెళ్ళిపోయాడు నారాయణ. చీకటిపడుతూంటే భయం కలసిన ఆనందంతో కలల మత్తుతో గుడివైపు నడచింది లక్ష్మి. ఆమెకు ఆకలి వేస్తున్నట్టే అనిపించలేదు.

* * *

ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిదికూడా అయింది. ఎండ ఎక్కువైన కొలదీ లక్ష్మికి ఆకలి ఎక్కువౌతోంది. ఎండ చుర్రుమనగానే గుడి దగ్గర రావిచెట్టునీడకి వెళ్ళి కూర్చుంది. గుడిగోపురం అంత ఎత్తుగా ఎవరు కట్టారా అని చాలాసేపు ఆలోచించింది. గోపురంమీద ఏదో పక్షి వాలింది. లక్ష్మికి సరదా వేసింది. తనకీ అంతపైన నుంచుని భూమి అన్నివైపులా చూడాలనిపించింది. కొంతసేపు ముసలి రోగిష్టి తల్లి జ్ఞాపకం వచ్చింది. బొడ్డులో తాళాలు దోపుకున్న సుబ్బయ్యగారు కేకలు వేస్తోన్నట్టు అనిపించింది. మధ్య మధ్య అకారణంగా ఉలిక్కిపడింది. గాలిలోంచి ఏదో కమ్మని వాసన వస్తోంటే, లాలాజలాన్ని గుక్కిళ్ళు మింగింది.

పూజారి గసరయ్య ఎవరు నువ్వని అడిగాడు. 'బొమ్మాయి' వెళ్తున్నానని చెప్పింది. నారాయణ ఎటువైపునుండీ రావడంలేదు. తన్ని దగా చేశాడా? గుండె కొట్టుకుంది భయంతో, ఆశా భంగంతో. కాదు, తప్పకుండా వస్తాడు. తన్ని పెళ్ళిచేసుకుంటాడు. ఆ కళ్ళతో ఎంత యిష్టంగా చూసాడు. పల్చని తెల్లని చొక్కానుండి కండలు తిరిగిన వొళ్ళు ఎంత వాచ్చుంది. ముట్టుకోవాలనీ ముద్దెట్టుకోవాలనీ అనిపించింది.

కాలవ రేవునుంచి తడిసిన బట్టలతో బిందెలు బుజాన పెట్టుకుని ఆడవాళ్ళు వెళుతున్నారు. గుళ్ళోంచి, మంత్రాలు వినపడుతున్నాయి. దేవుణ్ణి తలచుకుని నమస్కరించింది. కళ్ళెత్తి చూసింది. ఎదురుగా సుబ్బయ్యగారు పోలీసులతో, లక్ష్మి కంగారుపడిపోయింది, పారిపోదామనుకుంది.

"ఆగక్కడ" గద్దించాడు పోలీసు. లక్ష్మి జబ్బ పట్టుకున్నాడు.

"ఓసి దొంగముండా ఇక్కడ తగులడ్డావా, ఇదేం బుద్ధే నీకు? ఏం పొయ్యేకాలం వచ్చింది" అన్నాడు సుబ్బయ్య,

లక్ష్మి వణుకుతూంది.

"ఏదీ ఉంగరం?" వగరుస్తూన్న సుబ్బయ్యగారు గట్టిగా గొంతు చించుకొని అడిగాడు.

"ఉంగరవేంటి?"-తన్ని తను కాపాడుకుంటానికి ఒకటే మార్గం అయిన అబద్ధాన్ని ఆశ్రయించింది లక్ష్మి.

"రెండు తన్నండి ముండని"-సుబ్బయ్య సలహా యిచ్చాడు.

పోలీసు లాఠీతో వీపుమీద పొడిచాడు. "అమ్మో" అంది లక్ష్మి.

"చెప్పు ఉంగరం ఏం చేశావు?"

"నాకు తెల్దు" మొరాయించింది లక్ష్మి.

పోలీసు మోకాళ్ళమీద లాఠీతో కొట్టాడు. "బాబోయ్" అని అరచింది లక్ష్మి. ఆమె కళ్ళమ్మట నీళ్ళు ప్రవాహం కట్టాయి. చుట్టూ జనం మూగారు. కొందరు వెకిలిగా నవ్వారు. కొందరసహ్యించుకున్నారు.

"స్టేషనుకి నడు" అన్నాడు పోలీసు.

మునివేళ్ళమీద నిలబడి చుట్టూ మూగిన జనంలోకీ, జనం అవతల వున్న రోడ్డువైపూ పరకాయించి ఆశగా చూసింది లక్ష్మి, నారాయణ వస్తున్నాడేమో అని. కాని ఎక్కడా జాడలేదు. తల్లి జ్ఞాపకం వచ్చింది. ఒక్కసారిగా పెద్దపెట్టున ఏడ్చింది, అక్కడ రోడ్డుమీద చతికిలబడి. పోలీసు ఒక పక్కా, సుబ్బయ్య ఒక పక్కా నడుస్తోంటే దారిపొడుగునా నారాయణ వస్తాడనీ, తనని విడిపిస్తాడనీ ఆశతో కన్నీళ్ళతో చూస్తూనే వుంది.

రెండు నెలలు జైలులో ఉండేటప్పటికి నారాయణ యింక రాడని లక్ష్మికి దృఢమైంది. ఇసుకలాంటి అన్నమూ, చీకటికొట్టులాంటి జైలుగదీ, మనోవ్యధా-లక్ష్మిని నీరసంగా అసహ్యంగా చేసివేశాయి. 'ఉంగరమూ పోయింది. పెళ్ళీ పోయింది' అని గొణుగుకొనేది ఒక్కతే. కటకటాల్ని పట్టుకుని, మగవాడి నెవడినీ నమ్మకూడదనుకుంది. అయినా సుబ్బయ్యగారి కొడుకు ఉంగరం తాను తీస్తే పోలీసులకెందుకూ బాధ అనిపించింది లక్ష్మికి. వాళ్ళ సొమ్ము ఏమయినా తా నపహరించిందా ? లక్ష్మి హేతువుకి ఈ చట్టాలూ మనుష్యులూ అర్థం లేకుండా కనిపించాయి.

రోజూ తెల్లియకుండా ఏడ్చేది. జర్వం వచ్చేది. కదలకపోయినా కాళ్ళు లాగేవి. ముసలితల్లి చచ్చిపోయిందేమో అన్న దిగులు. రాత్రుళ్ళు నిద్రలో తనూ నారాయణా 'బొమ్మాయి' వెళ్ళుతూన్నట్టూ, దారిలో రైలు లోంచి తన్ని నారాయణ కిందికి తోసేసినట్టూ తన తల చితికి రక్తం ప్రవహించినట్టూ కలవచ్చి 'బాబోయ్' అని అరుస్తూ లేచి కూర్చునేది.

ఒకరోజున 'లక్ష్మీ' అన్న పిలుపు వినబడింది. ఎక్కడా అని తెల్లబోయి గది నలువైపులా చూసింది. ఎవరూ కనబడలేదు. మళ్ళీ 'లక్ష్మీ. ఇక్కడ.... నేను' అన్న మాటలు వినిపించాయి. ధ్వని వచ్చినవైపే చూసింది. తన గది నానుకున్న గదిగోడ పగులులోంచి నారాయణ చూసి నవ్వుతున్నాడు.

"నేనూ-నారాయణని లక్ష్మీ."

"నువ్వేలాగొచ్చావు?" ఆశ్చర్యంతో అడిగింది లక్ష్మి.

"నిన్నరాత్రి తీసుకొచ్చారు."

"ఏం?"

"సైకిల్ షాపులో పనికి కుదిరాను. డబ్బు అవసరం వచ్చి సైకిల్ చక్రం అమ్మేశాను అంతే. పోలీసులు వచ్చి యిక్కడ నన్ను ఉండమని బతిమాలుకొన్నారు" నవ్వుతూ చెప్పాడు నారాయణ.

"బలేగా అయింది సచ్చినోడా-బాగా అయింది" కసితో మెటికలు విరిచింది లక్ష్మి.

"నా కిదేమి కొత్తకాదు పిల్లా. ఇది అయిదోసారి మనం రావడం" అన్నాడు నారాయణ తన ఆధిక్యతను నిరూపిస్తూ.

"మంచిదానివి లక్ష్మీ. నీ ఉంగరం అమ్మితే యిరవై రూపాయలొచ్చినై. వారం రోజులు దర్జాగా వెలిగింది మన బతుకు. సినిమాలూ, కాఫీహోటళ్లూ-హాయ్ హాయ్."

"దొంగనాయాల-" తిట్టింది లక్ష్మి.

"నీ తిట్లు నన్ను తగలవు"అన్నాడు నారాయణ.

"అన్నాయం. అన్నాయం చేశావు దొంగసచ్చినోడా. నా ఉసురు నీకు తగుల్తుంది" అంది ఉక్రోషంతో లక్ష్మి.

"ఓష్ ప్రపంచమే అన్యాయం లక్ష్మీ. ఎవడికి అవసరమైతే వాడే అన్నాయ్యం చేస్తాడు. మరి నువ్వు దొంగతనం చెయ్యలేదూ? నీ దగ్గర్నుంచి నేను కొట్టేశాను."

"పో-నీ జిమ్మడా."

"ఎక్కడికీ పోను. ఇక్కడే నీకు సావాసంగా వుంటాను."

లక్ష్మి బాధతో మొహం మరోవైపు తిప్పి కూర్చుంది. నారాయణ నవ్వుతూ అన్నాడు.

"జైలు నుంచి విడిచాక వచ్చి నిన్ను తప్పకుండా పెళ్ళి చేసుకుంటానులే" అంటూ ఫక్కున నవ్వాడు నారాయణ.

లక్ష్మి ఉక్రోషంతో మాట్లాడలేదు.

"అప్పుడు బొంబాయి వెళ్ళిపోదాం. ఏది లక్ష్మి ఇటు చూడు. ఒక ముద్దియ్యి" అంటూ 'ప్చ్' అని పెదవులతో చప్పుడు చేశాడు నారాయణ.

లక్ష్మి దగ్గరున్న నీళ్ళలోటా తీసి పగులువైపు విసిరింది. పెద్ద చప్పుడయింది. పోలీసు 'ఏమిటది' అని కేకవేశాడు. లక్ష్మి మోకాళ్ళమీద తల ఆన్చి ఏడుస్తోంది. నారాయణ వెకిలినవ్వు జైలుగదిలో కోలాహలంగా ప్రతిధ్వనించింది.

*(1961)*

# నిర్మల వెంగండం

ఖంగారు ఖంగారుగా భోజనం చేస్తున్న భర్త మానసిక పరిస్థితినీ, మొహంమీద పడుతున్న నల్లని వంకీలజుట్టునీ, అదోవిధమైన ఆనందాన్నీ అందాన్నీ సూచించే అతని రూపాన్ని చూసేటప్పటికి జాలివేసింది నిర్మలకు.

'తాపీగా తినండి. మీకిష్టమని ఈ గోంగూర పచ్చడికూడా చేశాను. మీరలాగ కంగారుగా తిని వెళ్ళిపోతే నా మనసంతా ఏదో బాధపడుతుంది.'

'ఒళ్ళుమ్మకున్నాక తప్పుతుందా మరి! ఆ రావణాబ్రహ్మ ఈవేళ ఎలాగైనా నన్ను వదలడులే!'

ఈ రావణాబ్రహ్మ అన్న బిరుదు ఎవరికి చెందుతుందో నిర్మలకి తెలుసు. ఆ పేరు చెప్పితే తన భర్త హోరని వర్షములో తడిసి వచ్చి కూడా గడగడా మరచెంబుడు నీళ్ళు తాగుతాడన్న విషయం కూడా తెలుసును. కాని ఎదురుగా తన భర్త అంత కంగారుగా భోజనం సరిగా చేయకుండా వెళ్ళిపోతుంటే ఆమె భరించలేకపోయింది. అందులోనూ జరిగిన రాత్రి అతనసలు భోజనమే చేయలేదు. దానికి కారణమైన కలహమూ, ఆ కలహములో మొండిపట్టు పట్టిన తనపాత్ర నిర్వహణా, ఆ కోపములోనే యిద్దరూ భోజనం మానేసి, ఒకే పెద్ద మంచంమీద ఒకరికొకరు తగలకుండా, ఒకరివైపొకరు తిరగకుండా పడుకొని జరిపిన అసిధారావ్రత నిర్వహణమూ ఇవన్నీ నిర్మలని పశ్చాత్తప్తురాలినిగా భర్తయెడ మరీ సుముఖురాలిగా, ప్రేమచేత కరుణచేత ఆర్ద్రహృదయగా చేసివేశాయి. అందులోనూ

అందమైనవాడు, జుట్టు ఆ విధంగా మొహంమీద పడేవాడు, అటువంటివాడు తనకి భర్తఅయి, తన సర్వస్వమూ అయినప్పుడు-

'మీరు ఆ కూర మరోసారి కలుపుకుంటేకాని వీలులేదు. నా మీద ఒట్టే! లేకపోతే దీనికి ఓడి వుద్యోగం పోతేపోతుంది-దీని తాతలాంటిది వస్తుంది. ఊఁ, మరి కలపండి' అంది.

ఈసారి విసనకర్ర పుచ్చుకొని విసరుతూ అతనిప్రక్కన కూర్చుంది. నవ్వుతూ పట్టుదల పట్టుతూ లాలిస్తూ అతనిచేత తిరిగి కూర కలిపించింది. 'అయిన ఆలస్యం ఎలాగూ అయిందిగా? ఇంకో పావుగంట లేటయితే పీకలు తీస్తారా ఏమిటి? సంసారాల్లో ఎవళ్ళకిమాత్రం ఏదో అవసరాలు రాకుండా వుంటాయా, ఆలస్యాలవకుండా వుంటాయా?' అంటూ నొక్కులు నొక్కుతూ సన్నగా దీర్ఘంతీసింది.

ఈ ఆర్గ్యుమెంటుని ఏ కోర్టులోనూ ఒప్పుకోరని తెలుసును-కాని కలహానంతరం అందులోనూ ఒక రాత్రి రాత్రి అంతా మౌనంగా వుండి, తిరిగి సంధి కలుపుకొన్న తర్వాత భార్యా భర్త లనుభవించే ఆనందం సరి క్రొత్త ప్రేమలను ఉద్రేకాన్ని స్వచ్ఛ పరిమళాన్ని కలిగి వుంటుంది. అటువంటి పునర్నవమైన ఆప్యాయతతో భోజనం పెట్టుతూంటే, భార్య సన్నని గాజుల చప్పుడుతో విసరుతూ లాలిస్తూ ఉంటే వేరే కాంక్షించే స్వర్గమే లేకపోయింది గంగాధరానికి. ఆఫీసులూ, బాధలూ, సమస్యలూ అన్నీ చప్పున ఫేడౌట్ అయిపోయాయి. ఆ కాస్సేపట్లోను అతనికి నిత్యమూ, సత్యమూనైన బ్రహ్మానందం గోచరించింది.

ఈ సారి వాళ్ళ కబుర్లు, ఒకసారి మనస్సులోంచి సమస్యా సందేహాలు దూరమైపోయిన తరువాత-ఏ అడ్డంకీలేని నదీ ప్రవాహంలాగా సాగిపోయాయి. వచ్చే సంక్రాంతి పండుగకి మామగారు ఏం బహుమతి యిస్తారో అన్న ప్రశ్ననుండీ, సినిమాలో ఫలానా నటి తాలూకు నటన యెలావున్నదో, పక్కింటావిడ కొనుక్కున్న కొత్తచీరలోని కొత్త ఫ్యాషన్ విశేషమూ, కో-ఆపరేటివ్ స్కీములో తాము కట్టించబోయే చిన్నసైజు యింటికి యెన్నిగదులు ఉండాలి అన్నంతవరకు అనవసర అవసర సమాలోచనలన్నీ సాగిపోయాయి. అతను చెయ్యి కడుక్కొని లేచే

టప్పటికి ఆమె వక్క-పొడుం తీసుకొచ్చి ఇచ్చింది. అతను బనీను ధరించే టప్పటికి దువ్వెనతో వచ్చి అతని పాపిడితీసింది. అతను అమెరికన్ జాకెట్ వేసుకొనేటప్పటికి జోళ్ళు రడీగా ఎదురుగా పెట్టింది. అతను ఆమెను ముద్దు పెట్టుకొని 'వస్తాను నిర్మలా' అని యధాలాపంగా అలవాటు చొప్పున గోడమీద టైము చూచేటప్పటికి అతనికి స్పృహ వచ్చినట్టు- లేక తప్పి నట్టు అయింది. కఠిన వాస్తవికత కొరడాతో కొట్టినట్లయింది. అతని నీడ అతని వెనుకనే వచ్చి వెన్నుల్లో పొడిచినట్లయింది. ఉన్నపళంగా నప్పగా కుర్చీలో వాలి 'పదకొండుంబావు' అన్నాడు. అతని మొహంలో కత్తి వాటుకు నెత్తురు చుక్క-లేదు. తెల్లబడిన అతని మొహాన్ని, పిచ్చిగా చూస్తోన్న అతని కళ్ళను చూసి అర్ధాంగి కంగారుపడింది.

'గంటంపావు లేటు! ఆఫీసుకు వెళ్ళేటప్పటికి యింకో పావు గంటైనా పడుతుంది. ఇంక ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవలసిందే. అసలే కోపిష్టి మనిషి, అందులోనూ దొరల పంక్చుయాలిటీ అంటో ఛస్తొంటాడు. అసలు మొన్న మీవాళ్ళు వచ్చిన రోజున ఆలస్యమైనందుకే మండిపడ్డాడు. తుది హెచ్చరిక అని చెప్పాడు, మీసాల మీద చెయ్యివేసి. నా కొంప తవ్వే శావు. ఏ పావుగంటో, అరగంటో ఆలస్యం అయితే సర్దిచెప్పుకోవచ్చును. ఇప్పుడేమిటి చెయ్యటం?'

నిర్మలకి ఏమీ తోచలేదు. ససంభ్రమ సవిషాద సశంకిత అయి అలాగ నించునిపోయింది. అతను కణతల్ని రెండు చేతులతోనూ అదిమి పట్టుకొన్నాడు. ఈ విధంగా ఆలస్యంగా ఆఫీసుకు దయచేసి ఆ తప్పుని మళ్ళీ మళ్ళీచేసి ఉద్యోగం పోగొట్టుకొని, కొత్తది దొరక్క-, మాసిన గడ్డంతో, లోపలకు పోయిన కళ్ళతో రోడ్లుకాస్తూ మిత్రుల్ని అణా, బేడా అడిగి బతుకుతూన్న శంకరం స్మృతిపథంలో మెరిగేటప్పటికి అతనికి ఒక్క- నిమిషం ఊపిరాడలేదు. అతన్ని లాలిస్తూ భోజనం పెడుతూ, అర గంట కన్న ఆలస్యం అవడంలోని వైపరీత్యాన్నీ, విపత్తునీ చూడలేక పోయానే అని బాధపడుతోంది ఆమె.

"ఛీ ఛీ- మీ ఆడాళ్ళింతే. వెధవ సొద వేసుక్కూర్చున్నావు ఇప్పుడు చీవాట్లు తినాలి. డిస్మిస్ అంటే గొల్లుమని ఏడుస్తూ రావాలి. రేపటి నుండి మెతుకులు కూడా ఉండవు."

"అయ్యో నాకేం తెలుసండీ" అంది నిర్మల.

"ఏం తెలుసు మరీ! నీ మొగుడేమైనా కలెక్టరనుకున్నావా? మినిష్టరనుకున్నావా! గుమాస్తా అంటే ఏమిటనుకున్నావు? ఎన్నిసార్లు చెప్పాను నీకు తొమ్మిదింటికల్లా వంట అవ్వాలనీ" కోపంతో కేకలు వేస్తున్నాడు గంగాధరం.

"మరి మీరు తొమ్మిదింటికిగా బియ్యం పట్టించుకొని వచ్చిందీ?" అంది నిర్మల భయంగా.

మొదట తడితడిగా కనబడి తర్వాత బలం సంతరించుకొని బిందు రూపం తాల్చికొని, కనుకొలకుల నుండి రెండశ్రువులు నిర్మల కపోలాల మీద మెల్లగా జారాయి. గంగాధరానికి గబుక్కున జాలి వేసింది. అతనికి ఏ వూహ తట్టినా, ఏ అనుభూతి కలిగినా గబుక్కున కలుగుతుంది. "ఏదో కోపంలో అన్నాను నిర్మలా. నీ తప్పేమీలేదు. కాతాకొట్టు తెరిచేటప్పటికీ యీ వేళ తొమ్మిదయింది. అవునుకాని యిప్పుడేమిటి చేయడం?" అన్నాడు గంగాధరం.

నిర్మల తడికళ్ళు ఒకసారి మెరిశాయి. మంచుపడుతూన్న వేకువ పొద్దు మీద చటుక్కున సూర్యకిరణాలు పడ్డట్టు బిక్కపోయిన ఆమె మొహం ఒక్కసారి వెలుగుతో ఉద్దీప్తమయింది. తన భర్తకి నెల నెలా వచ్చే జీతపురాళ్ళని రక్షించే ఒక ఉపాయం ఆమెకు తట్టిఉండాలి.

గంగాధరం ఆశగా ఆమెకేసి చూశాడు. ఊపిరాడకుండా నదిలో కొట్టుకుపోతున్న అతనికి ఆమెలో స్ఫురించిన ఊహ అనే పడవచెక్కని పట్టుకొని గట్టుకు చేరుకోవాలనుకున్నాడు.

"నాకో ఊహతట్టిందండీ" అంది నిర్మల. "నిజంగానా" ఆత్రుతగా అన్నాడు గంగాధరం.

"నిజమేనండీ. మా స్కూల్లో యిదివరకు ఓ మేస్టరు ఉండేవారు. ఆయన చాలా కోపిష్టి. పెద్దపెద్ద మీసాలతో గండుమొహంతో అచ్చంగా పెద్దపులిలాగ ఉంటాడు. ఓనాడు నేను స్కూలుకి బాగా ఆలస్యంగా వెళ్ళాను. ఆయన కళ్ళెఱ్ఱజేసి ఎందుకింత ఆలస్యమయిందని గర్జించాడు. ఒకవేళ ఆడపిల్లనని చేయిచేసుకోకపోయినా, అక్కడ ఎండలో ఇసుకలో నుంచోబెడతాడు. మగపిల్లలు ఏడిపిస్తారేమో అని నా భయం. నాకు

భయంతో సిగ్గుతో ముచ్చెమటలు పోశాయంటే నమ్మండి. నాకు చటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఆయనకి మాతృప్రేమ ఎక్కువనీ, మాతృపూజ కన్నా జీవితంలో పరమార్థం పరోహటిలేదనీ. చూడండీ మీరేదో కాంప్లెక్సూ, గింప్లెక్సూ అంటారు అలాగ అన్నమాట. అంతే మా అమ్మ ఊరగాయలు కోసం అటక ఎక్కుదోతూ నిచ్చెనమీదనుంచి పడిందనీ, ఆమె కాలికి మర్దనా, అదీ చేసి, ఆవిడకి భోజనం పెట్టి, నే నన్నింటిని వచ్చేటప్పటికి ఆలస్యమయిందనీ మాంచి పొదుపుగా అబద్ధం ఆడేశాను. దాంతో అంత పెద్దపులీ అహింసావాది అయిన మేక అయిపోయాడను కోండి. నన్ను దగ్గరకు పిల్చి నా తల నిమిరి, విద్యార్థులందరికీ నన్నొక ఆదర్శం కింద చూపించి గౌరవించాడు మా మేష్టారు."

ఆమె ఆగింది భర్తకేసి భావయుక్తంగా చూస్తూ, పాపం భయా వస్థలో నున్న గంగాధరానికేమీ స్ఫురించలేదు.

"ఈ కథకీ నా ఏడుపుకీ సంబంధం ఏమిటి?" అన్నాడు విసుగ్గా.

భర్త తెలివితేటల్ని గురించి కొంచెం నిరసనగా, జాలిగా నవ్వి, విశమర్చి యిలా చెప్పింది నిర్మల; "చూడండి, మీ 'బాస్'లో ఎక్కడో వీక్ పాయింటు ఒకటి ఉంటుంది. దానిమీద మీరు 'ప్లే' చెయ్యాలి. ఎంత కోపంలో ఉన్నవాడైనా, అతనికి యిష్టమైన, అప్యాయమైన ప్రసక్తి తీసుకువస్తే చటుక్కున మెత్తబడిపోతాడు, మా మేస్టారులాగా. ధైర్యం తెచ్చుకోండి, ఆలోచించండి."

గంగాధరానికి ఆమధ్య తోటి గుమాస్తా ఒకడు చెప్పిన విషయం సమయానికి జ్ఞాపకం వచ్చింది. ఒక్క ఉదుటునలేచి ఆమెని కావలించు కొని "మై ప్రెషస్ ! నువ్వు నిజంగా నన్ను రక్షించడానికి వచ్చిన దేవ తవు. అందుకే కార్యేషు మంత్రీ, కరణేషు దాసీ (పాపం తిరిగేశాడు కంగార్లో) అన్నారుపెద్దలు. మా అధికారికి ఓ పెద్ద వీక్‌నెస్ ఒకటివుంది. అదే మిటంటే ఆయనకి చాలా కాలం పిల్లలులేరు. ఈ మధ్యే మూడు నాలుగేళ్ళ క్రితం ఒక పిల్లాడు కలిగాడు. ఆయనకి పిల్లలు అంటే ఎంతో పిచ్చట. ఆ రోజుల్లో మిఠాయీ బొమ్మలు కొని చుట్టుప్రక్కల ఉన్న పిల్లలకు వారం వారం పంచిపెట్టేవాడుట. ఇప్పటికీ ఈయన ఉన్న వీధిలో ఏ పిల్ల వాడికి జబ్బు చేసినా ఈయన స్వయంగా వెళ్ళి కష్టసుఖాలు విచారించి అవ

సరమైతే స్వయంగా డాక్టర్నికూడా తీసుకువెళతాడుట. ఎవరికీ కానీ రాల్చని వాడు నిరుపేద అనాథశిశుశరణాలయానికి రెండు వందలు- టూ హండ్రెడ్ అడగ్గానే యిచ్చిపారేశాడుట. ఏదీ, నా అమెరికన్ షర్టు ఇలా పడెయ్యి. ఓహో బ్యూటిఫుల్ అయిడియా" అంటూ అతనో విధమైన నాట్యం చేశాడు.

"మీరు షర్టు తొడుక్కునే ఉన్నారండీ" అంది నవ్వుతూ నిర్మల. గోధుమరంగు పాంటుమీద షార్కుస్కిన్ బ్లౌజువేసుకొని, జుట్టు అందంగా మొహంమీద పడుతుంటే సైకిలెక్కి సంతోషంగా వెళ్ళే భర్తను చూసి నిర్మల మళ్ళీ ఒకసారి సరికొత్తగా ప్రేమించినంత ఆనందమును, గర్వమూ పొందింది.

గంగాధరం వచ్చినట్లు తెలిసిన మేనేజరు తన గదిలోంచి గంగాధరాన్ని పిలిచాడు. మాంచి ధీమాగా, ఏ సంకోచమూ లేకుండా వెళ్ళే గంగాధరాన్ని చూచి సోదర గుమాస్తాలంతా తమ కళ్లని తామే నమ్మలేక ఒక్కసారి కళ్ళు నులుముకు చూశారు. వినయంగా మేనేజర్ ముందు నిలబడ్డాడు గంగాధరం.

"నీ ప్రవర్తన నా కర్థంకావటంలేదు. నీకు బొత్తిగా భయమూ, భక్తి లేకుండా పోయాయి. ఇది ఆఫీసనీ, ఇక్కడ నీవు జీతగాడివనే స్పృహ కూడా నీకు లేనట్లుంది. ఇదివరకు నీకు మూడుసార్లు వార్నింగు యిచ్చాను. నా మాట నీకు లక్ష్యం ఉంటేగా. ఇంక నీ విషయంలో కన్సిడరేషన్ ఏమీ చూపలేను. ఇంక నువ్వు ఫలితం అనుభవించక తప్పదు" అని కోపంగా నిక్కచ్చిగా ఆరోహణావరోహణలు సాటిస్తూన్న గొంతుతో, మీసం కొసన్ని మెలివేస్తూ కిళ్ళీచేస్తూ మాట్లాడే మేనేజరును చూస్తూంటే తీవిగా వెనకాలే నడిచివెళ్ళి 'జింకని, అమ్మని' నోటకరచుకొనే పులిలోని ఒడుపూ, నిశ్చయమూ గంగాధరానికి స్ఫురించేటప్పటికి అతని గుండె కొన్ని సెకనులు పనిచెయ్యలేదు. భయం భయంగా వణికే గొంతుని సరి చేసుకుంటూ ఇలా అన్నాడు.

'చిత్తం....ఏక్సిడెంటు జరిగిందండీ.........తమరు క్షమించాలి.'

'ఏక్సిడెంటా?' ఎగాదిగా చూచాడు మేనేజరు. 'నువ్వు బాగానే వున్నావే' అన్నాడు.

'ఆఫీసుకి ఆలస్యమవుతుందేమోనని తొందరగా వస్తున్నానండి. చటుక్కున దారికడ్డంగా ఒక చిన్నపిల్లవాడు వచ్చాడండీ. సైకిలు ఆ కుర్ర వాణ్ణి ఢీకొన్నదండి'

ఈసారి అధికారి మొహం మారిపోయింది. ఆ తరువాత ఆవేదన మొహంలో కనబడింది. 'ఏమైంది....ఏమైంది' అన్నాడు.

'తలకి, కాలికి గాయాలు తగిలాయండి. ఒకటే రక్తమండి. తక్షణం నా జేబురుమాలు తలకికట్టి ఆ కుర్రవాణ్ణి ఎత్తుకొని హాస్పటల్‌కి వెళ్ళా నండి. అక్కడ చికిత్స చేయించి కట్టుకట్టించి, డాక్టరుగారు ఫరవాలేదన్న తరువాత ఆ కుర్రవాడింటికి ఫోనుచేయించి మరీ వచ్చానండి. ఇంటికివెళ్ళి బట్టలు మార్చుకొని....'

'ఏం డేంజరు లేదుగదా. డాక్టరు గట్టిగా చెప్పాడా' ఫైర్ అలారం మోగింది అతని గొంతు.

'మరేం ఫర్వాలేదండి. అశ్రద్ధ చేయకుండా వెంటనే వైద్యం చేయించానండీ. సెప్టిక్ అవకుండా పెన్సిలిన్ ఇవీ అవీ ఇంజెక్షన్లు ఇచ్చా డండి డాక్టరు'

'ఆ కుర్రాడు కళ్ళు తెరిచి మాట్లాడుతున్నాడా?'

'చిత్తం....మొదట్లో కొంతసేపు తెలివిలేదండి. ఇప్పుడు మా అమ్మ కావాలి అని అంటున్నాడండి. ఈపాటికి తల్లిదండ్రులు అక్కడికి వెళ్ళేఉంటారండి!'

మేనేజరు మొహంలోని బాధ క్రమేణా తగ్గింది. 'మీరంతా వట్టి బ్రూట్స్. సైకిలెక్కితే ఏదో పెద్దనిషా వచ్చేస్తుంది కాబోలు మీ అంద రికీ. రోడ్డుమీద పిల్లలు - అమాయకులైన పిల్లలు - ఉంటారని ప్రాథ మిక జ్ఞానంకూడా పోతుంది కాబోలు. ఇకనైనా జాగర్తగా మసులుకో. నిన్ను క్షమించాను. నువ్వువెళ్ళి నీపని చూసుకో. నా మనసంతా అదోలా అయిపోయింది' అన్నాడు మేనేజరు.

శాల్యూట్ చేసి వెనక్కి తిరిగి తోటి గుమాస్తాల మధ్యకి వచ్చిపడ్డాడు గంగాధరం. సగర్వంగా సహాసంగా 'ఏం జరిగింది? ఏం జరిగింది?' అంటూ చుట్టూచేరి అడిగారు అందరూ. 'భాయ్ వీడు గంగాధరం ఏమిటను కున్నారో' అంటూ నవ్వుతూ ఫైల్సుతీసే గంగాధరాన్ని ఏదో మహిమాన్వితుడిలాగా, హఠాత్తుగా అణిమాది సిద్ధులు లభించిన యోగీశ్వరుడిలాగ వెర్రిగా చూశారు. మనసులోనే నిర్మలని తలచుకొని ధన్యవాదాలర్పించాడు గంగాధరం.

ఈ ప్రమాదవార్త విని సగం డీలాఅయిన మేనేజరు కాస్సేపట్లో తిరిగి కోలుకొని, ఒక్కసారి నిట్టూర్చి, తన పనిలో నిమగ్నుడయ్యాడో లేదో, గణగణమని టెలిఫోను మోగింది. తాపీగా చెవిదగ్గర పెట్టుకొని 'హలో' అన్నాడు. అవతల కొననుండి కంగారుగా భార్యగొంతు 'ఏమండీ మీరేనా, అయ్యో అర్జంటుగా రండీ. ప్రమాదంఅండి అబ్బాయికి ప్రమాదం జరిగిందండీ, ఎవడో సైకిలు మీదనుంచి పోనిచ్చాడండీ. తలంతా రక్తమండీ. త్వరగా రండీ.'

మేనేజరు గుండెలాగి, తిరిగి ఎగిరి గొంతుకలోకి అడ్డంగా వచ్చేసింది.

అతని మొహం తెల్లబడిపోయింది. మాట వణకింది. 'ఎవడావెధవ-ఆ సైకిలుతొక్కినవాడు?' అన్నాడు.

'ఆ దుర్మార్గపు వెధవ సైకిలు ఆపకుండ దిగకుండా రంయ్యిమని తొక్కుకొని పారిపోయాడండీ. వాడికాళ్ళు విరగ – త్వరగారండీ.'

మేనేజరు చేతులూ కాళ్ళూ ఆడలేదు. 'బతికే ఉన్నాడా' అని ఒక్క కేక పెట్టాడు ఫోనులోకి.

'అవేంమాటలండీ మీరు మరీనూ తలమీద గాయంపడింది అంతే. గాయం కడిగి గుడ్డతో కట్టాను. మన డాక్టరుకు ఫోనుచేస్తే లేడు. ఇంకొక డాక్టరిని ఎవరినైనా వచ్చేటప్పుడు తీసుకురండి. నెత్తురింకా కొంచెంగా వస్తూనే ఉంది. ఆలస్యం చెయ్యకండి' అంది ఆవిడ.

మేనేజరు కిప్పుడు శ్వాస ఆడింది. కాని క్షణంలో అతని మొహం కోపంతో కందగడ్డలా అయిపోయింది. కోటు చేత్తో తీసుకుని ఆఫీసుగది లోంచి ఇవతలికి వచ్చి గంగాధరంకేసి విషం కక్కుతూ చూశాడు.

'ఏయ్ - యిలారా.'

ఆ పిలుపుకీ చూపుకీ గతుక్కుమన్నాడు గంగాధరం. 'సార్' అన్నాడు దగ్గరగా వచ్చి.

'నువ్వెవరిమీదనుంచి పోనిచ్చావో తెలుసునా సైకిల్ని....?'

గంగాధరం ఏమిటన్నట్లు వెర్రిగా చూశాడు.

'మా అబ్బాయి మీదనుంచి. లేకలేక కలిగిన ఒక్క కొడుకుమీద నుంచి. మా ఆవిడ ఇప్పుడే ఫోను చేసింది. పైగా ఆగకుండా పారిపోయా వుట. నీఅంత నీచుడూ, దుష్టుడూ, అల్పుడూ, అధముడూ ప్రపంచంలో ఉండడు. నామీద నీకున్న గ్రుడ్డి మూలాన్ని చెయ్యాలని చేసినట్టు కనబడు తోంది. నిన్ను అరెస్టు చేయించాలి న్యాయానికి. కాని నీ పాపం నిన్నే కొడుతుంది. నిన్ను డిస్మిస్ చేశాను పో - ఆఫీసులోంచి పో-' అంటూ మేనేజరు ఊగిపోయాడు కోపంతో.

గంగాధరం ఏమి అర్థంకాక గుటక మింగాడు. 'సార్' అనపో యాడు.

'నువ్వేం చెప్పనక్కరలేదు. ఇంకొక నిముషం ఎదురుగా ఉంటే నిన్నేం చేస్తానో నాకే తెలీదు. ఏమయ్యా హెడ్‌గుమాస్తా. ఇతనికేదైనా ఇవ్వవలసింది ఉంటే తక్షణం ఇచ్చి పంపెయ్యి. మళ్ళీ నా కళ్ళకి కన బడ్డావంటే అరెస్టు చేయిస్తాను. జాగ్రత్త' అంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ అధికారి వెళ్ళిపోయాడు.

కాసేపటికి వెర్రివాడులాగా, సర్వం పోగొట్టుకొన్న వాడిలాగా మూర్తీభవించిన శోకం లాగ వచ్చిన గంగాధరాన్ని చూసి కలవరపడింది నిర్మల. అతని నోటినుండి జరిగిన కథ విని నిశ్చేష్టురాలైంది. జాలిగా తల రెండుచేతుల్తో పట్టుకొని కుర్చీలో కూర్చున్న గంగాధరాన్ని, అతని అంద మైన మొహంమీదపడే నల్లని వంకీలజుట్టునీ చూసేటప్పటికి ఆమె కను కొలకుల్లో తెల్లని నీటిబిందువు తళతళ లాడింది.

(ఆంధ్రపత్రిక వారపత్రిక)
19-11-1958



# పరివర్తన

థియేటర్ అంతా జనంతో నిండి ఉంది. పావుగంట ఆలస్యంగా మిలటరీ దుసులలో వచ్చిన శంకరానికి బ్యాటరీ లైటు వేసి చూపిస్తున్నా సరే, సీటు వెతుక్కోవటం కష్టమయింది. తడబడుతూ కాళ్ళు తొక్కుకుంటూ చివరికి సీటులో చతికిల పడ్డాడు. ప్రేక్షకులందరూ ఏకాగ్రతతో తెరమీద కథలో నిమగ్నులై ఉన్నారు. బరువుగా విడుస్తున్న వాళ్ళ ఊపిరి చప్పుడు శంకరానికి వింతగా తోచింది. తెరమీద మంచు దట్టంగా కప్పిన పట్టణంలో ఒక భాగం. ఓవరాల్స్ వేసుకున్న వ్యక్తులు రోడ్డుమీద మంచులో స్పష్టాస్పష్టంగా గోచరిస్తూ నడుస్తున్నారు. ఒక చర్చి కిటికీ లోంచి ముసలివాడు నిర్లిప్తంగా మంచుని మనుష్యుల్ని పరికిస్తున్నాడు. హఠాత్తుగా పిస్తోలు పేలిన చప్పుడు. రోడ్డుమీద ఓ వ్యక్తి "అబ్బా" అంటూ ఒరిగాడు. బూట్ కాళ్ళు కలదొక్కుకుంటూన్న చప్పుడు.... శంకరంచేతిమీద ఎవరిదో మెత్తని చేయిపడింది. శంకరం పక్కకిచూశాడు. ఒక యువతి చప్పున చేయి తీసేసుకుని "సారీ" అని తెరవైపు చూస్తూ వుంది. హిచ్ కాక్ పిక్చర్ యొక్క ప్రభావం అనుకున్నాడు శంకరం. ఆమె కలవరపాటు చూసి. అతనికి కథ అర్థం గావడంలేదు, ఆలస్యంగా రావడం మూలాన. అయినా శ్రద్ధగా తెరమీదకి చూస్తున్నట్టు అనిపించింది. నిశితంగా వెచ్చగా తనకి ఆ చూపులు తగులుతూన్నట్టు ఉంది శంకరానికి. ఆమె వైపు చూడాలనుకుని కూడా అతను కుతూహలాన్ని అణచుకున్నాడు. ఇంతలో ఆ యువతి ఏడుపుని నొక్కిపట్టిన సన్నని ధ్వని - ఆగిఆగి అతనికి వినపడింది. వింతగా ఆమెవైపు చూశాడు. పరీక్షగా, నిదానంగా

చూశాడు. రాజేశ్వరి ! శంకరం వాళ్ళు మనస్సూ ఒక్కసారిగా వేడిగా కంగారుగా అస్తిమితంగా అయిపోయింది. కొంతసేపటికి తమాయించు కొన్నాడు. ఆమె చేతిమీద చెయ్యివేసి "రాజీ" అన్నాడు మెల్లగా.

"వాగున్నావా?" అంది రాజేశ్వరి. నిట్టూర్పుని, మాటల్ని నొక్కిపట్టి. శంకరం చేతినుండి ఆమె తన చేతిని మెల్లగా తీసేసుకుంది. ఇద్దరూ ఓ ఐదు నిముషాలపాటు నిశ్శబ్దంగా ఉన్నారు. వాళ్ళు తెరవైపే చూస్తున్నారు గాని వారి దృష్టి అటులేదు. థియేటర్‌లో వెచ్చబడిన చీకటికన్న దళసరైన ఉద్రేకం వారిదుపురిసి చుట్టుకుంది.

"నీతో మాట్లాడాలి" అన్నాడు శంకరం. గొంతును బాగా తగ్గించి! ఆమె వెడల్పయిన తెల్లని కళ్ళతో అతనికేసి చూసింది.

"ఏచకి పోదాం వచ్చెయ్యి" అన్నాడు శంకరం. ఆమె తల ఊపింది. ఇరువురూ లేచి అడుగులో అడుగు వేసుకుంటూ థియేటరు బయటక వచ్చేశారు. విద్యుద్దీపకాంతిలో ప్రౌఢంగా అందంగా ఆకర్షణీయంగా ఉన్న ఆమె ముఖాన్ని, అవయవాల్ని చకితుడై చూస్తూ నిలుచుని పోయాడు శంకరం. రాజేశ్వరి కొంచెం కలవరపడి నవ్వి "ఏమిటా వాలకం, రా పోదాం" అంది శంకరం అనుసరించాడు.

ఆమె కారువద్దకు వచ్చింది. లోపల స్టీరింగుదగ్గర కూర్చుంటూ "ఎక్కడికి పోదాం," అంది అతను ఎక్కి కూర్చోగానే.

"డ్రైవర్ లేడా?"

"రమ్మన్నాను. సినిమా వదలే సమయానికి వస్తాడు."

"మరి—"

"ఇక్కడ లేకపోవడం చూసి యింటికి వస్తాడు."

"మీ ఆయన?"

నవ్వింది రాజేశ్వరి "ఊళ్ళో లేరు-క్యాంపుకి వెళ్ళారు" ఓ సెకను ఆగి మళ్ళా యిలా అంది "ఉంటేమాత్రం? వారికి నామీద నమ్మకమే...."

శంకరం నిట్టూర్చాడు. అదే పట్టుదల అదే వ్యక్తిత్వం, అదే స్వతంత్రం ఈ రాజేశ్వరిలో అనుకున్నాడు. అతనికి జరిగిపోయిన రోజులన్నీ జ్ఞాపకం వచ్చాయి. రాజేశ్వరీ, తనూ గాఢంగా ప్రేమించుకున్నారు

బాల్యంనుండీ. కొనదేరిన ముక్కుతో పెదవి ఎటువి వంపుతో ఒక పట్టుదలా వెడల్పాటి కళ్ళల్లో తెలివైన వెలుతురూ, వెన్నెల పాలరాతి శిల్పం మీద పడి జారిపోతున్నట్టుగా అనిపించే అవయవ లావణ్యమూ – రాజేశ్వరి అతన్ని స్వప్నంలో స్వగతంలో ఆక్రమించుకుంది. అతని బతుక్కి ఒక అర్థాన్నీ ఆవేశాన్ని గమ్యాన్నీ యిచ్చింది. ఇరువురి స్నేహాన్ని చనువునీ ఎవరూ అడ్డుపెట్టలేదు. తప్పుగా తీసుకోలేదు. వారి కుటుంబాల మధ్య ఉన్న సాన్నిహిత్యమే అటువంటిది–అదే కాదు, వారిదువురూ భార్యాభర్తలౌతారనే అనుకున్నారందరూ. ఆమె ఆనర్సు చదవడానికి దూరం వెళ్ళింది. తాను ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాడు. ఆమె సెలవులకి వచ్చినప్పుడల్లా కలసికొనేవాడు. గంటలకి గంటలు కబుర్లు చెప్పుకొనేవారు సినిమాలకి వెళ్ళేవారు. రాజకీయాల్నిగురించి సాంఘిక వ్యవస్థన్ని గురించీ విశ్వాసాల గురించీ–చర్చించుకొనేవారు. ఆమె తెలివైనది. ఎటువంటి సమస్యనీ ప్రాక్టికల్‌గా ఆలోచించి తూచి నిర్ణయం చేయగల శక్తి ఉంది ఆమెకు. ఆమె ఉద్రేకానికి లోనుకాదు. దాన్ని శాసించగలదు. బుద్ధియొక్క అదుపులో ఆవరణలో ఆమె ఉద్రేకాలు నిలిచి ఉంటాయి. అందుకే ఆమె తనని, తన జీవితాన్ని, తన భవిష్యత్ కుటుంబాన్నీ అందంగా ప్రయోజనకరంగా సుఖవంతంగా తీర్చి దిద్దగలదని అతను నమ్మాడు.

ఫైనలియరు పరీక్షలు వ్రాసి చదువుతో, వయస్సుతో, మరింత పొడుగ్గా అందంగా పెరిగిన రాజేశ్వరి తనని ఏకాంతంగా పిలిచి, "శంకరం, నిన్ను నేను పెళ్ళిచేసుకోను" అని చెప్పినప్పుడు అతను నమ్మలేకపోయాడు. ఆమె ఒక్కొక్కటే కారణాలు విశదీకరిస్తూంటే ఒక్కొక్క నిలువులోతు లోపలికంటూ అధఃపాతాళానికి అంధకార సముద్రంలోనికి అతను మునిగిపోయాడు. అతనికి తన జీవితాన్ని ఎవరో సగానికి నిర్దయగా చీల్చి రెండుముక్కల్నీ చెరోవైపుకీ విసిరేసినట్టు అనుభవం పొందాడు. చివరికి ఆమె తండ్రికూడ అన్నాడు "మనం ఎరిగున్న శంకరాన్ని కాదని ఆ నారాయణరావుని పెళ్ళిచేసుకోవడం అన్యాయం అమ్మా" అని.

ఆమె వినలేదు. నారాయణరావు బాగా డబ్బున్నవాడు, పెద చదువు చదివాడు. పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. వీటితోపాటు మంచి ఆరోగ్యమూ

రూపమూ ఉన్నవాడు అతనంటే యిష్టపడింది. అతనికి మాట యిచ్చింది. ఇంత గొప్ప అవకాశాన్ని జారవిడచుకోవడం-ఒక బాల్య చాపల్యాన్ని నమ్మి, ప్రేమ అనే పదం పన్నిన యింద్రజాలంలో చిక్కుకుని-వారి తెలివి తక్కువ. మానవుడికి బుద్ధి హేతువు ఉన్నందుకు ఉపయోగం ఏమిటీ? ఇదీ ఆమె వాదం.

తండ్రికి ఆమె పట్టుదల తెలుసును. "నీయిష్టం తల్లీ. నీ సుఖమే నాకు కావల్సినది" అన్నాడు. తాను ఆ సాయంత్రం తోటలో మునిమాపు వేళ కలుసుకున్నాడు. చీకటి తన మనసు లోని దిగులులా వ్యాపిస్తూంటే, గాలి చెట్ల ఆకులలో ఏడుస్తూంటే ఆమెతో అన్నాడు "నువ్వులేని బ్రతుకు ఊహించుకోలేను రాజీ! బతకలేను, నాగుండె పగిలిపోతుంది రాజీ."

"ఇది బలంలేనివాళ్ళ మాటలు. ధైర్యం స్థయిర్యం లేనివాడవు, నన్ను పెళ్ళిచేసుకొని ఏం నిర్వాకం చెయ్యగలవు శంకరం? జీవితాన్ని, జీవితంలో కలిగే సంఘటనలనీ ఎదుర్కోలేని పిరికితనం నా కసహ్యమని తెలుసుగా? నువ్వంటే నాకు వున్న అభిమానమూ యిష్టమూకూడా యిటు వంటి మాటలతో తుడిచి వెయ్యకు" అంది రాజేశ్వరి.

ఆమె పెళ్ళికాకముందే తాను మిలిటరీలో జేరాడు. మళ్ళీ యిన్నేళ్ళకి కలుసుకున్నాడు. శంకరానికి కారు దిగి రాజేశ్వరితో బీచ్ వొడ్డున కూర్చోవడంకూడా ఎరగడు యీఆలోచనలతో. అతను ఎంతో బలవంతాన తన హృదయంలోని ఉద్రేకాన్ని అణచుకుంటున్నాడు. అక్కడక్కడ జనం జంటలుగా గుంపులుగా బీచ్ వొడ్డంతా ఉన్నారు. దశమి నాటి వెన్నెలపడి సముద్రం అలలతో నురుగులతో గంభీరంగా మనోహరంగా ఉంది.

"నువ్వు సుఖంగా ఉన్నావా రాజీ?" అన్నాడు శంకరం.

"ఆఁ! నన్నుచూస్తే తెలియడంలేదూ" అని నవ్వింది రాజేశ్వరి.

"మరి థియేటరులో నన్ను చూసి ఏడ్చావెందుకూ! నువ్వు ఏడ్చి నట్లు నాకు తెలుసు."

"అవును. నిన్ను చూడగానే ఏదో బాధ కలిగింది. నావల్ల నువ్వి లాగ అయిపోయావు కదా అని బాధ" ఆమె గొంతు మృదువుగా జాలిగా ఉంది.

"అంతేనా రాజీ! ఒకే బాధేనా?" అతను కంగారుగా అడిగాడు.

"కాదు శంకరం నువ్వంటే నాకు అభిమానమూ ఉంది. నిన్నెప్పుడూ మర్చిపోలేను...."

శంకరం హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆమె చేయి పట్టుకుని "రాజీ నన్ను ప్రేమిస్తున్నావా! మరి నీ భర్త...." అంటూంటే ఆమె నవ్వి యిలా అంది "ఇలా తొందరగా నిర్ణయాలకి వచ్చేస్తావు నువ్వు శంకరం! నాభర్తని కోరి పెళ్ళిచేసుకున్నాను. సుఖపడ్డాను. అన్నివిధాలా."

శంకరం తెల్లబోయాడు. తన నిర్ణయం తప్పనీ, తాను సుఖపడడం లేదనీ తన వొళ్ళో ఆమె తలదూర్చి ఏడవాలని అతని రొమాంటిక్ ఉద్దేశం. కాని నిశ్చలంగా అందంగా నిండుగావున్న ఈ రాజేశ్వరి తనమీద స్నేహభావాన్నీ జాలినీ మాత్రమే ప్రదర్శిస్తుంది.

ఇరువురూ కొంతసేపు మౌనంగా కూర్చున్నారు. రాజేశ్వరి, దీనంగావున్న శంకరాన్ని చూచి మళ్ళీ జాలిగా అంది, "నువ్వు పెళ్లి చేసుకోలేదు కదూ ?"

"లేదు."

"చేసుకోవా శంకరం ?"

"ఊహుఁ."

వెన్నెల వెలుగులో శంకరం కళ్లు తడితడిగా వుండడం ఆమె చూసింది. "ఎవరిమీద నీ కోపం శంకరం! వెర్రివాడివిగానీ. నువ్వు పెళ్ళిచేసుకొంటే నీ జీవితం మారిపోతుంది. నీకు ఒక గమ్యం ఏర్పడుతుంది. నా మాట వినవా ?" అంది బతిమాలుతూన్న గొంతుతో.

"నీ బొమ్మ ఈ మనసులోంచి చెరగిపోదు రాజీ. అంతవరకు పెళ్లాడలేను" అన్నాడతను బరువుగా గాద్గదికంగా.

రాజేశ్వరి తల తిప్పుకుంది. ఇసుకలో చూపుడువేలుతో వలయాలు గీస్తోంది. ఆమె కన్నులలో క్రమ్మిన నీరు శంకరం చూడకూడదని ఆమె ప్రయత్నం. కొంతసేపటికి తేరుకొని వెన్నెలలాగ నవ్వి "సరే. నీ మిలిటరీ కబుర్లు చెప్పు. ఇప్పుడు నువ్వు బ్రిగేడియర్‌వా ? జనరల్‌వా ?" అంది.

"మేజర్ని."

శంకరం తన అనుభవాలు చెప్పసాగాడు. ఆమె శ్రద్ధగా వింది. బీచ్‌లో జనం బాగా పల్చబడ్డారు. సముద్రపు అలలు యిందాకటికన్న కోపంగా బలంగా ఒొడ్డును తగిలి విరుగుతున్నాయి. ఆమె లేచి "ఇక పోదామా?" అంది.

శంకరం ఆమెను అనుసరించాడు.

కారు నడుపుతున్న రాజేశ్వరి రేగిన ముంగురుల్ని అవయవాల వయ్యారాన్ని ఎర్రని పెదవుల్లోని తియ్యని నట్టుదలనీ చూస్తూ కూర్చున్నాడు శంకరం. అతనిలో ఏదో కోరిక బలవత్తరమైన నరనరాలలోనూ వెచ్చగా పదునుగా వ్యాపించింది.

"ఇదే నా హోటలు. ఇక్కడాపు రాజీ" అన్నాడు శంకరం. రాజేశ్వరి కారు ఆపింది.

"ఒకసారి నా రూమ్‌కి రారాదూ. ఓ నిమిషం కూర్చుని వెళుదువు గాని" అన్నాడు శంకరం.

"ఆలశ్యమైపోయింది."

"భయమా రాజీ" అన్నాడు శంకరం.

"నువ్వుంటేనే? నీ దగ్గరా నాకు భయం?" అంది రాజేశ్వరి నవ్వి.

"అయితే ఓసారి వచ్చివెళ్ళు."

రాజేశ్వరి కారు దిగి అతని వెనకాలే వెళ్ళింది. రూంలో ఆమెని సోఫాలో కూర్చోపెట్టి "ఇప్పుడు నువ్వు నా అతిథివి. ఏదైనా తీసుకోవూ" అన్నాడు.

"ఇప్పుడేమీ వద్దు. అరె! టేబులుమీద అది నా ఫోటోయే!"

"అవును నిన్ను నిత్యం చూస్తూ వుండాలి రాజీ" శంకరం నవ్వాడు. "నేఫా యుద్ధంలో బ్రతికి తిరిగివస్తానని అనుకోలేదు. అప్పుడు కూడా నీ ఫోటో నా జేబులోనే వుంది." అన్నాడు.

రాజేశ్వరి ఆ ఫోటోని పరీక్షగా చూసి "ఎంత చిన్నదాన్నో అప్పుడు. ఎనిదేళ్ళు జరిగిపోయాయి" అని నిట్టూర్చింది.

అల్మారాలోంచి బ్రాందీ తీసి టేబులుమీద పెట్టి "ఎనిమిదేళ్లు నాకు ఎనిమిది యుగాలు. నీకు క్షణంలో జరిగిపోయినట్లు వుంది. అయినా రాజీ నువ్వు మరింత అందంగా – మరింత పరువంగా వున్నావు. ఇప్పుడు నీ వయసెంత రాజీ?"

రాజేశ్వరి నవ్వి "ఇరవై ఎనిమిది" అంది.

"కొంచెం మందు వేసుకోనియ్యి రాజీ, అలవాటయిపోయింది. అయినా ఎప్పుడూ మోతాదుగానే వుంటాను" అంటూ కళ్ళు చిట్లించి ఆమె కేసి నవ్వుతూ చూసి బ్రాందీ గ్లాసులో పోసుకుని తాగాడు.

"మిలిటరీ దుస్తులలో ఉన్న నీ ఫొటో ఒకటి నాకివ్వు శంకరం" అందామె.

"ఒక టేమిటి నీకు కావల్సినవి తీసుకో" అని ఆల్బం ఆమె ముందు పడవేశాడు.

ఆమె ఒక ఫొటో ఏరి తీసుకుని లేచి నుంచుని "ఇంక వెళ్ళి వస్తాను శంకరం" అంది. అతను మాట్లాడలేదు. తదేకంగా ఆమెను చూస్తున్నాడు. ఆమె కొంచెం యిబ్బందిగా కదిలింది. "ఏవిటా చూడడం?" అంది విసుగ్గా.

శంకరం ఆమె దగ్గరకు వచ్చి రెండుచేతులూ చప్పున పట్టుకున్నాడు. "రాజీ, ఈరాత్రికి యిక్కడ వుండిపో, ఒకసారి పూర్తిగా నువ్వు నా దానివి కావాలి. ఇంక జీవితంలో ఏమీ కోరను. ఇంక నీకు కనిపించను, ఈఒక్క కోరిక తీర్చు రాజీ. ఈ తృప్తితో, యీ స్మృతితో యింక చనిపోయినా ఫరవాలేదు. అదేం రాజీ అలా చూస్తావు ఇది తప్పుగా భావిస్తున్నావా ! నాకోసం, గుండెలో యింత పెద్ద ఎడారిని దాచుకొన్న నాకోసం– ఒకసారి, ఒకసారి...." ఉద్రేకంతో ఎరుపెక్కిన మొహంతో అతనింక మాట్లాడలేక పోయాడు.

ఆమె మెల్లగా చేతులు విడిపించుకొని "శంకరం నా కిష్టంలేదు" అంది నిశ్చయంగా.

అతనింకా ప్రాధేయపడుతూ "రాజీ రాజీ ఒక్కసారి........" అన్నాడు.

రాజేశ్వరి అతన్ని సోఫాలో కూర్చోపెట్టింది. మృదువుగా లాలనగా అంది "పిచ్చివాడవయి పోతున్నావు శంకరం నువ్వడిగేది ఎంత అసహజమో, ఎంత అసంభవమో నీకు తెలియడంలేదు. నువ్వు పెళ్ళి చేసుకోవాలి. తప్పదు శంకరం ! నా మాట విను !"

శంకరం తల వాల్చుకుని కూర్చున్నాడు. అతని కన్నులలో నీరు చిమ్మింది.

రాజేశ్వరి "నేను వెళ్ళి వస్తాను శంకరం ! నువ్వు స్తిమితంగా ఆలోచించుకో" అంటూ అతని జుట్టు నిమిరి గదిలోంచి వెళ్ళిపోయింది. శంకరం మరి కాస్త బ్రాందీ పోసుకొని ఒక గుక్కలో తాగి గిర్రున తిరిగే పంకావైపు చూస్తూ కూర్చున్నాడు.

* * *

సివిలియన్ డ్రస్సులో ఉత్సాహంగా వచ్చిన శంకరాన్ని నవ్వుతూ ఆహ్వానించింది రాజేశ్వరి. ఆమె చాలా అందంగా అలంకరించుకుంది. ఇటూ అటూ అందంగా పెరిగిన గార్డెన్ చూస్తూ యీలవేస్తూ వచ్చాడు శంకరం. ఆమె వొంటిమీదనుండి సుతారపు అత్తరు సువాసన అతన్ని సోకి గిలిగింత పెట్టింది. వరండాలో విద్యుద్దీపకాంతిలో నిలిచి వున్న ఆమె లావణ్యాన్నీ అందాన్నీ ఎంతగా వెర్రిగాచూస్తూ "రాజీ" అని చేతులు చాపాడు.

"హుష్ - నౌకర్లింకా వెళ్ళలేదు" అందామె సిగ్గుగా.

ఇద్దరూ డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చున్నారు. రాజేశ్వరి మౌనంగా తలవాల్చి కూర్చుంది. శంకరం మెల్లగా "రాజీ నువ్విలాగ అనుగ్రహిస్తావని అనుకోలేదు. నీ చీటీ చూసినప్పట్నుంచీ ఎప్పుడు చీకటిపడుతుందా అని చూస్తూ వున్నాను" అన్నాడు.

రాజేశ్వరి జవాబుగా నవ్వింది.

శంకరం నలువైపులా దృష్టి సారించి "చాలా పెద్దయిల్లే ! ఈ ఫర్నిచర్ చాలా బాగుంది" అన్నాడు.

ఆమెలో గృహిణీత్వపు గర్వం కళ్ళలో మెదిలింది. "బొంబాయిలో కొన్నాం ఆయనా నేనూ కలిసి ఎన్నిక చేశాం" అంది.

"మీ గార్డెన్ కూడా మనోహరంగా వుంది రాజీ. అంతా నీ కృషి ఫలితమే ననుకుంటాను" అన్నాడు శంకరం.

"ఒక్క నాకే కాదు. ఆయనకీ గార్డెనింగంటే ప్రాణం. ఇద్దరం కలిసి ఏ మొక్క ఎక్కడ నాటాలో, ఎక్కడ ఎలా వుండాలో వివరంగా ఆలోచించి ప్రణాళిక వేశాం. ఆయన గోతులు తవ్వడం, నేను మొక్కలు నాటడం. నేను బోదెలు చెయ్యడమూ ఆయన నీరు తోడడమూ - తోట మాలికి ఊరికే జీతం యిస్తున్నాం."

శంకరం సిగరెట్టు అంటించి గోడలమీద ఫొటోలు చూస్తున్నాడు. రాజేశ్వరి పక్కనే నిలబడి చెబుతోంది.

ఇది మా పెళ్ళినాటి ఫొటో. ఇది హనీమూన్‌కి కాశ్మీరు వెళ్ళినప్పుడు. ఈ బొమ్మలన్నీ అవే! కాశ్మీరు ఎంత లవ్లీగా వుంటుందని.... ఇంకా ఆల్బమ్‌లో చాలా బొమ్మలున్నాయి. ఇది ఆయనకి జనరల్ మానేజరుగా ప్రమోషన్ వచ్చినప్పుడు తీసిన ఫొటో - నాకూ ఓ పూలదండ వేశారులే."

శంకరం మరొక ఫొటోని చూసి "ఇది - ఈ ఎన్‌లార్జిమెంటు ఎవరిది?" అన్నాడు.

"మా బాబుది ఏడాది పిల్లవాడివి. ఎన్‌లార్జి చేయించాం."

శంకరం ఆశ్చర్యంగా "రాజీ. నీకు పిల్లలున్నారా?" అన్నాడు.

"భలేవాడివి. పెళ్ళయాక పిల్లలు పుట్టరేం?" అంది రాజేశ్వరి.

"ఎంత మంది?"

"ఒక్కడే."

"అందుకే యింకా నీ వొళ్ళు...." ఆమెకేసి చూస్తూ ఆగిపోయాడు శంకరం. ఆమె ఫక్కున నవ్వి "సరే, యింక భోజనం చేద్దామా?" అంది.

"భోజనానికి తొందరేమిటి. ఏది నీ యిల్లంతా చూపించు రాజీ" అన్నాడు శంకరం కుతూహలంగా.

ఆమె ఒక్కొక్క గదీ చూపించింది. భర్త లైబ్రరీ గది, ఆమె గదీ, వంటగదీ అన్నీ చూపి అతన్ని మేడమీదకు తీసుకెళ్ళింది. "ఈ బాల్కనీ అంటే వారి కెంతో యిష్టం. అలసిపోయి వచ్చినప్పుడు యిక్కడే కూర్చుని ఆకాశాన్ని నక్షత్రాల్నీ చూస్తూ విశ్రాంతి తీసుకుంటారు. అప్పుడు నేను వీణమీద రెండు మూడు పాటలైనా వినిపించి తీరాలి" అంది రాజేశ్వరి.

సగం అల్లిన ఊలుస్వెట్టర్ని చూపించి శంకరం "నీకు అల్లిక పని బాగా వచ్చునా రాజీ?" అన్నాడు.

"ఏదో కొంచెం, కాలక్షేపం ఎలాగ చెప్పు. ఆయనకి స్వెట్టరూ మఫ్లరూ. అబ్బాయికి మేజోళ్ళు అల్లుతూంటాను."

"నీ భర్త ఎప్పుడు వస్తాడు రాజీ?"

"నాలుగైదు రోజుల్లో...." ఆమె ఆలోచనగా నిలబడిపోయింది.

"ఏమి టాలోచిస్తున్నావు?" అన్నాడు శంకరం.

"ఈవేళ ఆయన దగ్గర్నుండి ఉత్తరం రావాలి. రాలేదేమా అని!"

"అందుకు పెద్దకారణం ఏముంటుంది రాజీ. పని తొందరలో రాయక పోవచ్చును" అన్నాడు శంకరం.

"అదికాదు శంకరం. రోజువిడిచి రోజు వారు ఉత్తరం రాయక పోతే నాకు తోచదని వారికి తెలుసును" అంటూ సన్నగా నవ్వింది రాజేశ్వరి.

శంకరం మరో సిగరెట్టు వెలిగించాడు.

"ఈ రాధాకృష్ణుల దంతపుబొమ్మ ఎంత బాగుంది రాజీ. ఎక్కడ ఖరీదు చేశావు" అన్నాడు.

"నా పుట్టినరోజుకి ఆయన బహుమతిగా యిచ్చారు."

"ప్రతి పుట్టిన రోజుకి మీ ఆయన ప్రెజెంట్ యిస్తాడా?"

"ఆఁ .... ఏం మరచిపోయినా నా పుట్టినరోజూ, పెళ్ళిరోజూ ఆయన మరచిపోరు. ఇప్పుడు నేను కట్టిన చీర ఒక పుట్టినరోజు బహుమతే"

శంకరం కిటికీలోంచి వెన్నెల పరుచుకున్న పట్టణాన్ని చూస్తున్నాడు.

"ఏమిటి చూస్తున్నావు శంకరం" అంది రాజేశ్వరి.

"ఇక్కణ్నుంచి వ్యూ బాగుంది" అన్నాడు శంకరం. అతని గొంతులో జీర వుంది.

రాజేశ్వరి శంకరాన్ని మరో గదిలోకి తీసుకు వెళ్ళింది. గదిలో చిన్నటేబిలూ, చిన్న చిన్న కుర్చీలూ. చిన్న రైలుబండీ, మోటారుకారూ రకరకాల ఆటవస్తువులూ - ముచ్చటగా వుంది. ఆరేళ్ళ కుర్రవాడు కాలు మీద కాలు వేసుకు పడుకున్నాడు. ఆయా మంచం వారనే కూర్చొని కథలు చెబుతోంది.

"వీడే మా అబ్బాయి. సుందరరావు తాతగారిపేరు" అంది రాజేశ్వరి. సుందరరావు లేచి కూర్చుని "ఈయనెవరమ్మా, డాడీవచ్చాడేమో అనుకున్నాను. డాడీ ఎప్పుడొస్తాడమ్మా" అన్నాడు ముద్దుగా.

రాజేశ్వరి వాణ్ని ముద్దుపెట్టుకుని "వచ్చేస్తారు బాబూ, ఇంకా పడుకోలేదేం - నిద్రరావడంలేదా" అంది.

"నువ్వు రావాలమ్మా, నువ్వొచ్చి కథ చెబితేకాని నిద్ర పోనమ్మా" అన్నాడు సుందరరావు బుంగమూతిపెట్టి.

"అలాగే సుందర్. ఇవ్వతినివచ్చి నీకు కథ చెప్తాను. ఏం?"

తల ఊపాడు సుందరరావు.

"ఎవరి పోలిక రాజీ. మీ అబ్బాయిలో నీ పోలికలు కనిపించవేం" అన్నాడు శంకరం.

"ఆయన పోలికే - ఆ నుదురూ ఆ పెదాలూ...." అంది రాజేశ్వరి గదిలోంచి వస్తూ.

రాజేశ్వరి శంకరాన్ని పడకగదిలోకి తీసుకు వెళ్ళింది. లేత నీలపు రంగు గోడలూ రెండు పెద్ద స్టీల్ అల్మైరాలూ, తెరచివున్న వాటిలోంచి కనపడే ఖరీదైన చీరలూ. పాంట్లూ, ముఖమల్ దుప్పటి పరచిన మంచాలూ, మొజెయిక్ ఫ్లోరింగూ, గోడలలో అమర్చబడిన విద్యుద్దీపాల మెత్తని వెలుతురూ, నిలువుటద్దాలూ - లవెండరువాసన, విశాలంగా ఉన్న ఆ గది ఎంతో మనోహరంగా వుంది. దగ్గరగావున్న ఆ మంచాలమీద నారాయణ రావూ రాజేశ్వరి దగ్గరగా కౌగలించుకుని పడుకున్నట్లు కనపడ్డారు శంకరానికి. అతని గొంతులో దెబ్బ పట్టినట్టయింది.

"ఎలా వుంది శంకరం" అంది రాజేశ్వరి.

"వండ్రఫుల్" అన్నాడు శంకరం. తేరుకొని రాజేశ్వరి నవ్వింది. ఆ నవ్వులో ఏదో తృప్తి, గర్వమూ ధ్వనించాయి.

ఇరువురూ టేబిలు మీద ఎదురెదురుగా కూర్చొని భోజనం చేస్తున్నారు. శంకరం పరధ్యానంగా తింటున్నాడు.

"ఏం శంకరం అదోలా వున్నావు" అంది రాజేశ్వరి.

"ఎలా వున్నాను" అన్నాడు నవ్వుతూ శంకరం.

"గ్లూమీగా"

"నిన్నూ నీ యింటినీ చూడడం ఒక అనుభవం సుమీ. అవును కాని రాజీ...." సందేహం ధ్వనించింది అతని గొంతులో.

"ఏం" కుతూహలంగా చూసింది రాజేశ్వరి.

"నన్ను పిలవడంలో నువ్వు తొందరపడి...."

"నేను తొందరపడి నిర్ణయానికి రానని, వచ్చాక ఆ నిర్ణయం మారదనీ తెలుసుగా శంకరం."

శంకరం నవ్వేశాడు. ఆమె తన క్లబ్బుని గురించీ, అతను తన మిలిటరీ అనుభవాలూ చెప్పుకుంటూ భోజనం పూర్తి చేశారు. భోజనానంతరం రాజేశ్వరి శంకరాన్ని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చొపెట్టి యిన్ని పత్రికలు అతనిముందు వుంచి "బాబుని పడుకోబెట్టి వస్తాను, నౌకర్లని పంపివేస్తాను. ఈ పత్రికలు చూస్తూవుండు. ఇంతవరకూ గృహిణి అయిన రాజేశ్వరిని చూసి విసుగెత్తింది కదూ" అని ఆగి సిగ్గుతో ఓరగా చూసి "ఈసారి నీ రాజేశ్వరిగా వస్తాను" అని వెళ్ళిపోయింది. శంకరం మందహాసం చేశాడు.

ఒక గంట అనంతరం తెల్లని చీరతో సిగ్గూ కోరికా కలవరపడే కళ్ళతో అప్సరసలా మెట్లుదిగి వచ్చింది రాజేశ్వరి. కాని డ్రాయింగ్ రూంలో శంకరం లేడు. వరండాలోకి వెళ్ళి చూసింది. అక్కడా లేడు. గేటు కాపలావాడు తనవైపే రావడం చూసింది. "దొరగారు వెళ్ళిపోయానని చెప్పమన్నారు. ఈ కవరు మీ కిమ్మన్నారు" అని లేతనీలపు రంగు కవరు ఆశ్చర్యంతో చెల్లబోయిన రాజేశ్వరికి యిచ్చి వెళ్ళిపోయాడు. ఆ

కవరు తనదే. డ్రాయింగ్ రూమ్ బల్లమీద తన కవర్లూ రైటింగ్ ప్యాడూ ఉన్నాయి.

సంభ్రమంతో ఆశ్చర్యంతో కోపంతో ఆత్రుతగా కవరు విప్పి యిలా చదివింది రాజేశ్వరి.

రాజీ,

నన్ను క్షమించు. నేను వెళ్ళిపోతున్నాను. నేను నిన్ను కోరిన కోరిక ఎంత అసమంజసమో, అవివేకమో తెలుసుకున్నాను. నా మీద జాలివల్ల నువ్వు అంగీకరించావు. అయినా నేను చూసి చూసి ఒక పవిత్ర దేవాలయాన్నీ, లోనిదేవతనీ అపవిత్రం చేయలేను. పదేళ్ళ క్రితం రాజేశ్వరివి కాదు నువ్వు. నువ్వూ, నీ భర్త, నీ కొడుకు, నీయిల్లూ యివన్నీ పెనవేసుకుపోయిన స్త్రీ మూర్తివి. నీ అణువణువూ నీ భర్తకి అంకితమయింది. మీ యిద్దర్నీ విడదీసి చూడడం తెలివితక్కువ. నిన్ను విడిగా ప్రత్యేకంగా నేను పొందడానికి నీదగ్గిర ఏమీ నీడనేదిలేదు రాజీ. నిర్మలమైన ఒక సరస్సును కెలికివేసేటంతటి కుసంస్కారిని కాదు నేను. దాంపత్య జీవితం ఇంతగా ఒక వ్యక్తిని మారుస్తుందని ఉదాత్తం చేస్తుందని నేనెన్నడూ ఊహించలేదు. ఈ చర్య జరిగివుంటే ఎంతో మానసిక సంక్షోభానికి కారణమై వుండేది. నిన్ను మరచిపోయేందుకు ప్రయత్నిస్తాను. నీ కోరిక ప్రకారం పెళ్ళి చేసుకుని సతీమణితోనే నీకు మళ్ళీ కనిపిస్తాను.

—శంకరం

*(1967)*

35

# దేవుణ్ణి చూసినవాడు

గవరయ్య పెళ్ళాం లేచిపోయిందన్న వార్త ఊరుఊరంతా ఉత్సాహంగా వ్యాపించింది. అంతకుముందు రోజునే చైనా ఇండియా సరిహద్దులలో దురాక్రమణ చేసిందనీ, యుద్ధం జరుగుతూన్నదనీ వచ్చిన వార్త చటుక్కున అప్రధానమైపోయి అందరూ మరచిపోయారు కూడా. ఆడది లేచిపోవడంలోని విశిష్టతని ఈ వూరువారొక్కరే గుర్తించారా అనిపిస్తుంది యింత తెలుగు దేశంలోనూ!

రోడ్ల కూడలిలో, కాఫీ హోటలులో (అవూళ్లో ఒకటే వుంది) పొలంగట్లనీ, పంచాయతీ బిల్డింగ్ దగ్గరా పురుషులూ; పెరటి గోడల దగ్గరా, బావులా, నీలాటి రేవుల దగ్గరా ఆడవాళ్ళు ఈ విషయాన్నే చిత్ర విచిత్రంగా చెప్పుకుంటున్నారు. వట్టి లేచిపోవడమే అయితే యింత సంచలనం కలిగించకపోను; అందులోనూ ఎందుకూ పనికిరాని ఎదురింటి అరుగుమీది మిషన్ కుట్టుపనివాడితో లేచిపోవడమే మరీ విడ్డూరంగా వుంది. ఇంతకన్న మరో ఏ పెద్దమనిషితో లేచిపోయినా యింత అప్రదిష్ట ఉండకపోనని వూళ్ళో అనుభవజ్ఞులైన పెద్దలు అనుకున్నారు. చాలా మంది యువకులు గవరయ్య భార్య తమని నిష్కారణంగా అవమానించినట్టూ అన్యాయం చేసినట్టూ బాధపడ్డారు.

"వాడిలో ఏం చూసి లేచిపోయిందత్తా" అని మూడోసారి అడిగింది తన అత్తని ఒక పడుచు తన కుతూహలం ఆపుకోలేక.

"పోనీ నువ్వే వాడితో లేచి పోకపోయావూ నీకు తెలిసొచ్చును." అంది అత్తగారు విసుగుతో, కోపంతో.

"గవరయ్యకి బాగా శాస్తి అయింది" అని ఏకగ్రీవంగా ఆబాల గోపాలమూ తీర్మానించారు. గవరయ్యను చూసి జాలిపడినవాడూ సానుభూతి తెలిపినవాడూ ఒక్కడు లేడు.

గవరయ్య అంటే ఆ వూళ్ళో అందరికీ అసహ్యం. మనిషి కూడా నల్లగా ఎగుడుదిగుడుగా వుంటాడు. మొహంమీద స్ఫోటకం మచ్చలు, పెదాలు లావుగా మోటుగా వుంటాయి. కనుబొమ్మలు గుబురుగా గొంగళీ పురుగులు అతికించినట్లు వుంటాయి. ఊరికి శివారున వున్న పెద్ద పెంకుటింటి లోగిలిలో గవరయ్య వుంటాడు.

"నాకు తెలుసును. యిలాంటిదేదో జరుగుతుందని" అన్నాడు కన్నులరమూసి అవధాని. అవధాని ఆ వూళ్ళో ధర్మకర్త.

మునసబు చలపతీ, కరణం నరసింహమూ తల వూపారు. దాంతో మరికాస్త ఉత్సాహంతో ఉపనిషద్వాక్యంలాంటి పై వాక్యానికి వ్యాఖ్యానం చెప్పాడు ధర్మకర్త.

"వేణుగోపాలస్వామి వూరికే పోనిస్తాడా ? ప్రథమ కళత్రం చావనే చచ్చింది, ఇంక ఈ రెండో ఆవిడ చావుకన్న ఘోరమైన పని చేసి వూరుకుంది. ఒక్క ధర్మకార్యం చేశాడా ? ఒక్క మంచిమాట చెవిని పెట్టాడా ?"

మున్సబు చలపతి చేతికర్రను నేలమీద తాటించి అన్నాడు "ఒక్కరిని దగ్గరకు రానిచ్చాడా ? కర్కోటకుడంటే యీ గవరయ్య. ఎంత అహం, ఎంత పొగరు...."

"పాపపు సొమ్మంతా పాపిష్టి ఆర్జితం ! దాని ఫలితం వూరికే పోతుందా ? మొన్న కుర్రాళ్ళందరూ వెళ్ళి భజన చందాకి ఒక్క రూపాయి- ఒక్క రూపాయి యిమ్మంటే తరిమి కొట్టాడుట...." అన్నాడు కరణం.

గవరయ్య యిరవై ఏళ్ళ క్రితం ఇరవై ఏళ్ళవాడు ఈవూరొచ్చాడు. ఈ వూళ్ళో అతనికో మేనత్త వుంది. తల్లీ తండ్రీ లేని అతను యీ మేనత్త దగ్గరకు వచ్చిపడ్డాడు. వస్తూనే కొంత డబ్బుకూడా తీసుకుని వచ్చాడు. ఈ వూరికి రెండు మైళ్ళ దూరంలోనే టౌను వుంది. రోజూ

ఉదయమే టౌన్‌కి వెళ్ళి చీకటి పడ్డాక తిరిగొచ్చేవాడు. కొన్నాళ్ళకి తోళ్ళ వ్యాపారం చేస్తున్నాడని తెలిసి అందరూ "హరి హరీ" అని చెవులు మూసుకున్నారు. మేనత్తతో యిది చాలా పాపమనీ, చెడిసిపోతుతుందనీ చెప్పారు. కానీ మేనత్త ఏమీ మాట్లాడలేదు. కొందరు చొరవచేసి గవరయ్యతో జంతు చర్మ విక్రయం మంచిదికాదని చెప్పారు. "జంతువులేం ఖర్మ మనుషుల తోలునే అమ్ముతాను. మరీ పల్చన కాబట్టి పనికిరాదు కాని" అని సమాధాన మిచ్చాడట గవరయ్య. గవరయ్య ఒంటెత్తు మనిషి. ఎవరితోను మాట్లాడడు, కలవడు అసలు గవరయ్య నవ్వడం ఎవరూ చూడలేదు. అదే కాక గవరయ్యకి "పాపం" "పుణ్యం"అనే భేదాలు వున్నట్టుకూడా తెలియదు.

ఈ యిరవై ఏళ్ళలోనూ అతను లక్ష రూపాలయకి పైగా సంపాదించాడని ప్రతీతి. ఊళ్ళో పెద్దలు – ఉదారులూ ధర్మపరులూ కాబట్టి, అతని పాప వ్యాపారాన్ని క్షమించి అతని శ్రేయస్సుకోరి, అతని ఆముష్మిక సుఖం కోసం దానధర్మాలు చేయమనీ గుడి మండపం కట్టించమనీ, పాఠశాల బిల్డింగ్‌కి చందా యిమ్మనమనీ, సప్తాహాలు చేయించమనీ చెవిలో యిల్లు కట్టుకుని చెప్పారు. గవరయ్య గుండ్రంగా లోతుగావున్న కళ్ళని కుంచించి మోటైన పెదాలమధ్య చుట్టని నొక్కిపెట్టి, విసుగ్గా, విసురుగా "నేనొక్క కానీ యివ్వను, పోయి మీ అబ్బతో చెప్పుకోండి" అనేవాడు. మంచి లేదు, మర్యాదాలేదు వీడికి అనుకున్నారు వాళ్ళందరూ పరోక్షంగా. అతనికి లక్ష రూపాయిలుండడంవల్ల అతని ఎదురుగా అలా అనలేదు, వాళ్ళు సహజంగా జ్ఞానులు కాబట్టి.

గవరయ్య మేనత్తగారింటికి చేరిన కొద్ది రోజులలోనే మొదటి భార్యను తీసుకొచ్చాడు. ఆ భార్యనెక్కడికీ పంపేవాడు కాదు. పొరుగిళ్ళకు కూడా వెళ్ళేదికాదు. మేనత్తా, భార్యా, గవరయ్యా – ముగ్గురూ మూడు పెయ్యాలలా వుండేవారు. ఒక ప్రకారంకూడా వూళ్ళోవుండేది. గవరయ్య పెళ్ళాన్ని ఏదో భూతం ఆవహిస్తూంటుందనీ, ఊళ్లో ఎవరికి తెలియకుండా అందరూ నిద్రపోయే అర్ధరాత్రివేళ భూతవైద్యుడెవడో వచ్చి ప్రయోగాలు చేస్తాడని ధూపాలు వేస్తాడనీ చెప్పుకుంటూంటారు.

ఇంత ఒంటరిగా సంఘ జీవితంలో కలవకుండా పిశాచాలా వుంటున్నారో ఎవరికీ అర్థంకాలేదు. కొంత కాలానికి గవరయ్య పుట్టిన వూరు నుండి వచ్చాననని చెప్పుకుంటూ కొన్నాళ్లు ఆ వూళ్ళో ఒక గాజుల వర్తకుడు తిరుగుతుండేవాడు. అతను గవరయ్యను గురించిన భోగట్టా అందజేశారు.

గవరయ్య తండ్రి చాల దుర్మార్గుడట. జూదమూ, తాగుడూ రెండింటినీ సమపాళంగా అభ్యసించి ప్రాక్టీసు చేశాడుట. తల్లి రోగిష్టిదై మంచానపడి ఉండేది. అందువలన గవరయ్య తండ్రి పొరుగూళ్ళో ఒకావిడని వుంచుకొన్నాట్ట. గవరయ్య చిన్నతనంలో తల్లి సంరక్షణ ఏమీ ఎరగనివాడు. తండ్రికున్న చెడ్డ పేరువలన గవరయ్యతో ఎవరూ కలిసేవారు కాదు. ఆఖరికి ఆ వూరి బళ్ళో కూడా చేరనివ్వలేదు. ఆ స్కూలు స్థాపించినాయన అక్కడ పేరొందిన భూస్వామి. ఆ భూస్వామితో గవరయ్య తండ్రికి ఎడతెగని వైరం. భూస్వామి పలుకుబడీ దైవభక్తివున్నవాడు. ప్రతిఏటా సుబ్బారాయుడి షష్టి ఉత్సవాలూ, అన్న సంతర్పణా చేయించేవాడు. గవరయ్య తండ్రి రౌడీ ముఠాతోచేరి ఆ వుత్సవాలలో గలభా చేయించేవాడు. ఒకానొక ప్రాణావసర సమయంలో గవరయ్య తండ్రిచేత యిచ్చిన దానికన్న రెండు రెట్లుకి తనఖా వ్రాయించుకొని వున్న భూమి కాస్తా అన్యాయంగా కాజేశాడని గవరయ్య తండ్రి అరోపణ. కాని వూళ్ళో పెద్దలు ఒక రౌడీ మాటల్ని నమ్మేటంత అవివేకులుకారు. అదే కాక వాళ్ళు చాటుమాటుగా వడ్డీ వ్యాపారం ఆ భూస్వామి పద్ధతి మీదే చేస్తున్నారు కాబట్టి పెద్దమనిషి, పరమ భక్తుడూ అయిన భూస్వామి యిలాంటి అక్రమం చేస్తాడని కలలో కూడా ప్రజాసామాన్యం నమ్మదలచుకోలేదు.

గవరయ్య ఒంటరితనాన్ని చూసి బాధపడి తండ్రి ఒక్క కుక్కపిల్లనీ, రెండు పిల్లిపిల్లల్నీ తెచ్చి యిచ్చి వాటితో ఆడుకోమనేవాడు. "మనుషులకంటె యివే నయం" అనేవాడు రోగిష్టి అయిన భార్యతో; గవరయ్య బాల్యమంతా కుక్కలతో, చెట్లతో, గోడలతో ఆడుకుంటూ గడిపాడు. కొన్నినాళ్ళకి రోగిష్టి తల్లి చనిపోయింది. ఆమె చనిపోవడంతో

గవరయ్యతండ్రి దుండగాలెక్కువైపోయాయి. గవరయ్య తండ్రికి భార్య అంటే చాలా ప్రేమ. ఆమె జబ్బుకోసం చాలా డబ్బు ఖర్చుపెట్టాడు. ఇప్పుడీమెకు చివరి రోజుల్లో వైద్య సహాయం చేయించలేకపోవడం భూస్వామి అక్రమం వల్లనేనని ఆలోచించిన గవరయ్య తండ్రి మరీ పేట్రేగిపోయాడు. భూస్వామి పాలేరు పొలంలోంచి వస్తూండగా ఎవరో వాడి తల రెండు చెక్కలయేటు యినుపకత్తితో కొట్టారు. భూస్వామి తన అనుమానమంతా గవరయ్య తండ్రిమీద ఉందన్నాడు. గవరయ్య తండ్రిని అరెస్టుచేశారు. కేసు మోపారు ఊళ్ళో అందరూ బలమైన సాక్ష్యం ఇచ్చారు. వాళ్ళు స్వయంగా చూసినా చూడకపోయినా, భక్తిపరుడైన భూస్వామి ఆజ్ఞల్ని దైవాజ్ఞగా శిరసావహించారు. గవరయ్య తండ్రికి యావజ్జీవ శిక్ష పడింది. తండ్రి ఆఖరిమాటగా కొడుకుతో 'ఎవర్నీ నమ్మకు. నీ కాళ్ళమీద నువ్వు నుంచో, ఈ మనుషులందరూ దొంగ వెధవలు, విష సర్పాలు' అని చెప్పి మరీ పోలీసులతో వెళ్ళాడు.

తల్లిలేని, తండ్రిలేని గవరయ్య ఆ యింట్లో బెంబేలెత్తిపోయాడు. బెంగతో రెండురోజులు తిండీతిప్పలు లేక యింట్లో మూలగా కూర్చుని పధ్నాలుగేళ్ళ గవరయ్య హోరుమనిఏడ్చాడు. ఎవరూ ఆదాయలకి రాలేదు. పలకరించలేదు. రౌడీ, హంతకుడూ అయిన తండ్రి దుర్గుణాలు వీడికి సంక్రమించి వుంటాయనీ, వీడి కెంతదూరంలో వుంటే అంత మంచిదని ఆవూళ్ళో మంచివాళ్లందరూ అనుకున్నారు కాబోలు. గవరయ్యకి జ్వరం వచ్చింది. మందులేదు, మాకులేదు. జ్వరం స్ఫోటకంలోకి మారింది. ఆ యింట్లోంచి రాత్రిళ్ళు "అమ్మా చచ్చిపోతున్నానేవ్" అనే కేకలు విన వచ్చేవి భయంకరంగా దీనంగా.

మశూచి అని తెలియగానే ఆ పొలిమేరలలోకూడా జనం నడవడం మానివేశారు. "ఈ కొడుకుకూడా పోతే వూరికి పీడా వదలిపోతుం" దన్నారు కొందరు. ఇలా వుండగా ఒక రోజు సాయంత్రం ఒకగుర్రబ్బండీ గవరయ్య ఇంటిముందాగింది. దానిలోనుంచి నలభై ఏళ్ల స్త్రీ దిగింది. ఒంటి నిండా నగలున్నాయి. మనిషి పొడుగ్గా, బలంగా ఉంది. చెంపలదగ్గరైనా జుట్టు నెరవలేదు. ఆ వీధివీధంతా వింతగా ఆమెకేసి చూస్తూ నుంచున్నారు.

కాని ఆమె పక్కకి కూడా చూడకుండా సరాసరి లోపలికి వెళ్ళిపోయింది. నౌకరు పెట్టెలన్నింటినీ లోపల పెట్టి తలుపులు దభాల్న వేసేశాడు.

నౌకరు ద్వారా ఆమె గవరయ్య తండ్రికి యిలాకా ఉన్న ఆవిడనీ. ఆరునెలలు పుణ్యక్షేత్రాలు సేవించి రెండురోజుల క్రితమే తిరిగి వచ్చిందనీ. గవరయ్య తండ్రికి యావజ్జీవ శిక్ష పడడమూ కొడుకు దిక్కులేనివాడై ఉండడమూ తెలిసి యెకాయెకిని సామాను పట్టించుకుని ఆ వూరు వచ్చేసిందనీ తెలిసింది. అంతే. నాటినుండీ గవరయ్య ఆమె సంరక్షణలో పెరిగాడు. జబ్బునుంచి కోలుకున్న గవరయ్య మరీ వికృతంగా వున్నా ఆమె లక్ష్యం చేయలేదు. తండ్రితో సంబంధమున్నంత మాత్రాన ఈ చాత కాని వికారపు కొడుకు బాధ్యత తీసుకోవడంలోని అవివేకాన్ని ఒకరిద్దరు చొరవగల స్త్రీలు ఆమెకి చెప్పిచూశారు. కానీ ఎవర్నీ లక్ష్యంచేయని గుణం ఆమెలో వుంది. కొన్నాళ్ళకి ఒక పిల్లని వెతికి తెచ్చి గవరయ్యకి పెళ్ళి చేసింది. గవరయ్య ఇరవయ్యోయేట ఆమె మరణించే ముందు గవరయ్యకి తన నగలూ, పదివేల రూపాయల నగదూ యిచ్చివేసింది.

తర్వాత అత నీ వూరిలో మేనత్త ఇంటికి రావడం, తోళ్ళ వ్యాపారం చేయడమూ, ఏడెనిమిదేళ్ళకు మొదటి భార్య పోవడమూ ఊళ్ళో అందరికీ తెలిసినదే. ఈ చరిత్రఅంతా గాజుల వర్తకుడి ముఖతః విన్న తర్వాత గవరయ్య అంటే ఉన్న వాళ్ళ అసహ్యభావం యీసారి తార్కికమైన ఆధారంతో మరింత గట్టిపడింది. తండ్రి దుర్మార్గుడు, హంతకుడు. వీడు చిన్నతనంనుండి పిల్లులతో కుక్కలతో కలిసి జంతు లక్షణాలు అలవరచుకున్నాడు. పైగా వీడి పెంపకం ఒక చెడిన స్త్రీ చేత. ఇంతటి అమానుషుడు వచ్చి వచ్చి తమ ఊళ్ళో పడ్డాడనే బాధ ఒకవైపున పీడించింది నలుగుర్నీ.

అయినా అవధాని మొదలైన పెద్దలు మొదట నిరాశ చెందలేదు. గవరయ్య దుర్మార్గుడు నిజమే. వికృత రూపుడు - అదీ నిజమే - పిసినిగొట్టు, ఎవరికీ కానీ రాల్చడు- ఒప్పుకున్నాం- ఒంటెత్తు మనిషి, సభ్యత లేనివాడు- అందరికీ తెలుసును; అయితేనేం ధనవంతుడు, ఆ ధనాన్ని సత్కార్యాలకు ఉపయోగించేటట్టు చేస్తే అతనికీ, పెద్దలకీ ముక్తి ఉంది.

ఇంత ఉదారాశయంతో ఎన్నో విధాల ఎన్నోసార్లు గవరయ్యని కదిపి చూశారు. వేణుగోపాలస్వామి ఉత్సవాలన్నారు. మండపం కట్టించాలన్నారు. ఒకవైపు ఒరిగిన ప్రాకారం బాగుచేయించాలన్నారు. దేనికీ గవరయ్య లొంగిరాలేదు. చివరికి గుళ్ళోకివచ్చి దైవదర్శనం చేసుకుని ప్రసాదం తీసుకోమన్నారు. అది ఖర్చులేనిపని ఎప్పటికైనా గవరయ్య రాతి గుండెలలో భక్తి వి త్తనం నాటుకుంటుందని వాళ్ళ ఆశ. కాని ఏనాడూ గవరయ్య గుడి ఛాయలకికూడా రాలేదు.

ఒక తోటివాడు నాస్తికుడై పాపియై పోతూంటే ఊరుకోలేని మంచితనంవలన, కార్యదీక్షవలన ఊరి పెద్ద లతనిమీద బహిష్కారణాస్త్రం ప్రయోగించారు. కానీ అదేమి పనిచేయలేదు. ఎందుకంటే గవరయ్య ఊరినే బహిష్కరించాడు మొదటినుండీ. చాకలీ, కోమటీ, మంగలీ అతనికి చాటుచాటుగా వాళ్ళవాళ్ళ సేవలందించడం మానలేదు కూడా. నిక్కచ్చిగా వాళ్ళందరికీ జీతాలిస్తాడేమో గవరయ్య బేరాన్ని పోగొట్టుకోవడానికి వాళ్ళెవరూ ఇష్టపడలేదు.

మొదటి భార్య కాలుజారి నూతిలోపడి మరణించినప్పుడు అవధానీ తదితరులూ గవరయ్యని పరామర్శించారు. ఇదంతా కర్మఫలితమనీ, యిప్పటికేనా మేలుకోమనీ హెచ్చరించారు. కాని గవరయ్య ఖాతరు చేయలేదు. పైగా ఏడాదిలో తనకన్న పదిహేనేళ్ళు చిన్నదైన ఒక పిల్లను పెళ్ళి చేసుకుని యింటికి తీసుకొచ్చాడు. ఆ పిల్ల అందంమాట ఎటున్నా ఫ్యాషన్‌గా అలంకరించుకునేది. ఆమెని ఎంతో ఆప్యాయంగా ప్రేమగా చూసేవాడని గవరయ్యని గురించి అనుకునే వారు. అయితే ఆమె అయినా యిల్లుదాటి యీవలికి వచ్చేదికాదు. ఎవరేనా కుతూహలం కొలదీ వెళ్ళి పలకరిస్తే కబుర్లు సరదాగా చెప్పేది. ఎవరేనా గవరయ్య రూపాన్ని గురించిగాని, వయస్సు గురించిగాని వ్యంగ్యంగా హేళనచేస్తే "ఆయన చాలా మంచివారు" అనేదిట. నాలుగు రోజుల కొకసారి ట్రక్కు టౌన్‌కి బండి మీద వెళ్ళి సినిమా చూసి వచ్చేదిట. గవరయ్య తన నిబంధనల్ని ఈ భార్య విషయంలో సడలించాడని ఆశ్చర్యపోయారు. కానీ ఆ సడలింపు కూడా కొంతవరకే. ఆ యింటిలో వున్నవాళ్ళు అలాగ మనుషులకీ, వూళ్లో జరిగేసంఘటనలకీ దూరదూరంగా వుండవలసిందే.

ఎదురింటి అరుగుమీద వున్న మిషన్ కుట్టువాడితో యీమెకి లేచి పోవడం దాకా యింత చనువు ఎలా ఏర్పడిందో ఎవరికీ తెలియదు. కాని ఈ దుస్సంఘటనతో మునసబూ, కరణమూ, తదితరులూ మహదానందం పొందారు. కటిక చీకట్లో వాళ్ళకి మళ్ళీ ఆశాకిరణం గోచరించింది. ఇనుం వేడెక్కినప్పుడే సాగగొట్టాలన్నారు. నలుగురూ కలసి ఒక రోజున గవరయ్య యింటికి వెళ్ళారు. ఇల్లు చాలా పెద్దది. మండువాలోగిలి. ఇంటి చుట్టూ పెద్దదొడ్డి: వెనకాల గడ్డివామూ, దూడల పాకా, చెట్లు, చేమలూ వున్నాయి. ఆ పైన యింకేమీ యిళ్ళు లేవు. అన్నీ పొలాలే. మేనత్త వున్న చిన్న లోగిలిని క్రమ క్రమంగా పెంచే యింత యింటిని చేశాడు గవరయ్య.

ఆ ఇల్లు అన్నిఇళ్ళలా వుండదు. కలకల లాడుతూన్నట్టు వుండదు. ఏదో భయంకరమైన ఏకాంతం ఆ ఇంట్లో పేరుకున్నట్టు వుంటుంది. రాత్రుళ్లు దెయ్యాలు గదిలోంచి గదిలోకి వంకర కాళ్ళతో తిరిగి తిరిగి పగటివేళ అటకమీదా, చూరు మూలల్లోను దాక్కున్నట్టు వుంటుంది. పలుకుబడీ, స్తోమతూ సహజంగా ధైర్యమూ వున్న ఆ నలుగురికీ ఆ ఇంట్లో అడుగు పెడుతూంటే కొంచెం బెదురుగా వుంటుందన్నమాట నిజం.

గోడకు చేరబడి కళ్లు మూసుకుని వున్నాడు గవరయ్య. బనీను లోంచి అతని బలిష్టమైన రొమ్మూ, కండలూ మశూచికపు గుంటలతో నాట్లుతిన్న తుమ్మబొదెల్లా వున్నాయి. అడుగుల చప్పుడు విని కళ్ళు తెరచి చూశాడు. కళ్లు ఎర్రజీరలతో తాగినవాడి కళ్ళలా వున్నాయి. అవధానీ, మునసబూ, కరణమూ, మరొక పెద్ద మనిషీ తేరి చూస్తున్న గవరయ్యకి దగ్గరగా వున్న బల్లమీద కూర్చున్నారు. గవరయ్య ఏమన్నట్టుగా ప్రశ్నార్థకంగా చూశాడు.

"నీకు రావాల్సిన కష్టం కాదోయ్ గవరయ్యా. నిమ్మకు నీరోసినట్టు వుండే స్వభావం నీది. ఒకరిజోలీ శొంఠీ అక్కర్లేదు. విషయం తెలియగానే 'అరే! పాపం' అని మనస్సు కొట్టుకులాడి పోయిందంటే నమ్ము" అన్నాడు కరణం.

గవరయ్య మాట్లాడలేదు. అలాగే చూస్తున్నాడు.

పన్నులు కట్టడంలో కానీ, పాలేళ్ళకి జీతాలివ్వడంలోకానీ - తన ధర్మం తాను పైపైకి నెరవేర్చుకునేవాడు. ఒకరిసొమ్ము ఎప్పుడూ తన దగ్గర వుంచుకోలేదు. సుబ్బయ్య గాడికి సాలు తిరక్కముందే ధాన్యం కొలిచి యిచ్చేశాట్ట గవరయ్య. "వాడు తెగ చెప్పుకోవడమే - మా కామందు మహాదొడ్డమనిషీ అని...." అన్నాడు మున్సబు. గవరయ్య అలాగే చూస్తున్నాడు. అతను వీరి మాటలు వింటున్నాడో లేదో తెలియదు.

"కాని ఒక్కమాట గవరయ్య బాబూ!" మందంగా, గంభీరంగా, అందులోనే ఒక విశేషమైన దయా, మృదుత్వాన్నీ కలిపి వాచా చమత్కారియైన అవధాని ధర్మకర్తృత్వపు హోదాతో పలికాడు "భగవంతుడి ఆసరాలేకుండా ఎటువంటివాడూ యీ సంసార సాగరాన్ని సుఖంగా దాటలేడనుకో. నువ్వు ఉత్తముడివి. ముక్కుకి సూటిగా పోయేవాడివి. అయితేనేం; నీ వ్యాపారం వుంది చూడు - అది కేవలం ధర్మవిరుద్ధమని శాస్త్రాలు నొక్కి చెబుతున్నాయి. అయితే కలియుగంలో కొన్ని మినహాయింపులు చేశారు మనుషులు. అందుకని ఫరవాలేదు. కాని ఒక్కటి చెప్పారు - ఏమైనా ఆ భగవంతుని స్మరించడం మానకుండావుంటే అన్ని కష్టాలూ మంచులా విడిపోతాయి. ఫలం, పుష్పం, పత్రం, తోయమ్ - అన్నారు - భగవానుడు అల్పసంతోషి...."

క్రమంగా అందరి మొహాలలోను విజయాన్ని సూచించే నవ్వు అలముకొంది. ఎప్పుడూ కసురుకొని విసుక్కునే గవరయ్య యీ వేళ మౌనంగా వున్నాడు. అభేద్య మనుకున్న కోటగోడకు పగులు ఏర్పడింది. ఇంక మెల్లమెల్లగా గవరయ్యని మార్చివేయ వచ్చుననే భావం వారిలో ఏర్పడింది. అందరూ లేచారు, వెళ్ళొస్తామన్నారు. కాని గవరయ్య అలాగే శిలాప్రతిమలా కళ్ళప్పచెప్పి చూస్తూ కూర్చున్నాడు.

## 2

ఒక ఏడాది గడిచింది. అప్పుడప్పుడు కరణము, మున్సబూ వగైరాలు గవరయ్య ఇంటికి వచ్చి పోతున్నారు. గవరయ్యని దైవ దర్శ

నానికని, హరికథకనీ, మరొకటనీ చెప్పి పిలుచుకు వెళుతున్నారు. ఊళ్లో వాళ్లు కూడా గవరయ్య వీధిలో వెళుతూంటే నమస్కారాలు పెడుతున్నారు. గవరయ్య మాత్రం ఏమీ మాట్లాడడు. మంత్రించిన వాడిలా ఆ దేవాలయంలో కానీ, హరికథలో కానీ కూచుంటాడు. సగంలో ఒక్కొక్క సారి చటుక్కున లేచి వెళ్ళిపోతాడు. పెద్దలు దలపంకించి 'రాక్షసముండాకొడుకు. ఒక్కరోజులో మారతాడా' అనేవారు.

"మారికేం చేస్తాడు ? సంఘాన్నీ, ధర్మాన్నీ కాదని ఎక్కడికి పోతాడోయ్ వీడు" అనేవాడు అవధాని.

వేణుగోపాలస్వామి గుడి ప్రాకారం పూర్తిగా పడిపోయేటట్టు వుంది. ఇంక జాగుచేస్తే లాభం లేదనుకున్నారు వూళ్ళో పెద్దలు. పాతిక వేలైనా వుంటేగాని యీ పని జరగదు. అంత మొత్తాన్ని ఒక్క గవరయ్య తప్ప యివ్వగలిగినవాడు మరొకడు లేడన్నారు. ఈ యేడాదిలోనూ గవరయ్య చాలా లాభాలు సంపాదించాడు. తోళ్ళ వ్యాపారం అలా వుండగా, పట్టణంలో నూనె మిల్లులో ముప్పాతికవాటా కొన్నాడు. ఒక్క వేరుశనగ నూనెలోనే ఒక లకారం వచ్చిందని వూరంతా ఎంతగా చెప్పుకుంటున్నారు. ఈ అభివృద్ధికి కారణం అతనిలో పొడచూపిన దైవభక్తి అని వాళ్ళను కోవడమే కాకుండా అతడు ఏమరిపోతాడేమోనని అతనివద్ద మరిమరీ పని కట్టుకు చెప్పేవారు. ఒక మంచిరోజున మున్సబూ, కరణమూ, ధర్మకర్తా యింకా వూళ్ళో మోతుబరులూ, అందరూ కలిసి గవరయ్య యింటికివెళ్ళి ప్రాకారోద్ధరణను గురించి చెప్పారు. అతనే పూనుకోవా లన్నారు. "నీపేరు చిరస్థాయి అయిపోతుంది, గవరయ్యా. నీ పేరు మీదుగా రోజూ పూజా పునస్కారాలు జరిపిస్తాం" అనీ చెప్పారు.

"దేవుడికి అసలు గుడెందుకు ? ఆ గుడి చుట్టూ గోడెందుకు ?" అన్నాడు గవరయ్య చుట్ట చివరని వోష్ఠో నములుతూ.

నిశ్చేష్టులయా రందరూ. "అపచారం ! అపచారం !" అని లెంపలు వాయించుకున్నాడు కరణం.

ధర్మకర్త కరణానికి కన్నుగీటాడు. "గవరయ్య వేసిన ప్రశ్న సామాన్యమైనది కాదు. తత్వవేత్తల్నీ, మహర్షుల్నీ కూడా ముప్పు తిప్పలు పెట్టిన జటిల ప్రశ్న అది. అయితే గవరయ్యలో మనకి తెలీకుండానే గొప్ప సాధన జరుగుతోంది. నాలుగు రోజులు మనం ఓపికపడితే గవరయ్య వంటి పెద్దమనిషి తన ప్రశ్నకి తనే జవాబు పొందుతాడు. భగవదనుగ్రహం నేరుగా ఒక్కసారి రాదోయ్. అంచెలంచలుగా వస్తుంది. అలాగ వచ్చిన రోజున గవరయ్య ఏది-మన గవరయ్యే వచ్చి "ఇదిగో అవధానిగారూ, ఈ పదివేలు దగ్గిరుంచండి-ప్రాకారం కట్టించెయ్యండి" అని అనడూ?

గవరయ్య ఎప్పుడూ చెయ్యనివాడు అవధానికి నమస్కారం చేశాడు. "సెలవు తీసుకోండి. నాకు పనుంది. టౌనుకెళ్ళాలి" అని అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు. అవధాని ఆశ్చర్యపడ్డాడు. అందరూ మొహమొహాలు చూసుకున్నారు.

"అవధానీ జయించావోయ్. తల వంచి నీకు నమస్కరించాడు కూడా! వీణ్ణి తగలెయ్య-మారుతున్నాడు. మారిపోతున్నాడు" అన్నాడు కరణం హుషారుగా.

"ఈ వర్షాకాలం వెళ్ళేసరికి-నే చెబుతున్నాగా-పాతికవేలూ మన ముందు పడేస్తాడు. ఆ ప్రాకారంతోపాటు మన యిళ్ళకి ప్రహరీగోడలు లేస్తాయి!" అన్నాడు మీసాల్లో ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మున్సబు.

# 3

వర్షాకాలం రానే వచ్చింది. రావడంలో మంచి ఖూతంగా, కోపంగా, బలంగా వచ్చింది. కుంభ వృష్టిగా వర్షం, దట్టమైన మేఘాలతో నల్లబడిన ఆకాశం మెరుపులూ, వురుములూ ప్రకృతి పెళ్ళిపందిరిలా హడావిడిగా వుంది. రోడ్లు బురదైనా కుచ్చెళ్ళు నెత్తిపట్టుకొని ఆడవాళ్ళు, అందులో

కొత్తగా పెళ్ళయిన వధువులు సరదాగా పేరంటాలకి వెడుతూ వస్తున్నారు. రైతాంగం అంతా పొలంపనుల్లో పడిపోయారు. మున్సబు పెళ్ళానికి కీళ్ళ నొప్పులూ, అవధాని కూతురికి వేవిళ్ళూ అయినా గ్రామం వుమ్మడి సౌఖ్యానికి అవేమీ ఆటంకంగా లేవు. కరణం విధవ చెల్లెలు కిటికీలోంచి ఎదురింటికి చుట్టంచూపుగా వచ్చిన బస్తీ అబ్బాయికేసి అదేపనిగా చూస్తూ చెయ్యి వూపుతున్నా షార్టుసైటూ మబ్బునీడలూ మూలాన అతనికి ఆ సిగ్నల్స్ కనబడటంలేదు. ఎండైనా వానైనా గ్రామం శివార్లల్లో వున్న కూలీ, నాలీ జనం, మురికిగుంటలూ పందులూ, జబ్బులూ అన్నీ సక్రమంగానే వున్నాయి. పంచాయితీవాళ్ల కట్టించిన లైబ్రరీ బిల్డింగులో పేకాట నిరంతరం సాగుతోంది.

ఇలాంటి చల్లని సుఖమైన వాతావరణంలో పిడుగువంటి వార్త చటుక్కున ఊరంతటినీ దద్దరిల్ల చేసింది. మున్సబూ, ఒకరిద్దరు పెద్దలూ మున్సబు యింటి అరుగుమీద కూర్చుని శాలువ కప్పుకొని వెచ్చగా చుట్టలు కాలుస్తూ ఆధ్యాత్మిక గోష్ఠి సలుపుకుంటున్నారు. ఆ సమయంలో పానకాలు అక్కడికి పరుగెత్తుకుని వచ్చాడు. వాడి కళ్ళల్లో విపరీతమైన కంగారు ఉంది. వాడి వాలకం చూస్తే వాడి వెనకాలే భూకంపమో, వరదో గ్రామానికి వచ్చినట్టుంది.

"ఏంరా! ఏం జరిగిందిరా?" అన్నాడు మున్సబు.

"అదొచ్చిందండీ. తిరిగివచ్చిందండీ" అన్నాడు పానకాలు.

రెణ్ణెల్ల క్రితం మున్సబుగారి గిత్తదూడ కట్టు తప్పించుకొని పారిపోయింది. మున్సబు చిరునవ్వుతో "అయితే యింకేం నేవచ్చి చూస్తాలే. కొట్టాంలో కట్టేయ్" అన్నాడు.

"గిత్తకాదు బాబూ! గవరయ్య పెళ్ళాం!" అన్నాడు పానకాలు మెల్లగా. అందరూ చటుక్కున నిటారుగా కూర్చుని "ఆఁ ఆఁ ఏమన్నావ్!" అన్నారు ఏకకంఠంతో.

పానకాలు చెప్పిన వివరణ యిది. రాత్రి చాలా పొద్దుపోయాక పట్నంలో రెండో ఆట సినీమా చూసివస్తూన్న బట్టలకొట్టు నరసింహం వూరు సమీపించే వేళకి రోడ్డుకి పక్కగా చెట్లనీడల్లో ఎవరో కదులుతూండ డం చూశాడు. అతనికి దెయ్యమేమో అని అనుమానం భయమూ కలిగి గుండెలు దడదడలాడాయి. అక్కడికి కాస్తదూరంలో పాకలో పడుకున్న పానకాలుని కంగారుగా లేపాడు. ఇద్దరూ వచ్చి చూశారు. రేగినజుట్టూ నల్లని మాసినబట్టలూ, నడవలేక ఒక్కొక్క అడుగువేసే ఆడకూతుర్ని చూశారు. ఆమెచేతిలో చిన్నమూట వుంది. ఎవరా అని దగ్గర్నుంచి చూశారు పోల్చలేకపోయారు. పలకరించారు. ఆమె మాట్లాడలేదు, ఆమె నడక వేగం హెచ్చించింది. వీళ్ళిద్దరూ అంతదూరంనుంచే ఆమెను అనుస రించారు. ఆమె పొలాలమ్మటే వెళ్ళి గవరయ్య యింటి పెరటినానుకున్న పాకలోకి వెళ్ళింది. ఆ పాక గవరయ్య యింటిపెరటికీ, పొలాలకీ మధ్యగా వుంది. పాకలో కర్రపేళ్ళూ, పాతసినారేకు డబ్బాలూలాంటి చెత్తాచెదారం అంతా వుంది. గవరయ్యను లేపి చెప్పుదామంటే యింత రాత్రివేళ లేపితే దంతాడని భయం వేసింది.

మళ్ళీ యిప్పుడా సంగతి జ్ఞాపకం వచ్చి పాకవైపువెళ్ళి చూశాడు. ఎవరోకాదు ఆ ఆడమనిషి—గవరయ్య పెళ్ళామే! కడుపు చాలా ఎత్తుగా వుంది. నెలలు నిండినట్టున్నాయి. గడ్డిమీద పడుకుని మూలుగుతూ వుంది.

"ఈ సంగతి గవరయ్యకు తెలుసునంటావా...." అన్నాడు మున్సబు.

"తెల్దుబాబూ. తెల్లారగట్లనే లేచి టౌను కెళ్ళిపోతాడుగా గవరయ్య" అన్నాడు పానకాలు.

మున్సబు తొందరగా లేచాడు. చెప్పులు వేసుకుని బయల్దేరాడు, అవతాని యింటికి. దారి పొడుగునా అందరూ పలకరిస్తున్నారు. "ఏం మున్సబూ, గవరయ్య పెళ్ళాం తిరిగొచ్చిందటగా, ఈ వూరూ, ఈ మదు సులు, ఏమైపోతన్నారు బాబూ. మంచీ, చెడ్డా, పున్నెంపాపం అన్నీ మట్టి కొట్టుకుపోతన్నయ్యా! లేచిపోయి కడుపులు సేసుకొనొచ్చేవాళ్ళని మళ్ళీ ఏలు

కుంటావుంటే ఊళ్ళోపిల్లలు రెచ్చిపోరటయ్యా! ఏమొచ్చింది బాబూ. ఈ ఊరికీ, పెద్దలకీ!" అంది అరవై ఏళ్ళుదాటిన ఒకావిడ అరుగుమీద నుంచుని. అవధాని యింటికి వెళ్ళేలోపుగానే మున్సబుకి తెలిసిపోయింది ఊరంతా గవరయ్య పెళ్ళాం గురించి మాట్లాడుకుంటున్నారని. అవధాని చాలా చిరాగ్గా, కోపంగా వున్నాడు.

"మీకు తెలుసా" అన్నాడు మున్సబు మెల్లెక్కుతూ.

"ఆబాల గోపాలానికీ తెలుసును! మునసబుగిరీ చేస్తున్న నీకే తెల వదు. ఎంతధైర్యం వుండి ఆ పాపిష్టిది యీ వూరొచ్చిందట! ధర్మభయం దైవభయం ఎక్కడైనా ఉన్నాయ్యా అని!"

కాస్సేపట్లో కరణమూ, వూరిపెద్దలూ అందరూ అక్కడ సమావేశ మయ్యారు. గవరయ్య తక్షణం ఆ చెడిపోయిన దాన్ని తరిమేస్తాడో లేక తనే వూరినుంచి వెళ్ళిపోతాడో తేల్చుకోవాలన్నారు. ఆ రోజు ఉదయమే మాలగూడెంలో ఎవడికో కలరా తగిలిందనీ దానికి కారణం యీ పాపిష్టిది వూళ్ళో అడుగు పెట్టడమే అనీ ఒకరన్నారు. అవధాని పెద్దక్కగారు తలుపురెక్క ఓరగా తీసి యిలా అంది. "మేమందరం సిగ్గుతో చచ్చిపో తున్నాం. ఇలా బరి తెగించిన వాళ్ళు వూళ్ళోవుంటే సంసారులగతి ఏమవు తుంది ఆలోచించండి అన్నయ్యా. మమ్మల్ని వూళ్ళో వుండమంటారో లేందే గంగలో దూకమంటారో చెప్పండి."

"ఇంతకీ గవరయ్య యింట్లో లేడుగా. రాగానే పెద్దలు మీరు వెళ్ళి చెప్పండి! మీ మాట వినకుండా వుంటాడా! ఏమైనా చెప్పండి అవధాని గారూ! గవరయ్య యిదివరకటి వాడుకాదు. పాపం పుణ్యం అంటే ఏమిటో తెలుసుకున్నాడు. దైవభక్తి, అంతకన్నా మీరంటే భక్తి కలిగున్నా డిప్పుడు." అన్నాడు ఊళ్ళోకి పెద్ద కామందైన శేషగిరి.

"గవరయ్యమీద యింకా ఎన్నిఆశలు పెట్టుకున్నాం!" అన్నాడు మున్సబు నిట్టూరుస్తూ గుడి ప్రాకారాన్ని. పాతిక వేలనీ తలచుకొని.

"గవరయ్యా మేనత్త వుండికదా, ఆవిడేంచేస్తోంది. ఊరుకుందా?" అన్నాడు కరణం.

"ఏం మేనత్తలే బాబూ. ఖాయిలాపడి మంచానపడింటుకు పోయి వుంది పాపం. బాగా ముసిల్దయిపోయింది" అన్నాడొకడు.

కనుచీకటి పడేవేళకి గవరయ్యా యింటిముందు సైకిలు దిగాడు. ఇంట్లోకి అడుగు పెట్టగానే అవధాని, కరణం, మునసబునీ చూశాడు. కనుబొమలు పైకెత్తి ప్రశ్నార్థకంగా తల ఆడించాడు. అవధాని అంతా చెప్పాడు. గవరయ్య కళ్ళు ఎర్రబడ్డాయి. అతని లావాటి పెదవులు వణికాయి. గబగబా వెళ్ళి మూలనున్న గునపం చేత్తో పైకి ఎత్తాడు. "చంపేస్తాను. తప్పేడుముండని." అని అరిచాడు. అవధాని కంగారుగా "వొద్దు వొద్దు అంతపని అక్కర్లేదు. గవరయ్యా బాబూ. నీ ధర్మనిష్ఠ తెలియనిదా ఇప్పుడు మళ్ళీ ఖూనీకేసు వొకటా? నీ పీకేకాక మా పీకల మీదకికూడా వస్తుంది. దాన్ని యింట్లోంచి తోలేసెయ్యి చాలు" అన్నాడు. గవరయ్య అతని మాటలు వినిపించుకోలేదు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ లోపలికి వెళ్ళిపోయాడు. ఈ సమయంలో అక్కడ వుండటం తమకే ముప్పని గ్రహించిన ఆ పెద్దలు ముగ్గురూ అక్కడనుంచి జారుకున్నారు. గవరయ్యా పాకలోకి వెళ్ళాడు. అక్కడ జీబురుగా, చీకటి చీకటిగా వుంది. పాత సామానులతో, దుమ్ముతో నిండివుంది. గవరయ్యా పరకాయించి చూశాడు. ఒక పక్కగా నేలమీద వెల్లకిలా పడుకున్న పెళ్ళాన్ని చూశాడు. దగ్గరగా వెళ్ళి గునపం పైకెత్తాడు. ఇంతలో ఏదో సంశయం కలిగింది. "ఇది చచ్చిందా? బతికేఉందా" అనుకున్నాడు. మోకాళ్ళమీద వంగి మొహంలోకి చూశాడు. పీక్కుపోయి పాలిపోయింది మొహం. ఎండి అట్టలు కట్టిన జుట్టు అసహ్యంగా నేలమీద భుజాలచుట్టూ పరచుకొని వుంది. దీనంగా మృత్యు విహ్వలగా, భయంకరంగా, అసహ్యంగా వుంది ఆమె మొహం. "చిట్టీ" అని పిలిచాడు గట్టిగా. భుజాలు పట్టుకుని కుదిపాడు. చిట్టి కళ్ళు తెరిచింది. గవరయ్యను ఆనమాలు కట్టింది. ఆమె కన్నులమ్మట నీళ్ళు కారుతున్నాయి. వణుకుతున్న తన రెండు చేతులనీ పైకెత్తి నమస్కారించింది. "నన్నేం చేయకు నేను వెళ్ళిపోతాను" అంది నీరసంగా. తన తల్లి

చచ్చిపోయేముందు యిలాగే తన తండ్రికి చేతులెత్తి దణ్ణం పెడుతూ దీనంగా చూడటం జ్ఞాపకమొచ్చింది గవరయ్యకు. మళ్ళీ చిట్టి చేతులు రెండూ కిందకు వేలాడిపోయాయి. కాసేపు అలాగే కూచుని ఏమను కున్నాడో లేచి లోపలికివెళ్ళి ఒక చెంబుతో నీళ్ళూ, ఒక గిన్నెనిండా అన్నమూ తీసుకు వచ్చాడు. "చిట్టీ" అన్నాడు. చిట్టి కళ్ళు తెరిచింది. "లే, ఈ అన్నం తిను తెల్లారగానే వెళ్ళిపో. నీ మొహం నాకు చూపిం చకు తెలిసిందా" అన్నాడు. చిట్టి తల వూపింది. గవరయ్య లేచి నుంచుని "తెల్లవారేక యీ పాకలో కనిపించేవా నీకు చావు తప్పదు" అని యింట్లోకి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి గవరయ్యకి అన్నం సహించలేదు. అతనికి కాళ్ల కింద మంటలు పెట్టినట్టుంది. అపతల ఆకాశంమీద మబ్బులు దట్టంగా పట్టాయి. గాలి రివ్వుమని చెట్ల ఆకుల్లోంచి చప్పుడు చేసుకుంటూ ఇంటి చూరుని తాకి వెర్రిగా అరుస్తూ వెనక్కి తిరిగి పోతోంది. పక్కమీద దొర్లు తూన్న గవరయ్యకి కునుకు పట్టింది. గవరయ్యకి భయంకరమైన కల వచ్చింది. తన తండ్రిని, తల్లిని ఒక స్తంభానికి కట్టి చుట్టూ మంటలు పెట్టారు. ఆ మంట పెట్టినవాళ్ళు అపధానిలాగ, కరణంలాగ, మునసబు లాగ కనిపించారు. తల్లీ తండ్రీ ''బాబోయ్, బాబోయ్" అని అరుస్తున్నారు. తల్లీ తండ్రీ ఎర్రగా నల్లగా బూడిదలా కాలిపోయారు. ఆ బూడిదలోంచి ఒక వ్యక్తి బయటికి వచ్చాడు. ఆ వ్యక్తి గబగబా అడుగు లేసుకుంటూ తన పెరట్లో పాకవైపు వెళ్ళాడు. ఆ వ్యక్తికి ఒక చేతిలో శంఖం, మరొక చేతిలో చక్రం, నుదుట నామాలూ వున్నాయి. గుళ్ళో తనుచూసిన వేణు గోపాలస్వామి విగ్రహంలా వున్నాడు. వేణుగోపాలస్వామి కళ్ళమ్మట నీళ్లు కారుతున్నాయి. దేవుడేడుస్తున్నాడు. చిట్టి పక్కలో వున్న పిల్లవాణ్ణి చేతులతో తీసుకొని "నీకేం భయంలేదు. నే నున్నానుగా" అని చిట్టిని ఓదారుస్తున్నాడు. ఇంతలో మండుతున్న కాగడాలు పట్టుకొని ఊళ్ళో జనం కేకలు వేసుకుంటూ వచ్చి పాకను అంటించేస్తున్నారు. పాక నలువైపులా భగ్గుమని అంటుకుంది. జ్వాలలు మిన్ను ముడుతున్నాయి. దేవుడు మంటల్లో కాలిపోతున్నాడు. చిట్టి కాలిపోతోంది. నోరెరుగని చిన్ని పిల్లాడు కాలి పోతున్నాడు.

ఉలిక్కిపడి లేచాడు గవరయ్య. అతని నుదురంతా చెమటతో తడిసి పోయింది. కిటికీ తలుపులు గాలికి కొట్టుకుంటున్నాయి. హోరుమని గాలి వాన, ఉరుములూ, మెరుపులూ అంతా భయంకరంగా వుంది. గవరయ్య మొహం తుడుచుకున్నాడు. పక్కనున్న కూజాలోని ఒక గ్లాసుడు మంచి నీళ్ళు గడగడా తాగాడు. చీకటిలోంచి బయటకు చూశాడు. వానతో కలసిన చీకటి, నల్లని విషంలాగా ఆకాశం మించి కారుతోన్నట్లు నల్లని పాపం సముద్రంలా పొంగుతోన్నట్టు వుంది. ఆ భయంకరమైన చీకటిలో యీ మనుషులు, ఇళ్ళు, వాకిళ్ళు, భయాలూ, కోర్కెలూ, అన్నీ అబద్ధంలా కనిపించాయి. ప్రకృతియొక్క ప్రచండ తాండవంలో ఏదో సత్యం కొరడాతో చెళ్ళున కొట్టినట్లు అర్థమయినట్లు అనిపించింది. ఒక పెద్ద మెరుపు మెరిసింది. ఆ మెరుపులో వేణుగోపాలస్వామి గోపురాగ్రం మెరిసింది. గవరయ్య మనసు లోతులలో ఏదో మెరిసింది. గవరయ్య దిగాడు. లాంతరు పట్టుకుని పెరట్లో కెళ్ళాడు. పెరడు చాలా పెద్దది. వర్షంలో తడుస్తూ గాలి వూపుకి తట్టుకుంటూ పాక దగ్గరికి వెళ్ళాడు. పాకలోంచి కీచుగా, గట్టిగా మూలుగులు వినబడుతున్నాయి. లోపలకు వెళ్ళాడు. బాధతో వలయం తిరిగి పోతోంది చిట్టి. చూడలేక దీపం అక్కడ పెట్టి బయటకు వచ్చి నిలుచు న్నాడు. అలా వర్షంలో చలి గాలిలో ఎంతసేపు నుంచున్నాడో తెలీనే తెలీదు, ఇంతలో ఒక మెరుపు మెరిసింది. దగ్గర్లోనే ఎక్కడో పిడుగుపడిన భయంకరమైన చప్పుడు. "బాబోయ్" అని అరిచింది చిట్టి. గవరయ్య ఒక్క నిముషం సేపు నిశ్చేష్టుడయ్యాడు. ఇంతలో "కేర్ కేర్" మని ఏడుపు వినిపించింది. కఠినమైన అసహ్యమైన గవరయ్య మొహం మీద లావాటి పెదవుల సందులనుంచి వచ్చిన చిరునవ్వు తాలూకు వెలుగు అలుముకొంది. గవరయ్య అంత వర్షంలోనూ అంత చీకటిలోనూ మెరుపుల సహాయంతో వూళ్ళో మంత్రసాని కోసం పరిగెత్తుకెళ్ళాడు.

ఉదయం ఎనిమిది గంటలయింది. గవరయ్య ఇంటి వరండాలో అవధాని, కరణం, శేషగిరి, మున్సబూ అందరూ కూర్చుని వున్నారు. వర్షం తగ్గి లేత ఎండ కాస్తోంది. ఆ ఎండల్లో రాత్రంతా తడిసిన చెట్ల ఆకులూ, పచ్చికా, గవరయ్య యింటిమీద వాలిన కాకి నల్లని రెక్కలూ మెరుస్తు

న్నాయి. అవధానీ, మున్సబూ, వాళ్ల మొహాలు మాత్రం మొంపటం లేదు. నిరాశాహతమైన వారి కళ్లలో కోపం సుళ్లు తిరుగుతోంది. గుమ్మం అవతల వాళ్ల వెనకాలే వచ్చిన వెట్టివాడూ, ఒకరిద్దరు నౌకర్లూ తమరేంచెప్పినా చేసేస్తామన్నట్టుగా విధేయతా, పట్టుదల మూర్తీభవించినట్లు చేతులు కట్టుకు నుంచున్నారు.

కాసేపటికి ఇంట్లోంచి గవరయ్య వచ్చాడు. నడుస్తున్న ఇనుప గర్డరులా వున్నాడు. చిన్న కళ్లు కుంచించి సూటిగా, నిర్లక్ష్యంగా వాళ్ళ కేసి చూశాడు. అవధాని భీకరంగా కంఠం మార్చి "ఇలా చేస్తావనుకో లేదు గవరయ్యా! ఇంకా పెద్దమనిషివి అనుకున్నాను. చెడిపోయినదాన్ని ఇంట్లోకి తీసుకువచ్చి పెట్టుకుంటావా? ఎవడివల్లో పుట్టిన కొడుకుని ఇంట్లో తెచ్చి పెట్టుకుంటావా! నీకు సిగ్గూ, అభిమానమూ రెండు లేకపోవడమే కాదు. పాపం, మహాపాపం, ఘోరపాపం చేశావు. దేముడింక నిన్ను క్షమించి సహించి వూరుకుంటాడా?" అన్నాడు గుక్క తిప్పుకోకుండా. గవరయ్య తాపీగా గోడ కానుకుని కూర్చున్నాడు. బొడ్లోంచి పొగాకు కాడ తీసి చుట్ట చుడుతూ "నాకు దేవుడే చెప్పాడు" అన్నాడు. "ఏం చెప్పాడు" అవధాని.

"ఆ పిల్లాణ్ణి నేను పెంచుకుంటాను. ఆ పిల్ల ఇంట్లో పడివుంటుంది" అన్నాడు గవరయ్య.

"లేచిపోయిందాన్ని ఏలుకుంటావా?" అన్నాడు శేషగిరి తన చెవుల్ని తాను నమ్మలేక!

"ఏలుకోడం సిగతరగ-నాకంటే సగం చిన్నదాన్ని పెళ్ళిచేసుకుంటే లేచిపోక ఏం చేస్తది. ఇపుడు పొమ్మంటే ఎక్కడికి పోలది. తిండీ బట్టా యిస్తే కుర్రాణ్ణి సాకుతూ యిక్కడే పడివుంటుంది" అన్నాడు గవరయ్య. అవధాని వికటాట్టహాసం చేశాడు. "దేవుడు చెప్పాడా నీకు? ఏ దేవుడయ్యా! రంకు దేవుడా? మహా తపస్సు చేసిన వాళ్ళకి దిక్కు లేదు కాని...."

"నాకు దేవుడు కనిపించాడు. నేను దేవుణ్ని చూశాను." అన్నాడు మొండిగా గవరయ్య. అపుడతని కళ్ళు మెరిశాయి.

"ఇప్పుడైనా దాన్నీ, ఆ పిల్లాణ్నీ ఎక్కడికేనా పంపించేసెయ్. ఇంతటి అన్యాయాన్ని మేము ఒప్పుకోం" అన్నాడు కరణం. "నిన్ను గుడి చాయలకికూడా రానివ్వం" అన్నాడు అవధాని. "ఊరు వూరంతా ఏకమవు తుంది గవరయ్యా! మంచిగా చెబితే వినడంలేదు నువ్వు. మేమంతా చేతులు కట్టుకూర్చోలేదు జాగ్రత్త" అన్నాడు మున్సబు.

ఒక్కసారి గవరయ్య లేచాడు. గోడవారనే వున్న గునపం తీశాడు. "ఎవడ్రా! నా యాల. నామీద కొచ్చే వాడెవడ్రా. నేనొకరి సొమ్ము తిన్నానా. అసలు మిమ్మల్నిక్కడకు రమ్మన్నానా? నువ్వెవడివయ్యా నాకు నీతులు చెప్పడానికి? నా యవ్వారంలో జోక్యం చేసుకుంటే ఒక్క ఏటుకి తెగేస్తాను రమ్మను ఎవడొస్తాడో" అని అరిచాడు గవరయ్య. అతని వొళ్ళు ఆవేశంతో వూగిపోయింది. అతను పేలుతున్న అగ్ని పర్వతంలా వున్నాడు. అతని ఆకారం, అతని రౌద్రం చూసేసరికి వెట్టివాడు భయపడి పోయి నోరావలించాడు. అవధాని లేచాడు. తక్కిన వాళ్ళందరూ కూడా లేచారు. "అయితే దాన్ని వదలవన్నమాట" అన్నాడు అవధాని.

"వదల్ను" అన్నాడు గవరయ్య.

"అయితే నిన్ను వెలేస్తున్నాం. చాకలి, మంగలి రానేరారు సరికదా నీ పొలంపనులకి. పాలేరు తనానికి ఎవరొస్తారో చూస్తాను" అన్నాడు అవ ధాని.

మున్సబు వెట్టివాడికేసి చూసి "ఈవేళ పూళ్ళో టముకు వెయ్యరా", అన్నాడు.

గవరయ్య ఉగ్రంగా వురిమిచూసి "పొండయ్యా పెద్దమనుషులూ ఇలాంటి యెదవూళ్ళో వుండమన్నా వుండను. నా పిల్లాణ్ణి యీ యెదవల మధ్య తిరగనివ్వను. థూ!" అని కాండ్రించి వుమ్మేశాడు. వెళ్ళిపోయే అవధాన్నీ బృందాన్నీ చూస్తూ.

వారంరోజులు తిరిగేసరికి గవరయ్య ఇల్లు తాళంవేసి వుంది. గవ రయ్య టౌనులో ఇల్లు కొన్నాడనీ, ఇక్కడ ఊళ్ళో ఇల్లూ, పొలమూ అమ్మకం పెట్టేడనీ తెలిసింది.

*(జ్యోతి, 1964)*

# నవ్వు

రామచంద్రరావు ఎప్పుడూ నవ్వుతూ కనిపిస్తాడు. అతనికి నవ్వడం ఒక స్వభావమైపోయినట్టూ, కష్టాలూ, చీకాకులూ అతనికి దూరంగా తొలగి వుంటాయన్నట్టు అనిపిస్తుంది. ఊళ్ళో అందరినీ అతను నవ్వుతూ పలకరిస్తాడు. అందరూ అతనికి స్నేహితులు.

అతను పక్కనుంటే మూర్తికి వొళ్ళంతా తేలికపడినట్టు, ఉదయపు నీరెండవంటి ఉత్సాహం వచ్చినట్టు అనిపిస్తుంది. మూర్తికి సమస్యలు చాలా ఉన్నాయి. కాని ఆ సమస్యలన్నీ రామచంద్రరావు ఎదురుగా వున్నంత సేపూ మంచు విడిపోయినట్లు మాయమైపోతాయి.

కాని, మూర్తికి ఎప్పుడూ ఆశ్చర్యం కలుగుతూంటుంది. ఎందుకు ఇతని వదనాన ఒక విషాదరేఖగానీ, విసుగుగానీ కనిపించవు? ఏ జీవిత రహస్యం యితనికి తెలుసును? సుఖంలోని ఆనందంలోని ఏ కీలకాన్ని యితను వశపరచుకున్నాడు?

తేరా చూస్తే రామచంద్రరావు సామాన్యుడు. ఆస్తి, హోదా ఉన్నవాడు కాదు; ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటున్నాడు. 'నా' అన్నవాళ్ళెవరూ ఉన్నట్టు కనపడరు. అతను ఒంటరివాడు. ఏలూరు నుండి వచ్చే బస్సు ప్రమాదానికి లోనయిందనీ ప్రయాణీకులకి చాలామందికి గాయాలు తగిలాయనీ విన్నాడు మూర్తి. వారిలో రామచంద్రరావు ఒకడని తెలిసినప్పుడు బాధపడ్డాడు మూర్తి. కంగారుపడ్డాడు. సరాసరి టిక్కెట్టు కొనుక్కొని ఏలూరు వెళ్ళి ఆస్పత్రికి వెళ్ళాడు గాయపడినవారిలో రామచంద్ర

రావును గుర్తించడం కష్టమయింది. అతనికి తలకీ చెంపలకీ కట్లువున్నాయి. అతనికి స్పృహలేదు. మూర్తి గాభరాపడ్డాడు. తక్కిన గాయపడిన వారందరి దగ్గరా వారి వారి భార్యలూ, తలిదండ్రులూ వున్నారు. రామచంద్రరావు మాత్రం ఒంటరిగా మృత్యువుకీ-బ్రతుకుకీ మధ్య వున్న మసకమసక అంచుమీద ఉన్నాడు. మూర్తికి కళ్ళనీళ్ళు తిరిగాయి. ఇంత ఉత్తమునికి ఎందుకిటువంటి గతి పట్టింది అనుకున్నాడు. అతని మంచం ప్రక్కన ఒక కుర్చీ మీద కూర్చున్నాడు మూర్తి. స్పృహరాగానే-తనని చూస్తాడనీ, కావలించుకుని ఏడుస్తాడనీ అనుకున్నాడు. తనకి ఏడుపు వచ్చేస్తుంది. ఎలాగ యితనికి ధైర్యం చెప్పి వోదార్చడం ? ఎప్పటికోగాని రామచంద్రరావుకి స్పృహ రాలేదు. అతడు కొంచెం కదలడం మొదలుపెట్టాడు. మూర్తి గుండెలు కొట్టుకున్నాయి. దుఃఖంతో ఆనందావేశంతో రామచంద్రరావు కళ్లు తెరిచాడు. ఓ నిముషం తదేకంగా మూర్తికేసి చూశాడు.. 'బతికే ఉన్నానా' అంటూ నవ్వాడు. సన్నని చిన్నని నవ్వు హాయిగా మొగ్గవిడి తెల్లని పువ్వు రేకులను విచ్చుకుంటూన్నట్టు.

మూర్తి 'షాక్' తిన్నాడు, అలాంటి విపత్సమయములో కూడా అతను నవ్వగలడని అనుకోలేకపోయాడు. తర్వాత రోజున మాటల సందర్భంలో అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ మూర్తి అన్నాడు "రామం నీవు పెళ్ళిచేసుకోవాలి. ఇటువంటి సమయంలో నీకు భార్యవుంటే ఎంత పరిచర్య చేసేది? ఇలా ఒంటరిగా ఎన్నాళ్లు వుంటావు?"

రామచంద్రరావు జవాబుగా - నవ్వాడు.

సరళ కనుక అంగీకరించివుంటే రామచంద్రరావుకి యీ ఒంటరితనం వుండేదికాదు. సరళ రామచంద్రరావుకి దూరపు బంధువుల అమ్మాయి. సన్నగా నాజూకుగా వుంటుంది. ఆమె కళ్ళల్లో తెలివైన వెలుతురు వుంది. సరళా రామచంద్రరావూ కలిసి చదువుకున్నారు. అప్పుడే వారిద్దరికీ స్నేహం కలిసింది. ఆ స్నేహం ప్రేమగా మారినట్లు కూడా మూర్తికి తెలుసును. రామచంద్రరావు మూర్తితో అన్ని సంగతులూ చెప్పేవాడు, ఆమె తనని తప్పకుండా పెళ్ళి చేసుకుంటుందన్న విశ్వాసాన్ని ప్రకటించేవాడు. సరళ తలిదండ్రులు కూడా ఏనాడూ వీరిరువురి స్నేహానికి అభ్యంతరం చెప్ప

లేదు. సరళ తల్లిదండ్రులు కలవారు. సరళ ఒక్కర్తే వారి సంతానం. రామచంద్రరావుకి సరళతో పెళ్ళి జరగాలనీ, దానితో అతని ఒంటరి తనమూ ఆర్థిక సమస్యా రెండూ తీరి సుఖిస్తాడనీ, నిజమైన నిర్మలమైన స్నేహితుడైన మూర్తి ఎంతో ఆశించేవాడు.

"రామం, నువ్వెప్పుడైనా ఆమె అభిప్రాయం తెలుసుకున్నావా?" అని అడిగాడు మూర్తి, రామచంద్రరావుకి ఉద్యోగం వచ్చిన రోజున.

"సమయం రానీ" అన్నాడు రామచంద్రరావు.

రెండు మూడు నెలల అనంతరం సరళా రామచంద్రరావులు పార్కులో కలుసుకున్నారు.

విద్యుద్దీపాల కాంతీ, సప్తమి వెన్నెలా కలసి వీరు కూర్చున్న బెంచీ మీద విచిత్రంగా పడింది. రామచంద్రరావు, తన మనస్సులోని అభిప్రాయాన్ని విప్పి చెప్పాడు. కాని ఆ క్షణాన సరళ వివేకం ఆమె హృదయ దౌర్బల్యాన్ని జయించింది.

"రామం, నీ ఆస్తి ఎంత?" అని అడిగింది.

"ఒక పాత పెంకుటిల్లు, అదైనా మా వూళ్ళో ఉంది" అన్నాడు రామచంద్రరావు.

"భూమి గట్రా ఏమైనా...." అని ప్రశ్నించింది సరళ.

"సెంటు భూమి కూడా లేదు" అని కులాసాగా జవాబు చెప్పాడు రామచంద్రరావు.

"నీ జీతం ఎంత?" అని అడిగింది సరళ.

"నూటయిరవై రూపాయలు" అన్నాడు రామం.

సరళ నిట్టూర్చింది. ఆమె తన సాధక బాధకాలు, అవసరాలు, అలవాట్లూ తన తల్లితండ్రుల కనీసపు కోర్కెలు అన్నీ చెప్పింది. చివరికి ప్రేమా యిష్టమూ మొదలైన దౌర్బల్యాలకి లోబడి తనసుఖాన్నీ భద్రతని బలి యిచ్చుకోలేనంది. "నువ్వంటే నాకెప్పుడూ యిష్టమే, కాని నా జాగ్రత్తలో నేనుండాలిగా" అంది.

పార్కులోంచి రామచంద్రరావు యివతలకి రాగానే మూర్తి ఎదురై ఏమైంది, ఏమైంది" అని ఆత్రుతగా అడిగాడు.

"నిరాకరించింది" అన్నాడు రామచంద్రరావు.

మూర్తికి కోపం వచ్చింది రామచంద్రరావుమీద. అతనంత తాపీగా జవాబు చెప్పినందుకు కాదు. అతని పెదాల మీద నిశ్చలంగా నిలిచిన చిరునవ్వుని చూసి ఏ ప్రేమ వైఫల్యానికి మనుష్యులు ఆత్మహత్య చేసుకుంటారో, ఏకాంతంలో పడి ఏడ్చిఏడ్చి కృశించిపోతారో అటువంటి దానికి హాయిగా నవ్వగలిగే యీ రామచంద్రరావు లోని విశేషం ఏమిటి? ఇంత కులాసా, యింత ధీమా ఎక్కడవి అని విసుక్కుపోయాడు మూర్తి.

సరళకి వివాహమైంది. పెళ్ళికి రామచంద్రరావు వెళ్ళాడు. పెళ్ళి నాలుగు రోజులూ యిటు ఆడపెళ్ళివారితో, అటు మగపెళ్ళివారితో కలుపుగోలుతనంగా తిరిగాడు. అత్తింటికి వెళుతూన్న సరళతో "నీ భర్త రూపసి, ఉత్తముడూ కూడా. నువ్వు ఎప్పుడూ సుఖంగా ఉండాలని కోరుతున్నాను. వచ్చే ఏడాదికి నువ్వు పాపాయి నెత్తుకొని రావాలి సుమా" అన్నాడు. అతని స్నేహ స్నిగ్ధ కంఠస్వరానికి సరళ హృదయం ఆర్ద్రమయింది. కృతజ్ఞతతో సిగ్గుతో "థాంక్స్" అంది.

కాని రామచంద్రరావు మనసారా కోరిన అదృష్టం ఆమెను వరించలేదు. ఏడాదికే ఆమె విధవరాలై తిరిగి వచ్చింది. రామచంద్రరావు చూడటానికి వెళ్ళాడు. ధైర్యం చెప్పాడు. అలాగ ప్రతి రోజూ వెళ్ళి ఎన్నో కబుర్లు కథలు చెప్పేవాడు. ఆమె దుఃఖంనుండి కోలుకుంది. ఇంక యితని అవసరం తీరిందనుకున్న సరళ తండ్రి రామచంద్రరావుని చాటుగా పిలిచి, 'నువ్వు రోజూ యిలా రావడం బావుండదు. లోకం ఏదైనా అనుకుంటుంది' అన్నాడు. రామచంద్రరావు నవ్వుతూ 'మీరు చెప్పింది నిజమే ఇంక నేను రాను' అని వెళ్ళిపోయాడు. మళ్ళీ సరళ దగ్గరకు ఎన్నడూ వెళ్ళలేదు. రామచంద్రరావు ఒక మూడు గదులవాటా తీసుకుని అద్దెకు ఉంటున్నాడు. ఒక గది వంటగదిగా ఉపయోగించుకుని స్వయంగా వండుకు తింటాడు. తొమ్మిదింటికల్లా స్నానంచేసి భోజనం చేసి తెల్లని దుస్తులు వేసుకుని ఆఫీసుకు బయలుదేరుతాడు. దారిలో కిల్లీకొట్టు పోలయ్యనీ, ప్లీడరు రాఘవరావు గారినీ, వెంకయ్య మాష్టారినీ, పెరుగమ్ముకుని బతికే గోవిందమ్మనీ -అందరినీ నవ్వుతూ పలకరిస్తూ ఆఫీసుకు వెళతాడు. ఆఫీసులో అందరూ

అతని మిత్రులు. ఆఫీసరు కూడా రామచంద్రరావంటే దయగా అభిమానంగా ఉంటాడు.

కాని రామచంద్రరావుని దురదృష్టమే వరించింది. ఆఫీసు రిట్రెంచిమెంటులో పై వాళ్ల అతన్ని ఉద్యోగంనుండి తొలగించి వేశారు. మూర్తి చాలా ఆందోళన చెందాడు. ఇకమీద రామచంద్రరావుకి గడిచే విధానంలేదు. అయినా రామచంద్రరావు ఏమీ బెదరిపోలేదు. పైగా మూర్తికి అతను నవ్వుతూ ధైర్యం చెప్పాడు.

ఉద్యోగం పోయిన రెండు రోజులకే రామచంద్రరావు తన స్వగ్రామం వెళ్ళాడు. ఓ నెల్లాళ్ళపాటు అక్కడే ఉండి, అతని పాత పెంకుటి లోగిలి అమ్మివేసి, మూడువేలరూపాయలు చేత్తో పట్టుకుని తిరిగివచ్చాడు. ఈ సారి పాత మూడు గదుల పోర్షన్ వదిలేసి ఒకేఒక గది అద్దెకు తీసుకున్నాడు. ఒక జైపు మిషన్ కొని, 'ఇచ్చట జైపు చేయబడును' అని బోర్డు కట్టాడు. ఈ మూడువేలూ ఎన్నాళ్ళు వస్తుంది ? ఈ జైపు వల్ల వచ్చే ఆదాయం ఏం సరిపోతుంది ? నీ భవిష్యత్తు ఎలాగ ? అని ఆత్రుత కనపరిచాడు మూర్తి.

రామచంద్రరావు నవ్వాడు "ఎవరి భవిష్యత్తు మాత్రం ఎవరు చెప్పగలరు మూర్తీ, మనం చేసుకున్న కట్టుదిట్టాలు నిజంగా రక్షిస్తాయా?" అన్నాడు.

రామచంద్రరావు తన స్వగ్రామం వెళ్ళిన రోజులలో సరళ తండ్రి చనిపోయినట్టూ, ఇంటి యాజమాన్యమంతా సుకుమారమైన సరళమీద పడి నట్టూ తెలుసుకున్నాడు. ఒకసారి సరళను చూసి వచ్చాడు.

ఆరు నెలలు గడిచాయి. రామచంద్రరావుకి తీవ్రమైన జబ్బు చేసింది. పదిహేను రోజులైనా జ్వరం తగ్గుముఖం పట్టలేదు. మూర్తి భయపడ్డాడు. తిన్నగా సరళ యింటికి వెళ్ళాడు రామచంద్రరావు పరిస్థితిని వివరించి చెప్పాడు.

"మీరు అతని బాధ్యత వహించాలి. ఒకనాడు మీరు అతన్ని మోసగించారు. కాని అతను ఏనాడూ మిమ్మల్ని నిందించలేదు. డబ్బుతో ఏమైనా కొనవచ్చును గాని అటువంటి అమృత హృదయాన్ని పొంద

లేము. మృత్యుముఖంలో ఉన్న అతన్ని కనికరించండి. లోకం ఏమనుకుంటుందో అనుకొని సంశయించకండి. ఒక్కడూ ఆ చిన్న గదిలో చీకటిలో బాధతో, వ్యాధితో చివికిపోతున్నాడు. వివేకంకన్న, హేతువు కన్న హృదయ ధర్మం గొప్పది. ఈ సత్యాన్ని యిప్పుడైనా మీరు తెలుసుకోరా" అని మూర్తి ప్రాధేయపడ్డాడు. అతను తల పైకెత్తి చూసేసరికి సరళ చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిసి ఉన్నాయ్. "పదండి నేనూ మీతో వస్తున్నాను" అంటూ సరళ ఎలా వున్నది అలా బయలుదేరింది.

రామచంద్రరావుని జాగ్రత్తగా సరళ యింటికి మార్చారు. పక్కగదిలో డాక్టరు 'ఇతను బతుకుతాడనే నమ్మకం లేద'ని చెప్పడం అప్పుడే మెలకువ వచ్చిన రామచంద్రరావుకి వినిపించింది భయాందోళనతో కన్నీటితో సరళా, మూర్తీ, రామచంద్రరావు దగ్గరకు వచ్చి నిలబడ్డారు.

"నేను డాక్టరు చెప్పింది విన్నాను. దానికింత భయమెందుకు" అన్నాడు రామచంద్రరావు. అతని పెదవులమీద చిరునవ్వు నిలిచి వుంది. కష్టాల్నీ, బాధల్నీ చివరకి మృత్యువును కూడా లక్ష్యం చెయ్యని చిరునవ్వు. అంత ఆందోళనలోనూ ఆశ్చర్యచకితుడయ్యాడు మూర్తి. కాని రామచంద్రరావు సరళ సపరిచర్యలలో మూర్తి నిరంతర సాన్నిధ్యంలో పట్నం నుండి పిలిచిన పెద్ద డాక్టర్ల సహాయంతో వ్యాధినుండి విముక్తుడయాడు. సరళ అతన్ని తన యింట్లో ఉండిపొమ్మని కోరింది, పూర్తిగా ఆరోగ్యం కోలుకునే వరకూ.

మూడు నెలల అనంతరం సంపూర్ణ ఆరోగ్యవంతుడైన రామచంద్రరావు తన కృతజ్ఞతను తెలియజేసి వెళ్ళిపోతానన్నాడు. "నా గదికి వెళ్ళిపోతాను మళ్ళీ బ్రైపు మొదలు పెట్టాలి. సెలవిప్పించు" అన్నాడు.

"అయితే నేనూ వస్తాను. ఆ ఒక్క గదిలో మనమిద్దరమూ ఎలా ఉండడం?" అంది సరళ.

"నువ్వు రావడమేమిటీ? నాతో ఉండడమేమిటి?" అన్నాడు రామచంద్రరావు తెల్లబోయి. "మరి భార్య భర్తను వదలి ఉంటుందా?" అంది సరళ తలవాల్చి వోరగా చూస్తూ. ఈ సారి నిజంగా రామచంద్రరావు

సిగ్గుపడి పోయాడు. అతను తెప్పరిల్లి చటుక్కున ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాడు.

సరళా రామచంద్రరావుల వివాహం నిరాడంబరంగా జరిగింది. మూర్తి ఉత్సాహానికి పట్టపగ్గాల్లేవు.

మొదటి రాత్రి రామచంద్రరావు జుట్టులోనికి వేళ్ళు పోనిస్తూ మృదువుగా అడిగింది సరళ, "మీరు ఎప్పుడూ నవ్వుతూనే ఉంటారు కారణం ఏమిటి నాకు చెప్పరూ?" రామచంద్రరావు కళ్ళలో గతస్మృతుల నీడలు బరువుగా నల్లగా కదిలాయి. కిటికీలోంచి చీకట్లోకి అలాగ కొంతసేపు చూస్తూ నిలుచున్నాడు. అతని కంఠస్వరం గంభీరంగా మారి పోయింది.

"నా పదహారవయేట నేను మా అమ్మా, నాన్నా, మా చెల్లెలు, తమ్ముడూ భద్రాచలం వెడుతున్నాము. నేను అనారోగ్యంతో సన్నగా నీరసంగా ఉండేవాణ్ణి. ఎప్పుడేమైపోతానో అని అమ్మానాన్నా భయపడు తుండేవారు. భద్రాచల రాముని దర్శనంతో నేను ఆరోగ్యవంతుణ్ణి అవుతా ననివారి నమ్మకం. అందుకే భద్రాచలం వెడుతున్నాము. పాపికొండల దగ్గర హఠాత్తుగా మా పడవ బోల్తాకొట్టింది. కారణం ఏమిటో యిప్పటికి నాకు తెలియదు. నేను స్పృహలేకుండా ఒక ఒడ్డుకు కొట్టుకుపోయాను. తెలివి వచ్చేసరికి నా చుట్టూ జనం ఉన్నారు. మరి కాస్త దూరంలో మాతల్లి దండ్రుల సోదర సోదరీల శవాలు పడివున్నాయి. వాళ్ళందరూ చచ్చి పోయారు. ఒక్కసారిగా నేను దిక్కులేనివాడి నయాను. ఒక్కసారిగా అపారదుఃఖం నన్ను నిశ్చేష్టితుణ్ని చేసి వేసింది. గుండెలు పగిలిపోయి నాయి. మళ్ళీ అదే నదిలో దూకి చచ్చిపోదా మనుకున్నాను. కాని ఒక మెరుపులాగ నా మనస్సులో ఏదో మెరిసింది. ఈ సృష్టి ఈ జీవితము అంతా ఒక హాస్యం. దీనికి ఒక నియమమూ నిర్ణీత పద్ధతీ అంటూ లేవు. ఉన్నా మనకి తెలియదు. మనం తెలుసుకోలేము. ఎవరో తెరవెనుకనుండి మనల్ని యిలా ఆడిస్తున్నారు. ఇది పెద్ద జోక్ - నవ్వులాట. లేనిదే అనారోగ్యంతో ఎప్పుడేమవుతానో అన్న నేను బతకడ మేమిటి? నిండు ఆరోగ్యంతో ఆశలతో ఉన్న వాళ్లు పోవడమేమిటి? ఈ అద్భుతమైన

హాస్యనాటకములో నేనూ ఒక పాత్రని. కష్టాలకీ, భయాలకీ రేపటి బాధలకీ ఆందోళన చెందడం ఎంత తెలివి తక్కువ సరళా ? ఈ కాస్సేపటి బతుకునీ సంకుచితత్వంతో సందేహంతో ద్వేష విషంతో నింపుకోవడని ఎంత మూర్ఖత్వం సరళా."

ఈ మాటలకి సరళ చలించిపోయింది. విద్యుద్దీపాల కాంతిలో అతని కళ్ళు చెమ్మగిలినట్లు లనిపించిందామెకు. అతన్ని గుండెలకు హత్తుకుని, "నేను నిన్ను వదలను రామం"అని అర్థంలేకుండా అవేశంగా అంది.

రామచంద్రరావు చల్లగా నవ్వాడు తెల్లని మల్లెపువ్వు విరిసినట్టు స్వచ్ఛమైన హిమకణం సూర్యరశ్మిలో మిలమిల మెరసినట్టు........

సరళకి అర్థమయింది- అతని నవ్వు వట్టి నవ్వు కాదనీ, అతని నవ్వు వెనకాల భయంకర విషాదముంది. వేదాంతం వుంది.

కాని యీనాటి వరకూ మూర్తికి మాత్రం అతని నవ్వుకి కారణం తెలియదు పాపం.

*(1964)*

382

# రాత్రి 9 గంటలకు

(ఒక పట్టణంలో మనుష్యుల మనస్సుల ఊహల
మాటల కోలాహల హాలాహలం)

ఒక సందులో ఒక చిన్న యింట్లోంచి - "అమ్మా, భయం వేస్తోంది. ఈ రోగం యింక తగ్గదే. అమ్మా కావిలించుకోవే చచ్చి పోతుండా. బాబోయ్ డాక్టరు దున్నపోతు ఎక్కివస్తున్నాడు. స్టెతస్కోపు పాశంలా విసురుతున్నాడమ్మా."

ఒక రోడ్డు మొగని ఆధునిక కవి :

"గంటల కారు చప్పుడు, పక్కపూరు అంటుకుందని విన్నప్పుడు అరెరె పాపం ! అరెరె ఏమిటి ఉపద్రవం ! టాక్సీ చేయించుకువెళ్ళి చూసి వద్దామా భాయి ? ఆ జ్వాలా మహోత్సవాన్ని చూస్తే పంద్రఫుల్ వచన పద్యం ఒకటి వస్తుంది. హుంతాశన కృతాశన గృహ గృహ కర్పూరభస్మం నా పద్యం...."

ఒక యింటి అరుగుమీదనుంచి లోపల వంటింట్లోకి కేక-

"ఒసేవ్, నాకు కందిపచ్చడి అంటే యిష్టం."

ఒక రసపిపాసువు మరొకడితో -

"బలే బలే ! పద్మిని ఎంత మజాగా వుందిరా జిస్ జిస్.... ఏమిటో దాని పేరు....జలాంతర క్రీడా సమయ బహిర్గతజంఘాదిసురమ్యా పద్మినీ పద్మినీ....పిక్చరు ఏదో దొంగల్ని గురించిట. అయినా వెధవ కథా కమామిషు ఎవడిక్కావాలి ?"

పక్కనున్న పాతిక వోల్టు విద్యుద్దీపకాంతిని కమ్మేస్తూ ఒక షాపు కారు దోపనపొయ్యే చలమయ్యతో –

"రేపు మా బావమ్మర్ది చెల్లెలు కొడుకు పెళ్ళి, గొప్ప విశ్శేశాను. అంటే మా అబ్బిగాడిదే. కట్నం పందొమ్మిదివేల ఎనభై ఒక్క రూపాయ నాలుగు పైసలు, పై రూపాయీ నాలుగు పైసయీ బావమ్మర్లకి సంభావన యిచ్చేస్తాను. ఏది శాశ్వతం లెద్దూ! అయినా ఆ మాత్రం దానం సెయ్యకపోతే బెడిసికొడుద్ది సెలమయ్యా."

ఆశావాది అయిన ఓ గుమాస్తా తన మిత్రుడితో –

"చస్తే రోల్సు రాయిస్ కిందపడి చావాలి. ప్రాణం ఎంత మెత్తగా హాయిగా పోతుంది. ఎంత గొప్ప! అబ్బ తలచుకుంటేనే ఒళ్ళుగగుర్పొడుస్తుంది."

ఒక క్లబ్బులోంచి –

"మూడు జోకర్లు కల్సినా డిక్ అవలేదు. బాడ్ లక్, ఇంకొక బ్రాందీ సోడా.... బోయ్!"

ఒక డాబా పిట్టగోడ నానుకు నించున్న ఒకావిడ పక్క డాబా మీదున్న మరో ఆవిడితో –

"ఏమోయ్, చంద్రుడెంత బాగున్నాడో ఆకాశంమీద, మన వీథి మొగని కిళ్ళీకొట్లో ఉన్న గిరజాల అబ్బాయిలాగ."

ఒక మధ్యతరగతి యింట్లోంచి –

"ఏమండీ నామాట వినండీ. సానికొంప వెళ్ళకండీ, మీ పాదాలట్టుగుంటాను. మీ పిల్లల్ని చూడండి. వీళ్ళ గతేం కాను? అబ్బొడతారేవండీ, పోనీ కొట్టండి. చంపండి, నా రక్తాన్ని మీ చేతులకు రాసుకుని మీ ప్రియురాలి పెదాలకు రాయండి. ఎర్రగా వుంటాయి చప్పరించేందుకు. హోరి భగవంతుడా స్త్రీకి మొగుడు వెధవే గతికదా....?"

ఓ రిక్షావాడు –

"సైడు సైడూ, తప్పుకోవయ్యా బాబూ, ఈ రిక్షా అంటే ఏంటను కున్నావ్. యిమానంలాగ ఎగుర్ది. దీని తస్సా మందూ గబుక్కున

యాక్షన్ దౌనయిపోయిందిగాని, లేందే డబుల్ టాకీ రెండొందలు కొట్టి ఉండేవాణ్ని బాబయ్యా. రిక్షాలాగే యోగంవుంటే అంకె ఎందుకు తగుల్తాది, దొంగనాయెదవ మార్కెట్టు!"

ఒక కాలేజీ విద్యార్థిని స్నేహితురాలితో –

"అవిగో గుళ్లో గంటలు కార్తీకమాసం వెన్నెల. దేవుడి ప్రసాదం పెడతారు రావే సుజాతా. (మెల్లగా) మన క్లాస్‌మేట్ మురళీధరరావు.... అబ్బ వాడే పొడుగ్గా, ఎర్రగా టక్‌అప్ చేసుకునీ.... ఆమధ్య రిబ్బన్లు పంపాడూ....వాడూ. ప్రతీరోజూ వస్తాడే. వాడికీ మనలాగే ఎంతో భక్తి పాపం!"

ఒక కోతలరాయుడు –

నాకు స్పోర్ట్సు అంటే చాలా యిష్టమండీ. క్రికెట్, బేస్‌బాల్, పోలియో తెగ ఆడేసేవాణ్ని నా చిన్నప్పుడు."

ఒక లౌడ్‌స్పీకరులోంచి –

"అఖిలాంధ్ర సాహితీ సమావేశం....మంత్రిగారు అధ్యక్షులు— మున్సిపల్ చైర్మన్‌గారు ప్రారంభకులు....చాంబర్ ఆఫ్ కామర్సు ఉపాధ్యక్షుల ఉపన్యాసం 'సాహిత్య వ్యాపారమూ లాభనష్టాల పరీక్ష....' మహాకవి 'శాతకర్ణి' 'తాజా రచన' కీర్తిపథంలో పరుగెత్తే స్తోత్రరథం నుండి రసపత్తర ఘట్టాల కావ్య పఠనం."

ఒక పాత్రికేయుడు తన గదిలో వ్రాసుకుంటూ –

"ఊరికి కరణమూ, భాషకి వ్యాకరణమూ ప్రబల శత్రువులు."

ఒక ఖైదీ –

"ఈపాటికి వంతెన క్రింద ఓ చుక్కేసి మనోళ్ళతో మాంచి సరదాగా వుండేవాణ్ని. కొండమీద సెంద్రుడు గిర్రున తిరుగుతూండేవాడు రంగులరాటంలాగ! ఇప్పు డెదవ బ్రతుకు కటకటాల యెనక్కి తోసేసారు.....అయినా వూరికినే....దేవుడి తోడు....వూరికినే కొదవలితో ఇలా అన్నానో లేదో యెదవ అర్భకం ముండ అదేరా నా పెళ్ళాం-కళ్ళు తేలేసి

టపీమని సచ్చిపోయింది. పీకతెగి పిట్టలా కొట్టుకుంది. ఏంటోగాని నా కప్పుడు మాత్రం శానా కట్టమనిపించిందిరా, ఆ యెర్రి బాగుల్ది యేపుగా సాపుగా వుండేది. పికిలిపిట్టలాగు. ఏమైతేనేం యిప్పుడిక్కడ జైల్లోపడి సత్తున్నా ఓ సుక్కైనా లేక...."

ఓ మనస్తత్వ శాస్త్రవేత్త రిపోర్టు -

హృదయాలలో శూన్యం ఎక్కువైనకొలదీ థియేటర్లు నిండి పోతాయి. అందుకోసం థియేటర్ యజమానులకు నా సలహా ఏమిటంటే ధనికవాదాన్ని ఎప్పుడూ బలపరచండి."

ఒక అల్ట్రా-మోడరన్ కవీంద్రుడు-

"నియాన్ లైట్లకింద పేరుకున్న చీకట్లో పట్టణ కన్య పరాభవం. అర్థమయిందా సోదరా యీ చిత్రం!"

సరికొత్త మోడల్ కారులో వెనకసీటులో కూర్చున్న భర్త భార్యతో-

"నీ మెడలో నెక్లెస్ ఎలా మెరుస్తోందో."

(భార్య) "బ్లాక్‌మార్కెట్ సంపాదన రాత్రుళ్ళే మెరుస్తుందిటగా?"

కృష్ణా బారేజి మీద నుంచున్న ఓ కృష్ణమూర్తి స్వగతం—

"ఇక్కడ నుంచి దుమికితే చచ్చిపోతానని గ్యారంటీ వుందా? నేను దూకి చావనా లేకపోతే నా అప్పులవాణ్ని యిక్కడకు తీసుకొచ్చి తోసెయ్యనా? ఏది కర్తవ్యం?"

విదేశాలనుండి కొత్తగా తిరిగి వచ్చిన ఒక ఆఫీసరు-

"స్కౌండ్రల్. దూరంగా వుండు. సరీ మీదకు వస్తున్నాడు చూడండి ముష్టి వెధవ. అబ్బ కంపు. మాసినబట్టలూ, ఒళ్ళంతా దుమ్మూ వీడూ....పోనీ యిస్త్రీ చేసిన శుభ్రమైన చొక్కా, పాంటూ తొడుక్కుని అడుక్కోకూడదూ....బ్లడీబెగ్గర్, సభ్యత తెలియని దేశం."

ఒక వేశ్య మరొకతెతో—

"చూడవే ఆ ప్లీడరుగారు మన్ని చూసి మొహం చిట్లించుకుని ఎలా వెళ్ళుతున్నాడో-వొట్టి నీతివాసన కొడుతూ! మొగుడు పోగానే చెల్లెల్ని చేర దీసి ఆస్తి అంతా కాజేసి తగిలేశాడు పెద్దమనిషి!"

ఒక అరవై యేళ్ళ వృద్ధనారి సగర్వంగా చూడవచ్చిన చుట్టంతో -

"నాకు పదముగ్గురు సంతానం నాయనా! ఆరుగురు మగపిల్లలు. అందరూ అనేవారు నువ్వెంత అదృష్టం చేసుకున్నావే అని. మా ఆయన గుమాస్తా పనిచేసి రిటైరయారు. మా పెద్దబ్బాయి కోర్టులో గుమాస్తా. రెండోవాడు మున్సిపల్ ఆఫీసులో గుమాస్తా. మూడోవాడు కో-ఆపరేటివ్ సొసైటీలో గుమస్తా. నాలుగోవాడు బియ్యంమిల్లులో గుమాస్తా. అయిదో వాడు ఎక్సయిజ్ ఆఫీసులో గుమాస్తా. ఆరోవాడు కిరాణాకొట్టులో గుమాస్తా. అందరూ అరవై డెబ్బై రూపాయలు తెచ్చుకుంటున్నారు. వాళ్ళకీ తామర తంపరలా పిల్లాజెల్లా....ఇంక పెద్దమ్మాయి మొగుడు రైల్వేలో గుమాస్తా, రెండో అల్లుడు....(చుట్టం చెవులు మూసుకొన్నట్టు ఆవిడకు తెలియదు.)

వివిధ శబ్దాలు —

సోడా సోడా....'కాయ్‌రాజా కాయ్ చూస్తే లేదు కాస్తే వుంది.... అర్జంటుగా యివ్వండి కొంచెం సైనేడ్....మీ కొట్లో కాంట్రాసెప్టివ్‌లు దొరుకుతాయాండీ....యన్. టి. రామారావు ఎంత బాగున్నాడే శ్రీకృష్ణుడి లాగ .... ఏయ్ బుద్ధిలేదూ లారీకిందపడి చావాలని వుందా? .... హలో హలో స్టాక్ ఎక్ఛేంజికి....షేర్లు ఎలా వున్నాయి?....వంతెనకింద ఎవర్నో పొడిచి చంపారట ఘోరం....ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ రెండుగంటలు లేటు.... సోడా రాజసమారీ సోడా....

భరత వాక్యం—

రాత్రి 9 గంటలకు రమ్మంటుంది పట్టణం. రంగు వేసుకున్న మొహం రాకాసివంటి అహం మిరుమిట్లు కొలిపే నవ్వుతో మెత్తగా కౌగ లిస్తుంది నిన్ను.

అభిరుచీ వ్యక్తిత్వం చచ్చి అమాంతం మూస్తావు కన్ను.

*(ఆంధ్రప్రభ వీక్లీ 1961)*

# ఏమీ లేదు

రైలు జోరుగా వెళుతోంది – మెయిలు అవడంవల్ల. దూరంగా కొండలూ చెట్లూ అక్కడక్కడ గుడిసెలూ, భూమికి పైత్యం కలిగి గుండ్రంగా తిరుగుతున్నట్లున్నాయి. రైలుపెట్టెలో వేడిగాడ్పు. సాయంత్రం ఆరుగంటలయినా చీకాకుగా వీస్తోంది. ఇంజను నిట్టూర్పులలోని బొగ్గుమసి బట్టల్ని ఖరాబు చేస్తోంది అసలా సాయంత్రమే ఎంతో కష్టంగా చైతన్య రహితంగా వుంది. సంధ్యవేళ దూరంగా కనపడీ, కనపడని కొండలు ముసుగులు కప్పుకుని రాత్రి సంచారానికి తయారౌతున్న దయ్యాలలాగ వున్నాయి. మూడవక్లాసు పెట్టె ఎప్పటిలాగే దేశసౌభాగ్యాన్ని ప్రతిఫలిస్తోంది. నా పక్కనే కూర్చున్న ఆసామి కాండ్రించి చుట్టరసాన్ని ఉమ్మేస్తున్నాడు. అంగవస్త్రపు గుడ్డా, రాగి చెంబూ ఆభరణాలుగా గల ఒక శాస్త్రులుగారు పెట్టెలో మూలగా బిక్కమొహం పెట్టుకుని – కూర్చున్నాడు – వర్ణాశ్రమ సంకరానికి బాధపడుతున్నాడేమో! ఒక వర్తకుడు ఆ చివరా, ఈ చివరా కాళీ వున్నా, మధ్యగా కూర్చుని సీటు అంచుల్ని చేత్తో గట్టిగా పట్టుకున్నాడు. విసురుకి సీటుమీద నుండి జారి రైలులోంచి కిందికి పడిపోతానని భయం కాబోలు. చీటికీ మాటికీ పక్కనున్న ట్రంకుపెట్టెకేసి చూస్తున్నాడు. ఆ చూపులో ఏదో కొంచెం ప్రేమలాంటి అనురాగం వుట్టిపడుతోంది. కాలేజీ విద్యార్థులు సెలవులకి కాబోలు యిళ్ళకివెళ్ళే హడావుడిలో వున్నారు. ఇంకా రకరకాల మనుష్యులూ, ముసుగున్న ఒక హీన రకం ఆంగ్లో ఇండియన్ యువతీ కూడా పెట్టెలో వున్నారు. కాలేజి విద్యార్థులు కళ్ళజోడు పెట్టుకుని కూర్చున్న ఒక బెంగాలీతో కబుర్లు చెబుతున్నారు.

ఒక పిచ్చివాడు రైలువేగాన్నీ చప్పుడునీ మించేటట్టుగా కంఠమెత్తి పాడుతున్నాడు—త్యాగరాజ కృతికీ, సినిమా పాటకీ, చాలా అసందర్భంగా వివాహం చేయించేశాడు. అందరూ నవ్వుతున్నారు. నేను మధ్య మధ్య దినపత్రికనీ, నా పక్క కాస్త దూరంలో కూర్చున్న యువతినీ చూస్తున్నాను. పత్రికలోకన్నా యీవిడలో నాకు వార్తలెక్కువ కనిపిస్తున్నట్లు అనుమానం వేసింది. ఆవిడ తన కెదురుగా కూర్చున్న ఒక గ్లాస్కోచొక్కాకేసి చూసి అర్థవంతంగా నవ్వుతోంది. చీటికీ మాటికీ చెయ్యెత్తి సిగలోపువ్వులు సర్దుకుంటోంది. జెరదా కిళ్లీ వేసిన గ్లాస్కోచొక్కావాడి నల్లని మొహంలో ఎర్రని పెదవులు నెత్తురుబికిన గాయంలా వున్నాయి. అతని జేబులో జేబుకన్నా పెద్దదయిన పర్సు, ఒక సిల్కురుమాలూ వున్నాయి. తలకి రాసిన అత్తరు కొంచెం చెంపలమీదికి స్రవిస్తోంది. చిన్నప్పట్నుంచీ సరసం తెలిసిన మెరకవీధి రసజ్ఞుడిలా వున్నాడు. కాస్సేపటికి అన్నాడు యువతితో "ఏవూరు?" అని.

యువతి యిటూ, అటూ చూసి "బిక్కవోలు" అంది, సరసుడు మెల్లగా "యింకేం" అన్నాడు. యువతి ఫక్కున నవ్వింది. అకారణంగా పైట సవరించుకుంది.

పిచ్చివాడు గట్టిగా, పిచ్చిగా మాట్లాడుతున్నాడు. "నాకు మాటలురావు. మాటలు తిరగబడిపోతున్నై. నాకు ఆకలి. నేను మాటల్ని తినేస్తున్నాను."

శాస్త్రులు కళ్ళుమూసుకుని పాడుకుంటున్నాడు. "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే భజగోవిందం భజగోవిందం మూఢమతే...." "పసుపు ధర ఎలా వుంది శాస్త్రులూ మీ వూళ్ళో?" అంటున్నాడు వర్తకుడు. బెంగాలీ వాడు చచ్చుయింగ్లీషులో విద్యార్థులతో ఏవో గొప్పలు చెపుతున్నాడు. ఒక్క విద్యార్థి మాత్రం చాకలెట్లు ఒకటి తర్వాత ఒకటి తింటూ కిటికీలోంచి అవతలకి చూస్తున్న ఆంగ్లోఇండియన్ యువతి గుండ్రని పిక్కలవైపే చూస్తున్నాడు.

పిచ్చివాడు తన పిరుదుల మీద చేత్తో తాళం వేస్తూ పాడుతున్నాడు:

"ఎంతగతి పట్టెరా నీకు శ్రీరామచంద్రా
ఎంతమతి పోయెరా నీకు శ్రీరామచంద్రా"

"అయ్యా నా పేరు రామచంద్రమూర్తి. నాకు పిచ్చని మా వాళ్ళందరూ అన్నారు. పిచ్చివెధవ ఎవడేనా యింత గొప్పగా పాదతాడా నవాల్" అంటూ తొడ చరిచాడు.

"ఈసారి ఎన్నికలలో కాంగిరేసు నెగ్గుద్దా?" చుట్ట ఆసామీ అంటున్నాడు.

"యాడు నెగ్గితే ఏంలే. మనూరికి మాత్రం ఒంతెన పడదు" మరొహాడు.

"నా వోటు మాత్రం ఎవడు నెగ్గితే వాడికే" అన్నాడు వర్తకుడు పెట్టెతాళం లాగి చూసుకుని,

"నీ కెలా తెలుస్తదీ యాడు నెగ్గేదీ?" చుట్ట ఆసామీ ప్రశ్న.

"నెగ్గిం తర్వాతే నేను నా వోటు వేస్తాను. లేందే వెయ్యనేవెయ్యను."

ఇద్దరు ముగ్గురు పగలబడి నవ్వారు. ఈసారి విశ్వాస్త అవగుంఠనం కాస్త సరిచేసుకుని, "స్టేషన్ వచ్చిందా నాయనా?" అంది కళ్ళు మూసుకునే.

"ఏ స్టేషనండీ?" అన్నాడు విద్యార్థి.

విశ్వాస్త సమాధానం చెప్పలేదు. మళ్ళీ చటుక్కున సమాధిలోకి వెళ్ళిపోయింది.

ఏదో స్టేషన్ వచ్చింది. చుట్టా, బీడీ, సోడా-కేకలు. విద్యార్థులు రైలుదిగి ప్లాట్‌ఫారం మీద అటూ యిటూ తిరుగుతున్నారు. కొత్త వాళ్ళెవరూ ఈ పెట్టెలో ఎక్కలేదు. గ్లాసోక్క చొక్కావాడు రెండు డ్రింకులు కొన్నాడు. ఒక డ్రింకు యువతికి అందించాడు. ఆమె ఆశగా డ్రింకు కేసి చూస్తూ "వద్దండీ" అంది.

"తీసుకో చల్లగా వుంటుంది. గాడుపుదెబ్బకూడా" ఎంతో ఆప్యాయంగా గ్లాసోక్కవాడు అన్నాడు. ఆమె తీసుకుంది. వర్తకుడు లేచి శాస్త్రిలుతో, "పెట్టె సూత్తూవుండు శాస్త్రిలూ, యిప్పుదేవస్తా" అన్నాడు.

"ఎక్కడికీ?" శాస్త్రిలు.

"ఒంటేలుకి" వర్తకుడు.

ఆంగ్లో యిండియన్ యువతి గబుక్కున లేచి కీచుగా ఇంగ్లీషులో అడిగింది. ఎవరి నుద్దేశించో తెలియదు. "చాక్లెట్స్ ఎవైలబుల్ హియర్!"

ఆమె పక్కలకేసి చూస్తున్న విద్యార్థి ముందుకు గంతువేసి "వాట్ మేడమ్?" అన్నాడు.

మరొక విద్యార్థి శుభ్రమైన తెలుగులో "దీన్ని తగలెయ్యా, పెద్దెడు చాక్లెట్లూ తినేసి యింకా కావాలంటోంది దీనిది కడుపా ఖండవిల్లి మడుగా?" అన్నాడు.

పక్కల విద్యార్థి సవినయ సవిషాదంగా "ఇక్కడ దొరకవండి" అన్నాడు. అతడు గబుక్కున అలా అంటూ యేడుస్తున్నాడేమో అని నాకు భయం వేసింది.

గార్డు ఈజిల్ ఊదాడు. రైలు కదిలింది. వర్తకుడు వచ్చి యథా స్థానంలో కూర్చున్నాడు. పిచ్చివాడు వాగుతున్నాడు. "నా పెళ్ళాం సాయేబుతో లేచిపోయింది. నాకొడుకు పారిపోయాడు. హహ్హహ యెందుకో చెప్పుకోండి. మొదటి బహుమతి లక్షరూపాయలు. రెండవ బహుమతి పదిలక్షలు....''

"ఏమయ్యోయ్ సెట్టీ రేపు వైశాఖలో నీ తండ్రి తద్దినం – మరచి పోకూడదు. ఆరోజుకి నేను వస్తాను" అన్నాడు శాస్త్రులు. "ఓరి తద్దినం తగలడా. అప్పుడే ఏడాది తిరిగిపోయిందా?" వర్తకుడు కాలవేగానికి ఆశ్చర్యపోతున్నాడు.

బెంగాలీవాడు అంటున్నాడు "మా మిడ్నపూర్‌లో ప్రతివాడూ విప్లవ వాది. ప్రతివాడూ కొన్ని వందల బాంబులు తయారు చేశాడు. చంపేందుకు ఇంగ్లీషువాడు కనపడకపోతే వాళ్ళలో వాళ్ళే ఒకళ్ళ నొకళ్ళు చంపేసు కున్నారు."

"మహా వీరులండి" అన్నా డొక విద్యార్థి.

గ్లాస్కో చొక్కావాడు ముందుకు వంగి "రాత్రికి రానా" అంటు న్నాడు. యువతి కళ్ళు వంచించి చిత్రంగా కొంటెగా చూచి చిన్న నవ్వు నవ్వి మొహం పక్కకు తిప్పింది.

నేను పేపర్లో చదువుతున్నాను. "ఇండియాలో మనిషి సగటు ఆదాయం చాలా తక్కువ. అమెరికాతో బ్రిటన్‌తో పోలిస్తే వీళ్ళు ఏం తిని బ్రతుకుతున్నారా అనిపిస్తుంది. ఇక్కడ సగటు జీవిత పరిమాణం యిరవై మూడు ఏళ్ళు...."

మెయిలు వేగం హెచ్చింది. చిన్న చిన్న స్టేషన్లని ఖాతరు చెయ్యకుండా రైలు వెళ్ళిపోతోంది. వడగాలికి రైల్లోవాళ్ళ మొహాలన్నీ మాడినట్టుగా కనిపిస్తున్నాయి. శాస్త్రిలు సంచిలోంచి మామిడిపండు తీసి తింటున్నాడు. విధవ మళ్ళీ కళ్ళు తెరిచి "స్టేషనొచ్చిందా నాయనా?" అంది. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. వెలుగు తగ్గిపోతోంది. మసకగా చీకటి కమ్ముకుంటోంది.

హఠాత్తుగా రైలు ఆగింది. కారణం ఏమిటా అని అందరూ కిటికీలలోంచి తొంగి చూశారు. గార్డు కంగారుగా ముందుకి వెడుతున్నాడు. జనం గుంపులుగా వెనకాలే వెళుతున్నారు. రైలు ముందు పెట్టెలవైపు కలకలం. ఏవో మాటలు, ఆశ్చర్యార్థకాలు, విహ్వలాక్రోశాలు. వర్తకుడు భయంతో పెట్టె తాళం లాగి చూసుకున్నాడు. ఎవరో కొందరు వెనక్కి వచ్చేస్తున్నారు.

"ఏం జరిగింది? ఏం జరిగింది?" అన్నాడు బెంగాలీ.

"స్యూసైడ్, స్యూసైడ్" - జనంలోంచి ఎవరో కేక.

గబగబా కొందరు పెట్టెలోంచి దూకి యింజనువైపుకి పరిగెత్తారు. "రామ రామ" "ఎవడో అభాగ్యుడు" లాంటి మాటలు. శాస్త్రిలు 'ఆత్మహత్యే' అని భయంగా కిటికీలోంచి చూస్తున్నాడు. ఇటూ అటూ పంట చేలు, చెట్లు. దిగిన ఒక ప్రయాణీకుడు మా పెట్టెలోకి వచ్చాడు. వాడి వొళ్ళు వణుకుతోంది. తడబడుతూ "ఘోరం కళ్ళు బైర్లు కమ్మాయి. రామ రామ" అని చతికిలబడ్డాడు.

విధవ ముసుగు సవరించుకుంటూ సగం తెలిసీ, సగం మైకంలో అంది "ఏం పొయ్యేకాలం? ఘోరకలి ఉన్నట్టుండి వాడికి ఎంత ధైర్యమో యీ అఘాయిత్యం చెయ్యడానికి."

"కాలమే అంతలేండి బొత్తిగా దిగజారిపోయింది. ఎందుకు చెప్పండి, ఈ వెధవ ఆత్మహత్యలూ, ఆత్మస్తుతులూనూ! తెగతిని ఏ పెళ్ళాంతోనో ముండతోనో దెబ్బలాడి ఉక్రోషంతో ఇలా చస్తారు" అన్నాడు శాస్త్రులు.

వర్తకుడు అంటున్నాడు - "ఇటువంటివాళ్ళు చచ్చిపోవడమో, చంపడమో చేస్తారు శాస్త్రులూ. మా తమ్ముడి బామ్మరిదికి బాకీ వుండి రొక్కించి అడిగాడని గొడ్డలి తీసుకొచ్చి చంపబోయాడు రౌడీ ఎదవ. తప్పిందికానీ ఈపాటికి పరలోకంలో వుండేవాడు మా తమ్ముడి బామ్మరిది. అయితే మావాడు దద్దమ్మలా పూరుకున్నాడనుకునేవ్, అబ్బే కోర్టులో దావా పడేసి, నిముషాలమీద జైల్లో పడేయించాడు. వాడు జైల్లో వున్నట్టుండి ఒక రోజున విషం తాగి చచ్చాడు, పీడా వదిలింది." యువతి మాత్రం ఏదో కంగారుగా బిక్కుబిక్కున చూస్తోంది. ఈ వార్త ఆమెను చాలా భయపెట్టినట్టుంది. అంతకుముందు విలాసాలు, ఒయ్యారాలు చిలికే ఆవిడ బిగుసుకుపోయింది. మొహంలో నెత్తురులేదు. ఆశ్చర్యంగా చూస్తున్నాను. గ్లాస్కోచొక్కావాడేదో చెప్పబోతున్నాడు. ఆమె వినలేదు.

"భయంగా వుందా?" - గ్లాస్కోచొక్కా ఉవాచ.

"పాపం" - అందామె శూన్యంలోకి చూస్తూ.

అందరూ పెట్టెలోకి తిరిగివచ్చారు. అందరూ కంగారుగా ఒకర్ని మించి మరొకరు మాట్లాడుతున్నారు. గార్డు చాలా ప్రముఖంగా తల పంకిస్తూ, పక్కనున్న కుతూహలపరులకి జవాబులు చెప్తూ వస్తున్నాడు.

"ఏమయింది?" అన్నాడు ఒకడు మరో పెట్టెలోంచి.

"పోయాడు" - ఒక గొంతు.

"ఏం?"

"వాడి ఖర్మ."

రైలు కూత వేసింది. శవందగ్గర సెలవు అడిగినట్టు వడగాలి కొంచెం తగ్గింది. రైలు కదిలింది.

"సచ్చినోడు నల్లగా ఉన్నాడు! ఉంగ్రాల జుట్టుంటే మావోడేమో అని హడలిపోయాను. మావోడు ఈడెక్కడో కూలిపనికనొచ్చాడు" అంది ఒక పడుచు రొప్పుతూ.

"నీవోడు కాదా?" - ఒక పేరయ్య.

"అబ్బే, ఆడెవడో.... యెర్రిముండాకొడుకు."

"పాపం" అన్నాడు పేరయ్య ఆశాభంగంతో.

బెంగాలీతో విద్యార్థులు ఉద్రేకంగా చర్చిస్తున్నారు.

"ఆత్మహత్యేనంటారా?" అన్నాడొక విద్యార్థి.

"ఇన్‌టెన్షన్‌తో చచ్చిపోతే ఆత్మహత్యే, లేనిదే యాక్సిడెంట్" బెంగాలీ.

"రైలు గుండెలమీదనుండి పోయింది" - మరొకడు.

"జఠరికలు పూర్తిగా నలిగిపోయాయి."

"ప్లీహం పిప్పిఅయిపోయింది." వీళ్ళిద్దరూ ఫిజియాలజీ యింకా మరచిపోని విద్యార్థులు.

"కలకత్తాలో ఆత్మహత్యలు ఎక్కువ" - సగర్వంగా అన్నాడు బెంగాలీ, కలకత్తా ప్రాముఖ్యత కదే కారణమన్నట్లు.

"ఎందుకు చచ్చిపోయాడంటారు ?" జిజ్ఞాసువైన ఒకాయన బెంగాలీని ప్రశ్నించాడు.

"ఆఁ-ఆయుర్దాయం మూడింది. చచ్చాడు. ఏం వుంది" అన్నాడు చుట్ట ఆసామీ.

"నిరాశావాదం ఎక్కువయింది దేశంలో. విదేశ నాగరికత దీనికి కారణం" అన్నాడు బెంగాలీ.

"జపాన్‌దేశంలో హరకిరి చేసికొని రోజుకి కొన్నివందల మంది సుఖంగా, ధైర్యంగా చచ్చిపోతారుట" ఒక మిడిల్‌స్కూలు మేష్టారు.

"ప్రతీ సంఘటనకీ స్త్రీ పురుష సంబంధం ఉంటుందని అన్నాడు ఫ్రాయిడ్. ఎవతో మోసగించివుంటుంది. తట్టుకోలేక చచ్చిపోయాడు" అన్నాడు బెంగాలీ.

"విఫల ప్రేమ అయివుంటుంది" అన్నాడు రొమాంటిక్ ఊహలున్న పిక్కల విద్యార్థి.

విధవ మళ్ళీ సగం కళ్ళు తెరచి అంది. "ఈ ప్రాణం ఎంత సేపమ్మా - బుద్బుదప్రాయం. అయినా రైలుకిందపడి ఎవణ్ని ఉద్ధరించనూ."

గ్లాస్కో చొక్కావాడు యువతికేసి చూసి ఆశ్చర్యపోతున్నాడు. యువతి పెదాలు వణుకుతున్నాయి. బలవంతంగా ఏడుపు నాపుతున్నట్లుంది.

"అట్లాగున్నావేం -ఒంట్లో బాగోలేదా?" అన్నాడు గ్లాస్కోచొక్కా. యువతి తలూపింది. నే నామెను పరీక్షగా చూడడంచూసి తల దించేసింది.

ఆంగ్లో ఇండియన్ యువతి బొమ్మల పత్రిక చదువుతోంది తల పైకెత్తి "హూ యీజ్ డెడ్ మాన్?" అంది మొత్తం పెట్టెలోని అందర్నీ ప్రశ్నిస్తూ.

రైలు స్టేషనులో ఆగింది. ఆంగ్లో యిండియన్ యువతి "కూలీ కూలీ" అని పిలుస్తోంది. ఎవ్వరూ రాలేదు. పిక్కల విద్యార్థి లేచి "మే ఐ హెల్ప్ యు మేడమ్" అంటూ ఆమె సూట్‌కేస్ సవినయంగా ఆమెకు అందించాడు. ఇంతలో, ఆమెని ఆహ్వానించే ఇంకొక స్వజాతి యువకుని తో కరచాలనం చేస్తూ చేతో సూట్‌కేసూ, సంచీ పుచ్చుకుని కృతజ్ఞత అయినా చెప్పకుండా ఆమె వెళ్ళిపోయింది. వెళ్ళిపోయే పిక్కలవైపు వెర్రిగా విరహంగా చూసి విద్యార్థి వెనక్కి తిరిగాడు.

బొత్తాలులేని లాల్చీ. ముక్కునుంచి జారి పడిపోతుందేమో అన్న కళ్ళజోడుతో ఒక సన్నని, ఎర్రని మనిషి పెట్టెలోకి వచ్చాడు. జుట్టు చెంపలదగ్గిర నెరసింది. గాడుపులో తిరిగినట్టు మొహం వడలిపోయింది.

"నమస్కారం. మీలోఎవరైనా శవాన్ని దగ్గిరనుండి చూశారా!" అన్నాడు పెద్దగా.

"మేం మేం" అన్నారు విద్యార్థులు హుషారుగా.

లాల్చీఆయన చిరునవ్వు నవ్వాడు. చెవిలో పెన్సిలు తీసి అరచేతిలో కొట్టుతూ "దయచేసి వివరాలు - శవాన్నిగురించి, రూపం, రంగూ, చూసినవీ, విన్నవీ తెలియచేస్తారా?" అన్నాడు.

"మీ రెవరు?"

"నేను పత్రికా విలేఖరిని."

"అక్కడికిపోయి చూసుకోవయ్యా" అన్నారు విద్యార్థులు.

"చూడండి బాబూ మా గ్రామానికి పదిసంవత్సరాలనుండీ నేనే విలేఖర్ని నెలకి పదిహేనురూపాయలు పంపిస్తారు. ఇప్పటికి రెండేళ్ళనుండీ, ఈ

ప్రాంతాలనుండి ఒక వార్త పంపలేకపోయాను. ఈ పోస్టు రద్దుచేస్తా మంటున్నారు."

"మరి యీ గ్రామానికి విలేఖరి ఏమిటయ్యా!"

"ఇదివరలో ఇక్కడ రెండుమూడు కాంగ్రెస్‌వాళ్ళ ఆశ్రమాలు, ఖాదీ వుత్పత్తి కేంద్రం అన్నీ వుండేవి. ఎవరో నాయకులు వస్తూండే వారు. అందుకోసం నన్ను నియమించారు. ఇప్పుడా సంపదలు లేవు. పైగా వూళ్ళో రెండు పార్టీలు. ప్రతిగొడవా ఏదో ఒక పార్టీకి చెందివుంటుంది. వీళ్ళ వార్త పంపితే అవతలవాళ్ళకి కోపంవచ్చి తంతామంటున్నారు. ఇన్నాళ్ళకి ఈ నాన్‌పార్టీ వార్త తగిలింది. బాబ్బాబు, అంత దూరం పోలేను. గార్డు నడిగితే చెప్పడం లేదు. దయయుంచి. .." కళ్ళజోడు పైకి తోశాడు విలేఖరి. విద్యార్థులూ, ఇంకా చూసినవాళ్ళూ ఏవేవో చెప్పారు. కదల బోతూన్న రైలులోంచి దుమికి కంగారుగా వెళ్ళిపోయాడు.

రైలు మళ్ళీ కదిలింది విద్యుద్దీపాలు వెలిగాయి. ఇంతవరకూ యేమీ ఎరగనట్టు ఒక మూల కూర్చున్న పిచ్చివాడు, అమాంతం లేచాడు. "చచ్చాడా, చచ్చినాడా, చచ్చిపోయినాడా?" అన్నాడు వెర్రిగా నవ్వుతూ.

"కలి, ఘోరకలి" అన్నాడు శాస్త్రులు జారీ చెంబులోని నీళ్ళు కాసిని దాహం పుచ్చుకుంటూ.

"కలి కాదు శాస్త్రులూ, ఆకలి, రోకలి" అంటూ పిచ్చివాడు శాస్త్రులుమీద ఒరిగాడు. శాస్త్రులు పిచ్చివాణ్ని 'ఛో ఛో' అని తోశాడు. పిచ్చివాడు ఆ తోపుకి బెంగాలీమీద పడ్డాడు. బెంగాలీ 'గెట్ అవుట్' అని మళ్ళీ తోశాడు. పిచ్చివాడి తలకి రైలుపెట్టె గోడ తగిలింది. 'అబ్బా' అన్నాడు. అందరికేసి చూశాడు. నోరు మూసుకున్నాడు. "మాట్లాడను. ఇంక మాట్లాడను" అన్నాడు జాలిగా.

"పిచ్చిముండాకొడుకు పాపం" అన్నాడు చుట్ట ఆసామి. "మీ రందరూ మనుషులు, మనుషులంతా ప్రపంచం, ప్రపంచమనే రైలుబండి ఇప్పుడు నామీదనుంచి పోయింది. చూడండి, ఎంత దెబ్బ తగిలిందో - మాట్లాడను, నేను చచ్చిపోయాను. రైలు కిందపడి చచ్చిపోయింది నేనే. హరోం హరహర" అంటూ గోడకి చేర్లబడి కళ్ళు మూసేసుకున్నాడు పిచ్చివాడు.

అందరూ నవ్వారు.

"శాంతారాం పిక్చరాడుతోంది మా వూళ్ళో" అన్నాడు విద్యార్థి. వాళ్ళ టాపిక్ సినిమాలలోకి వెళ్ళిపోయింది. చుట్ట ఆసామీ వ్యవసాయాన్ని గురించి శాస్త్రులుతో మాట్లాడుతున్నాడు. విధవ మగతగా తూగుతూ మధ్య మధ్య కళ్ళు తెరుస్తూ నిద్రపోతోంది. బెంగాలీవాడు ఒక సీసా తీసి రస గుల్లాలు తీసుకుని తింటున్నాడు.

నేను పేపరునుంచి నా దృష్టిని పక్కకు మరల్చాను. యువతి చెక్కిళ్ళమీద సన్నని నీటిచార. గ్లాస్కో చొక్కావాడు జేబులో పర్సు తీసి - మరి యువతిని ఆకర్షించడానికో ఏమో-నోట్లు లెక్కపెట్టుకుంటు న్నాడు. కాని యువతి దిగులుగా వుంది. నాకు చాలా వింతగా అనిపించింది. ఈమెలో ఈ మార్పుకి కారణం?

విధవ కళ్ళు తెరచి "ఏ స్టేషనూ వచ్చేదీ."

ఈసారి శాస్త్రులు అన్నాడు "బిక్కవోలు."

"ఊహుఁ - చోడారం రాగానే చెప్పు నాయనా"-మళ్ళీ పడుకుంది విధవ.

"ఇక్కడెక్కడ చోడారం. శానారాత్రి పడుద్ది" అన్నాడు చుట్ట ఆసామి.

బిక్కవోలు స్టేషను వచ్చింది. రైలు ఆగింది. యువతి చప్పున కన్నీళ్ళు తుడుచుకుని చేతిసంచీ పుచ్చుకొని లేచింది. గ్లాస్కోచొక్కా మెల్లగా "ఏమంటావ్ నేను కూడా దిగనా!" అన్నాడు.

యువతి తీవ్రంగా చూసింది. కళ్ళల్లో అసహ్యం, బాధ సూదుల్లా గుచ్చుకున్నాయి. నిరసనగా తలపంకించి గబగబా దిగి వెళ్ళిపోయింది. గ్లాస్కో లాల్చీవాడు ఎర్ర గాయాల్లాంటి రెండు పెదవుల్నీ ఆవులించి తెల్ల బోయి చూశాడు.

మళ్ళీ రైలు కదిలింది. చీకట్లో దూసుకుంటూ వెళ్ళిపోతోంది. నేను పేపరు చదువుకుంటున్నాను. రైలు చప్పుడు అదేపనిగా వినడంవలన మనసులో ఒక స్వభావంలాగ అయిపోయింది. ఇంతకీ ఏమీలేదు .... సంగతి చెబుతున్నాను.



(1961)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B105 |
| పుస్తకం పేరు | తిలక్ కథలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 405 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | Good |
| పరిస్థితి | |